

ముప్పదేండ్లకుముందు
భారతీయుల సేవకు
అంకితమై
నేటికి
లక్షలాది ప్రజలను
సేవించుచున్న...
బెంగాల్
లాంపులు
1932 తొలి భారతీయ లాంపు
నేడు అన్నింటికన్న మిన్న
ఆధునిక సాంకేతిక చేర్పులతోను, శ్రేష్ఠతకు ప్రాధాన్యత గల పర్యవేక్షణతోను తయారైన "బెంగాల్" లాంపు పొదుపు, మన్నిక, ప్రకాశవంతమైన నిండు వెలుగును యిచ్చుటలో యితర లాంపులలో దేనికిన్ని తీసిపోదు.
బెంగాల్ 'హంస' మీకు
చల్లని, నిండు వెలుగునిచ్చును
ఆంధ్రప్రదేశ్‌కు సోల్ సెల్లింగ్ ఏజెంటు: జి. ఏ. పరశురామ్ & కంపెనీ,
11-4-658/2, లక్డికాపూల్, హైదరాబాద్-4 (ఆ. ప్ర.)
Chari

# శ్రీ నాగేశ్వర శతజయంతి సంచిక

# ఆంధ్రపత్రిక

[ప్లవంగ సంవత్సరాది సంచిక]

ఏబదియేడవ సంచిక

**[1967-68]**

★

సంపాదకుడు:

**శివలెంక శంభుప్రసాద్**



★

**వెల రూ. 5**

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము.

Suppliment to Anghra Patrika (Regd. No. M 1118.)

## ADVERTISERS INDEX

సంచిక 57

# శ్రీ నాగేశ్వర శత జయంతి సంచిక

సంవత్సరం 1967—68

## విషయానుక్రమణిక

# ప్రస్తావన

మామూలుగా సంవత్సరాది సంచిక బహువ్యాసకర్తల వ్యాసాలతో వస్తేవి. ఈ ప్లవంగ సంవత్సరం సంచికమాత్రం ప్రధానంగా దేశోద్ధారకులు, విశ్వదాతలు, కళాప్రపూర్ణులు, ఆంధ్రపత్రిక వ్యవస్థాపకులు అయిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి రచనలతో మాత్రమే వెలువడుతున్నది.

ఈ సంచికలో మరి ముగ్గురు శ్రీ పంతులుగారిని గురించి చెప్పిన, వ్రాసినవానిని కూడా ప్రచురించాము. మహాత్మాగాంధి, మహాదేవ దేశాయి శ్రీ పంతులుగారిని గురించి చెప్పిన విషయములు ఒక కోవవి. శ్రీ నోరి నరసింహశాస్త్రి గారి సుదీర్ఘవ్యాసము ఇంకొక కోవది.

ఈ సంచికను ఈ విధంగా కూర్చడానికి, ఇది శ్రీ పంతులుగారి శతజయంతి సంవత్సరం కావడమే కారణం. వారినిగూర్చి చెప్పడంకంటే, వారు చెప్పినది ప్రజలకు నివేదించడమే మంచిదని సంచికను కూర్చే సమయంలో మాకు హఠాత్తుగా తట్టింది. అందువల్ల వారిని గురించిన వ్యాసాలతో నింపుదామని అనుకున్న సంచికను అప్పుడు ఇట్లా వారి వ్యాసాలతోనే కూర్చడమైనది.

శ్రీ పంతులుగారు బహుముఖ మనీషి; మహోద్యమము. బహుముఖమైనవారి ఉద్యమం తెలిసినంతగా దేశానికి వారి వైదుష్యము తెలియలేదు. ముఖ్యంగా ఈ తరంవారికి తెలియదు.

వారి ఆ వైదుష్యం ఇట్టిదని చెప్పడంకోసమే ఈ వ్యాస సంకలనం ఉద్దిష్టమైంది.

ఇందువల్ల తెలియదగు విషయం ఒకటి వుంది. ఆ కాలంలో నాయకులకు వైదుష్యంగూడా ఒక పరికరం.

శ్రీ పంతులుగారి రచనలు అనేకం. వ్రాసిన విషయములు అనేకమే.

కాని లక్ష్యం ఒక్కటే.

అది మానవాభ్యుదయ సాధనం.

ఎడతెగని అన్వేషణ.

ఈ రచనలు శ్రీ పంతులుగారి వ్యక్తిత్వాన్ని అర్థంచేసుకోవడానికి, అకళింపు చేసుకోవడానికి ఉపకరిస్తాయి.

శ్రీ పంతులుగారి రచనలు అనంతంగా వున్నాయి. అవి అన్నీ కూరిస్తే అనేక సంపుటాలు అవుతాయి.

శ్రీ పంతులుగారు తమ రచనలను కూడబెట్టడంగాని, ప్రచురణకోసం అట్టేపెట్టడంగాని చేయలేదు.

ఇందులోగూడా వారి వ్యక్తిత్వమే ప్రస్ఫుటం అవుతున్నది.

అసలు శ్రీ పంతులుగారిని చాలామంది వారి ఆత్మకథను వ్రాయమన్నారు. "వ్రాయడానికి ఏముంది నా జీవితంలో" అని పంతులుగారు సమాధానం ఇచ్చేవారు.

ఇది పంతులుగారి తత్వం.

ఇప్పుడు ఈ సంచికలో ప్రచురించిన వ్యాసాలలో శ్రీ పంతులుగారి వైదుష్యాన్ని, వారి ధార్మికజీవనపద్ధతిని దిఙ్మాత్రంగా ప్రజలముందుంచడమే మా లక్ష్యం.

శ్రీ పంతులుగారి వైదుష్య వైవిధ్యాన్ని గురించి శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు వ్రాసిన వ్యాసాన్ని ఈ సంచికలో ప్రచురించాము. ఆ వ్యాసంలో శ్రీ పంతులుగారి వైదుష్యజీవనము, సాహిత్య సిద్ధాంతాలు చక్కగా చూపబడినాయి.

వ్యాసాన్ని వ్రాయవలసిందిగా కోరినవెంటనే శ్రీ శాస్త్రిగారు అంగీకరించి, వ్రాసిపంపించారు. అందుకు వారికి అభివందనలు.



దేశోద్ధారక, విశ్వదాత, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు
జననం: 1–5–1867 నిర్యాణం: 11–4–1938

# దేశోద్ధారకుడు

దేశభక్తునిగూర్చి వ్రాయడంలో దేశోద్ధారకుని విషయం నేను తలపెట్టకపోవడం అసంభవం. "ఒక క్రొత్త అంజనం కల్పించి దానికి ఆకర్షకమయిన పేరు పెట్టి ధనం ఆర్జిస్తున్నారు" అని నేను ఎల్లప్పుడూ దేశోద్ధారకుని పరిహసిస్తూనే వుంటాను. "అది నిజమే. అది అనుచితమేగాని నే నేమి చేయగలను? అది నిరపాయకరమైన అంజనం. దానివలన వచ్చే ధనాన్ని దేశ సేవ కోసం వ్యయపరచడానికే నేను ప్రయత్నిస్తుంటాను" అని అతడు ఎప్పటిమాదిరి చిరునవ్వు నవ్వుతూ నాకు సమాధానం చెబుతుంటారు. నిష్ప్రయోజనమయిన ఆ అంజనం గూర్చి నేనెంతటి ఉపేక్షతో పరిహాసం చేస్తుంటానో అంతటి ఉపేక్షతోనే దానినిగూర్చి దేశోద్ధారకుడు ఇచ్చిన సమాధానాన్ని కూడా నేను గ్రహించేవాడిని. ఆ కారణంవల్ల దేశోద్ధారకుడు ఈ యంజనంవలన లభించిన ధనంతో ప్రజానసులకు ఉపకారము చేస్తున్నాడనే విషయంలో నాకు అది వరకు ఎట్టి నమ్మకమూ కలుగలేదు. కాని ఆయన ఆంధ్ర దేశంలో ప్రజోపయోగమయిన పెక్కు ఉద్యమాలకు అపరిమితంగా ధనసహాయం చేస్తున్నాడని యీసారి ఆంధ్రదేశ సంచారంలో నేను గ్రహించ గలిగినపుడు నాకు మిక్కుటమయిన ఆశ్చర్యమే కలిగింది.

దానార్థియయిన యాచకుడు అతనివద్దకు వెళ్లి యాచించిన పిమ్మట తిరస్కృతుడై ఆయన సమ్ముఖం ఎన్నడూ విడచిపోలేదు. ఆంధ్రదేశంలో ప్రతిచోటా నాకు సమర్పింపబడిన సన్మానపత్రాలలో దేశోద్ధారకుని ధర్మాలను గూర్చిన ప్రశంస పేర్కొనబడుతూనే వచ్చింది. అస్పృశ్యుల కొరకేర్పరుపబడిన ఆనందాశ్రమంలో శాశ్వతభవనాలను నిర్మించి యిచ్చినవాడు దేశోద్ధారకుడే. ఒక పాఠశాలకు ధనసహాయం కావలసి వచ్చినప్పుడు తోడ్పడినవాడును దేశోద్ధారకుడే. సీతానగరంలో డాక్టరు సుబ్రహ్మణ్యంగారేర్పరచిన ఆశ్రమానికి ముద్రాశాలోపకరణాలు కావలసి వచ్చినప్పుడు వాని నన్నిటిని సమకూర్చినవాడును మన నాగేశ్వరరావే.

పరోపకారం ఒనరిస్తున్నప్పుడు కలిగే ఆనందం నాగేశ్వర రావును మరెప్పుడునుగూడ కలుగదు. నాకు తెలిసినంతవరకు ఆయన నేరదాతలలో అగ్రగణ్యుడు. అతని దాతృత్వం అపారమే అయినప్పటికీ కేవల నిరాడంబరం. అతని కుడిచేయి యిచ్చిన దానము అతని యెడమచేతికే తెలియబడనప్పుడు యితరులకు అసలే తెలియదని వేరుగా వ్రాయవలెనా? ఈ సంచారంలో నే నొకచోట యీ అమృతాంజనం దోపిడినిగూర్చి ఛలోక్తిగా పల్కాడినపుడు ఒక దేశారాధకుడు ఇట్లా అన్నారు: "నాగేశ్వరరావుగారు యింకా హెచ్చుగా దోపిడి చేయవలెననే నేను కోరుతాను. ఎందుకనగా ఆయన దోచుకొనిన ధనమంతా దేశసేవకే వినియోగింపబడుతుందని నేను ఋజువుగా చెప్పగలను".

ఆంధ్రదేశమందలి రాజకీయ నాయకులకు ప్రజలు విచక్షణలేకుండా విచ్చలవిడిగా బిరుదాలు ఇస్తుంటారని నేను రహస్యంగా విమర్శిస్తుంటాను. నాగేశ్వరరావుకు ఇవ్వబడిన 'దేశోద్ధారక' బిరుదము అతనిపట్ల సార్థకమే అని నా కిపుడు బాగుగా నమ్మకం కలిగింది.

[గాంధీజీ ఎంగుయిండియాలో 30—5—29న వ్రాసిన వ్యాసం భాగం]

# భోగి, త్యాగి - మహాత్ముని ప్రశంస

**మీ** సమక్షంలో ఇరువురు నాగేశ్వరరావులు వున్నారు. ఒకరు సజీవులు. వారు విశ్రమిస్తూ నేలమీద కూర్చుని వున్నారు. రెండవ నాగేశ్వరరావుగారు కాగితంపై వున్నారు. జీవంతో వుండే చిత్తరువును బహిర్గతం ఒనరించడానికి నాకు సామర్థ్యం లేదు.

"తన్ను తాను తెలిసికొన్నవాడే ఉత్తముడు" అని జ్ఞానులు చెప్పివున్నారు. ఆత్మసహితుడైన పురుషుని నిజ స్వరూపాన్ని పరు లెవ్వరును సరిగా గ్రహించజాలరు. అట్టి పురుషునికి కూడా తన ఆత్మయొక్క యదార్థస్వరూపం పరిపూర్ణంగా గ్రహింప గల్గడం దుర్లభం.

సత్యాన్వేషకుడైన ఒక మహాత్ముని ఈ విషయమై ఇలా చెప్పారు: "తన్ను తాను తెలిసికోవడం కంటె మానవుని జీవితంలో మహోత్కృష్టమైన కార్యం వేరే ఏమీ లేదు. నిన్ను నువ్వు తెలుసుకో." ఇలా అన్న జ్ఞాని ఒక ఆంగ్లపండితుడు. సంస్కృత భాషలో దీనికి సామ్యం మరొకటి వుంది. "ఆత్మ పర్యవసానమండీ పరమ పురుషార్థం." కోటి కొక్కరైనా అట్టి స్థితిని అందుకోలేరు. శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు అట్టి ఉచ్చస్థితిని ఇప్పుడు అందుకొన్నా, లేక ఈవరకే అందుకొనివున్నా, వారి అంతస్స్వరూపాన్ని బాహాటంగా వ్యక్తీకరింపగలుగుతుంది. మన మీ చిత్రాన్ని ఎట్లా అవలోకించి వారి మూర్తిని తెలుసుకొంటున్నామో వారి ఆంతరమూర్తిని కూడ మనం అప్పుడు ప్రత్యక్షం చేసికోగల్గుతున్నాం.

చిత్రగతులై వున్న నాగేశ్వరరావుగారు వేరు. చైతన్య స్వరూపులైన నాగేశ్వరరావుగారు వేరు. చైతన్య రూపంలో వారు అనుదినం అభ్యుదయం పొందుతూ వుండవచ్చు. లేదా క్రమశః పతనం పొందుతూ వుండవచ్చును. చిత్రమూర్తులైన నాగేశ్వరరావుగారు నిశ్చలంగా స్తంభితు లవుతారు. ఈ మూర్తిగల మహాపురుషునికి మనం కొన్ని సద్గుణాలను ఆరోపించి ఉపలక్షిస్తున్నందువల్ల వారి మూర్తిని ప్రదర్శించే చిత్రంపైనకూడా ఆదరాభిమానాలను ప్రకాశింపజేస్తున్నాము.

అచలమయిన ఆ మూర్తి ఎటువంటిదో నేనిప్పుడు ఇంచుక వివరిస్తాను. నాగేశ్వరరావుపంతులుగారిని నే నెరిగిన దాదిగా వారియం దొక విశిష్టలక్షణం నా మనస్సును మార గొనివుంది. అదేమనగా నాదినిగాని వారి సహకారాన్ని అవసరంగా అపేక్షించేవారికి వారు నిశ్శంకంగా ఆత్మార్పణం కావిస్తూంటారు. నేను వారితో ఒకమారు ఛలోక్తిగా ఇట్లా అన్నాను: "అమృతాంజనం పేరుతో ప్రజలను మీరు వంచన చేస్తున్నారు" అని. నాగేశ్వరరావుగారు 'సరే. నేను మీ మాట కాదనను. అది వంచన అయినా, నిరుపద్రవకరమైన వంచన. అది ఎవ్వరికిని మేలుచేయునట్టిది కాకున్నా చెరుపును మాత్రం చేయుదు. అమృతాంజనం వాడేవారు దాని నివారణశక్తితో విశ్వాసం కలిగే దానిని కొంటున్నారు. ఆ నమ్మకమే వారికి గుణం ఇస్తుంది. ఇది నేను నిశ్చయంగా చెప్పగలను. అమృతాంజనం వలన నాకు వస్తూవున్న లాభంలో అధిక భాగం ప్రజలయొక్క కష్టాల నివారణకే వినియోగింపబడుతూవున్నది. ఈ నా వ్యాపారానికి ఇదే పరమప్రయోజనం" అని అన్నారు.

"ఈయన నాకు నచ్చిన మనిషి" అని తక్షణం అనుకున్నాను. అతని ఆ ప్రత్యుత్తరంలో సంపూర్ణమయిన త్రికరణశుద్ధీ, వినమ్రతా ప్రకాశించాయి. "అతడు ప్రజలను వంచిస్తూ వున్నట్లయితే అంతకంటె ఎక్కుడుగా వారిచే వంచింపబడడానికి ప్రజలు ఒప్పుకొన్నారు" అని నేను గ్రహించాను. అర్థిజనులు ఎవరైనా కన్నీరు పెట్టి 'దేహి!' అని కోరితే, "లేదు" అనేమాట వారి నాల్కకు రాదు. వ్యాపారస్తులే నాకు ఈ విషయం రుజువుపరచి వున్నారు. పిన్నలకేకాక పెద్దలకూ వారి యీవి సోకుతూనే వున్నది. నావంటివారం కూడా వారిని ఆశ్రయించి రిక్తహస్తాలతో మరలిరాము. నాగేశ్వరరావుగారి మేడలు ఒక వంక మహారాజులకూ వేరొక వంక నాబోటి రిక్తులకూ నివాసం ఒసంగుతూ వున్నాయని ఒకానొకమిత్రుడు అన్నాడు. మేడలు అందగొనగల్గడం నాబోంట్లకు భాగ్యమే.

చాలాకాలం నాగేశ్వరరావుగారు ఆంధ్రులన్న సంగతే నేను ఎరుగను. మదరాసులో వారిని కలుసుకొన్నప్పుడు తమిళులనే భావించేవాణ్ణి. సంపూర్ణ వ్యక్తిత్వంగల ఆంధ్ర ప్రముఖు లొకరు ఈ విధంగా తమిళు లైనట్లు భావింపబడడం విశేషమే. నేను కార్యభారంతో క్రుంగిపోతున్నాను. వీరి చిత్రపటావిష్కరణకు ఎందుకు ఒప్పుకున్నానో మీ రిపుడు గ్రహించేవుంటారు. చిత్రగతులై వున్న నాగేశ్వరరావుగారు అచంచలు లయినప్పటికీ, జీవమూర్తు లయిన రావుగారు మాత్రం ఇతోధికాభివృద్ధి పొందుతూ, దీనజనవత్సలులై విరాజిల్లుతారుగాక అని మీరు కూడా నాతోపాటు ఈశ్వరుణ్ణి ప్రార్థించాలని కోరుతున్నాను. కాబట్టి ఈ చిత్రపటావిష్కరణ సందర్భానికి వచ్చినవాళ్ళు గాని దీనిని ఆయత్తపరచిన ఉత్సాహులుగాని నాగేశ్వరరావు గారి చిత్రపటం లభ్యమయింది గదా అని సంతృప్తి పొంది, మిన్నకవుండే పక్షంలో ఆత్మవంచన గావించుకొన్నవాళ్ళు అవుతారు. అది నాగేశ్వరరావుగారికి నాకు కూడా అన్యాయం చేయడం అవుతుంది. వారి సహవాసాన్ని సహాయకత్వాన్ని నేనెందుకు విశేషంగా భావిస్తున్నానో మీకు చెప్పనే చెప్పాను. నాకూ మీకూ వ్యామోహం కొల్పిన సద్గుణ విశేషాదులు వారియందు ఇంకా ఎన్నో వుండవచ్చు. ఉన్నవనడం నిస్సంశయం. ఈ కార్యారంభాన్ని మీరు నిజంగా గొప్పగా తలుస్తూవున్న పక్షంలో వారిలో మీరు గమనించిన సద్గుణజాలాన్ని, లేక భావించిన దొడ్డతనాన్ని మీ మీ జీవితాలలోను అనుష్ఠేయం చేయవలసివుంది. మహాపురుషుల చిత్రసంపత్తికి ఇదే విశిష్టప్రయోజనం. ఇది మీరు గ్రహించలేకపోతే మీ యీ కార్యం ఉత్తవికారం మాత్రమే అవుతుంది.

(1936 లో గాంధీజీ చెన్నపురి ఆంధ్రమహాసభలో శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి చిత్రపటం ఆవిష్కరించినప్పుడు చేసిన ప్రసంగం ఇది.)

# విశ్వదాత

ఆంధ్రులు తమ నాయకుని విశ్వదాతఅని గౌరవించారు. ఆయన చేసిన దానధర్మాలు ఆంధ్రులకు తెలిసినట్లు ఇతరులకు తెలియవు. నేడు ఆంధ్రులందరూ విశ్వదాత పోయినారే అని విలపిస్తున్నారు.

## గుప్త దానాలు

ఆయన చేసిన ధర్మకార్యాలు అందరికీ తెలిస్తేనా? ఆయన కుడిచేతితో ఏమిచ్చినారో ఎడమచేతికి తెలియదు. ఎంతమంది విద్యార్థులకో, ఆతురులకో గుప్త దానాలు చేశారు.

## హరిజన సేవ

కాంగ్రెసు ఉద్యమం, హరిజనోద్యమం రెండూ వారికి చాల ప్రియమైనవి. ఆ రెండుఉద్యమాలకు ఆయన మిక్కిలి ఉదారభావంతో సాయం చేశారు. ఆయన ఎన్నో సంవత్సరాలుగా ఆంధ్ర హరిజనసేవక సంఘాధ్యక్షులుగా ఉన్నారు. తమ జమీందారీలో హరిజనులకు ఎన్నో నివాస స్థలాలు దానం చేశారు.

## దరిద్రనారాయణ సేవ

దమ్మిడీ ఖర్చులేకుండ దుష్టంగా కౌష్ఠరాలు తయారుచేసి వేలకొలది రూపాయలు సంపాదించినవారెందరో ఉన్నారు. శ్రీ నాగేశ్వరరావు తమ 'అమృతాంజనం' మందు చేయడానికి ఖరీదు జహస్యత్వమనే విషయాన్ని రహస్యంగా ఉంచలేదు. కాని, ఆయన సంపాదించినదంతా దరిద్రనారాయణులకే అర్పణ చేశారు. ఆయన మహాక్షత్ర వ్యాపారస్థులు అయినా అత్యంత దేశభక్తులు. 63 వ యేట కారాగారానికి వెళ్లారు; తరువాత మళ్లీ రెండుసార్లు వెళ్లారు.

## ఆంధ్రపత్రిక

ఆంధ్రులసేవ, ఆంధ్రభాషా సేవ—ఇవే ఆయనకు పరమధ్యేయాలు. లోకమాన్యతిలక్ 'కేసరి' పత్రికను ఏవిధంగా పెంచారో ఆ విధంగానే శ్రీ నాగేశ్వరరావు ఆంధ్రపత్రికను పెంచారు. మహారాష్ట్రులకు 'కేసరి' చేసినంత సేవను యీ ఆంధ్రపత్రిక ప్రజల విజ్ఞానాన్ని అభివృద్ధి చేయడంలో చేసింది.

[నాగేశ్వరరావు పంతులుగారు నిర్యాణం చెందినప్పుడు శ్రీ మహాదేవదేశాయి 'హరిజన్' పత్రికలో వ్రాసినవి.]

Dear Sir, 11/7/1920

I am enjoying good health here and believe you are all enjoying good health. Please convey my good wishes and thanks to all our friends there. Kindly remove from the Baba the words Desodharaka & Vesvadata from the announcement & also add a note as request that no body should add those epithets in their letters to me. It is quite improper to have such high sounding epithets and makes my position quite ridiculous. I am sorry for all the trouble caused to you and others on my account.

May God protect the Baba and help you all,

yours ___

[illegible]

# విశ్వదాత వినయసంపత్తి

[శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు వినయ భూషితులు. నిగర్వ శిఖామణులు. నిరాడంబరులు. పెక్కండ్రు పెక్కు రీతుల వారిని సత్కరించినను వా రుప్పొంగెడివారు కారు. "విశ్వదాత, దేశోద్ధారక" బిరుదములను సైతము వాడవలదని శ్రీ పంతులుగారు తిరుచినాపల్లి జెయిలునుండి ఆంధ్రపత్రికా కార్యాలయమునకు స్వహస్తముతో వ్రాసిన లేఖను, దాని తర్జుమాను ప్రకటించుచున్నాము.]

తిరుచినాపల్లి, 11—1—1930.

నేనిచ్చట చాల ఆరోగ్యముగనే యున్నాను. మీరందరును ఆరోగ్యముగా నున్నారనియే నమ్ముచున్నాను. మన మిత్రుల కందరికిని నమస్కృతుల నందజేయగోరెదను. వారినందరిని చాలా చాలా అడిగితినని తెలుపగోరెదను.

పత్రికలోని ప్రకటనలో నా పేరుకు ముందు చేర్చబడుచున్న "దేశోద్ధారక–విశ్వదాత" అను పదములను తీసివేయగోరెదను. నాకు ఉత్తరములను వ్రాయువా రెవరును గూడ నిటుపైని యీ పదములను వాడవలదని నేను ప్రార్థించితిననిగూడ పత్రికలో స్పష్టముగా ప్రచురణ చేయగోరెదను. ఇట్టి పెద్ద బిరుదులను వాడుట యెంత మాత్రమును సముచితము కాదు. ఈ పదములను వాడుట వలన నా స్థితి చాల హాస్యాస్పదమగుచున్నది. నా నిమిత్తమున మీకును, నితరులకును చాల యిబ్బందులు కలిగినందులకు నేను చింతిల్లుచున్నాను. భగవంతుడు పత్రికను, మిమ్ముల నందరిని కాపాడునుగాక!

(సం.) కా. నాగేశ్వరరావు

# శ్రీమద్భగవద్గీత

[భగవద్గీతల కాంధ్ర వ్యాఖ్యానాది వివరణములను శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు చిర కాలము క్రిందటనే, వారు జెయిలులో నున్నపుడు రచించినారు. దాని ముద్రణము వారి యారోగ్య దశయం దున్నప్పుడే పూర్తి యయినది. కాని వారు సంకల్పించుకొన్న ఉపోద్ఘాతమును దురదృష్టవశమున వారు వ్యాధిగ్రస్తు లగుట మూలమున అనుకొన్న విధముగా ముగించ లేకపోయినారు. చిత్తుప్రతియైనను పూర్తి కాకముందే వారు లింగైక్యమును పొందినారు. ఆ యేకదేశమునే ఆంధ్రగ్రంథమాలవారు ఆ గ్రంథమునకు ఉపోద్ఘాతముగా ప్రచురించినారు. ప్రకటితమైన యీ భాగమును బట్టి చూచినచో ఆ ఉపోద్ఘాతమునే ఒక మహాగ్రంథముగా శ్రీ పంతులుగారు వ్రాయ బూనినట్లు స్పష్టము కాగలదు. ఏమయిన నేమి? వారి సంకల్పము కొనసాగదయ్యెను. "భగవద్భక్తులకు గీతా ప్రచారము చేయుట ధర్మము" అని వేయివిధములుగా నమ్మిన శ్రీ పంతులుగారి ఆత్మకు తృప్తికరముగా, శ్రీవారి శాశ్వత మహత్తర రూపమయిన ఆ కృతిని ఆంధ్రమహాజనులకు ఆదరపూర్వకముగా ఆంధ్రగ్రంథమాలవారు సమర్పించినారు. ఆ ఉపోద్ఘాత భాగమును, శ్రీ పంతులుగారు ప్రత్యధ్యాయారంభ సమాప్తులలో వ్రాసిన ప్రవేశికా సారాంశములను, కొన్ని ముఖ్యమైన పట్టులలో వారు వ్రాసిన వివరణములను పొందుపరచి ఇప్పుడు ప్రకటించుచున్నాము. ఈ బృహద్వ్యాసము భగవద్గీతలకు నికషమైన సారాంశముగా నుండగలదని మా నమ్మిక.]

శ్రీమద్భగవద్గీతలు భగవద్విషయము నైన గీతలు, భగవంతుడు చెప్పినగీతలు. భగవద్గీతలు హిందువుల మత గ్రంథములయందు విశేషవ్యాపకమును, పండిత పామరాదరణమును గల ప్రమాణ గ్రంథము. ప్రస్థానత్రయమునందును గీతాశాస్త్రము త్రిమతస్థులకును సమాదరణీయమయిన యోగశాస్త్రము. త్రిమత స్థాపకులును, వారి శిష్య ప్రశిష్యులును, దార్శనికులు, తత్త్వజ్ఞులు, యోగులు, భోగులు, నైతికులు, రాజనీతిజ్ఞులు మొదలగు మహానుభావులును గీతాశాస్త్రమునకు వ్యాఖ్యానములను వ్రాసి గీతా పాఠమును సుగమము చేసిరి. వర్తమాన కాలమునందును స్వామి వివేకానందుడు, లోకమాన్యతిలకు, అరవిందఘోషు, గాంధి మహాత్ముడు మొదలగు నాయకులును, పండితులును గీతలకు వ్యాఖ్యానములను వ్రాసి గీతాపాఠమును జనరంజకము చేసిరి. పాశ్చాత్య పండితులును భగవద్గీతలకు వ్యాఖ్యానములను వ్రాసి గీతాశాస్త్ర మహాత్మ్యమును వ్యాపకము చేసిరి.

కురుక్షేత్రమునందు గీతామందిరము నిర్మింపబడినది. లక్షలకొలదిగ గీతాశాస్త్రప్రతులు లోకమునం దంతటను వెదజల్లబడినవి, పడుచున్నవి. ఆంధ్రమునందును వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారును, రాజమహేంద్రవరమునందు న్యాపతి సుబ్బారావుగారి యాజమాన్యమున హిందూ సమాజమువారును, ఆనంద ముద్రాశాలాధిపతులును, ఇతరులును గీతను ప్రచురించి ప్రచారము చేయుచున్నారు. చదలవాడ సుందర రామశాస్త్రిగారు తొమ్మిది సుప్రసిద్ధ వ్యాఖ్యానములతో నాంధ్రమునందు పెద్ద గ్రంథమును ప్రచురించి ఆంధ్రులకు మేలొనర్చిరి. భగవద్గీతల కాంధ్ర పద్యానువాదములును చేయబడినవి.

సామాన్యమునకు [illegible] వ్యాఖ్యానము [illegible] ప్రాచీనసంప్రదాయానుసారముగా [illegible]. [illegible] తిలకు కర్మయోగపరముగను, గాంధిమహాత్ముడు [illegible]పరముగను వ్యాఖ్యానములను వ్రాసిరి. వర్తమాన సంఘ [illegible]మునందు గీతా తత్త్వగ్రహణము [illegible] కాగలదు.

విశ్వకల్యాణమార్గప్రదము [illegible] భగవద్గీతల [illegible] విధముల నెందరు వ్యాఖ్యానములను [illegible] ఉపనిషత్తులయందు ప్రవచింపబడిన [illegible] "పూర్ణమదః......" పూర్ణమిదం [illegible]. అనంతములైన వ్యాఖ్యానములును లోకసంగ్రహమునకు [illegible]. గీతోపదేశాంతమునందు శ్రీ కృష్ణపరమాత్ముడు చెప్పినట్లు భగవద్భక్తులకు గీతాప్రచారము చేయుట ధర్మము. క్రైస్తవ మతస్థులు చేయుచున్న బైబిలు ప్రచారము హిందువులకు గీతా ప్రచారమునకు పూనుకొనవలసిన మార్గావసరములను నిరూపించుచున్నది:

> "య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి,
> భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః."
>
> అ. 18., శ్లో. 68.

భగవద్భక్తులకు భక్తితత్పరులై గీతాప్రదానము చేయుట మోక్షసాధనము.

విశ్వవికాసమునందు మానవాభ్యుదయ మొక యద్భుతాధ్యాయము. హిందూ సిద్ధాంతులు సృష్ట్యాదినుండియును 195, 58, 85, 032 సౌరాబ్దములు గతించినటులు గణించిరి. ఈ కాలపరిగణనము భూగోళోత్పత్తికి గాకను జీవోత్పత్తికి సంబంధించినటు లూహింప దగియున్నది. భూగోళమునందు మానవ

జన్మ సంభవ మెపుడు జరిగినదియును నిర్ణయించుట దుష్కరము. జ్యోతిశ్శాస్త్రజ్ఞులును, భూగోళ ఖగోళ భౌతికాది శాస్త్రజ్ఞులును భూగోళమున 200 కోట్ల జీవములు, 30 కోట్ల సంవత్సరము లకు పూర్వము సృష్టింపబడినటులు నిర్ణయించియున్నారు. మాన వుడు 3,00,000 సంవత్సరములనుండియును భూగోళమునందు నివసించుచున్నటులు శాస్త్రపరిశోధనలు నిర్ణయించుచున్నవి.

స్థల పరిమితియందు భూగోళము బ్రహ్మాండమునం దొక రేణువునకును సాటి రాకున్నది. సూర్యగోళము భూగోళముకంటె 12,50,000 రెట్లు పెద్దది. బ్రహ్మాండమునం దెన్నియో సూర్యమండలములును, సూర్యగోళమునకన్న పెద్దవైన నక్షత్ర గోళములును గలవు. దిక్కాలము అనంతములై దురవగాహములుగ నున్నవి.

దురవగాహమైన విశ్వతత్త్వమును గ్రహించుటకు మానవు లాదినుండియును చేసిన ప్రయత్నములను ప్రపంచేతిహాసము అనంత ముఖములను బోధించుచున్నవి. ఆ ప్రయత్నముల ఫల మిదమిత్థ మని నిర్ణయించుట దుష్కరమవి ప్రపంచ పరిస్థితులు విస్పష్టము చేయుచున్నను విజ్ఞానసాగరమున నుండి అమృతమును గ్రోలుటకు మానవు లందఱును ప్రయత్నిముంచ జేయుట ధర్మము. ఆ ప్రయ త్నముల ఫలము గీతయం దిటులు వర్ణింపబడినది:

"ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి
శ్రుత్వాఽ ప్యేనం వేద నచైవ కశ్చిత్."

అ. 2., శ్లో. 29.

ఒకానొక డాత్మయోగమును ఆశ్చర్యముగను చూచినను, తెలిపినను, వినినను ఆత్మతత్త్వము నెవ్వడును ఎఱుగడు.

మానవాభ్యుదయమునకు వినియోగపడిన విజ్ఞానముల యందు వైదికవిజ్ఞాన మతిప్రాచీనమును, అతివిశాలమును. వేద కాల నిర్ణయమునందు భేదాభిప్రాయములు లేవు. జీవయాత్రకు మూలాధారమైన కర్మ సంస్కారము జ్ఞానసంస్కారముగను పరిణ మించిన విధమును వైదిక విజ్ఞానము విశదము చేయుచున్నది. ఆదిని మానవులు ప్రకృతి పరిసరములను జయించి సుఖసంపాదన మున కాధిపత్యమును బడయుటకు చేసిన కర్మానుష్ఠానము జ్ఞాన యోగమునందు విచిత్రమైన దుఃఖాధ్యాయము. శాస్త్రజ్ఞాన వికాసము కర్మకాండకు ప్రాధాన్యమును తగ్గించి జ్ఞానయోగము నకు ప్రముఖతను గలుగజేసిన విధమును మతములు, శాస్త్రములు, సాంఘికవ్యవస్థలు, ప్రభుత్వములు, ప్రపంచేతిహాసాదులును విశదము చేయుచున్నవి. మానవాభ్యుదయమునం దనవరతమును కర్మసంస్కా రమునకును, జ్ఞానసంస్కారమునకును ప్రవర్ధమానం బయ్యెడి సంరంభమునకు వైదికమత పరిణామము పరమప్రమాణముగ నున్నది. కర్మపరమైన పూర్వమీమాంస జ్ఞానపరమైన ఉత్తర మీమాంసాదూపమును దాల్చుటయందు మానవాభ్యుదయము నకు సహజములైన ఘటనాఘటనములు ప్రత్యక్షము లగుచున్నవి. వైదిక మత పరిణామమునందు కర్మయోగమునకును, జ్ఞాన యోగమునకును గలిగిన ఘటనాఘటనములు వివిధములైన మత ముల యందును, శాస్త్రములయందును, కళలయందును, కావ్య ములయందును, లోకవ్యవహారముల యందును, నిత్యజీవితము నందును ప్రత్యక్ష మగుచున్నవి. సనాతనమైన యీ ఘటనాఘట నములు వ్యక్తులయందును, కుటుంబములయందును, కులముల యందును సంఘములయందును, జాతులయందును సుఖదుఃఖము లకు మూలబీజములై, మహాసంక్షోభమునకు మూలముగ నున్నవి. మానవాభ్యుదయమునకును, విశ్వ శ్రేయస్సునకును కర్మ సంస్కారమును, జ్ఞానసంస్కారమును సమన్వయము చేయుట తత్త్వములకు, మతములకు, శాస్త్రములకు, కళలకు, పత్రిక లకు, వృత్తులకు, ధర్మములకు, రాజ్యాంగములకును పర మార్థము. ఆ పరమార్థమును 700శ్లోకములయందు భగవద్గీతలు సకల జనులకును సులభగ్రాహ్యము చేయుచున్నవి. పదునొకండవ అధ్యాయమునందలి మొదటి శ్లోకము ప్రక్షిప్తమని కొందఱి మతము. ఆ శ్లోకమును జేర్చినచో 701 శ్లోకములు. కొందఱు హిందూసనూజము ప్రచురించిన ప్రతియందు 11—వ అధ్యా యమునందలి 45— వ శ్లోకము ప్రక్షిప్తము చేయుట యుక్త మని తెలిపియుండిరి. శ్రీకృష్ణుడు చతుర్భుజుడని కనుపట్టెడి విరోధ మీ శ్లోకము ప్రక్షిప్తము చేయుటవలనను పోవు నని సూచించిరి. శ్రీ కృష్ణుడు చతుర్భుజుడో, ద్విభుజుడో నిర్ణ యించుట కాధారములు గనుపట్టవు. అర్జునుని సంబోధనము వలనను చతుర్భుజు డనియే నిర్ణయింపదగి యున్నది.

విశ్వ శ్రేయస్సునకు వినియోగపడిన సంస్కారములయందు భారతీయార్య వైదిక సంస్కార మొక దివ్యపర్వము. నాలుగు వేద ములు, వైదికమతసారము లైన బ్రహ్మసూత్రములు, ఉపని షత్తులు కర్మ ధర్మ బ్రహ్మజిజ్ఞాసాంబుధులు. కర్మ ధర్మ బ్రహ్మ జిజ్ఞాసకు నాలుగు వేదములు, శిక్ష, వ్యాకరణము, నిరుక్తి, ఛందస్సు, జ్యోతిషము, కల్పము, మీమాంసా శాస్త్రము, న్యాయ విస్తరము, పురాణము, ధర్మ శాస్త్రములు ప్రఖ్యాత సాధనములు. జిజ్ఞాసాశ్రయులాభమునకును వైదికమత సంప్రదాయసిద్ధమైన విజ్ఞానము నంతయును చదివి, తరిచి, విజ్ఞానామృతము ననుభ వించుట మహాపండితులకును అసాధ్యమైన విషయము.

సంస్కృత విజ్ఞానము సజీవముగను, పూర్ణముగను వ్యాప కమునం దున్న కాలమునందే వేదవ్యాసునికి బ్రహ్మ విద్యాపరమైన యోగశాస్త్రమును భగవద్గీతారూపమునను సువ్యక్తము చేయ వలసిన యవసరము గలిగినపుడు వర్తమాన కాలమునందు దాని యవసరమును సమర్థించుట యనవసరము. ముఖ్యముగను సంస్కృత భాషా పాండిత్యము దుర్లభమును, దురారాధ్యమును నైన వర్తమాన కాలమునందు సంస్కృత భాషాధారమైన విజ్ఞానము యొక్క విమర్శన సమన్వయములు పండితులకు సాధ్యమైనను సామాన్యులకు దుర్లభము. సనాతనమును, అపారమును అసాధ్య మును నైన వైదికమత సంస్కారతత్త్వములను గీతాశాస్త్రము

ప్రతి వ్యవసాయదారుడు **రష్యన్ ట్రాక్టరును**

## కోరుతాడు -- ఎందుచేత?




* వెలలో చౌక, నాణ్యంలో ఉన్నతమైనవి
* నమ్మకంగా పనిచేయుటలో దానికదేసాటి
* అధికకృషికి అత్యధికముగా తోడ్పడును
* దుక్కికి, దమ్ముకి అతి ప్రసిద్ధమైనవి
* అమ్మకం తరువాత గ్యారంటీ సర్వీసు లభించును.
* ఎల్లవేళల కావలసిన విడిభాగములు లభించును.
* వీటికి సాటి మరొకటి లేనందున

మీరు కూడ రష్యన్ డీజిల్ ట్రాక్టరను ఉపయోగించి మీ భూములమీద
అధిక ఫలము, మంచి ఆదాయము పొందండి

వివరములకు నేడే మాకు వ్రాయండి.

ఆంధ్రప్రదేశ్‌కు ఏకైక డిస్ట్రిబ్యూటర్లు:

# నవభారత్ అగ్రికల్చరల్ & కమ్మర్షియల్ కార్పొరేషన్

ఫోన్ నెం: 4199 గ్రామ్స్: "AGRICULT"

ప్రకాశం రోడ్, పోస్టు బాక్సు నెం. 365

విజయవాడ-2

బ్రాంచి: సుబేదారుపేట నెల్లూరు.

ఫోన్ నెం. 220 గ్రామ్స్: "AGRICULT"

సబ్ డీలర్లు: 1) సర్వోదయ భారత్ కిసాన్ ఇండస్ట్రియల్ సర్వీసు, కాకినాడ.

2) భారత్ ఆటోమొబైల్సు, పి.పి. రోడ్, భీమవరం. 3) శ్రీ దుర్గా ట్రాక్టర్‌సర్వీసు, కడప.

NVKR

సకల జనులకూ కరతలామలకము చేయుచున్నది. ఈ పరమార్థమునే భగవద్గీతల యందలి అధ్యాయాంతము నందలి గద్యవాటులు తెలుపుచున్నది: "ఇతి శ్రీ కృష్ణార్జున సంవాదమును, యోగశాస్త్రమును, బ్రహ్మవిద్యయును, ఉపనిషత్తులును నైన భగవద్గీతలయందు అర్జున విషాదయోగ మను మొదటి యధ్యాయము."

భగవద్గీతలు ప్రత్యేక పరిస్థితుల కేర్పడిన మతగ్రంథము గాకనుమానవాభ్యుదయమున కనుకూలమైన పూర్ణయోగశాస్త్రము. వేదశాస్త్రము లనంతములు. అనంతమైన వేదశాస్త్రముల సారమును గీతాశాస్త్రము ఉపదేశించు చున్నది. మానవాభ్యుదయమునకు మానవ విజ్ఞానము మూలాధారము. సకల శాస్త్రముల విజ్ఞానమును మానవాభ్యుదయమునకును, విశ్వకల్యాణమునకును వినియోగించుట విజ్ఞానమునకు పరమార్థము. ఆ పరమార్థమును గీతాశాస్త్రము సంగ్రహించు చున్నది :

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్."

గీతాశాస్త్ర కథనమునకు భారత యుద్ధము, అర్జునుడును నిమిత్త కారణములు. గీతాశాస్త్రము సకలజనులకును గీతామృతమును ప్రసాదించు చున్నది. వేద వరిణామమునందు కర్మానుష్ఠానము ధర్మానుష్ఠానమునకును, ధర్మానుష్ఠానము జ్ఞానానుష్ఠానమునకును పరిణామముగాగల విధమును ప్రపంచేతిహాసమునందు కర్మశాస్త్రము, జీవశాస్త్రము, ధర్మశాస్త్రము, మనశ్శాస్త్రము మొదలగు శాస్త్రములు నిరూపించుచున్నవి. వైదికమత పరిణామమగు పరమార్థమును వేదాంతశాస్త్ర సారమైన గీతాశాస్త్రరూపమునను నిరూపించుచున్నది. వైదికమత పరమార్థమును పురాణేతిహాసములు దృష్టాంత రూపమునను పండిత పామరులకు సులభగతము చేయుచున్నవి. మహాభారతము, ప్రపంచేతిహాసములయందు మహాధర్మేతిహాసము. గీతాశాస్త్రము హిందువుల యందు జాతి మత కులభేదమును, పండిత పామరభేదమును లేకను సకల జనులకును పురుషార్థసిద్ధికి సాధన భూతముగ నున్నది.

"త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్."
అ. 2., శ్లో. 45.

ప్రపంచమునందు గల 190 కోట్ల ప్రజలందును హిందువులు, బౌద్ధులు, క్రైస్తవులు, మహమ్మదీయులు, ఇతర మతస్థులును కలరు. ఈ మతస్థు లందఱకును ఆత్మయందును, పరలోకమునందును, దైవమునందును విశ్వాసము గలదు. హిందూమతమును, బౌద్ధమతమును హిందూదేశజన్యములై కర్మ ధర్మ సంస్కారములయందు సామ్యమును గలిగియున్నవి. ఆర్య సంస్కారఫలమైన ఈ మతము లార్యేతర జాతులందును వ్యాపకమును గాంచినవి. సెమిటికు సంస్కార సంజాతములైన క్రైస్తవ మహమ్మదీయ మత సంస్కార మార్గములయందు వ్యాపకమును గాంచినది. మతము మానవాభ్యుదయమునకును, శాంతికిని వినియోగపడిన విషయములయందు ప్రధానముగ నున్నది.

మతములకు అర్థము, కర్మపరమైన కామము, స్వార్థము హింస, భయము, భిన్నత్వము, భోగము, వకల్యము మూలాంకురము లైనను అభయము, అహింస, శాంతి, సత్యము, త్యాగము, నిత్యత్వము, బ్రహ్మత్వము పరిణామము లైనవి. ఆత్మ పోషణము, ఆత్మ రక్షణము, ఆత్మ సౌఖ్యము ఇహమున నుండి పరమునకును, దేహమునుండి ధర్మమునకును, ధర్మమునుండి దైవమునకును దైవమునుండి ఆత్మకును, భోగమున నుండి త్యాగమునకును పరిణమించిన విధమును మతముల పరిణామము విశదము చేయు చున్నది. జీవత్వము మానవత్వమును, మానవత్వము బ్రహ్మత్వమును పొందగల విధమును వేదాంతసారమైన భగవద్గీతలు సులభగ్రాహ్యము చేయుచున్నవి. మానవతత్త్వ పరిణామములను సులభముగను బోధించెడి గీతాశాస్త్రము హిందూమతస్థులకుమాత్రమే కాక ఇతర మతస్థులకును, తద్వ్యక్తులకును సమాదరణీయము. సుకృతులైన భగవద్భక్తులు నాలుగు విధములుగ నున్నారు : 1. ధన ధర్మ పరాయణులైన అర్థ్రాణపరాయణులు, 2. మానవాభ్యుదయమును సమకూర్చెడి శాస్త్రజ్ఞులు, 3. యంత్రాద్యుపకరణ నిర్మాతలు, 4. తత్త్వజ్ఞులు. ఈ పరమార్థమే భగవద్గీతయం దిటుల తెలుపబడినది :

"చతుర్విధా భజంతే మాం జనా సుకృతి నోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!"
అ. 7., శ్లో. 16.

క్రైస్తవ మతమునందును, మహమ్మదీయ మతమునందును భగవదారాధనమునకు మొదటి మూడు విధములును ప్రధానములు. హిందూమత పరిణామమునందు నాల్గవ విధమైన జ్ఞానము ప్రధానము. ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులును భగవదారాధనను చేయుటకు యజ్ఞము, దానము, తపస్సు సాధనములు.

"బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః."
అ. 7., శ్లో. 19.

సర్వమును బ్రహ్మమే యను పూర్ణయోగ జ్ఞానమును భగవద్గీత సంగ్రహము చేయుచున్నది.

జీవయాత్రకు పరమార్థము సుఖప్రాప్తి, దుఃఖనివృత్తి. పిపీలికాది బ్రహ్మపర్యంతముగల జీవజాలము శ్రీ పరమార్థ సిద్ధికనవరతమును కర్మమును చేయుచున్న విధమును విశ్వప్రవృత్తి విశదము చేయుచున్నది. భూతభావోద్భవకరమైన విసర్గము కర్మ మనబడుచున్నది. విశ్వమునందు చరాచరములు స్వధర్మారాధనమును చేయుచు, ధర్మారాధనమున కనురూపమైన కర్మఫలము ననుభవించుచున్నవి. సుఖప్రాప్తికిని, దుఃఖనివృత్తికిని, సామాన్యముగను కర్మ సాధ్యములైన అర్థకామములు సాధనములుగ నున్నవి.

ధనుడు తన శిష్యుడైనను దురభిమానముగల వాని వాక్యములను విని యూరకుండెను.

అర్జునుడు రెండుసేనల నడుమను రథమును నిలుపుటకు శ్రీకృష్ణుని గోరెను. శ్రీకృష్ణుడు రథమును నిలుపగా యుద్ధము చేయుటకు సమాగతులైన ఆచార్య బంధు మిత్ర పుత్రాదులను జూచి అర్జునుడు పరమకృపాయత్తచిత్తుడై ధర్మజిజ్ఞాసువుడై పాపభీతి కలిగి శ్రీకృష్ణపరమాత్ముని శిష్యుడు వలెను ధర్మోపదేశమును వేడెను. శ్రీకృష్ణుడు దైవ సంపత్సంపన్నుడైన విజయుని కభయమునొసంగి (మా శుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ!— అ. 16. శ్లో. 5) కర్తవ్యాకర్తవ్యముల నుపదేశించి కృతార్థుని జేసెను. అర్జునుడు మనోవాక్కాయముల ద్వారా సాత్త్వికములైన యజ్ఞ దాన తపఃకర్మాదుల సాధనమునను యోగశాస్త్రోక్తమైన బ్రహ్మవిద్యయం దధికారమును బడసెను.

ధీరుడు, ధీమంతుడు, దైవసంపత్సంపన్నుడు సాత్త్వికుడును అయిన అర్జునునకే స్వధర్మ నిర్వహణ మందు విషాదయోగము సంభవించినపుడు విషాదావస్థయందు సామాన్యుం విషయమై యోచించుట నిరర్థకము.

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున యుద్ధసమయమునందు దుర్యోధనార్జునులకు గలిగిన యుభయమాన ధర్మ సందేహములు మానవులకు సందిగ్ధసమయములందు సహజముగను గలిగెడి విషాదయోగమునకు ప్రమాణములు. ధర్మజిజ్ఞాస పురుషార్థమునకు సాధనమైన ఆత్మజ్ఞాన ప్రాప్యమైన చతుర్విధపురుషార్థములకును మూలాధారము. ఆత్మజ్ఞానమునకు సాధనమయిన పూర్ణయోగమును అష్టాదశయోగముల సాధనములను గీతాశాస్త్రము బోధించుచున్నది.

మహాభారతేతిహాసము. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందసుర బల సంపన్నులయిన కౌరవులు పరాజయమును, దైవబల సంపన్నులయిన పాండవులు ధర్మ విజయమును పొందిన విధమును వ్యక్తము చేయుచున్నది. ఘోరమైన మహాభారతయుద్ధపు దృష్టాంతమునను సర్వమునందును, ప్రత్యక్షముగను, ధర్మక్షేత్రమైన దేహక్షేత్రమునందును దైవాసుర సంపదలకును, ఆత్మానాత్మలకును, పుణ్యపాపములకును, కర్మాకర్మలకును, ధర్మాధర్మములకును జరిగెడి సమరమును భగవద్గీత బోధించుచున్నది. మహాభారతమునకు హృదయమైన గీతాశాస్త్రమువలెను సకలమయిన గీతలు, సాహిత్యములు, కళలు, శాస్త్రములు, సంగ్రామయాగములు, పురాణేతిహాసములు, సాంఖ్యయోగములు ధర్మజిజ్ఞాసకు ఫలమైన బ్రహ్మవిద్యకు సాధనములు. బ్రహ్మవిద్య మోక్షమునకు వలెను ధర్మార్థకామములకును మూలాధారము.

భగవద్గీతకు బీజమైన "అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" యనెడి ధర్మజిజ్ఞాసార్థము సకల సంసార ప్రవృత్తికిని బీజము. ఈ ధర్మజిజ్ఞాసార్థమును పూర్ణయోగశాస్త్రసాధనను సుగమము చేయుట శ్రీమద్భగవద్గీతకు పరమార్థము.

అంధుడయిన ధృతరాష్ట్రుడు ధర్మ సంస్మరణమును చేయుచు "కి మకుర్వత— ఏమి చేసిరి?" అని సంజయుని చేసిన ప్రశ్నకు సమాధానము,

> "యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
> తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ."
>
> అ. 18., శ్లో. 70

అను శ్లోకమునందు కలదు. మొదటి చివర శ్లోకములందు గల "అకుర్వత, యోగేశ్వరః, ధనుర్ధరః" లనుపదములు గీతాశాస్త్రమునకు కర్మయోగహృదయమును ప్రతిపాదించుచున్నవి. ధర్మ సంస్మరణము, ధర్మ సంకీర్తనము, ధర్మజిజ్ఞాసయు ఆత్మసంయమన యోగమునకు సాధనములు. నిరపేక్షమైన సర్వాత్మత్వమునందు సాపేక్షములైన సర్వధర్మములు, కర్మములు శరణమును పొందుటవలన పూర్ణయోగము సిద్ధించుచున్నది. ఆత్మయందు సర్వభూతములను, సర్వ భూతములందు ఆత్మను, సర్వత్ర భగవంతుని, భగవంతునియందు సర్వమును చూచునపుడు పూర్ణయోగసిద్ధి గలుగుచున్నది. పూర్ణయోగాభ్యాసమునకు గీతార్థమునకు శక్తియైన "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ", కీలకమైన "అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"— అను నీ రెండింటి యొక్క పరమార్థము స్వాత్మానుభవలబ్ధమైన పురుషార్థమును సులభము చేయుచున్నది. సర్వగతమైన బ్రహ్మము నిత్యముగా యజ్ఞమునందు గలదు. బ్రహ్మోద్భవ బ్రహ్మ ప్రతిష్ఠితములైన యజ్ఞకర్మలు బ్రహ్మవిద్యకు నియతసాధనములు. బ్రహ్మవిద్య కేవలము మోక్షమునకే కాక ధర్మార్థ కామములకును సాధనము, సాధ్యము.

బ్రహ్మవిద్యయందు విషాదయోగము పోయి ఆత్మయోగ స్థితి గలుగుటకు, కర్మసన్న్యాస కర్మయోగములందు, కర్మయోగ విశేషమును, గీతాశాస్త్రము బోధించుచున్నది.

ఆత్మయోగస్థితికి బాహ్యాభ్యంతరములం దాత్మ సందర్శనము సాధనము. ప్రకృతియందు జననము సంతోషమును, మరణము శోక దుఃఖములను గలుగజేయును. నిత్యమైన ఆత్మయోగమున అనిత్యములైన దేహేంద్రియాదుల సంరక్షణమువలెను నాశనమును నిర్వ్యక్త సాధనము. జీవపరిణామమునకును దేహేంద్రియాదుల ఉపనిర్మాణములవలెను, ఆత్మ పరిణామమునకును సహజమైన దేహేంద్రియాదుల రక్షణమువలెను వినాశమును నవసరము. ప్రకృతి సిద్ధమైన ధర్మమునకు విషాదమును బొందుట యవివేకము. అర్జునుడు స్వధర్మనిర్వహణమునకు బుద్ధియోగపరమును గనుగొనజాలకను చిత్త వైకల్యమును, నిశ్చేష్టతను, వైరాగ్యమును బొందుట హృదయదౌర్బల్యమును విశదము చేయుచున్నది, జ్ఞానయోగము విశదము చేయుట లేదు.

## సారాంశము

సంస్కృత భాషయందు వేదాంతాంతరార్థమును ప్రతి వేదమునందున్ను, పాదమునందున్ను, శ్లోకమునందును సమర్థించుట



Grams: PRINTERS
Phone: 3599 & 566
NATIONAL
Litho
PRINTERS
LITHO OFFSET PRINTERS
GANDHI NAGAR
VIJAYAWADA-3
NLP
Consult for
POSTERS
CALENDERS
LABLES
SHOWCARDS
Printing
Varnishing
OUR SPECIALITY

విషాదయోగమును, శ్రీకృష్ణపరమాత్ముడు తత్త్వమును, కర్తవ్యాకర్తవ్యములను, సంసారధర్మమును, మానవధర్మమును, కులధర్మమును, క్షాత్రధర్మమును, స్వధర్మమును బోధించి పోగొట్టుచున్నాడు. సుఖదుఃఖపరమైన విషయభ్రాంతి పోయి స్వధర్మనిర్వహణమును జేయుటకు జిజ్ఞాసువులు కర్మస్వభావమును, ధర్మస్వభావమును, బ్రహ్మస్వభావమును, ఆత్మస్వరూపమును తెలిసుకొనవలయును. నిత్యానిత్య వస్తువివేకము శోకమోహములను బోగొట్టి తత్త్వజ్ఞానమును గలుగజేయుచున్నది. వేదములు, ఉపనిషత్తులు, దర్శనములు, శాస్త్రములు, పురాణములు తత్పదార్థ త్వంపదార్థపరమైన తత్త్వనిరూపణమును చేయుచున్నవి. ప్రవృత్తినివృత్తి మార్గములయందు కర్మయోగ సాంఖ్యయోగముల కవినాభావసంబంధము గలదు. గీతాశాస్త్రమునందలి సాంఖ్యయోగము, కర్మయోగమునకును, జ్ఞానయోగమునకు గల అవినాభావసంబంధమును యోగశాస్త్రరూపమునను నిరూపించుచున్నది.

సాంఖ్యము, యోగము, న్యాయము, వైశేషికము, మీమాంస, వేదాంతము తత్త్వసందర్శన యోగములు. ఈయోగములు ప్రకృతి పురుషుడు భగవంతుడు, జ్ఞానము జ్ఞాత జ్ఞేయము, కర్మ కర్త కార్యము మొదలగునవైన త్రిపుటిని భిన్నవిధములను నిరూపించుచు [illegible] సిద్ధికై సాధన, సాధక, సాధ్యములయందు [illegible] చున్నవి. అనంతములైన యుక్తి [illegible] సాధనములను పూర్వశాస్త్రములను గీతాశాస్త్రము సమన్వయము చేయుచున్నది. పూర్ణయోగము [illegible] ఆత్మయోగమునందు సాధ్యమగుచున్నది.

సాంఖ్యయోగ నామము కపిలకృతమైన సాంఖ్యశాస్త్రమువలన నేర్పడినది. సాంఖ్యము 25 తత్త్వములను నిరూపించుచున్నవి. [illegible] తత్త్వముల కతీతమైన పరమాత్మను నిరూపించుచున్నది. కాని భగవద్గీత యందు సాంఖ్యయోగము జ్ఞానయోగమునకు పర్యాయపదముగ వాడబడినది.

రెండవ అధ్యాయములో తొమ్మిదవ శ్లోకములో నర్జున విషాదయోగ మంతయు ముగియుచున్నది. పదునొకండవ శ్లోకము గీతాశాస్త్రమునకు పూర్ణయోగ జ్ఞానమునకు బీజము. "అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" యని శ్రీకృష్ణుడు విషాదావస్థ యందున్న యర్జునునకు వినియోగించిన సంబోధనమె సంసార ప్రవృత్తియందు చిక్కొని కంతకును వినియోగపడుచున్నది. నిరర్థకములైన స్వాభిమాన మమకారాహంకార సంజాతములైన శోకమోహములు, వానివెంటనే ప్రజ్ఞావాదములను మానవులను సంసారప్రవృత్తియందు స్వధర్మస్వకర్మ విముఖులను, విమోహితులను జేయుచున్నవి. శోకమోహములు పోవుటకు నిత్యానిత్యవస్తువివేకసాధ్యమైన బ్రహ్మజ్ఞానము, ఆత్మజ్ఞానము, కర్మజ్ఞానము, ధర్మజ్ఞానము సాధనములు. ఆధ్యాత్మికపరమైన కర్మయోగము (నిష్కామకర్మయోగము) బ్రాహ్మీస్థితికిని బ్రహ్మనిర్వాణమునకును సాధనము నగుట విధానమును రెండవ అధ్యాయము తెలుపుచున్నది. పురుషార్థసాధనములైన సకల కర్మలును అనంతమైన ఆత్మయోగపరము లైనప్పుడు శాంతములై, అంతవంతములైన విషయభోగపరమైనపుడు విషాదశోకములను గలుగజేయుగలవు.

## సారాంశము

రెండవ అధ్యాయమునందు భగవద్గీతాశాస్త్రమునకు పరమార్థమైన బ్రహ్మవిద్యాప్రవృత్తికి ఆత్మయోగతత్త్వసాధనము సంక్షేపముగ నుపదేశింపబడినది. ఆత్మ, తత్త్వపదార్థములు నాశరహితములు. దేహము లంతవంతములు. నిత్యానిత్యవస్తువివేకము గల స్థితప్రజ్ఞులు సత్యమైన ఆత్మవిషయమునను, అనిత్యమైన దేహవిషయమునను శోకమోహములను పొందరు. స్వధర్మారాధనము వలనను సర్వకామములు లభించుచున్నవి. మోహమును బూని స్వధర్మపరిత్యాగమును జేయుటవలన నపకీర్తియును, పాపకీర్తి వలనను దుఃఖమును గలుగుచున్నవి. శోకమోహములవలనను స్వధర్మ పరిత్యాగమును జేయుట యవివేకము. ఈ యవివేకము పోవుటకు జ్ఞాననిష్ఠను, ధర్మనిష్ఠను, యోగనిష్ఠను సంక్షేపముగ ద్వితీయాధ్యాయము సాంఖ్య బుద్ధి, కర్మబుద్ధి, యోగబుద్ధి రూపమునను తెలుపుచున్నది.

కర్మనిష్ఠయందును జ్ఞాననిష్ఠయందును సమత్వబుద్ధి గల యోగి బ్రాహ్మీస్థితిని పొందగల విధము వివరింపబడినది. బుద్ధియోగము కన్నను నితరకర్మములు మిగుల హేయములు. సాంఖ్యయోగాధ్యాయము నందలి 46 వ శ్లోకమునందీ పరమార్థము విస్పష్టము చేయబడినది. ఈ పరమార్థమునకు సాధనము స్థితప్రజ్ఞుని లక్షణములందింద్రియ నిగ్రహపరమైన ఆత్మయోగ రూపమున వివరింపబడినది. ప్రవృత్తిరూపము విషయములు ఇంద్రియములను నాకర్షించుచున్నవి. విషయాసక్తములైన ఇంద్రియములు సమ్మోహమును పొంది బుద్ధియోగమును తత్ఫలమైన ఆత్మయోగమును పొందజాలకున్నవి. బుద్ధియోగపరాయణములైన ఇంద్రియములు విషయములందు చరించుచున్నను ఆత్మయోగారూఢమైన శాంతి బ్రాహ్మీస్థితిని గలుగజేయుచున్నది. యోగసంసిద్ధికి కర్మ యోగము రాజయోగము. సకలకర్మలును జ్ఞానమునందు పరిసమాప్తిని పొందుటవలన సకలజ్ఞానమును కర్మయోగమునందు పరిసమాప్తిని పొందుచున్నది. సాధకునియందు యోగము స్థిరపడుటకు మూడవ అధ్యాయము కర్మయోగములో నారంభమగుచున్నది.

## కర్మయోగవివరణము

పురుషార్థమునకు జ్ఞానకర్మలలో నేది యుత్తమ మని సంశయ నివారణార్థ మర్జునుడు మరల శ్రీకృష్ణుని యడుగుచున్నాడు. కర్మయోగమును తెలిపెడి మూడవ అధ్యాయమునందు గల జ్ఞానయోగ ప్రశంస, కర్మయోగమునకును జ్ఞానయోగమునకును గల యవ్యవహిత సంబంధమును తెలుపుచున్నది. ఈ యధ్యాయ హృదయమును గ్రహించుటకు మూడునాలు గధ్యాయములయందలి కర్మయజ్ఞపరముల యర్థగ్రహణ మత్యవసరము. జగచ్చక్రమునందు కర్మము బ్రహ్మోద్భవమని నిరూపింపబడినది. అక్షరపరబ్రహ్మయోగాధ్యాయమునందు 'భూత

భావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః' (8–3) అని చెప్పబడినది. నిర్వికల్పము పరబ్రహ్మమునకు సవికల్పము కర్మమునకు మూలము. సకలభూతములయొక్క భావమును ఉద్భవమును నైన విసర్గము కర్మ పరిణామమును పొందుచున్నది. కర్మము బ్రహ్మోద్భవము. ఆత్మ బుద్ధియోగమువలనను కర్మచక్రమునందు ప్రవేశించుచున్నది.

బ్రహ్మమయ మైన జగత్తు కర్మమయము. కర్మమయమైన జగత్తునందు బ్రాహ్మీస్థితిని బడయుటకు కర్మస్వభావము సమగ్రముగను తెలిసికొనవలయును. కర్మసంబంధమైన సందేహమును నివృత్తి చేసికొనుటకు కర్మయోగ బుద్ధియోగములయందే యోగము శ్రేయస్కరమో నిశ్చయించి చెప్పవలయునని పార్థుడు పార్థసారథిని ప్రశ్నించుచున్నాడు. సాంఖ్యయోగాధ్యాయమునందు శ్రీకృష్ణుడు బుద్ధియోగమును బోధించినప్పుడు నిష్కామ కర్మయోగమును వచించినను అర్జునుడు భేదములేని విషయమునందు భేదబుద్ధిని మరల ప్రశ్నను జేయుచున్నాడు. శ్రీకృష్ణుడు గహనమైన కర్మగతిని బోధించి విజయుని కర్మ ప్రవర్తకునిగా జేయుచున్నాడు.

గీతాశాస్త్రమునందలి 18 అధ్యాయములందును జగచ్చక్రమునకు సహజమైన కర్మప్రసంగము గలదు. కర్మ, అకర్మ, వికర్మ, యజ్ఞకర్మ, బ్రహ్మకర్మ, నిత్యకర్మాదివిభాగములు కర్తృస్వరూప స్వభావములను దెలుపుచున్నవి. దేహము కర్మక్షేత్రము, ధర్మక్షేత్రము, బ్రహ్మక్షేత్రము. కర్మ విసర్గముతో నారంభమగుచున్నది. దేహాంగములు కర్మసంభవములు. ప్రకృతి గుణసంజాతములైన కర్మప్రవాహములను ధర్మసాధనమునను బ్రహ్మత్వమునందు (ఆత్మత్వమునందె) లయము చేయుట కర్మయోగము.

బ్రహ్మజ్ఞానమువలెను బ్రహ్మోద్భవమైన కర్మజ్ఞానమును గహనము. సర్వగతమైన బ్రహ్మము సర్వగతమైన కర్మయందు ప్రతిష్ఠితము. కర్మజీవజాలమునకు సాధ్యసాధనము. విశ్వప్రవృత్తి యంతయును కర్మబద్ధము. సనాతన వైదికధర్మ సారసర్వార్థమునకు దివ్యవ్యాఖ్యానము. విశాలమైన, నిరపేక్షమైన కర్మయోగము కాలాంతరమునను సాపేక్షమై సంకుచితమైనది. లౌకికకర్మలు కర్మపదము నధిష్ఠించినవి. సన్న్యాసము నిష్కామకర్మయోగమునకు లక్ష్యమైనది. సన్న్యాసమునకు నంతర్లక్ష్యము క్షీణించి బాహ్యలక్ష్యము ప్రధానమైనది. ఆత్మయోగ సాధ్యమైన కర్మయోగాస్థానమును కాషాయాంబరములును బాహ్యచిహ్నములును న్యాక్రమించి విశ్వవ్యాప్తమైన కర్మ సంకుచితమైనది. గీతాశాస్త్రము నష్టమైన కర్మయోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదరూపమున పునరుద్ధారణమును జేయుచున్నది. రెండవ అధ్యాయమునందు సాంఖ్యయోగ విషయమునను చేసిన యుపదేశమునే మూడవ యధ్యాయము వివరించుచున్నది.

'తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం' కర్మకౌశలమే యోగమనియును, యోగము నారాధించుట బ్రహ్మవిద్యకు సాధనమనియును గీతాశాస్త్రము ప్రతిపాదించుచున్నది. ప్రపంచ పరిణామమునందు అక్షరమునుండి బ్రహ్మమును, బ్రహ్మమునుండి కర్మయును నుద్భవించిన విధమును సకల ప్రవృత్తియును విస్పష్టము చేయుచున్నది. సర్వగతమైన కర్మయోగమునకువలెను సర్వగతమైన బ్రహ్మవిద్యకు సాధనముగనున్నది. కర్మయోగాభావమైన జ్ఞానయోగమును, జ్ఞానయోగాభావమైన కర్మయోగమును నసంభవములు. పండితపామర జనులకు సులభగ్రాహ్యమైన కర్మయోగము కర్మసన్న్యాసముకన్నను విశేషమైనను కర్మసన్న్యాసము ప్రశస్తమను బడసినది. కర్మయోగమునకు మానవస్వాతంత్ర్యధర్మ పరిణామమునందుగల ప్రతిష్ఠను నుద్ధరించగల విధమును కర్మయోగశాస్త్రము, ముఖ్యముగను కర్మయోగాధ్యాయము సువ్యక్తము చేయుచున్నది. గీతాశాస్త్రపాఠకులు మూడవ యధ్యాయమునందుగల గహనమైన కర్మయోగ రహస్యమును గ్రహించుట బ్రహ్మవిద్యాప్రాప్తి సాధనము గాగలదు.

ప్రవృత్తియందు కర్మాచరణము పండితులకును సమ్మోహమును గలుగజేయుచున్నది. ఒక కర్మయే దేశకాలపాత్రాపరజనులయందు బాహ్యలక్ష్యానుసారముగ వివాదాస్పదమును గలుగజేయుచున్నది. పురుషార్థసిద్ధికి సకలకర్మలును సమానప్రయోజనములు. స్వభావసిద్ధమైన కర్మాచరణము నిశ్శ్రేయసకరము. యుద్ధకర్మమైనను కర్షక కర్మయును శ్రేయోదాయకము. యజ్ఞదాన తపములు, నిత్యకర్మలు, నైమిత్తికకర్మలు, వృత్తికర్మలు శారీరకకర్మలు, ప్రకృతిసిద్ధములు. ప్రకృతిసిద్ధమైన కర్మాచరణమునందు సమ్మోహము నిరర్థకము.

కర్మాచరణమునందు విజయునకు గలిగిన సమ్మోహము సకలజనులకును గలుగుచున్నది. అట్టి సమ్మోహమును బోగొట్టి సకల జనులను కర్మయోగపరాయణులను జేయుట గీతాశాస్త్రమునకు పరమార్థము. అర్జునుడు యోగశాస్త్రమును విని తరువాతను కర్మయోగియైన విధమును సకలజనులును కర్మయోగులగుట కర్మయోగాధ్యాయమునకు పరమార్థము.

శ్లో. నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత!
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ.—

అ. 18., శ్లో. 73.

## సారాంశము

కర్మయోగాభ్యాసమే జ్ఞానయోగసాధనము. ఎవ రెట్టి కర్మలను చేయుదురో వారి కట్టిఫలము గలుగుచున్నది. బ్రహ్మ యజ్ఞములను ప్రజలను సృజించి సర్వమునకును పురుషార్థసాధనమును నిరూపించెను. ఎవ రేరీతిని పురుషార్థములను సేవించెదరో వారల కావిధమైన పురుషార్థము కలుగుచున్నది. ఇంద్రియ విషయారాధనము కామమును దైవారాధనము పరమశ్రేయస్సును గలుగజేయుచున్నవి. కర్మలను విడుచుట జీవి కసాధ్యము. శరీరయాత్రకును కర్మనియతము. నియతకర్మానుష్ఠానము యజ్ఞార్థము చేయుటయే కర్మయోగము. కర్మ మూలముననే జనకాదులు సిద్ధిని పొందిరి. స్వధర్మ నిర్వహణార్థము, యజ్ఞార్థము, లోకసంగ్రహణార్థము, ఆత్మార్థము నియతకర్మారాధనమును చేయుట కర్మయోగము. కర్మప్రవర్తకులై ఇంద్రియములను, మనస్సును,

ఈ రెండు స్థలములయందును నున్న యీ కర్మవివేచనను బట్టి కర్మాకర్మ వికర్మల విషయమున గీతయందు జెప్పబడిన సిద్ధాంత మిచ్చట సంక్షేపముగ స్పష్టపరచుట యావశ్యకము. కారణమేమన: ఈ విషయమై టీకాకారులు మిక్కిలి గందరగోళమును జేసి యున్నారు. సన్న్యాస మార్గీయులకు సర్వ కర్మలను స్వరూపముతో త్యజించుట యిష్టము. కావున వారు గీతయందున్న కర్మపదమును కెట్టెట్టులనో తమ కనుకూలమగు నర్థమును చెప్పనలయునని ప్రయత్నించుచున్నారు. మరియు మీమాంసలకు యజ్ఞయాగాది కామ్య కర్మ లిష్టము లయినందున నవి దప్ప నితరములగు కర్మ లన్నియును వికర్మలని తోచును. ఇంతియుకాక మీమాంసకులయొక్క నిత్యనైమిత్తికాది భేదములును కర్మలందె యంతర్భూతము లగును. ధర్మశాస్త్రజ్ఞులు మీమాంసకుల మతమునసే తమ మతమును జొప్పించుచుండురు. నలు ప్రక్కలనుండియు నలుపురును బల వంతముగ దిమతిను మతముల కనుగుణమగు నర్థమును జెప్పుటచే గీత నిజముగ దేని నకర్మయని చెప్పుచున్నదో, దేనిని కర్మ యని యున్నదో, తురకు తెలియకయే పోయినది. కాని గీతయందు నిష్పక్షపాత బుద్ధితో నీ కర్మాకర్మ వికర్మల విషయమును విచారించు వాడు, కర్మలను జేయు కర్మయోగియే యనియు, కామ్యకర్మను మాత్రమే చేయు మీమాంసకుడుగాని కర్మలను వదలు సన్న్యాస మార్గీయుడుగాని కాడనియు మొదట గుర్తుంచుకొనవలెను. గీతయందలి యీ మూలసూత్రమును బట్టి విచారించినచో నీ 'కర్మ శూన్యత' యను నర్థములో 'అకర్మ' శబ్దము నీ జగత్తునందెక్కడను నుండుటయే లేదని, అనగా: ఏ మనుష్యుడైనను, ఎప్పుడును కర్మశూన్యుడగుట శక్యముకాదని మొదటనే సిద్ధమగును. (గీ. 3. 5; 18. 11); కారణమేమన: శయనించుటగాని, కూర్చుండుట గాని, యేమియు? యాచించియుండుట యైనను శ్వాసను వదలి పెట్టుడు. కాన కర్మశూన్యత యనుట యెన్నటికిని లేనియెడల నకర్మ యన నేమియో నిశ్చయించవలసి వచ్చును. కావున, కర్మ యన నేదియో యొక పని కాదనియు, ఆ కర్మవలన గలుగబోవు శుభా శుభ పరిణామమునుబట్టి కర్మత్వమును, అకర్మత్వమును నిశ్చయింప వలయు ననియు, సృష్టియున్నదే కర్మ గాన, మనుష్యుడు సృష్టి యం దున్నంతవఱకును సహజమగు కర్మ వదలిపెట్టనేరడనియు, కాని కర్మాకర్మలను విచారించువా డా కర్మ యెంతవఱకు బాధించునను విషయమును మాత్రము విచారించి చేయవలయు ననియు, ఏ కర్మ చేసిన తన్ను బాధింపదో దానికి కర్మత్వము, అనగా: బంధకత్వము పోయినదనియే చెప్పవలయు ననియు గీత సమాధానము చెప్పుచున్నది. మఱియు నే కర్మయొక్క కర్మత్వము, అనగా: బంధకత్వము ఈ విధమున నశించునేని యా కర్మ యకర్మయే యగును. అకర్మ యనగా కర్మ శూన్యత యని లౌకికార్థ మను మాట సత్యమే కాని శాస్త్రీయ దృష్టిచే విచారించిన నది యిచ్చట పనికిరాదు. కారణ మేమన: స్వస్థముగ కూర్చుండుట, అనగా కర్మను జేయకుండు టయు అనేక సమయములందు కర్మయగుచుండునట్లు కాన్పించుచున్నది. ఉదాహరణము—తన తల్లిదండ్రులను నెవరైనను చంపుచుండునప్పుడు నివారింపక స్వస్థముగ కూర్చుండుట యత్కాలమందు లౌకికదృష్టిచే నకర్మ యన కర్మ శూన్యత్వ మయినను నది కర్మయే,—యేమేని? అది అకర్మయు—అగును గాన, కర్మ విపాకశాస్త్రమును బట్టి దాని యొక్క యశుభమగు పరిణామము తనచే భోగింపబడక తప్పదు. కావున నీ గీతాశ్లోకమందు విరోధాభాసముచే మిక్కిలి సుందర ముగ జెప్పిన దేమన: అకర్మ నయిలము (అప్పుడప్పుడు భయంకర మైన) కర్మ మగును. మఱియు కర్మ యైనను కర్మవిపాక శాస్త్ర దృష్టిచే నా కర్మ చప్పుడానివలె (అనగా: అకర్మ) యగును. దీనిని తెలిసికొనినవాడు జ్ఞాని. ఈ విషయమే ముందు శ్లోకములందు వర్ణింపబడినది. కర్మ ఫలముల యొక్క బంధనము కలుగక పోవుట కా కర్మను నిస్సంగ బుద్ధితో, అనగా: ఫలాశను వదలి నిష్కామబుద్ధితో చేయుట యనునదియే గీతాశాస్త్రానుసార ముగ నొక నిజమగు ముఖ్యసాధనము (గీ. ర. ప్ర. 5. పు. 148—154; ప్ర. 10. పు. 399 చూడు). కావున నీ సాధనము ననుసరించి (అనగా: నిస్సంగ బుద్ధితో) చేయబడిన కర్మయే గీతానుసారముగ ప్రశస్తము. అనగా: సాత్త్వికమగు కర్మయగును. (గీ. 18. 9.); గీతానుసారముగ నదియే సత్యమైన 'అకర్మ'. కారణ మేమన: దాని యొక్క కర్మత్వము, అనగా: కర్మవిపాక శాస్త్రానుసారముగ బంధకత్వము నశించును. మనుష్యులు చేయునట్టి ('చేయునట్టి' యను పదమునందు స్వస్థముగ కూర్చుండుటయును జేరును.) కర్మనుండి పైన జెప్పిన విధమున 'సాత్త్వికమగు కర్మను', లేక గీతానుసారముగ 'అకర్మ' యను దానిని దీసివైచి నచో మిగిలినట్టి కర్మలను రెండు వర్గములుగ చేయవచ్చును. ఒకటి రాజసము, రెండవది తామసము. వీనిలో తామస కర్మలు మోహముచేతను, అజ్ఞానముచేతను చేయుట సంభవించును. కావున నా కర్మలు వికర్మలగును. మఱియు మోహముచే కర్మలను వదలి నను అది వికర్మయే యగును. అకర్మ కాదు (గీ. 18. 7.). ఇక మిగిలినవి రాజసకర్మలు. ఈ కర్మలు మొదటి వర్గములోనివి కావు. అనగా: సాత్త్వికములు కావు. లేక గీత వేనిని నిజముగ 'అకర్మ' యని చెప్పుచున్నదో యవి కావు. గీత వీనిని రాజస కర్మ లని చెప్పుచున్నది. కాని యిష్టమైనచో నిట్టి రాజస కర్మలను కేవల 'కర్మ' లని చెప్పవచ్చును. ఇది కర్మయో యకర్మయో యా కర్మయొక్క బంధకత్వమునుబట్టి నిర్ణయింపవలయును గాని, క్రియాత్మకమగు స్వరూపమును బట్టి కాని, కేవల ధర్మశాస్త్ర మునుబట్టికాని నిర్ణయించుటకు వీలులేదని యుందలి తాత్పర్యము. అష్టావక్ర గీత సన్న్యాస మార్గమును బోధించునది యయినను దానియందు నైతము—

> 'నివృత్తి రపి మూఢస్య ప్రవృత్తి రుపజాయతే,
> ప్రవృత్తి రపి ధీరస్య నివృత్తి ఫలభాగినీ.'

అనగా మూఢుల యొక్క నివృత్తియు, లేక, హఠముచే గాని, మోహముచేగాని కర్మలకు పరాఙ్ముఖు లగుటయు నిజముగ జూచిన ప్రవృత్తియే యగును. అనగా: కర్మయగును. బుద్ధిమంతుల యొక్క ప్రవృత్తియు, అనగా: నిష్కామ కర్మము నివృత్తియే అనగా: కర్మ త్యాగమువలన కలుగు ఫలమునిచ్చునదియే యగునని చెప్పబడినది. (గీత 18. 61. గీతారహస్యము)

## సారాంశము

వైదికవిజ్ఞాన పరిణామమునందు వేదాంతవిజ్ఞానము పూర్ణవిజ్ఞానము. కర్మపరమైన వైదికవిజ్ఞానము యజ్ఞరూపము నను బ్రహ్మపరమై జ్ఞానయోగ పరిణామమును పొందినది. అనంతములైన కర్మ యజ్ఞములైన యజ్ఞపరిణామములను పొందినవి. దేహక్షేత్రములు ధర్మక్షేత్ర పరిణామమును పొందుట కనంతములైన యజ్ఞములు నిర్ణయింపబడినవి. ధర్మార్థకామ మోక్షములకు మూలాధారమైన దేహక్షేత్రరక్షణ పోషణము కనంతములైన బాహ్యయజ్ఞములు విధింపబడినవి. క్షేత్రాధారములైన పంచభూతములు, పంచతన్మాత్రలు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మహాబుద్ధి చిత్తాహంకారములు ప్రకృతియందు వినిమయ విన్యాసరూపమున వైదికమతమున నంతములైన యజ్ఞపరిణామమును పొందినవి. నిత్యమైన ఆత్మతత్త్వసిద్ధికి సకలకర్మలును యజ్ఞసంస్కారమును పొందినవి కర్మపరమైన ప్రవృత్తిమార్గము, జ్ఞానపరమైన నివృత్తిమార్గము నందు యజ్ఞరూపమునను పరిసమాప్తిని పొందుచున్నది.

కర్మజములును, సాపేక్షములును, ప్రకృతిపరములు నైన స్థూల సూక్ష్మభూత యజ్ఞములు, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణ యజ్ఞములు, కర్మేంద్రియ యజ్ఞములు, ప్రాణాయామము, స్వాధ్యాయయజ్ఞము, దేవయజ్ఞము, బ్రహ్మయజ్ఞము మొదలగు బహువిధయజ్ఞములు నిరపేక్షమైన ఆత్మజ్ఞాన యజ్ఞమునందు పరిసమాప్తిని పొందుచున్నవి. సాపేక్షములైన యజ్ఞములు నిరపేక్షమైన ఆత్మయోగ పరిణామమును పొందుచున్నవి. దేహధారులకు అకర్మస్థితి అశక్యము; అకర్మస్థితి శరీరయాత్రకును అప్రసిద్ధము; అయజ్ఞునకిహలోకమే ప్రసిద్ధము గానపుడు పరలోకమసలే లేదు. అజ్ఞానసంజాతమైన సంశయములు పోయి జ్ఞానయోగసిద్ధి గలుగుటకు యోగము కీలకము. యోగ మనగా కర్మయోగము. కర్మయోగ జ్ఞానయోగములందు పూర్ణయోగపరిణామమును పొందగల విధమును కర్మసన్న్యాసయోగము ప్రతిపాదించుచున్నది.

శ్లో. తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!

## కర్మసన్న్యాసయోగ వివరణము

జ్ఞానయోగపరమైన నాల్గవయధ్యాయము "యోగమాతిష్ఠోత్తిష్ఠ" యను ఆదేశముతో నంతమును పొందుచున్నది. గీతాప్రయోజనము బ్రహ్మవిద్యోపదేశము. ఈ యుపదేశము శ్రీకృష్ణార్జున సంవాద రూపమునను పతిపరివిధములను పరిష్కరించుటయే గీతాశాస్త్రమునకు ప్రయోజనము. జ్ఞానయోగాధ్యాయమునందు యోగిని కర్మలు బంధింప వని తెలుపబడినది. కర్మ చేయుటయే జ్ఞానసాధనము, యోగసాధనము, పురుషార్థము, పరమార్థము.

జ్ఞానయోగాధ్యాయము "సన్న్యాసయోగము" "కర్మయోగము" మోక్షసాధనములుగను నుపదేశించుచున్నది. ఆత్మసంయమము లకు రెండు యోగములయందును భేదము కానరాక పోయినను సామాన్యులైన జిజ్ఞాసువులకు సంశయమును నివారించుటకై కర్మసన్న్యాసయోగాధ్యాయమునందు పూర్ణయోగతత్త్వము తిరిగి బోధింపబడుచున్నది. కర్మసన్న్యాసమునందు సామాన్యబుద్ధిగల వారలకు కర్మసన్న్యాసయోగమునకు పరమార్థమును తెలిసికొనక మోహము పోదు. కర్మయోగాధ్యాయమునందు సకలభూతములును వశముగను కర్మప్రవృత్తియందు నిష్ఠమయిన విధము తెలుపబడినది. ముముక్షువు కర్మబంధము నుండి విముక్తుడగుటకు, దేహధారులకు సాధ్యమైన ఫలత్యాగము సాధ్యముగాని, యసాధ్యమైన కర్మత్యాగము సాధ్యము గాదు. కామ్యకర్మలను విడుచుటయే సన్న్యాస మనియును, పావనకరము లయిన "యజ్ఞదానతపః కర్మలను" విడువక చేయవలయు ననియును 18 వ అధ్యాయమునందు తెలుపబడినది. "ఆత్మసంయమ యోగమునందు" ఫలాపేక్షను విడిచి నియతకర్మలను చేయుట "సన్న్యాసము"ను "యోగము" ననియును, అక్రియత్వమును నిరగ్నిత్వమును యోగము గాదనియును తెలుపబడినది. దేహయాత్ర కొరకును, ఆత్మశుద్ధి కొరకును యజ్ఞార్థముగను సంగమును ఫలమును విడిచి, కర్మలను జేయుటయే కర్మసన్న్యాసము. నిస్సంగులయిన ఆత్మయోగులు దేహేంద్రియమనోబుద్ధులచేత నాత్మశుద్ధి కొరకు కర్మలను జేయుచున్నను బాధితము గాదు. కర్మయోగముచేతను ధర్మక్షేత్రమైన దేహక్షేత్రమునందు నిస్సంగ కర్ములు జీవన్ముక్తులు గాగలవిధ మీ యధ్యాయమునందు సూచింపబడినది.

దేహక్షేత్రమునందు ఆజ్ఞాచక్రస్థానమైన భ్రూమధ్య స్థానము జ్ఞానస్థానము. జ్ఞానస్థానమునందు సూర్యచంద్ర, నాడులను, పురుష ప్రకృతులను, భావరూపములను, జ్ఞానకర్మలను సాంఖ్యయోగములను, పరమాత్మ ప్రత్యగాత్మలను సుషుమ్నా ముఖమునను నియమించి, యోగి, ద్వంద్వాతీతుడై శాంతిని పొందుచున్నాడు. ఈ స్థితియే పూర్ణయోగము. అభ్యాసవైరాగ్యములచేతను సర్వసమత్వబుద్ధి గలిగి పూర్ణయోగమును పొందగల విధ మాత్మసంయమయోగమునందు వివరింపబడినది.

కర్మయోగము సకలకర్మము బ్రహ్మోద్భవ మనియును, కర్మసన్న్యాసయోగము కర్మజములైన యజ్ఞములందు బ్రహ్మము ప్రతిష్ఠిత మనియును, జ్ఞానయోగము సకలకర్మలును జ్ఞానము నందు పరిసమాప్తిని పొందుచు జ్ఞానము స్వాధీన లబ్ధమైన ఆత్మయందు గలుగుననియును ప్రతిపాదించినవి. ఆత్మసంయమ యోగము అనేకములును, అనిత్యములును, సాపేక్షములు నైన యజ్ఞములు ఏకమును, నిత్యమును, నిరపేక్షమునైన ఆత్మ యోగమునందు (బ్రహ్మమందు) పరిసమాప్తిని పొందుచున్న విధమును వివరించుచున్నవి.

వైదికమత పరిణామమునందు వర్ణాశ్రమధర్మములు విచిత్ర ధర్మపరిణామములు. ఆశ్రమస్వీకారము త్యాగధర్మాధ్యాయము నందు మహోహరఘట్టము. జననము నుండియును దేహేంద్రి

యజ్ఞాదుల కభ్యాసమైన సంసారసౌఖ్యములను, భాగ్యభోగములను; విషయారాధనమును విసర్జించి సన్న్యాసమును స్వీకరించుట యసాధ్యవిషయము. సర్వసంగపరిత్యాగమును జేసిన వ్యాసుడు, శుకుడు, గౌతమబుద్ధుడు, శంకర రామానుజాదులు మొదలగు మహానుభావులు పూజాపీఠముల నధిష్ఠించి సన్న్యాసమునకు ప్రజా హృదయమునం దపారమైన గౌరవ ప్రతిష్ఠలను గలుగజేసిరి. సన్న్యాసము వర్తమానకాలమునందును నవోత్సాహమును గలుగ జేయుచున్నది. సన్న్యాసమునకు పరమార్థమంతర్జ్ఞానమై, బాహ్య చిహ్నములు మాత్రము శేషించియున్నవి. సన్న్యాసము కామ్యకర్మల న్యాసమును కేర్పడినను, సంసారత్యాగము, ముండన కాషాయాంబర ములు, భిక్షాటనము మాత్రము శేషించియున్నవి. భగవద్గీత "సన్న్యాసయోగము"కు శ్రీకృష్ణార్జున సంవాద రూపమునను యథార్థమైన స్థానమును నిరూపించుటకు ప్రయత్నించినది.

యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు, ధనుర్ధరుడైన పార్థునకు ఘోరమైన మహాభారతయుద్ధమునందు గీతోపదేశ సాధనమునను ప్రవర్తింపజేయుచున్నాడు. హిందూసమాజమునందు సన్న్యాసాశ్రమము పట్ల గల గౌరవ మపారము. సన్న్యాసమార్గీయులు ప్రస్థానత్రయము మీదను, ముఖ్యముగను భగవద్గీతా శాస్త్రము మీదను వ్రాసిన వ్యాఖ్యానములు సన్న్యాసగౌరవమును బలపరచుటయే గాకను, సన్న్యాసమునకు సంకుచితార్థమును ప్రతిపాదించినవి. భగవద్గీత "సన్న్యాసము" 'కర్మయోగము'లం దెద్దానిని శ్రేయస్కర మని ప్రతిపాదించునదియును నిర్ణయించుట కీ శ్లోకము (రెండవ శ్లోకము) ప్రమాణముగనున్నది. సన్న్యాసమార్గీయుల వ్యాఖ్యానపద్ధ తులను తెలుపుట కొక యుదాహరణమును, కర్మయోగపరముగను తిలకు మహాశయుని వ్యాఖ్యానమును సవిస్తరముగను పైని ఉదాహరింప బడినవి. పాఠకులు కర్మయోగ, సాంఖ్యయోగ పరమార్థములను గ్రహించి గీతాప్రయోజనమును, జీవిత పరమార్థమును సాధింప వలయు గాత!

ప్రవృత్తి నివృత్తి మార్గములు సాపేక్షములు. దేహ ధారులకు పూర్ణమైన ప్రవృత్తిస్థితియును, పూర్ణమైన నివృత్తి స్థితియును దుర్లభములు. కర్మయోగసంసిద్ధి లేకను జ్ఞాన యోగమును, జ్ఞానయోగసంసిద్ధి లేకను కర్మయోగమును అసాధ్య ములు. సంసారమును పరిత్యజించి సన్న్యాసమును స్వీకరించినను జీవయాత్రకు కర్మ లవసరములు. షోడశకర్మలను పరిత్యజించిన మాత్రమునను కర్మసన్న్యాససిద్ధి గలుగదు. ప్రాణ మున్నంతవర కును అకర్మత్వ మసంభవము. కర్మఫలత్యాగమునందే సన్న్యాససిద్ధి సాధ్యము. ఈ స్థితి సన్న్యాసమునకును, కర్మయోగమునకును సమానము. కాని రెండు యోగములందును కర్మయోగధర్మము సన్న్యాసులకును నవసరమును, విశేషవ్యాపకము గలదియును, ప్రత్యవాయము లేనిదియును గాన విశిష్టమై యున్నది. భిన్నాధికారు లకు భిన్నము లయిన రెండు ధర్మములను నిరూపింపబడిన సూటుకు గీతాశాస్త్రమునం దాధారములు లేవు. సాపేక్షములైన, అన్యోన్యాధారములయిన రెండు యోగములను నిరపేక్షమైన ఆత్మజ్ఞానమునందు సంసిద్ధిని పొందుచున్నవి.

## సారాంశము

కర్మసన్న్యాసయోగాధ్యాయమును సాంఖ్యకర్మజ్ఞాన యోగా ధ్యాయములు వివరించిన విధమునను కర్మయోగ విశేషమును "తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే" అని ప్రస్తు తించినది. కర్మయోగియైన అర్జునునకు కర్మయోగవిషయమున గలిగిన సంశయము పోవుట కాత్మజ్ఞాన మవసర మగుచున్నది. ఆత్మజ్ఞానమునకు యోగము పరమార్థసాధనము. రెండవ అధ్యా యము సాంఖ్యయోగాధ్యాయము దేహ మనిత్య మనియును, దేహి నిత్యుడనియును, అనిత్యమైన దేహముయొక్క నాశనమునకు దుఃఖించుట నిరర్థక మనియును, నిత్యమైన ఆత్మజ్ఞానమునకు యోగము సాధన మనియును బోధించినది. మూడవయధ్యాయము కర్మయోగాధ్యాయము నిత్యమైన ఆత్మజ్ఞానమునకువలెను దేహ ధారణమునకును కర్మయోగావసరమును వివరించినది. నాల్గవ అధ్యాయము జ్ఞానయోగాధ్యాయము బ్రహ్మవిద్యకు హృదయ మైన ఆత్మజ్ఞానమునకు స్వానుభవసిద్ధమైన యోగసంసిద్ధి సాధన మని ప్రతిపాదించినది. అయిదవ అధ్యాయము కర్మసన్న్యాస యోగము కర్మఫలమును, కామ్యకర్మలను విడుచుట కర్మసన్న్యాస మనియును, బ్రహ్మ నిర్వాణమునకు సాధన మనియును, కర్మలను విడుచుట సాధనము గాదనియు ప్రస్తుతించినది.

ఆత్మను బాహ్యవిషయారాధనమునుండి అంతర్ముఖము చేయుట యోగము. ఆత్మయోగము, సకల పదార్థములయందును ఆత్మసందర్శనమునకు సాధనముగ నున్నది. సర్వత్ర ఆత్మను, సర్వమును ఆత్మయందును సందర్శించుట ఆత్మయోగము. ఆత్మయోగి యజ్ఞదాన తపఃఫలములకు భోక్తయై బ్రహ్మవిద్యాధి కారియై శాంతిని పొందగల విధమును కర్మసన్న్యాసయోగా ధ్యాయము వివరించుచున్నది.

వైదికవిజ్ఞానమునకు పరమార్థము బ్రహ్మవిద్య. బ్రహ్మ విద్యకు పరమార్థ మాత్మయోగము. ఆత్మయోగము 'తత్త్వమసి' అను మహావాక్యమునందు పరిపూర్ణతను బొందుచున్నది. పూర్ణ యోగము "సర్వంఖల్విదం బ్రహ్మ" "సోఽహం బ్రహ్మాస్మి" అను పరమార్థము నాత్మయోగసాధనమునను నిరూపించుచున్నది. మొదటి అయిదధ్యాయములును ప్రతిపాదించిన కర్మయోగము నాత్మసంయమయోగాధ్యాయము తిరిగి వివరించుచున్నది.

## ఆత్మ సంయమయోగ వివరణము

ఆరవ యధ్యాయముతో నొకవిధముగ గీతావిషయ మంతము నొందుచున్నది. జ్ఞానయోగము కర్మయోగము మోక్షసాధనములని గతించిన యధ్యాయములందు చెప్పబడినది. సన్న్యాసము జ్ఞాన యోగమునకు సాధన మని వైదికమతము ప్రతిపాదించుచున్నది. వర్ణాశ్రమధర్మ ప్రతిపాదితమైన సన్న్యాసము జ్ఞానయోగము నకు లక్ష్యముగను బరిణమించినది. ఈ సంకుచిత సన్న్యాస లక్ష్యమును విశాలము చేయుట గీతాశాస్త్రమునకు ప్రయోజనము. ఆత్మసంయమయోగ మీ ప్రయోజనమును సమకూర్చుచున్న విధమును మొదట శ్లోకము విశదము చేయుచున్నది. కర్మఫలము

## అక్షర పరబ్రహ్మ యోగ వివరణము

ఏడవ యధ్యాయమునందు యోగమునకు సాధనభూత మైన ఆత్మతత్త్వసాధన ముపదేశింపబడినది. ఆత్మయోగము బ్రహ్మవిద్యా మూలముననే సాధ్యమగుచున్నది. విజ్ఞానయోగము నందు బ్రహ్మజ్ఞానము బ్రహ్మప్రాప్తికి సాధనముగ సువయోగింప బడినది. ఏడవ యధ్యాయాంతమునందు చెలుపబడిన అధ్యాత్మము, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము, బ్రహ్మము, కర్మము మొదలగు బ్రహ్మ విద్యాసాధనము లీ యధ్యాయమునందు తిరిగియు విశేషరూపమునను బోధింపబడుచున్నవి. అర్జునున కీ బ్రహ్మ విద్యాంగము లన్నియును నిశ్చయాత్మక జ్ఞానమును గలుగ జేయుటకును, సమ్మోహమును బోగొట్టుటకును వినియోగ పడుచున్నవి. శ్రీకృష్ణు డర్జునునకు నిశ్చయాత్మకమైన బ్రహ్మ జ్ఞానమును అక్షర పరబ్రహ్మయోగ రూపమున నీ యధ్యాయము నందు తెలుపుచున్నాడు.

హిందూమతసారమైన భగవద్గీతా సిద్ధాంతములకు పునర్జన్మము కీలకము. జననమరణమయమైన సంసారము నాద్యంతములు కనుపడవు. కర్మము జన్మమునకు మూలము. కర్మ త్యాగము మోక్షమునకు సాధనము. నిరంతరము కర్మనిమగ్ను డైన యపుడు కర్మత్యాగమెటులు సాధ్యమో గ్రహించుట దుష్క రము. సుప్రసిద్ధ వ్యాఖ్యాత లందరును ఏదోవిధముగ వారి సిద్ధాం తానుసారముగ నీ విషయమును సమన్వయము చేసిరి. ఏడవ అధ్యా యాంతమందు "ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః" అని గీతాశాస్త్రము బోధించుచున్నది. అవసానకాలమున కర్మ లంపటుడైనవాడు మరణకాలమందు ఆత్మయోగియై మోక్ష మును పొందుట సాధ్యమా యనియెడి సందేహము పండితులను సైతము బాధించుచుండును. కర్మబంధము నశించుటకు ఏదో కొంతకాలము కావలసియున్నది. ఎప్పుడు యోగి ఆత్మయోగి యగుచున్నాడో యప్పుడే కర్మబంధము నశించిపోవుచున్నది. ఈ అధ్యాయమునందు ఆత్మయోగ లక్షణము తిరిగియు వివరింప బడినది.

### సారాంశము

ఎనిమిదవ అధ్యాయమునం దుపాస్యమైన అక్షరపర బ్రహ్మ విషయము తెలుపబడినది. ఈ యధ్యాయమునందు సంశయ రహితముగ మరల చెప్పబడుచున్నది. విద్యలయందు బ్రహ్మవిద్య ఉత్తమ విద్య. ఆ యుత్తమవిద్యయే భగవద్గీతకు ప్రతిపాద్యవిషయ మును యోగశాస్త్రసాధనమునను పొందగలవిధ మీ యధ్యాయము నందు మరల తెలుపబడినది. బ్రహ్మవిద్యయే రాజవిద్య.

దేహమునందలి సహస్రారమునందు ప్రణవసాధనమునను ఆత్మయోగ మభ్యసింపవలసిన విధము తెలుపబడినది. విశేషాం శములైన అధ్యాత్మము, కర్మ, అధిభూతము, అధియజ్ఞము, మోక్ష మార్గములును తెలుపబడినవి. ప్రధానవిషయమైన బ్రహ్మవిద్యా విషయమును అక్షరపరబ్రహ్మయోగము వేదాంతవిజ్ఞానమునందు గుహ్యమైన యోగము. అక్షరము శబ్దరూపమున సమస్త ప్రపంచ మును వ్యక్తము చేయుచున్నది. పూర్వమీమాంసకులు శబ్ద ప్రమాణులు: వేదవేదాంగములయందు గల ప్రమాణముల ననుస రించి సకల కర్మలను ఆచరించెడివారు. కాని కాలక్రమమున అనంత మైన శబ్దబ్రహ్మమును అతిక్రమించి అక్షరపరబ్రహ్మయోగా భ్యాసమును చేయుట కుపక్రమించిరి.

## రాజవిద్యా రాజగుహ్యయోగ వివరణము

రాజవిద్యా రాజగుహ్యయోగరూపమునను తిరిగియు నాత్మ జ్ఞానము ఉపదేశింపబడుచున్నది. రాజవిద్యా రాజగుహ్య యోగా ధ్యాయమునందు ఆత్మజ్ఞానము సర్వత్ర ప్రత్యక్షముగ నున్న ప్రకృతి దృష్టాంతములచేత నాత్మజ్ఞాన ముపదేశింపబడుచున్నది.

సర్వవ్యాపకమైన వాయువు ఆకాశమునందు నిలిచియున్నట్లు విశ్వమంతయును భగవదాధారమునందు నిలిచియున్నది. సర్వభూత ములును కల్పాదిని పుట్టుచు, కల్పాంతమందు నశించుచున్నవి. భగవంతుడు మాత్రమే నిత్యుడు. భగవద్జ్ఞానమునకు యజ్ఞ యోగాది రూపములను భక్తిజ్ఞాన వైరాగ్యమార్గములను మానవులు జగవంతుని నారాధించుచున్నారు. ఆరాధకులకు సేవాను రూపమైన ఫలము కలుగుచున్నది. భక్తులు జాతిపక్షము లేక మోక్షమును పొందుచున్నారు. ఆత్మజ్ఞాను లనిత్యములైన దేహేంద్రియాది విషయ రాగముల నుపేక్షించి నిత్యమైన ఆత్మయోగమునందు పరాయణులై జ్ఞానయోగు లగుచున్నారు.

### సారాంశము

ఈ యధ్యాయారంభమునం దీ విషయము కొంతవరకు వివరింపబడినది. సుఖదుఃఖాదులయందు సమత్వము గల యోగయుక్తాత్ముడు ధర్మాత్ముడై ఆత్మయోగపరాయణుడై బ్రహ్మత్వమును బొందు చున్నాడు.

ప్రవృత్తియందు నిరంతరము నిమగ్నులైన మనుజులకు ప్రవృత్తి స్వరూపము సర్వకాలసర్వావస్థలయందును సమ్మోహ మును గలుగజేయుట సహజము. విషయారాధనమునందు గల భ్రాంతి ఆత్మారాధనమునందు గలుగకున్నది. భగవంతుడు సర్వత్ర ప్రత్యక్షముగ ప్రకృతి కాధారభూతుడుగ నున్నను సంకుచితమైన ప్రకృతిస్వరూపములు చిత్తము నాకర్షించుచున్నవి. చిత్తాకర్షణ కరములైన ప్రకృతి స్వరూపముల నారాధించుచు ఆత్మారాధన మును చేయుటకు విధము నీ యోగము తెలుపుచున్నది. యజ్ఞ దాన ధర్మములను చేయుచున్నను, ఆత్మార్పణము చేసినచో కర్మప్రతిబంధకము కలుగదు. సకలజనులును జాతి, లింగ, మత, కులభేదములు లేక మోక్షార్హులు. ఈ విధముగ ఏ భక్తుడు భగవంతుని ఏ విధముగ నారాధించునో తదనురూపమైన ఫల మును పొందుచున్నాడు. పాపపుణ్యభేదము లేక భక్తునకు భగవ దనుగ్రహము గలుగుచున్నది. భగవదనుగ్రహము గల భక్తులకు ఆత్మజ్ఞానము గలుగుచున్నది.

## విభూతి యోగ వివరణము

జగత్తునం దనంతములైన విభూతులు జనుల నాకర్షించు చున్నవి. జగత్తు వ్యష్టి సమష్టి రూపముల ననంతముగ గానవచ్చు చున్నను అనిత్యమని తెలుపబడినది. సర్వభూతముల యందును సమమైయున్న ఆత్మ నిత్యమనియును తెలుపబడినది. ఆత్మయోగి లక్షణములు, ఆత్మయోగ విధానము, ఆత్మయోగఫలము వివరింపబడినవి. ఆత్మయోగులు, బ్రహ్మనిర్వాణమును బ్రహ్మత్వమును పొందగల విధము తెలుపబడినది. ఈశ్వరవిభూతులు, 7, 9– అధ్యాయములందు తెలుపబడినను, విజయునకు విశ్వరూపాని ప్రవృత్తి గలుగుటకు విభూతియోగాధ్యాయముద్వారా ఆత్మ యోగమహత్త్వము—అష్టసిద్ధులు, మహావిభూతులు వీనిద్వారా భగవద్యోగమును గ్రహించగల విధ మీ యధ్యాయమునందు వివరింపబడినది. ఆత్మయోగానుభవము నందే విభూతియోగానుభవమును సాధ్యము అని విస్పష్టము చేయబడుచున్నది.

భగవద్విభూతులను శ్రీ వేదవ్యాసభగవానుడు వేదవేదాంగము లందును, అష్టాదశపురాణములందును, ఇతిహాసములందును విస్తరించెను. అయినను తృప్తినొందక సంక్షేప యాత్మనైన భాగవతమును భగవద్విభూతులను వర్ణించుటకు వ్రాసినాడను ఇతిహాసము గలదు. శ్రీకృష్ణుడు ప్రత్యక్షముగ దగ్గరనుండి తన విభూతులను చెప్పుచున్నను అర్జునునకు తృప్తి గలుగకయు ఆత్మవిభూతులను తిరిగిగూడ చెప్పుమని కోరుచున్నాడు. భగవద్విభూతులు స్వానుభవమువలన జ్ఞేయములు. అయినను బాహ్యములును, సుగుణములు నైన మహావిభూతుల సాధనమునను పరమాత్మను గ్రహింపగల విధమును అర్జునునకు విభూతియోగ రూపమునను శ్రీకృష్ణు డుపదేశించుచున్నాడు.

### సారాంశము

భౌతికపదార్థములు వైన ప్రకృతియందు భౌతిక పదార్థములు యోగసాధనములు. భౌతికపదార్థములు విభూతియోగ రూపమునను భగవదంశమునను [illegible]ంచుచున్నవి. దేహము నందు ఆత్మవిభూతి విభూతియోగ పరిణామమును, భౌతికవిభూతి భౌతికపరిణామమును పొందుచున్నవి.

పురుషార్థమునకు సాధనమైన దేహమునందు నైన విభూతిని సంపన్నించుటకు నిత్యమైన ఆత్మయోగము సాధనము. సకలవిభూతులకును భగవంతుడు ఆధారభూతుడైనను, ఆ విభూతులు భగవంతుని కాధారములు కావు. ఈ రీతిగ విభూతులను, భగవంతుని యధార్థముగ తెలిసికొనినవాడు యోగి యగుచున్నాడు. విభూతియోగ రహస్యమును తెలిసికొనిన కర్మయోగులు ప్రకృతి యందు ప్రవర్తించుచున్నను, ఆత్మయోగపరాయణు లగుచున్నారు.

## విశ్వరూప సందర్శన యోగ వివరణము

బ్రహ్మవిద్యోపదేశము పదవ యధ్యాయమునందు విభూతి యోగరూపమునను జేయబడినది. అధ్యాయారంభమునందు "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" అని వివరింపబడెను. సకలభావములకును "అహ మాత్మా" యనియును, విద్యలలో "అధ్యాత్మ విద్య" యనియును సకల విభూతులయందును ఆత్మ యోగస్థితి సువ్యక్తము చేయబడినది. ఈ యుపదేశాంతమునందు "మోహోఽయం విగతో మమ" యని అర్జునుడు చెప్పుచును "ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ!" యని మరల నడుగుచున్నాడు. పరమేశ్వర విభూతులందు ఆత్మ విభూతులను జూడగల ఆత్మయోగజ్ఞాన మర్జునునకు గలుగలేదని అర్జునుని ప్రశ్న తెలుపుచున్నది. వ్యష్టిరూపమునను జూడగలిగినయు శ్రీకృష్ణుడు తెలిపినవియు నగు భగవద్విభూతులను (ఆత్మవిభూతులను) అర్జునుడు సమష్టిరూపమునను జూచి సంశయనివారణమును, నిశ్చయమునుగూడ బడయగోరుచున్నాడు. అర్జునునకు ఆత్మే తరములైన విభూతులయందు గల ఆసక్తి స్వాత్మయోగమునందు గలుగుటకు విశ్వరూప సందర్శన యోగసాధనమునను సమష్టి రూపమునను ఆత్మయోగరహస్యము సువ్యక్తము చేయబడుచున్నది. విశ్వరూపమున ఏకత్వమునందు నానాత్వమును, నానాత్వమునం దేకత్వమును ప్రత్యక్షమగుచున్నది.

విశ్వమునం దుత్పత్తిస్థితిలయ కారణరూపము లైన సర్గ ప్రళయములు సంప్రాప్తము లగుచున్నవి. ఉత్క్రాంతియందు విశ్వమునందు గలుగుచున్న విషయములు వర్ణనాతీతములు. విశ్వరూప సందర్శనము జననమరణాతీతము నైన మోహనాశము నంతరించుటకును, నిశ్చింతత్వజ్ఞానము గలుగుటకును సాధనము.

విశ్వరూపమును చూచినపుడు అర్జునునకు విశ్వరూప సందర్శనము భయసంభ్రమములను గలుగజేసినది. తిరిగియు సౌమ్యరూప సందర్శనమే మనశ్శాంతిని గలుగజేసినది. విశ్వరూప సందర్శన యోగము సామాన్య కర్మయోగములకును ఆత్మయోగ సాధనము అని విశదము చేయుచున్నది.

### సారాంశము

అర్జునునకు విరాట్స్వరూప సందర్శనము విశ్వరూప సందర్శనమువలనను గలిగినది. విరాట్స్వరూప సందర్శనము భయభ్రాంతులను కలుగజేసినది. మహాతేజోంధకారములు సర్గ ప్రళయములు, కర్మార్జునులు సౌమ్యభయంకరరూపములు, దైవ రాక్షసరూపములు, పంచభూతములు, త్రిమూర్తులు మొదలగు సమస్తవిశ్వమును విరాట్స్వరూపమునం దేకస్థానమునందు గోచర మైనది. అర్జునునకు దివ్యదృష్టి యున్నను, వీనిని చూచుటకు సాధ్యము కాలేదు. అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మ తన కలవాటైన సౌమ్యరూపమును తిరిగి చూపింప ప్రార్థించి చూచి శాంతిని పొందెను. ప్రవృత్తియందు భగవద్విభూతులను పరమాణువు నుండి పరబ్రహ్మము వరకును వ్యాప్తమైన విశ్వ మంతయును ప్రత్యక్షము చేయుచున్నది. మహాయోగులు సకలమునందును భగవద్విభూతులను దర్శించుచున్నారు. విశ్వరూపసందర్శనము ద్వారమున విజ్ఞానపూర్ణ ఆత్మయోగులు గాగల విధము తిరిగియు భక్తి యోగాధ్యాయమునందు వివరింపబడినది.

ముల యందు నుండి భూతజాలములకు జ్ఞానము, సమ్మోహ మును గలుగజేయుచున్నాడు. నిత్యుడైన జీవుడు కర్మానుభవ మును, వాయువు గంధమునువలె గొనిపోవుచున్నాడు. లోకము నందు క్షరాక్షరులు గలరు. క్షరములైన భూతములు సకలము నవు గా అక్షరుడు జన్మవాసనలను గొనిపోవుచున్నాడు. సర్వ వ్యాపకమైన ఆత్మయు, పరమాత్మయైన పురుషోత్తముడు లోకి స్థింగి పురుషోత్తమాభిఖ్య డగుచున్నాడు. జగత్తునందు త్రిగుణ ములు ఆద్యంతములు లేక, చెప్పని కర్మవశ్యని జేయుచున్నవని వేదవిదులు అసంగశస్త్రముచేత త్రిగుణసంజాతములైన విషయ వాసనలను ఛేదించి, మోక్షమార్గము నన్వేషించుచున్నారు మోక్షమార్గాన్వేషణమునకు నిష్కామకర్మయోగము సాధనమై ఆత్మయోగమును సాధ్యము చేయుచున్నది. ఆత్మయోగమునకు దైవసంపద సాధనముగ నున్నది. దైవసంపద కధికారిలక్షణము 16 వ యధ్యాయమునందు సువ్యక్తము చేయబడినది.

## దైవాసుర సంపద్విభాగయోగ వివరణము

ప్రవృత్తియందు పురుషులకు సుఖదుఃఖములు, లాభ నష్టములు, జయాపజయములును వారి కర్మానురూపముగ కలుగు చుండును. అభయము, సత్త్వసంశుద్ధి, జ్ఞానయోగము, దానము, స్వాధ్యాయము, అహింస, సత్యము, భూతదయ, క్షమ మొదలగు దుర్గుణములు గల దైవసంపన్నులు సుఖమును, మోక్షమును పొందుచున్నారు. అసురసంపన్నులు దుష్పూరమైన కామము నాశ్ర యించి, కామభోగపరాయణులై, దంభాహంకారములను, స్వాభి మానపరాయణత్వమును గాని, పరపీడనమును చేయుచు దుఃఖ మును, అధోగతిని పొందుచున్నారు. వారు చేయు దానములు యజ్ఞములును దంభాహంకార సంయుక్తములై నిరర్థకము లగుచున్నవి. అసురసంపన్నులకు కామ, క్రోధ, లోభముల వినాశ గల యభిమానము ఆత్మయందు గలుగదు.

పురుషులకు కార్యములను చేయుటయందును, విడుచుట యందును శాస్త్రప్రమాణము ననుసరింపుట ధర్మము. ఈ యధ్యా యమునందు మానవుల సుకృతదుష్కృత స్వభావములు తెలుప బడినవి. ధీరులు, త్యాగులు, జ్ఞానులు, తత్త్వజ్ఞానులును ప్రవృత్తి యందు తాము దైవసంపదల నారాధించుచు నితరులకు సన్మార్గ దర్శకులుగ నున్నారు. ధనాధికారాభిమానులు కామక్రోధ లోభ ముల నారాధించుచు నితరులకు దుఃఖమును గలుగజేయుచు తాము దుఃఖము ననుభవించుచున్నారు. దైవసంపదల నారాధింప గల విధము శ్రద్ధాత్రయ విభాగయోగమునందు వివరింపబడినది.

### సారాంశము

ప్రవృత్తియందు పుణ్యపాపములు, సౌందర్య వికాసములు సౌమ్యరౌద్రములు, సత్యాసత్యములు, ధర్మాధర్మములును మానవ స్వభావములయందు సహజముగను గలుగుచున్నవి. ఈ స్వభావము లకు కారణములు సత్త్వరజస్తమోగుణములు. సత్త్వగుణము గలవారు దైవసంపన్నులై సుఖమునకు, మోక్షమునకు అధికారు లగుచున్నారు. సత్త్వసంపన్నులు దైవసంపదలను జీవయాత్ర యందు ననుసరించుచు, స్వకర్మ స్వధర్మారాధనమును చేయు చుందురు.

అసురసంపన్నులు తమదేహమునే ప్రధానముగ జూచు కొనుచు, దేహారాధనమునకై, తమ యావచ్ఛక్తిని వినియోగించు చున్నారు. దుష్పూరమైన కామము నాశ్రయించిన వీరికి కామ క్రోధ లోభారాధనము చేయుట సహజముగ సంభవించుచున్నది. ఆద్యంతములులేని విషయోపభోగములు సుఖసాధనములుగ కనుపడి నను, దుఃఖభాజనము లగుచున్నవి. అసురసంపన్నులు విషయ సమ్మోహితులై, ఆత్మపీడనమును, పరపీడనమును చేయుచు నున్నను, లోకమును నధోగతిపాలు చేయుచున్నారు. ఈ అధ్యా యమునందు సుకృతులు శాస్త్రవిధానము ననుసరించి, స్వకర్మ స్వధర్మారాధనము చేయుచు కృతార్థులు కాగల విధము తెలుప బడినది.

## శ్రద్ధాత్రయ విభాగయోగ వివరణము

క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగముతో ప్రారంభింపబడిన బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధన మీ యధ్యాయమునందు పూర్తి చేయబడినది. దేహాభిమానము నశించుటకు సేవయే అత్యవసరమైనను దేహవాసన లాత్మజ్ఞానమునకు ప్రతిబంధకములుగ నున్న విధమును 13, 14, 15, 16 అధ్యాయములందు సువ్యక్తము చేయ బడినది. గుణత్రయ విభాగయోగమునందు సత్త్వరజస్తమోగుణ ములు సకల ప్రాణులకును దుఃఖనిమిత్తము లగుచున్న విధము తెలుపబడెను. దేహవాసనలకు మూలబీజములైన కామక్రోధ లోభములను జయించి శాస్త్రప్రమాణము ననుసరించి కర్మలను జేయుట యోగశాస్త్రమూలమును బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధనము.

కామక్రోధలోభములను జయించుటకు శ్రద్ధ త్రివిధముగ నుపయుక్తమగునో అర్జునుడు వినగోరుచున్నాడు. అశ్రద్ధతోను, శాస్త్రవిధానము ననుసరించకను చేయు కార్యములు దంభా హంకార సంయుక్తములై స్వాభిమానమునకే విఘాతము కలుగ జేయుచున్నవి.

### సారాంశము

పురుషుడు శ్రద్ధామయుడు. ఎవ రెట్టి శ్రద్ధ గలవారో వారు అట్టివారే అగుచున్నారు. శ్రద్ధ సకలజనులకును సత్త్వమున కనురూపముగ గలుగుచున్నది. సకలకార్యములందును సత్‌స్థితి సత్త్వమునకు సాధన మగుచున్నది. సత్త్వస్థితిని బడయుటకు సాత్త్విక ప్రవృత్తిని సభ్యాసము చేయుట అవసరము. సాత్త్వి కాహారము వలనను శరీరమును సత్త్వానురూపముగ నుంచ వలయును. వాక్కును మనస్సును సాత్త్వికస్థితియం దుంచ వలయును. సకలకర్మలను ఫలాపేక్ష లేక భగవదర్పణముగ చేయవలయును. సాత్త్వికు లాహార విహారములయందు దేహారాధన మును పరిగణింపక ఆత్మారాధనము చేయుచు కృతార్థు లగు చున్నారు.

సాత్త్వికులు గానివారలు శాస్త్రప్రమాణము విడిచి, దంభాహంకారయుక్తులై, యథేష్టము ప్రవర్తింతురు. కొందరు శరీరమునకు పీడను గలుగజేయుచు, శరీరస్థుడనైన నాకును, భూతగ్రామమునకును పీడను గలుగజేయుదురు. ఇతరులకు పీడను గలుగజేయవలయునన్న యుద్దేశములో చేసెడి తపస్సు ఆత్మహింసకే మూలమగుచున్నది. వీరు చేసెడి యజ్ఞ దాన తపస్సులు అశ్రద్ధతో కూడినవై, ఇహమునకును, పరమునకును నిరర్థకములగుచున్నవి.

## మోక్షసన్న్యాసయోగ వివరణము

అర్జునుడు యుద్ధారంభమునందు గలిగిన సందేహమునే ఇప్పుడును నివృత్తిని జేయగోరుచున్నాడు. సన్న్యాసాశ్రమస్వీకారము జేసిదే మోక్షము లేదని పండితాభిప్రాయము. అందువలన సన్న్యాస తత్త్వము ఎంత వినినను సందేహము పోలేదు. అర్జునుడు సన్న్యాస తత్త్వమును, త్యాగతత్త్వమును శ్రీకృష్ణునివలన మరల వినగోరుచున్నాడు. కామ్యకర్మలను విడుచుట సన్న్యాస మనియును, కర్మఫలత్యాగము త్యాగ మనియును శ్రీకృష్ణుడు సమాధానము చెప్పెను. దేహధారులకు కర్మలను పూర్తిగ విడుచుట శక్యము గాదు. ఫలత్యాగమే త్యాగమని చెప్పబడుచున్నది. ఆత్మశుద్ధి కొరకు సంగమును విడిచి కర్మలను చేయుట జనులకును నియత ధర్మము. ప్రతిమనుజుడును స్వకర్మను భగవదర్పితముగ జేయుచు తరించుచున్నాడు. కర్మలయందు ఉత్పన్నఫలములు లేవు. ప్రతి మనుజుడును స్వధర్మాచరణమును మమకారాహంకారములు లేకను చేయుట పురుషార్థమునకు సాధనము. తానేకర్మము చేసినను ఈశ్వరకైంకర్యముగ భక్తిలో చేసినచో భగవంతుడు వానిని పాపముల నుండి రక్షించును.

౨. (66 వ శ్లో.) అర్జునుడు యుద్ధారంభమునందు ధర్మవిచారణను జేయుచు యుద్ధము చేయుటకు నిరాకరించెను. ధర్మసమ్మూఢ చేతస్కుడైన విజయునకు శ్రీకృష్ణుడు గీతాశాస్త్రమునందు ధర్మ స్వరూపస్వభావములను ఉపదేశించెను. ప్రపంచమునందు వైదికధర్మములు, లౌకికధర్మములు, రాజకీయ ధర్మములు, సాంఘిక ధర్మములు మొదలగు ధర్మములు జిజ్ఞాసువులకు నిరంతరము సందేహమునకు హేతుభూతములు.

అర్జునునకు గీతాశాస్త్రమునందు శ్రీకృష్ణుడు క్షాత్రధర్మములు మాత్రమే బోధించియుండలేదు. సకల జనులకును

విశ్వవిలాసములు సచ్ఛక్తి చిచ్ఛక్తి క్రియాశక్తి పరిణామములు; రసానంద సాధనములు.

కావ్యము విశ్వాధార మైన సర్వతోముఖరసానందసిద్ధి కాశ్రయము. సౌందర్యమంజరియం దీ పరమార్థమును కృతికర్త సర్వీన విధానమున నిర్వహించిన విధమును కావ్యగ్రము వివిధసందర్భములందును సువ్యక్తము చేయుచున్నది.

II శక్త్యుపాసన

బ్రహ్మాండవ్యాప్త మైన చైతన్య శక్తి పిండాండములందు తత్స్వరూపముగ గోచరం బగుచున్నది. ప్రపంచభూతపంచీకరణమునందు చైతన్యశక్తి కారణసూక్ష్మస్థూలావస్థలతో ప్రపంచపరిణామమును బొందుచు పురుషార్థమునకు సాధనంబుగ నున్నది. సూక్ష్మకారణావరణములందు వ్యాప్త మైన శక్తిని స్థూలావరణములందు ప్రసరింపజేయుట విజ్ఞానము, యోగము. ఆకాశతత్త్వమునందు వ్యాపకముగనున్న చైతన్యశక్తి పృథ్వీతత్త్వమునందు పరిమితమగుచున్నది. అఖండమైన చైతన్యశక్తికి బ్రహ్మాండఖండ బిందువు లన్నియు శక్తివిభాగములు. చైతన్యశక్తి బాహ్యాభ్యంతరములం దేక ప్రవృత్తిగ లీనమై బద్ధమై ప్రకాశించుచున్నది. బాహ్యాభ్యంతర శక్తుల సంయోగము రసయోగము, పరమార్థము, పురుషార్థము. చైతన్య శక్తి ప్రభావమును వేదాంతము వైరాగ్యమునను, ఆగమములు యోగమునను, కావ్యములు రసమునను, శాస్త్రములు సిద్ధాంతమునను, కళలు క్రియారూపమునను సువ్యక్తము చేయుచున్నవి. యోగములయం దాగమశాస్త్రసిద్ధమైన కుండలినీయోగము శక్త్యుపాసనకు ప్రాచీన సంప్రదాయసిద్ధము. అఖండమైన విశ్వవ్యాప్త మైన చైతన్య శక్తి నాత్మయం దావాహనము చేసి, శక్తి నేకముఖముగ చేయుట కుండలినీయోగము. కుండలినీ యోగము (నామరూపవిలసితము లైన భిన్నశక్తులకు మహాశక్తి స్వరూపమును) గర్పించి ఆనందరసమును గలుగజేయుచున్నది.

వరదాయిని యైన శక్తిని ప్రాచ్యు లాభ్యంతరసాధనలను పాశ్చాత్యులు బాహ్యసాధనములను నుపాసన జేయుచు, సుఖదుఃఖములను వైరాగ్యభాగ్యములను సిద్ధియంత్రములను పుణ్యపాపములను సృష్టి సంహారములను ప్రపంచపరిణామార్గము నడయుచున్నారు.

చరాచరప్రపంచ మంతయు చైతన్యశక్తి మూలమున జీవయాత్ర చేయుచున్నది. జీవజాలములు శక్తిని స్వాధీనము చేసికొనుటకు చేయుచున్న ప్రయత్నములను ప్రపంచపరిణామము విశదము చేయుచున్నది. వర్తమానకాలమునందు ప్రకృతిశాస్త్రజ్ఞులు వ్యక్తము చేసిన సిద్ధాంతములును నిర్మాణములును కుండలినీశక్తి యోగపరిణామములనే నిర్ణయించుచున్నవి. జీవశాస్త్రము భౌతికశాస్త్రము రసాయనశాస్త్రము జ్యోతిశ్శాస్త్రము గణితశాస్త్రము వేదాంతశాస్త్రము యంత్రశాస్త్రము శిల్పశాస్త్రము మొదలగు శాస్త్రములు చేసిన సిద్ధాంతము ప్రాచీనవైదిక విజ్ఞాననిర్ణయములను సమర్థించుచున్నవి. వర్తమాన – భౌతికశాస్త్రసిద్ధాంతములు నిర్మాణవిమర్శనములు ప్రాచీనాధ్యాత్మిక సిద్ధాంతమార్గములను సమర్థింపగల విధమును పరిశోధనలు విశదముచేయుచున్నవి.

ఆదికాలమున భయభ్రాంతులకు మూలము లైన ప్రకృతి శక్తులు (ఆత్మశక్తి యంత్రశక్తి) కాలక్రమమున వశవర్తులై మానవాభ్యుదయమునకు వినియోగపడుచున్నవి. ఆవిరిశక్తి విద్యుచ్ఛక్తి తేజశ్శక్తి రేడియోశక్తి ఓజశ్శక్తి బాహ్యయంత్ర సాధనముల మానవ సౌఖ్యమునకు వినియోగపడగల విధమును పాశ్చాత్యవిజ్ఞానము విశదముచేయుచున్నది. భావయంత్రసాధనమున నీ పరమార్థమును ప్రాచ్యులు సాధించిన విధము, సౌందర్యమంజరిలోని శక్త్యుపాసనాశ్వాసమునందు మనోజ్ఞ మైన యోగశాస్త్రకళారసభరితభావములచే సంభావితము. ఆ శక్తి నుపాసించి ధ్యానించి తన చిత్తమున స్ఫురించిన రీతిని గోపాలరావు గారు సౌందర్యమంజరిని రచియింప సంకల్పించిరి. ఆ మహాసంకల్పము కావ్యరసానందమును గలుగజేయుట యందుఁ గల సాధ్యాసాధ్యములకు సౌందర్యమంజరి ప్రమాణము. వైరాగ్యభాగ్యములకును త్యాగభోగములకును భావకాయములకును గల సంబంధము నాసంపోషనయందు సమన్వయము చేయుటకు కవి పాడిన యానంద గీతము ప్రపంచనాటకం కనురూపముగ నున్నది.

అఖండ మైన శక్తి ఖండరూపములందు స్థూలసూక్ష్మరూపమునను, బాహ్యాభ్యంతరములందు నుపలబ్ధ మైనప్పుడు ప్రపంచ స్థితికిని సౌఖ్యమునకును, అప్రబలమైనప్పుడు దుఃఖానుభవమునకును విలయమునకును, సాధనభూతముగ నున్నది.

ప్రకృతిశక్తి యనెడి పాంచప్రబంధ
ప్రాచ్యులు పాశ్చాత్యు లెచ్చరించిన
భావయంత్రంబులు బాహ్యయంత్రములు
నా సౌఖ్య కష్టముల్ పూని మథింప,
వైరాగ్యభాగ్యరూపములు ధరించి
యుద్భవించిన లక్ష్మి! యుత్సాహజనని!
ఒక్క మా టిటు చూడు, మ్రొక్కి వేడెదను;
వైరాగ్య, మదియును భాగ్యంబె యైన,
భాగ్యసంగతినె సంభావ్య మై యొప్పు;
ఉభయభాగ్యంబుల విభవంబు నిమ్ము!

* * *

త్రైజసశక్తి! నాదబ్రహ్మమూర్తి!
ప్రకృతిస్వరూపిణీ! ప్రత్యక్షశక్తి!
అత్యంతభక్తిమై ధ్యానింతు నిన్ను;
చల్లగా మెల్లగా, నుల్లాస మొలయ
దయ మీఱ, నాదు చిత్తమున స్ఫురించి
పరమార్థశబ్దప్రభలు గూర్పు మమ్మ!
సౌందర్యమంజరీసౌమ్యరూపమున,
నా కాంచన తెలుంగు నను జూపనిమ్మ! II, 81—98

శక్త్యుపాసన యోగసిద్ధికిని యంత్రరచనలకును వలె కావ్యరచనలకును సాధన మైన విధమును, నాదోపాసనసాధ్య మైన సకలవిజ్ఞానములకును మూల మైన భాషోపాసన పరిస్ఫుటము చేయుచున్నది.

## III భాషోపాసన

అవ్యక్తమైన శక్తికి నాదము ప్రథమవ్యక్త స్వరూపము. నాదము శబ్దరూపమున బ్రహ్మాండావృతమై భాషాధారమున బ్రహ్మాండమును గ్రాహ్యము చేయుచున్నది. శబ్దము భావదశయందు 1 పరారూపమును, భావము సూక్ష్మదశయందు 2 పశ్యంతీరూపమును, భావము శబ్దరూపమున 3 మధ్యమారూపమును, వాగ్రూపమున 4 వైఖరీరూపమును దాల్చుచున్నది. భావము ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తుల సంయోగవియోగములచే ప్రపంచ పరిణామమును పొందుచున్నది. సకలశబ్దార్థములకును అక్షరామ్నాయము స్థూలరూపమున మూలాధారము. వేదములు వేదాంగములు కావ్యములు కళలు మంత్రములు యంత్రములు భావశబ్దార్థపరిణామమైన పురుషార్థమునకు సాధనములు.

పరా వాఙ్మూలచక్రస్థా పశ్యంతీ నాభిసంస్థితా
హృదిస్థా మధ్యమా జ్ఞేయా వైఖరీ కంఠదేశగా.

చైతన్యశక్తి బ్రహ్మాండాంతర్గతమైన పిండాండమునకు ఆవాహన కాగల విధమును కుండలినీయోగము విశదము చేయుచున్నది. చైతన్యశక్తి హంసరూపమున ఉచ్ఛ్వాసనిశ్వాసములను గలుగజేయుచు, పిండాండమునందు శివశక్తుల సంయోగమును గలుగజేయుచున్నది. బ్రహ్మాండమునందు మాయాశక్తిని వలె, పిండాండమునందు మనశ్శక్తిని స్వాధీనము చేయగల విధము కుండలినీయోగము. బ్రహ్మాండమునందు నాదబిందుకళాపరిణామములైన వర్ణమాలాక్షరములు దేహమునందును వర్ణమాలాక్షరశక్తుల రూపమున నంతర్వ్యాప్తములై యున్నవి. బ్రహ్మాండాంతర్గతములైన భూలోకము భువర్లోకము సువర్లోకము మహర్లోకము జనలోకము తపోలోకము సత్యలోకము పరమైన శక్తులు, పిండాండమైన దేహమునందును అక్షరరూపమున నంతర్గతములై, సప్తచక్రములరూపమున ప్రతిష్ఠితములై యున్నవి. హిరణ్యగర్భశక్తి విద్యుత్ప్రాణమయమైన సూర్యరూపమున లోకవికాసమును జేయుచున్నది. రేడియోశక్తి యంత్రములవలన పరిస్ఫుటమగు విధమున, చైతన్యశక్తి కుండలినీప్రబోధమున పరిస్ఫుటమగు విధమును కుండలినీయోగము బోధించుచున్నది. గళయంత్రవర్ణన యీ పరమార్థమును మనోహరముగ మనోగతము చేయుచున్నది.

అవ్యక్తశక్తి సువ్యక్తస్వరనాదరూపమున అక్షరామ్నాయమును గ్రాహ్యమగుచున్నది. అకారము మొదలు హకారమువరకును గల యక్షరములు శబ్దములను పదములను ప్రత్యయములను వాక్యములను సమకూర్చుచున్నవి. "అహమ్" పదార్థము "అహంకారము"గ వ్యక్తమై జగద్రూపముగ పరిణమించుచున్నది.

భాషల స్వరూపస్వభావములు ప్రజల స్వరూపస్వభావములకు ప్రమాణములు. ఆంధ్రాక్షరామ్నాయము భాషాస్వరూపస్వభావములు సంగీత సాహిత్య శాస్త్ర కళాది నిర్మాణములందు చైతన్యశక్తిని ప్రజ్వలింపజేయజాలియున్నవి. భాషోపాసకులు కావ్యములందు భాషాశక్తి నుపాసించి కృతార్థులు కాగల విధమును భాషోపాసనా ధ్యానము విశదము చేయుచున్నది. చైతన్యశక్తి భాషాశక్తిసాధనమున సకలార్థసిద్ధికిని సాధనంబుగ నున్నది. మాటలు మణిమంత్రము లగుచున్నవి. ఆ మహాశక్తి దేహక్షేత్రమునందు ముకుళితములైన సప్తకమలములను వికసింపజేసి చిదంబరక్షేత్రమునందు దివ్యకాంతుల నానందతాండవము నానందగానమును జేయుచు, నాత్మానందమును గలుగజేయుచున్నది. వికసించిన కుండలినీశక్తి విశ్వగీతమును పాడుచు, విశ్వరూపమును సందర్శించుచు, విశ్వ[illegible]ను జేయుచు, విశ్వరసానందమును ప్రత్యక్షము చేయుచున్నది.

గళయంత్రోపమానమున శబ్దశక్తిస్వరూపస్వభావము లీ క్రింది పాదములందు సుబోధములు. విద్యుచ్ఛక్తి శబ్దకాంతుల భావరూపములను దాల్చుచు భాషామహాశక్తియోగమునందు రసపూర్ణానందమును గలుగజేయుచున్నది. పదములు భావములు భాషాశక్తి పరిణామములు. పరమార్థగ్రహణమునకును పరమార్థసాధనమునకును భాషామహాశక్తి మూలాధారము. ఆ శక్తి సహస్రారమునందు భాసిల్లుచు భాషాస్వరూపమున సకలాంతరములందును ప్రక్షిప్తముగ నున్న విధమును గళయంత్రోపమానము (త్రొక్కుడు హార్మోనియము) వ్యక్తము చేయుచున్నది. భాషావికాసము సంగీతసాహిత్యవికాసములకును సకలవాఙ్మయములకును మూలము.

అఖిలార్థదాయిని యగు కల్పవల్లి
భాషామతల్లియే ప్రతిజాతి తల్లి;
ప్రపంచకు నేకోదరప్రీతి గూర్చి,
జాతికుటుంబముల్ సవరించుచుండు!

* * *

జ్ఞానతీర్థంబులన్ దంకంబు లార్చి,
సంగీతసాహిత్యస్తన్యం బొసంగి,
నాదంబు భూలోక మేకం బొనర్చు
కల్పవల్లీపోలికం బండజెట్టి,
భావహస్తములతో జైవయి సూచి,
పరమార్థములు పోలపాటలు పాడి,
ప్రస్తుతివినోదముల్ పరికింపజేసి,
ముద్దుబిడ్డల బెంచి మురియుచుండు.
భాష పెంపకయున్న, బనులవు గావె ?
భాషపెంపే మానవప్రసాధనంబు ! III. 1—14

* * *

మేదోంబురుహాక్ష ! నాదస్వరూప !
వాయుచాలనమృదుసోపోహతుల
లలి శ్వాసకోశతంత్రుల నొత్తికొనుచు;
భావహస్తంబులు పైపైకి చాచి
సప్తకాంతయుపవర్ణఫలకముల్ మీటి,
నీవు శ్రుతుల్ దీర్చి నియతి వాయించు
గళయంత్ర మఖిలమంగళకరం బంబ!
వేదవేదాంగముల్ వేదాంతములును
సాహిత్యగ్రంథముల్ సంభాషణములు

నీ గానమహిమముల్ ; నిత్యంబు నీవు
లోకయాత్ర సమస్త మేకగీతముగ
పాడుచుందువు తల్లి ! స్వరకల్పవల్లి ! III.35-46

ఆ శక్తిప్రభావము పేరొక విధముస వీణోపమానమున వ్యక్తము చేయబడినది. దేహాధార మైన బ్రహ్మదండి వీణాదండము. వీణాదండము భిన్నస్థానములందు సప్తస్వరములను కల్పించుచున్నది. బ్రహ్మదండ శక్తి మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞా సహస్రార చక్రస్థానములందు శక్తిరూప మైన స్వర శక్తుల నుత్పత్తి చేయుచున్నది. కపాలకచ్ఛపీవీణ సరస్వతీశక్తిని ప్రజ్వలింపజేయుచున్నది. బ్రహ్మాండవీణారూప మైన బ్రహ్మదండ వీణ సహస్రారమునుండి మూలాధార స్థానమువఱకును వ్యాప్తము లైన శక్తిస్థానములందు శక్తుల వాడించుచు రసానందమును గలుగ జేయుచున్నది. ఖాస్వరస్వరవీణ దివ్యనాదమును ఆజ్ఞావీణ ఆజ్ఞాశక్తిని ఇతరనాదస్థానము లితర శక్తులను ప్రసాదించుచున్నవి. ఆ శక్తి ప్రత్యక్షమై విశ్వకావ్యరచనకు వినియోగపడుటకై గోపాలరావుగారు చేసిన యుపాసనావిధానము గంభీరముగ నున్నది.

బ్రహ్మదండపు వీణ, బ్రహ్మాండవీణ,
కచ్ఛపీవీణ, కపాలకచ్ఛపీవీణ,
దేవతయాత్మకత్రిగ్రంథివీణ,
నాడులే తంత్రులై నటియించు వీణ,
అఖిలశక్తులకు మూలాధార మైన
గణపతిపూజలో దొరగొడి వీణ,
త్రిజగజ్జనకము స్వాధిష్ఠాన మైన
యోగాగ్నికుండమం దుదయించు వీణ,
మణిపూరతేజంబు మహిమంబు నెఱపఁ
గనులకు మిఱుమిట్లు గలిగించు వీణ,
అద్భుతరీతి ననాహతస్థితినె
ప్రణవశబ్దంబులం బలికించు వీణ,
కల రూపుల విశుద్ధ కలకంఠగతుల
వాఁగెడి ఖాస్వరస్వరపూరవీణ,
మానసహంసంబు లీన నహో లీల
నాజ్ఞానువర్తియై యలరారు వీణ,
బ్రహ్మరంధ్రము సహస్రారంబు దాఁకి
యమృతంబు వర్షించి యలరించు వీణ,
సూక్ష్మాతిసూక్ష్మతేజోరేఖఁ బోని
కుండలి నాడించు గుప్తార్థవీణ,
అమ్మ! మా యమ్మ! నా కిమ్మ నీ వీణ ;
దాని నెక్కించెడి తలఁపు జనించె! III. 47-68

అవ్యక్త మైన సచ్ఛక్తి చైతన్యప్రపంచభావరూపమున వ్యక్తమగుచున్నది. చైతన్యశక్తి సంభావనయందు నిత్యప్రవృత్తి కను రూపముగ శబ్దశక్తి పరిణామమును పొందుచున్నది. శబ్దశక్తి

వాగర్థాధారమున భాషావరిణామమును హొందుచు, పురుషార్థమునకును రసానందమునకును సాధన మగుచున్నది. శక్తిస్వరూపములును భావార్థములును సిస్రృక్షయా క్రియలును సాంఖ్యయోగములును నీవునేనులును వేకమువుట మహాయోగానందము. రసోపాసనయందు ప్రవృత్తిపర మైన యోగానందము సాధ్యము. హృద్య కావ్యములు హృదయాహ్లాదకర మైన రసోపాసనకు సాధనములు.

నీవె నేనును నేనె నీవు నద్వ్యైదము,
ఉన సముచ్చయ మదే యోగాకారము;
లడియు నుభయ మధ్యమందు లయించ,
నీవు నే నేక మౌ భాసించె మనము!
ఆ యైక్యమందె దా నావిర్భవించు
సృష్టికిం బ్రతిసృష్టి హృద్యకావ్యంబు!

* * *

శక్తిమై ప్రణయిని ప్రాప్తించునాడ,
బాల్యంబునుండి నీ భక్తుండ నంద!
దయ మీఱ నాయం దుదయ మందవయ్య,
సౌందర్యమంజరీ సామరస్యమున! III, 79-88

సకల పదార్థములందును బ్రహ్మ చైతన్య మిముడియు వ్యాపకమై యున్నను, భూతసంఘాతములందు మూర్తరూపముల నాకాశ తత్త్వము క్షీణించుటయు పృథ్వీతత్త్వము ప్రబలుటయు సంభవించుచున్నది. పంచభూతములును నమలోమ విలోమ మార్గమున ప్రపంచరచనమును బడయుచున్న విధమును భూతములయుత్పత్తి స్థితి లయములకు వ్యుత్క్రమ మార్గమును తెలుపుచున్నవి. సృష్టిపరిణామమున నాకాశపరమాణువు పృథ్వీపరమాణువుగ పరిణమించుచు, స్థూలమైన కఠినములైన క్షేత్రములు కల్పింపఁబడుచున్నవి. ఆకాశ పరమాణువునందు పరిపూర్ణముగ వ్యాప్తమై యున్న చైతన్యశక్తి పృథ్వీపరమాణువునందు నిక్షేపింపఁబడి యణువులలో స్తంభించి ప్రక్షిప్తమగుచున్నది. పృథ్వ్యంబు తేజోవాయు తత్త్వములం దంతర్గతమై యున్న చైతన్యశక్తిని ప్రవర్తింపఁజేసి పరమార్థమును బడయుటయే యితర మార్గములకు వలె కుండలినీ యోగమునకును పరమార్థము. శ్రీ శంకరాచార్యులు సౌందర్యలహరియం దుపాసించిన త్రిపురసుందరిని శ్రీ గోపాలకృష్ణ గారు సౌందర్యమంజరియందు ప్రేయసీహృదయ సంస్థిత రసోపాసన రూపమున నుపాసించి కృతార్థు లయిరి.

## IV రసోపాసన

కవి భాషామహాశక్తి తనయం దుదయించి నటించుటకు చేసిన యుపాసన కనురూపముగ, భాషాశక్తి యుపాసకుల కుపాసనానురూపమైన కావ్యరసానందమును గలుగఁజేయుచున్నది. రసోపాసనాభ్యాసము విశ్వాత్మక మైన రసస్వభావ స్వరూపనిర్ణయము లను జేయుచున్నది. కావ్యములందు నవరసములు నుపాస్యము లైనను, శృంగార వీరశాంత రసములుమాత్రమే ఉపాసనానురూపముగ ప్రయోగయోగ్యములు; సచ్చిదానంద ప్రాప్తికి సాధనములు.

ప్రత్యేక భావశూన్యములైన బీభత్సకరుణభయానక హాస్యాద్భుత రసములు రససిద్ధికి నిరర్థకములు. రసత్రయమునందు కావ్యముల శాంతరసప్రదర్శన మసంగతము. శాంతరసము నిద్రాలయావస్థ యందు గోచరం బగుచున్నది; జాగరణావస్థయం దనుభవయోగ్యము గాదు; బ్రహ్మోపాసనకు లక్షణమైనను, ప్రవృత్తియందు దురారాధ్యము. ప్రవృత్తియందు, కావ్యములలో ప్రేమబీజమైన శృంగార రసము సమాశ్రయము.

నిద్రలో శాంతంబు నెగడు నద్యోఁడియు
అవ్యక్తసౌఖ్యస్వహానందకరము!
కర్త లయించుటం గర్మంబు నుడుగ
శాంతరసము ప్రదర్శనయోగ్య మగునా?
VI, 17—20

* * *

శృంగార వీరంబులం గిల్గనట్టి
మరణంబులం గాని మ్మరణకు దారి
శాంతరసంపు బ్రసక్తి యే మింక?
ఆ ప్రవృత్తిని దుర్లభార్థంబు గాదె?
లయసృష్టి సాధ్యంబులం ప్రవర్తిల్ల,
బ్రహ్మోపాసనమై పరగదె నేము?

* * *

స్థాయి జాగ్రత్స్వా లవిరు నిల్వ
మది యేక రసి వగా? యానంద మిదునె?
VI, 29—36

కావ్యములకు ప్రధానమైన రెండవ రసము వీరరసము. రణవీరము రౌద్రము; రక్తపిపాసయుతము; క్రోధయుతము; భయదము.

ప్రేమ బీజంబు శృంగారము,
ప్రేమ కటిబం బగునే వీరము!

* * *

శౌర్యంబు హింస శోకంబు జనిత్ర
భయద మౌ వీరంబు పాలింపం దగునె;
సంపాదనమునకు సంరక్షణమున
కాధార మగుటచే నారాధ్యమైన,
గుణవిశేషములతోఁ గూడినం గాని
వీరంబు సంతోష మే రీతిఁ గూర్చు?
ఉక్తియుద్ధంబులు రక్తి గొల్పినను,
రక్తపాతంబు లాసక్తి గొల్పెడినె?
ధర్మశాంతులను సంస్థాపించు టనిన,
ఈ వీరము నణంచుటే యర్థ మగును
గణుతింపఁగ ననాదికాలంబునుండి
వీరంబు నణఁచుటే విశ్వోద్యమంబు;
వీరంబునం గాని వీరం బణఁగ



# "లేపాక్షి బసవయ్యా లేచి రావయ్యా"

హనుమకొండ వేయిస్తంభాల గుడి ముందు నంది

అనాది కాలంనుండి ప్రకృతి, పశువు - ఈ రెండూ మానవునికి ముఖ్య సహచరులు. ప్రకృతిని వశం చేసుకొని సంపదను సృష్టించడంలో పశుసంతతి చేసిన సహాయం అమూల్యం. ఆది మానవుడు వ్యవసాయ నాగరికతకు అలవాటు పడిన నాటినుండి నేటివరకు పశుసంపదను వృద్ధి చేసుకోడానికి తీవ్రంగా ప్రయత్నాలు జరుగుతూనే వున్నవి. "గో బ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం" అనే ఆర్యోక్తిలో మనిషి కంటె ముందుగా పశుజాతిని పేర్కొనడం గమనార్హం. అందుకనే మనం మహాదేవుణ్ణి పశుపతి అని పేర్కొనడమూ, ఆలయంముందు మన పురాతన శిల్పకళాసంపద కనస్త్రోసినట్లు నందీశ్వరుని ప్రతిష్ఠించుకొనడమూ, భూమాత అన్నట్లు మనం పశువును "గోమాత" అని సగౌరవంగా పిలుచుకుంటాం.

భారత దేశానికి అన్నపూర్ణ, దక్షిణ భారతానికి ధాన్యాగారం మన ఆంధ్ర దేశం. ఈ కీర్తి మనకు దక్కడానికి మన అభ్యుదయ రైతాంగమూ, మన పశుగణమే గదా కారణం! మన ఒంగోలు జాతి కోడెలు దేశదేశాలలో కీర్తి పతాకాలు ప్రతిష్ఠించుకున్నవి.

అలాగని మనం ముణిసిపోకూడదు సుమా. పశుసంపద వృద్ధిచెందాలంటే ముందుగా నాసిరకం పశువులను రంగమునుండి తొలగించుకోవాలి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పశు సంవర్ధక శాఖ ఇందుకై అనేక ప్రయోజనకరమైన పథకాలు అమలుపరుస్తున్నది. నాలుగో పంచవర్ష ప్రణాళిక కాలంలో యీ కృషి ఉద్యమ స్థాయిలో జరుగుతుంది.

శ్రీశైలం, తిరుపతి వంటి పుణ్యక్షేత్రాలకూ, 'నాగార్జునసాగర్' వంటి ఆధునిక దేవాలయాలకూ, అమరావతి వంటి పురాతన శిల్పారామాలకూ నిలయమైన తెలుగుదేశం పశు సంవర్ధనలో కూడా ముందడుగు వేస్తున్నది.

'లేపాక్షి బసవయ్యా లేచి రావయ్యా!' అని మన కవులు గానంచేశారు. కేవలం శిల్పదృష్టి మాత్రమే కాదు, ఆధునిక పశుసంపద అభివృద్ధి కాంక్ష కూడా యిందులో ప్రతిధ్వనిస్తున్నది.

బి. ఆర్. కె. శాస్త్రి, ఎం.ఎ., ఐ.ఎ.ఎస్.,
డైరెక్టర్,
సమాచార పౌరసంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,
హైదరాబాదు.

వినియోగపడుట దుర్లభము. ఆదికాలమునుండియు విశ్వకల్యాణ సాధనములైన మతములకును కావ్యములకును మతములకును శాస్త్రములకును తత్త్వములకును కళాసౌందర్యములకును ఆధ్యాత్మికసాధనములకును భౌతికసాధనములకును సంయోగసామర్యములు దుర్లభములగుటయు, ప్రతిఘటనము ప్రబలుటయు దురదృష్టము. విశ్వమంతయు నేకశ్రుతిలయరాగరసబద్ధమై విశ్వపరిణామమును విశ్వకల్యాణమును బొందుటకు మహాత్ములు తమ శక్తిని వినియోగించుచున్నారు. మతాచారములు శృంగారవిలాసములు విశ్వేశ్వరారాధనమునందు మేళగించుట ప్రకృతిధర్మమైనను, ప్రతిఘటనము ప్రకృతిధర్మముగ నున్నది. గోపాలరావుగారు ప్రాచ్య పాశ్చాత్య సంస్కారములం దనుభవజ్ఞులు, పండితకవులు, రసజ్ఞులు: కావ్యమున ఉభయసంస్కారములను రసయోగానందమునందు లగ్నము చేసిరి.

సౌందర్యమంజరి హృద్యమైన భావమంజరి. గంభీరభావ కాంతులు భావాంబరమునందు ప్రకాశించుచు భావకావ్యప్రకాశమును రంజింపజేయుచున్నవి. కావ్యలక్ష్యము సాత్త్విక శృంగారరసపరమైన భావసౌందర్యసామ్రాజ్యము. అయినను, ప్రపంచవాసనలు పాశ్చాత్య సంస్కారము రాజసతామస రూపసౌందర్యధ్వనులు శృంగారపరమైన రూపసౌందర్యము ప్రాధాన్యము చేసినవి.

> కవికర్షకుండు పోషక ప్రకర్షకుండు—
> ఉభయులున్ సంపద్గుణోదారఘనులు;
> పతత్పనువర్షవృష్టి లభ్దించు
> ప్రకృతిచిత్రసమానకృతిఫలంబు!
> రసికవక్ర ప్రరాధనలందు
> వారి నామంబులు వందనీయములు!
>
> IV, 157–162

కావ్యము సరళమైన మంజరీద్విపదయందు రచియింపబడినది. శ్రావ్య మంజులారావమును గలిగి శ్రావ్యముగ నున్నది: భావాను రూపముగ సంస్కృత ప్రాయముగ నున్నను, సహజమాధుర్యమును గలిగియున్నది. భావకావ్యము భాషాపార్దవమునకు కొంతవఱకు ప్రతిబంధకముగ నేర్పడియుండును. కావ్యము గోపాలరావు గారి చిరకాలసాహిత్యోపాసనమునకు పక్వఫలము. సంకల్పానురూపమైన శక్తి, శక్తికిఁ దగిన భాష, భాషకుఁ దగిన రసము, రససాధనమైన కావ్యము, కావ్యమునకుఁ దగిన కృతిపతి. సౌందర్యమంజరి కావ్య ప్రపంచమునందు నవరసానందానుభవమునకు సాధనముగ నున్నది.

## పరమార్థము

ప్రపంచపరిణామమందు పురుషార్థము పరమార్థము. పురుషార్థమునకు సంకల్పము సాధనము: పురుషార్థసాధనములైన విశ్వ విలాసములు సంకల్పప్రభావములు. సంకల్పశక్తి శాంతశివసుందర విలాసముల నుపాసకుల ననుగ్రహించుచున్నది. సంకల్పము శక్తిపరిణామమును, శక్తి భాషాపరిణామమును, భాష రసపరిణామమును, రస మనురాగపరిణామమును, అనురాగము సౌందర్యపరిణామమును, సౌందర్యము కావ్యకళాపరిణామమును పొందుచు, పురుషార్థమునకు సాధనముగ నున్నది. సౌందర్యము వాగర్థజ్ఞేయమైన శక్తి, భావార్థయోగము. కావ్యమునకు శక్తివిలాసములైన భావార్థములు భావరూపములు, దేహాత్మలు. భావగుణరూపానుభూతుల వైభవవిలాస వైచిత్ర్యములు యోగశాస్త్రకళాకావ్యములు. కావ్యరసానందమునకు యోగ శాస్త్ర కళాకావ్యము లన్యోన్యాశ్రయములైన విధమునకు హృద్యకావ్యమైన సౌందర్యమంజరి నిదర్శనము. కావ్యకళారచనయందు రూప సౌందర్యరసానందము సామాన్యము; భావసౌందర్య రసానంద మసామాన్యము. ద్వివిధరసానందముల సంయోగము పురుషార్థము. సౌందర్యమంజరి సామాన్యాసామాన్యములైన రూపానుభవముల యోగమున శృంగారప్రేమగానమును మనోహరముగఁ జేయుచున్నది. గోపాలరాయకవి గారి భావకావ్యరచనాదక్షత్వము కావ్యమునందు సర్వత్ర ప్రత్యక్షమగుచు, కావ్యమిమాంసకు పాత్రముగ నున్నది. ఆంధ్ర సారస్వతపరిషత్తు గోపాలరాయకవి గారి భావకావ్యరచనాదక్షత్వమున కొసంగిన "కవిశేఖర" బిరుదము, కృతి పతి శ్రీ విక్రమదేవవర్మ గారి ధన్యవాదములను బడసి, సార్థకమైనది.

ఈభావకావ్యమునకు పరిచయవాక్యములను వ్రాయుటకైన సంస్కారము పాండిత్యము వాసనలు లేకపోయినను, సాహసించినందులకు గుణగ్రహణపరాయణులు మన్నింతురు గాత!

రసహృదయోపాసకులైన ఆంధ్రసాహిత్యోపాసకులు సౌందర్య మంజరికి స్వాగతంబు నొసంగి ఆదరింతురుగాత! శృంగారరసవిలాస చతురమైన సౌందర్యమంజరికి జనకుఁడు గోపాలరావుగారు విద్వత్కవీంద్రుఁడు: వరుఁడు విక్రమదేవవర్మమహారాజా విద్వత్కవీశ్వరవిభుఁడు. కృతికర్తృకృతిపతులు, తరుణభావోపాసకసాధకులు. పరమేశ్వరానుగ్రహమును ఆంధ్రసాహిత్య లోకాదరణమును ఉభయులును బడయుదురుగాత!

[సౌందర్యమంజరి - కావ్యపరిచయము : 1934]

హకారములో సంత మొందుచున్నది. అకారమునుండి హకారము వఱకును గల అక్షరములు శబ్దములను, పదములను, ప్రత్యయములను, పదార్థములను సమకూర్చుచున్నవి. అహమ్ శబ్దము ఆద్యంత వర్ణమాలాంతర్గతమైన సకల ప్రపంచమును నిరూపించుటకు సాధనముగ నున్నది. ఆదివర్ణమైన అకారమునకును, అంత్యవర్ణమైన హకారమునకును నడుమ గల వర్ణసముదాయము విద్యలకును, మంత్రములకును కళలకును మూలాధారమై సకల పదార్థములకు చిహ్నముగ నున్నది. అహమ్ శబ్దము పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ రూపమైన సకల ప్రపంచమును వ్యక్తము చేయునట్లు హిందూ విజ్ఞానము మంత్రతంత్ర శాస్త్రరూపమున నిరూపించుచున్నది.

అకారము శివస్వరూపము, నిర్గుణము; హకారము శక్తిస్వరూపము, సగుణము. నిర్గుణ సగుణస్వరూపమును శివశక్తి స్వరూపమును నైన అహంకారము కామకళాస్వరూపమున జగద్రూపముగ పరిణమించుచున్నది. మహత్తత్త్వము చంద్రసూర్యవహ్ని బిందురూపమై వెలయుచున్నది. త్రిగుణాత్మకము లైన చంద్ర సూర్యవహ్ని బీజములు ప్రకాశ విమర్శ మిశ్రబిందువులై పురుష ప్రకృతి సంయోగరూపమైన హంసః రూపమును దాల్చుచున్నవి. హంసః వర్ణములు కామకళాత్మకమైన త్రికోణరూపమునందు వ్యక్తము లగుచున్నవి. కామకళారూపమైన త్రికోణశీర్షమునందు హకారమును, మీకోణములందు సకారవిసర్గలును ప్రతిపాదితములు. శబ్దబ్రహ్మము త్రిగుణాత్మకమై స్వత్వాత్మ త్రికోణపీఠాకృతిని ఇచ్ఛా క్రియా జ్ఞానశక్తులను వ్యక్తము చేయుచున్నది.

బిందుసంజాతమైన త్రికోణరేఖలు (అ,క,థ) వర్ణరూపమున వ్యక్తమైన (48) నలువదియెనిమిదివర్ణములచే నిర్మిత మగుచున్నవి. అకారము మొదలు పదునాఱు వర్ణములు (అచ్చులు) ఒకరేఖయును, కకారము మొదలుకొని తకారమువఱకు నొకరేఖయును, థకారము మండిహకారమువఱకు మూడవరేఖయును త్రికోణరేఖలు. పరాశక్తియైన బిందువు నాదబిందుకళారూపమును, సూర్యచంద్రాగ్నిరూపమునను హంసః యోగమున పురుష ప్రకృతిసంయోగమున ప్రపంచ రూపమున వ్యవహరింపఁబడుచున్నది. బ్రహ్మాండభాసురమైన అఖిలామ్నాయము పిండాండమునందును శక్తిరూపమున జీవపరిణామమునందు వినియోగపడుచున్నది. బ్రహ్మాండావృతములైన సప్తలోకములు, సప్తస్వరములు, సప్తచ్ఛాయలు పిండాండమునందు సప్తకమలరూపమున జీవయాత్రకు వినియోగపడుచున్నవి.

చరాచరప్రపంచ మంతయును చైతన్యశక్తిమూలమున జీవయాత్ర చేయుచున్నది. జీవజాలములు శక్తిని స్వాధీనముచేసికొనుటకు చేయుచున్న ప్రయత్నములను ప్రపంచపరిణామము విశదము చేయుచున్నది. వర్తమానకాలమునందు ప్రకృతిశాస్త్రజ్ఞులు వ్యక్తముచేసిన సిద్ధాంతములును, నిర్మాణములును నీపరిణామములనే నిర్ణయించుచున్నవి. జీవశాస్త్రము, భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, గణితశాస్త్రము, వేదాంతశాస్త్రము, మంత్రశాస్త్రము మొదలగు శాస్త్రములు చేసిననిర్ధారణలు ప్రాచీనవైదికవిజ్ఞాన నిర్ణయములను సమర్థించుచున్నవి. వర్తమాన భౌతికశాస్త్ర సిద్ధాంతములు, నిర్మాణనిమర్శనములు ప్రాచీనాధ్యాత్మిక సిద్ధాంతమార్గములను సమర్థింపఁగలవిధమును పరిశోధనలు విశదము చేయుచున్నవి. అదికాలమున భయభ్రాంతులకు మూలములైన ప్రకృతిశక్తులు క్రమముగ వశవర్తినులై మానవధర్మాభ్యుదయమునకు వినియోగపడుచున్నవి.

అఖండమైనశక్తి ఖండరూపములందు సూక్ష్మాతి సూక్ష్మ రూపమునను, బాహ్యాభ్యంతరములం దేకత్రశాతిబద్ధమైనపుడు ప్రపంచస్థితికిని, అప్రశాతిబద్ధ మగునపుడు విలయమునకును సాధనభూతముగ నున్నది. నాదబిందువులు రేఖాకారమునను సూక్ష్మ రూపమునను ప్రపంచీకరణమును జేయుచున్న విధమును చిచ్ఛక్తి విశదము చేయుచున్నది. శ్రీచక్రమును షట్చక్రనిరూపణమును నాదము రూపరేఖావిలాసమున వ్యక్తముగాఁగల విధమును నిరూపించుచున్నవి. చిచ్ఛక్తినుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలమునుండి పృథ్వి, పృథ్వినుండి చరాచర ప్రపంచము కలుగుచున్నది. చిచ్ఛక్తి పృథ్వీతత్త్వమునందు ఆకాశతత్త్వమునందువలె వ్యక్త మగుచున్నను జీవజాలములకు పృథ్వీతత్త్వము గోచరించినట్లు ఆకాశతత్త్వము గోచరము గాకున్నది. సర్వవ్యాపకమైన చిచ్ఛక్తిని అనుభవవేద్యము చేయుటయే సకలయోగములకును సకలశాస్త్రములకును, మంత్రములకును తంత్రములకును, కావ్యములకును కళలకును ప్రయోజనము.

శ్లో. ప్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి.

అవ్యక్తమైన చిచ్ఛక్తిని సువ్యక్తమైన ఉపాధిమూలమున గ్రహించుట పురుషార్థమునకు ప్రయోజనము. అవ్యక్తమైన చిచ్ఛక్తి నాదరూపమున సుశ్రుతోపేతముగ విశ్వస్థితికి ఆధారభూతము. విశ్వవ్యాప్తమైన నాదము కళారూపమున విశ్వస్థితికి వినియోగపడుచున్న విధము 'రేడియో' శక్తి విశదము చేయుచున్నది. కళారూపమైన 'రేడియో' శక్తి శబ్దరూపమునను, శబ్దము అక్షరరూపమునను, అక్షరము పదరూపమునను, పదము అర్థరూపమునను పరిణామమును బొందినవిధము బ్రహ్మాండమునందువలె పిండాండమునందును గ్రాహ్య మగుచున్నది. హిందూవిజ్ఞాన ప్రతిపాదితమైన మంత్ర తంత్ర యోగశాస్త్రములు పిండాండమునందు శ్రీవిద్యారూపమున నీ పరమార్థమును సాధించుటకు వినియోగపడుచున్నవి.

ప్రపంచపరిణామమునందు మానవదేహము బ్రహ్మాండాంతర్గతమైన పిండాండమునకు లక్ష్యము నున్నది. విశ్వవ్యాప్తమైన రేడియోశక్తిని యంత్రసాధనమున శబ్దరూపమున ప్రత్యక్షము చేయఁగలవిధమున బ్రహ్మాండవ్యాప్తమైన చైతన్యశక్తిని మంత్ర రూపమున దేహమునందు ప్రత్యక్షము చేయుట మంత్రశాస్త్రమునకు ప్రయోజనము. మంత్రశాస్త్రము బీజాక్షరరూపమైన చైతన్య శక్తి నావాహనము చేయుచున్నది. అక్షరమునందు మంత్ర బీజాక్షరములు ప్రపంచసాధనములైన ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులకు సంచలనము గలుగఁజేయుచు సాధకుల సంకల్పముల కావరణ విక్షేపశక్తుల గలుగఁజేయుచున్నవి. మంత్రబీజాక్షరములు బీజ, శక్తి, కీలకరూపమున సంకల్పిత దేవతావాహనమును సాధకుని దేహమునందు జేయుచు బ్రహ్మాండశక్తులను పిండాండమునందు ప్రజ్వలింప జేయుచున్నవి. మంత్ర శాస్త్రమునందు పురుషవిద్య,

శ్రీవిద్య, కామవిద్య, ఘోరవిద్యాదుల ఉపాసన సాధ్యము. పురుషార్థమునందు ప్రధానమైన మోక్షమునకు సాధనభూతము కాని మంత్రోపాసనము ఇతర యోగవిద్యాభ్యాసమువలెనే పరిత్యాజ్యము. పురుషార్థములకు సాధనములైన అర్థకామములును ధర్మావిరుద్ధములు గాకుండుట మంత్రోపాసనమునకును యోగవిద్యాభ్యాసమునకు వలెనే పరమార్థము. మంత్రశాస్త్రమందు ధర్మయుక్తమైన అర్థకామసిద్ధికి కామేశ్వరీ రాజరాజేశ్వరీ త్రిపురసుందరీ దేవీపరమైన శ్రీవిద్యోపాసన సాధనముగ నిగమాగమములు నిరూపించుచున్నవి. శ్రీవిద్యోపాసనాంతర్గతమైన కుండలినీ యోగము మంత్రసిద్ధికిని అష్టసిద్ధులకును మోక్షమునకును సాధనముగాగల విధమును షట్చక్రనిరూపణము విశదము చేయుచున్నది.

కుండలినీయోగము:— 'పరా వాఙ్మూలచక్రస్థా పశ్యంతీ నాభి సంస్థితా, హృదిస్థా మధ్యమా జ్ఞేయా వైఖరీ కంఠదేశగా'. చైతన్యశక్తి బ్రహ్మాండాంతర్గతమైన పిండాండమునకు అవాహనగాగల విధమును కుండలినీయోగము విశదము చేయుచున్నది. చైతన్యశక్తి హంసః సః రూపమున ఉచ్ఛ్వాస, నిశ్వాసములను గలుగజేయుచు పిండాండములందు శివశక్తుల సంయోగమును గలుగజేయుచున్నది. బ్రహ్మాండమునందు మాయాశక్తి నివారి పిండాండమునందు మనశ్శక్తిని స్వాధీనము చేయుగలవిధమును కుండలినీయోగము విశదము చేయుచున్నది. బ్రహ్మాండమునందు నాద బిందు కళా పరిణామములైన వర్ణమాలాక్షరములు దేహమునందు వర్ణమాలాక్షర శక్తులరూపమున నంతర్వ్యాప్తములైయున్నవి. బ్రహ్మాండాంతర్గతములైన భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము పరమైన శక్తులు పిండాండమునందు దేహమునందును అక్షరరూపమున నంతర్గతములై సప్తకములరూపమున ప్రతిష్ఠితములైయున్నవి. శబ్దయోగశక్తి అంతర్ముఖమున పరిస్ఫుటమగువిధమున, కుండలినీశక్తి కుండలిని ప్రబోధమున పరిస్ఫుటమగువిధమును కుండలినీయోగము బోధించుచున్నది.

పరానపుడా దేహము కాకను దేహాధిష్ఠితమైన దేహి. మానవశరీరము విచిత్ర నిర్మాణము. జీవశాస్త్రము, జంతుశాస్త్రము, శారీరక శాస్త్రము, భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, జీవవికాసమునకు దేహాంగవికాసము వినియోగపడిన విధమును విశదము చేయుచున్నవి. చైతన్యశక్తి భౌతిక స్వరూపమునందు స్వయంప్రకాశమును, స్వయంవ్యక్తిత్వమును వెడయగల విధమునకు మానవ దేహాంగములు ప్రమాణములు. స్థూల సూక్ష్మ కారణదేహములందు స్థాపితమైన చిచ్ఛక్తి స్వయం ప్రకాశమానమైనను త్రిపురావరణ బద్ధమై అప్రత్యక్షముగనున్నది. మానవ దేహములందును, సకల పిండాండములందును బ్రహ్మాండమునందువలె చిచ్ఛక్తి పూర్ణవ్యాపకమును గలిగియున్నది. పిండాండములందు పూర్ణవ్యాపకమును గలిగినను అప్రత్యక్షముగనున్న చిచ్ఛక్తిని స్వాధీనము చేసుకొనుట శ్రీవిద్యకును, తదంగమైన కుండలినీయోగమునకును ప్రయోజనము.

కుండలినీశక్తి:—బ్రహ్మాండి దేహమునందు బ్రహ్మరంధ్రము మొదలు ముడ్డిపూస (Coccyx) వఱకును వ్యాపించియున్నది. సుషుమ్నానాడి బ్రహ్మదండినడుమగ బిసతంతురూపమున వ్యాపించియున్నది. ఇడాపింగళానాడులు, చంద్రసూర్యనాడులు మూలాధారస్థానమునుండి వెలువడి భ్రూమధ్యస్థానమునందు సుషుమ్నానాడితో సంయోగమును పొందుచున్నవి. సుషుమ్నానాడి శుద్ధచిచ్ఛక్తికిని, ఇడాపింగళలు చంద్రసూర్యశక్తులకును చిహ్నములు. ఇడ సుషుమ్నకు ఎడమభాగమునందును పింగళ కుడిభాగమునందును మూలాధారస్థానమునుండి బయలుదేరి చక్రస్థానములందు సుషుమ్నను కలసికొనుచు ఆజ్ఞాస్థానమునందు సుషుమ్నతో సంయోగమును పొందుచున్నవి. ఇడాపింగళానాడులు సుషుమ్నానాడికి ఎడను కుడి వైపులనుండి ప్రదక్షిణముచేయుచు చక్రస్థానములందు కలసికొనుచున్నవి. ఈ కూటస్థానములు, చక్రస్థానములు, గ్రంథిస్థానములు. స్థూలదేహమునందు గ్రంథిస్థానములందు దేహమునందు వ్యాపకమైయున్న ఇడాపింగళల సంయోగస్థానములు శక్తిస్థానములై బ్రహ్మాండమునందలి శక్తుల నాకర్షించుచున్నవి. బాహ్యాభ్యంతర శక్తులు చక్రస్థానములందు యోగయుక్తములై పంచప్రాణవాహినులను దేహమునందు ప్రసరింపజేయుచు జీవయాత్రకు వినియోగపడుచున్నవి. ఇడాపింగళానాడులు మూలాధారమునుండి ఆజ్ఞాస్థానమువఱకును చక్రభ్రమణము విధమునను (Spiral) సుషుమ్నకు ప్రదక్షిణము చేయుచు చక్రస్థానములందు కలసికొనుచు నారోహణావరోహణములను చేయుచు ప్రాణప్రవాహమును క్షేత్రమునందు ప్రవహింపజేయుచున్నవి. నాగబంధమువిధమున ఇడా, పింగళా, సుషుమ్నానాడులు సామాన్యముగ ప్రకృతి సిద్ధముగను స్వయముగను ప్రాణప్రవాహమును ప్రవహింపజేయుచున్నను, యోగధారణము ప్రాణప్రవాహమును స్వాధీనము చేసికొని దేహద్వారములందును, దేహగ్రంథులందును 72,000 నాడులందును ప్రాణశక్తులను యోగిసంకల్పానురూపముగ ప్రవహింపజేయుచున్నది. సకల పదార్థములందును పూర్ణ చైతన్య మేకముఖమున వ్యాపకమైయున్నను భూతపంచీకరణమునందు స్థూలస్వరూపములం దాకాశతత్త్వము క్షీణించుటయును, పృథ్వీతత్త్వము ప్రబలుటయును సంభవించుచున్నది. పంచభూతములను ననులోమ విలోమమార్గమున ప్రపంచీకరణమును బడయుచున్న విధమును భూతములయుత్పత్తి స్థితిలయములను పంచీకరణమార్గమును తెలుపుచున్నవి. సృష్టిపరిణామమునం దాకాశపరమాణువు పృథ్వీపరమాణువుగ పరిణమించుచు క్షేత్రజ్ఞున కనంతములైన క్షేత్రములు కల్పింపబడుచున్నవి. ఆకాశపరమాణువునందు పరిపూర్ణముగ వ్యాప్తమైయున్న చైతన్యశక్తి పృథ్వీపరమాణువునందు విక్షేపావరణములందు స్తంభించి ప్రక్షిప్తమగుచున్నది. పృథ్వీజలతేజోవాయుతత్త్వములం దంతర్గతమైయున్న చైతన్యశక్తిని ప్రజ్వలింపజేసి పరమార్థమును బడయుటయే ఇతరయోగములకువలె కుండలినీయోగమునకును పరమార్థము. చంద్రసూర్యనాడులు చక్రభ్రమణవిధమున గ్రంథిస్థానములందు కలసికొనుచున్న విధ



చిత్రము 1




2 3

చిత్రము, 3 : స్వాధిష్ఠానము
లింగస్థానము : అప్తత్త్వము

పైను 1 వ చిత్రపటమునందలి మూడు చిత్రములు తెలుపుచున్నవి. విషయధ్యానము బాహ్యసాధనములపైనాద ఆత్మశక్తులను లగ్నము చేయుచు ఆత్మవికాసమును దుర్లభము చేయుచున్నది.

కుండలినీశక్తి—సప్తకమలములు:—1. మూలాధారము, 2. స్వాధిష్ఠానము, 3. మణిపూరకము, 4. అనాహతము, 5 విశుద్ధము, 6. ఆజ్ఞాస్థానము, 7. సహస్రారము—సప్తకమలములు. ఆగమశాస్త్రము ఈ సప్తకమలములను విశేషముగ వర్ణించుచున్నవి. సనకుఁడు, సనందనుడు, సనత్కుమారుఁడు, వసిష్ఠుఁడు, శంకరుఁడు, అప్పయ్య దీక్షితులు మొదలగు ఆగమశాస్త్రజ్ఞులు కుండలినీయోగమును వర్ణించిరి. ఆగమములకు సన్నిహిత సంబంధముగల మంత్ర యంత్ర తంత్రశాస్త్రములును నీయోగమునకు ప్రాముఖ్యము నొసంగుచున్నవి. ఆగమశాస్త్రములకు ప్రధానమైన శ్రీవిద్యకు కుండలినీయోగము హృదయముగ నున్నది.



1 2

చిత్రము, 2 : మూలాధారము
గుదస్థానము : పృథ్వీతత్త్వము




3 4

చిత్రము, 4 : మణిపూరకము
నాభిస్థానము : తేజస్తత్త్వము



4 చిత్రము, 5 : అనాహతము 5

హృదయస్థానము : వాయుతత్త్వము



6 7

చిత్రము, 7 :

ఆజ్ఞాచక్రము

భ్రూమధ్యస్థానము :

మనస్తత్త్వము



5 చిత్రము, 6 : విశుద్ధము 6

కంఠస్థానము : ఆకాశతత్త్వము



7 8

చిత్రము, 8 : సహస్రారము

శిరస్సు : ఆత్మస్థానము



శ్రీ చక్రము

శ్లో. చతుర్భిః శ్రీకంఠైః శివయువతిభిః పఞ్చభి రపి
ప్రభిన్నాభి శ్శంభో ర్నవభి రపి మూలప్రకృతిభిః,
చతుశ్చత్వారింశ ద్వసుదళకలా శ్రత్రివలయ
త్రిరేఖాభి స్సార్ధం తవ శరణకోణాః పరిణతాః.
— సౌందర్యలహరి.

తా. తల్లీ! నలువురు రుద్రులచేతను, శివునికంటె వేఱయిన యేవురు శివశక్తులచేతను, తొమ్మిది మూలప్రకృతుంచేతను, అష్టదళ, షోడశదళ, త్రివలయరేఖలచేతను నీకు నిలయమయిన శ్రీచక్రము నలువదినాలు గంచులు గలది. శ్రీచక్రము త్రికోణాష్టకోణ దశకోణద్వయ చతుర్దశకోణము లనియెడు నయిదు శక్తిచక్రములచేతను, బిందువు, అష్టదళము, షోడశదళము, చతురశ్రము అను నాలుగు శివచక్రములతోడను గూడి నవచక్రాత్మక మయి శివశక్త్యుభయరూపముగా వెలయుచుండును.

శ్లో. సమున్మీలత్సంవిత్కమలమకరన్దైకరసికం
భజే హంసద్వన్ద్వం కిమపి మహతాం మానసచరమ్,
యదాలాపా దష్టాదశ గుణిత విద్యా పరిణతి
ర్య దాదత్తే దోషా ద్గుణ మఖిలమ ద్భ్యః పయ ఇవ.
—సౌందర్యలహరి.

తా. తల్లీ! ఏమిథునము పలికినపలుకు లన్నియు నష్టాదశ విద్యలుగా మాఱుచున్నవో, ఏజంట దోషములనుండి గుణమును నీటినుండి పాలనువలె గ్రహించునో, వికసించినజ్ఞాన మనెడి కమలమందలి మకరందమును గ్రోలి మైమఱచియున్న యోగుల హృదయ మను మానససరస్సున నున్న యనిర్వాచ్యమహిమగల శివశివాత్మక మనెడు హంసమిథునమును నే సేవింతును.

మానవ శరీరమునం దూర్ధ్వకాయము ప్రాణ ప్రవాహమున కాధారభూతముగ నున్నది. బ్రహ్మరంధ్రమందలి సుషుమ్నానాడి ప్రాణరక్షణమునకును ప్రాణపోషణమునకును మూలాధారముగనున్నది. శరీరమునందలి గ్రంథి మర్మస్థానములందు ప్రాణప్రవాహము యథోచితముగ జరగునప్పు డాయురారోగ్యములు సహజ మార్గమున నడచుచుండును. నరముల శక్తియును నాడులశక్తియును ప్రాణప్రవాహముమీఁద నాధారపడియున్నది. ప్రాణప్రవాహమున కభ్యంతరము గలుగునపు డభ్యంతరములను తొలంగించుటకు యోగము సాధనముగా నున్నది. పై పటమునందలి కమలస్థానములును, మర్మస్థానములును సాధకులకు ప్రాణప్రవాహమును జేయుట కభ్యాసముచేయుట కుపకరింపఁగలవు.

బ్రహ్మాండమునందు పరిపూర్ణమును నేకమునునైన చిచ్ఛక్తి క్షేత్రమునందు (పిండాండమునందు) ఖండమును భిన్నమునునైన చిచ్ఛక్తి పూర్ణప్రయోజనములను సమకూర్చుటకు పూర్ణత్వమును బొందవలసియున్నది. మహాశక్తి ఉపాసకులకు వారి సంకల్పమునకును, నుపాసనమునకును ననురూపమైన ఫలమును గలుగఁజేయుచున్నది. భగవద్గీతయును నీయర్థమునే బోధించుచున్నది.

శ్లో. యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః.

పురుషార్థము:— హిందూమత ధర్మసిద్ధాంతములకు ధర్మార్థ కామ మోక్షరూపములైన చతుర్విధ పురుషార్థములందును మోక్షము పరమార్థము. ఇతర యోగములవలె కుండలినీయోగపరమైన లయయోగమును నీ పరమార్థమునకు వినియోగపడుచున్నది. సృష్టి పరిణామమునందు చిచ్ఛక్తి ఆకాశతత్త్వమునుండి వాయుతత్త్వమునందును, వాయుతత్త్వమునుండి అగ్నితత్త్వమునందును, అగ్నితత్త్వమునుండి అప్తత్త్వమునందును, అప్తత్త్వమునుండి పృథ్వీతత్త్వమునందును నధోమార్గమునను వైఖరీరూపమునను వికారమును పొందుచున్నది. అధోగతిని సవికారముగ నున్న చిచ్ఛక్తికి ఊర్ధ్వగతిని నిర్వికారత్వమును సమకూర్చుటయోగము. లయయోగము పృథివ్యప్తేజోవాయుతత్త్వములను క్రమముగ ఆకాశతత్త్వమునందు లయము చేయుచు చిచ్ఛక్తిని ప్రజ్వలింపఁజేయుచున్నది. పృథ్వీతత్త్వమునందు పరిమితమై ప్రక్షిప్తముగ నున్న చిచ్ఛక్తి ఆకాశతత్త్వ యోగమువలన నపరిమిత మగుచున్నది. చిచ్ఛక్తి ఊర్ధ్వగమనమునందు మూఁతపడియున్న ద్వారములను తెఱచుచు శక్తిప్రవాహమున కాటంకములను తొలఁగించుచున్నది. తేజస్సు కట్టెలమంటయందును, మట్టినూనెదీపమునందును, విద్యుత్తునందును, రేడియమునందును ప్రకాశమానమైయున్నను జడపదార్థములందు కంటె నిర్మల స్వచ్ఛపదార్థములందు (Transparent) విశుద్ధముగను, వ్యాప్తముగను, ప్రబలముగను, సుందరముగను గోచర మగుచున్నది. ఊదాకిరణములు, రేడియముకిరణములు కాంతిప్రభావమును విశదము చేయుచున్నవి. రేడియోయంత్రములు విశ్వవ్యాపకమైన నాదప్రభావమును తెలుపుచున్నవి. దూరశ్రవణ, దూరదర్శనయంత్రములు

నాదకాంతుల సర్వవ్యాపకత్వమును వెల్లడిచేయుచున్నవి. మానవ దేహాంతస్థములైన సప్త కమలస్థానములును విశ్వవ్యాప్తములైన శక్తిస్థానములుగ నున్నవి. ఆ స్థానములందు సహస్రారస్థానము—సకల ప్రపంచమునకును నాలయము—వర్ణనాతీతము. సహస్రారప్రభావము శబ్దగ్రహణ, రూపగ్రహణ, దూరదర్శన, దూరశ్రవణ, నాదశ్రవణ దర్శన యంత్రాదుల కతీతమైన సూక్ష్మాతిసూక్ష్మమైన శక్త్యాలయము. ఆత్మనాదానుసంధానము వైఖరీ, మధ్యమా, పశ్యన్తీ శక్తులకు మూలమైన పరాశక్తిని సహస్రారమునందు సాక్షాత్కారము చేయుచు బ్రహ్మానందమును గలుగజేయుచున్నది.



7. బ్రహ్మరంధ్రస్థానము. 6. ఆజ్ఞాచక్రస్థానము. 5. విశుద్ధచక్రస్థానము. 4. అనాహతచక్రస్థానము. 3. మణిపూరక చక్రస్థానము. 2. స్వాధిష్ఠాన చక్రస్థానము. 1. మూలాధార చక్రస్థానము. క. వస్తి గ్రంథి. ద. బ్రహ్మదండి చివరభాగము. చ. మహాప్రాచీర. ట. హృదయగ్రంథి. త. శ్వాసకోశ గ్రంథి. వ. కంఠగ్రంథి. గ. భ్రూమధ్య స్థానము. జ. సుషుమ్న. డ. బ్రహ్మదండి.

విద్యుచ్ఛక్తి యంత్రాలయము శక్తిభరితమై యున్నను తంతులతో నియతరీతిని ననుసంధానము గలుగునపుడే విద్యుచ్ఛక్తి వ్యాపించి నియతకార్యములు నిర్వర్తింపఁబడుచున్నవి. విశ్వవ్యాపకమైన చిచ్ఛక్తి నాత్మానుసంధానము చేయుటవలన సర్వత్ర వ్యాపించి పురుషార్థము సిద్ధించుచున్నది. బ్రాహ్మీస్థితి బ్రహ్మరంధ్రముఖమున చిచ్ఛక్తి నాత్మానుసంధానము చేయుచున్నది. పురుషార్థసిద్ధి కర్థకామములు సామాన్యముగ ప్రతిబంధకములుగ నున్నవి. పురుషార్థమునం దర్థకామారాధనము సాధకుని లక్ష్యము నాత్మేతరమునందు లగ్నముచేయుచు పతనమునకు మూలమగుచున్నది. ధర్మావిరుద్ధమైన యర్థకామారాధనము ప్రకృతిసిద్ధమై పురుషార్థసిద్ధికి ప్రతిబంధము గాదు. ధర్మవిరుద్ధమైన యర్థకామారాధనము ప్రకృతి విరుద్ధమై పురుషార్థసిద్ధికి ప్రతిబంధకముగ నున్నది. మానవులకు పురుషార్థసిద్ధి కఖండమైన యభ్యంతరసాధనము సిద్ధముగ నున్నను వారిలక్ష్యము ఖండములైన బాహ్యసాధనములందు లగ్నమగుచు ధర్మానుసంధానము దుర్లభమగుచున్నది. కుండలినీయోగము బాహ్యాచారసాధనములందు లగ్నమైనపుడు వామాచారములు సంభవించుచున్నవి. సమయాచారులైన కుండలినీయోగోపాసకులు త్రిపురసుందరి నాత్మానుసంధానము చేయుచు మూలాధారమునందు కుమారిని, అనాహతమునందు యోషిని, సహస్రారమునందు పతివ్రతను నావాహనము చేయుచు శుద్ధ సత్త్వోద్యోగసంజాతమైన బ్రహ్మానందమును బొందుచున్నారు. కౌలాచారులైన శాక్తేయులు, కాపాలికులు వామాచారులై రూపానుసంధానమునందు స్థూలప్రపంచమునం దజ్ఞానసంజాతమైన విషయానందము ననుభవించుచు కుండలినీయోగమునకు ఫలములైన కామాఖ్య బైందవశక్తుల కపార్థములను గల్పించి రాక్షస కర్మముల నాచరించుచున్నారు. సహస్రారచక్రమునందు 26—వ తత్త్వముగ విలసిల్లుచున్న బైందవశక్తికిని, మద్యమునకును సంబంధమును గల్పించుట రహస్యసాధనలు గలుగజేసెడి పరమానర్థములకు నిదర్శనము. కన్యాపూజయును, ఇతరవామాచారములును ఆచారపిశాచముల దుష్పరిపాకములు. సప్తకమలముల సామాన్యవివరములను విన్యాసమునందుగల పటములు కోష్ఠము తెలుపుచున్నవి.

| నామము | స్థానము | తత్త్వము | తత్త్వ కాంతులు | దళములు | వర్ణములు | జ్ఞానేంద్రియములు | రంగు | మండలాకారము |
|---|---|---|---|---|---|---|---|---|
| 7. సహస్రారము | శిరస్సు | ఆత్మ | అనంతము | 1000 | 1000 | | | |
| 6. ఆజ్ఞాచక్రము | భ్రూమధ్యము | మనస్సు | 64 | 2 | హం, క్షం | చిత్తము మనస్సు | | బిందువు |
| 5. విశుద్ధము | కంఠము | ఆకాశము | 72 | 16 | అచ్చులు (16) | వికసనము శ్రవణము శ్రోత్రము | తెలుపు | చక్రము |
| 4. అనాహతము | హృదయము | వాయువు | 54 | 12 | క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ ఞ,ట,ఠ, | సంచలనము స్పర్శము త్వక్కు | ధూమము | షట్కోణము |
| 3. మణిపూరము | నాభి | అగ్ని | 52 | 10 | డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ | వ్యాపనము రూపము చక్షువు | ఎరుపు | త్రికోణము |
| 2. స్వాధిష్ఠానము | లింగస్థానము | అప్పు | 62 | 6 | బ, భ, మ, య, ర, ల | సంకోచనము రుచి జిహ్వ | తెలుపు | అర్ధచంద్రము |
| 1. మూలాధారము | గుదస్థానము | భూమి | 56 | 4 | వ, శ, ష, స | సంయోగము గంధము ఘ్రాణేంద్రియము | పసుపు | చతుష్కోణము |

మూలాధారాది కమలములకు సంబంధించిన సామాన్య విషయ గ్రహణము కలుగుటకై సప్తకమలముల చిత్రములును నిందు ప్రచురింపబడినవి. అనాహతచక్రస్వరూప స్వభావములు విచట సవిస్తరముగా దెలుపబడినవి. కుండలినీయోగచిత్రపటమును (9—వ చిత్రము), అనాహతచక్రపటమును (10—వ చిత్రము) సప్తకమలములను ఆగమశాస్త్రానుసారముగ వివరించుచున్నవి.

అనాహతము :— హృదయస్థానము. బన్ధూకపుష్పకాంతివలె ప్రకాశమానము ; క, ఖ,గ,ఘ,ఙ ; చ,ఛ,జ,ఝ,ఞ ; ట,ఠ అనెడి ద్వాదశవర్ణయుక్తమైన ద్వాదశదళయుక్తము ; షట్కోణాకారము, వాయుమండలము, ధూమాభముగల కర్ణికాయుతము ; కర్ణికోపరి భాగమున సూర్యమండలయుతము ; కర్ణికామధ్యమున విద్యుత్కోటి విభభాసమానత్రికోణము. దాని కూర్ధ్వమున కృష్ణసారాధిరూఢమును, ధూమధూసరాభమును, చతుర్భుజమును, అంకుశహస్తమును నైన వాయుబీజము ; దాని(క్రోడమున) సమీపమున ద్విభుజుడును, వరాభయ కరుడును, త్రినేత్రుడును. హంసవర్ణుడైన ఈశ్వరుడు. ఈ కర్ణికయందు రక్తపద్మముమీదను పీతవర్ణయును, చతుర్భుజయును, పాశకపాలవరాభయకరయును, పీతవస్త్రయును, సర్వాలంకరణాన్వితయును, సుధార్ద్రహృదయయును, కఙ్కాలమాలాధరయును నైన కాకిని శక్తియు ; మధ్యత్రికోణమునందు అర్ధచంద్రబిందురూపమస్తకుడును, స్వర్ణవర్ణుడును, కామోద్గమోల్లసితుడును నైన బాణలింగశివుడు ; దాని క్రిందను స్థిరతరదీపకలికాకార హంసరూపియైన జీవాత్మయు, ఈకర్ణిక క్రిందను రక్తవర్ణమును, ఊర్ధ్వముఖమును గల అష్టదళపద్మమును ; ఇయ్యది కల్పవృక్ష రత్నవేదీచన్ద్రాతపపతాకాద్యలంకృతమైన మానసపూజాస్థానము.కమలస్థానములందు అక్షమాలాధారమునను పరమాత్మస్వరూపమును పొందగల విధమును అనాహతపూజావిధాన ముదాహరింపబడినది.

సుషుమ్నానాడీమార్గేణ అనాహత చక్రస్థిత పార్వతీసహిత శివాయ నమః. అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్య యో ధ్వనిః, ధ్వనే రంతర్గతం జ్యోతి ర్జ్యోతిరంతర్గతం మనః, తన్మనో విలయం యాతి తద్విష్ణోః పరమం పదమ్, కం నమః— హంసశ్శివ స్సోహం

| బీజము వాహనము | దేవత వాహనము | ధాతు శక్తి | లింగ యోని | ఇతర తత్త్వ సంయోగము | గ్రంథులు | లోకములు | గుణము | అధిష్ఠాన శక్తి |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | సత్యలోకము | సత్త్వము | చంద్రుడు |
| ఓమ్ | శంభువు | హాకిని | ఇతర త్రికోణము | మహత్తు సూక్ష్మప్రకృతి హిరణ్యగర్భుడు | రుద్రగ్రంథి | తపోలోకము | సత్త్వము | చంద్రుడు |
| హం: శ్వేతగజము | సదాశివుడు | శాకిని | త్రికోణము | శబ్ద తన్మాత్ర శ్రోత్రేంద్రియము వాగింద్రియము | | జనలోకము | రజస్సు | రవి |
| యం; కృష్ణమృగము | ఈశుడు | కాకిని | బాణ త్రికోణము | స్పర్శతన్మాత్ర త్వగింద్రియము గుహ్యకర్మేంద్రియము | విష్ణుగ్రంథి | మహర్లోకము | రజస్సు | రవి |
| రం; మేషము | వృషభ వాహన రుద్రుడు | లాకిని | త్రికోణము | రూపతన్మాత్ర చక్షురింద్రియము గుదకర్మేంద్రియము | | స్వర్లోకము | తమస్సు | అగ్ని |
| వం; మకరము | గరుడవాహన విష్ణువు | రాకిణి | లింగ త్రికోణము | రసతన్మాత్ర జిహ్వేంద్రియము హస్తకర్మేంద్రియము | బ్రహ్మగ్రంథి | భువర్లోకము | తమస్సు | అగ్ని |
| లం; ఐరావతము | హంసవాహన బ్రహ్మ | డాకిని | స్వయంభువు త్రికోణము | గంధతన్మాత్ర ఘ్రాణేంద్రియము పాదకర్మేంద్రియము | | భూలోకము | తమస్సు | అగ్ని |

హంసః. ఖం నమః— హంస శ్శివ స్సోహం హంసః. గం నమః— హంస శ్శివ స్సోహం హంసః. ఘం నమః —హంస శ్శివ స్సోహం హంసః. ఙం నమః—హంస శ్శివ స్సోహం హంసః. చం నమః— హంస శ్శివ స్సోహం హంసః. ఛం నమః — హంస శ్శివ స్సోహం హంసః. జం నమః— హంస శ్శివ స్సోహం హంసః. ఝం నమః—హంస శ్శివ స్సోహం హంసః. ఞం నమః— హంస శ్శివ స్సోహం హంసః. టం నమః—హంస శ్శివ స్సోహం హంసః. ఠం నమః—హంస శ్శివ స్సోహం హంసః. ద్వాదశదళసహిత అనాహత చక్రస్థిత పార్వతీసహిత శివాయ నమః.

అనాహత చక్రము సప్తకమలములందును మధ్యస్థానమునం దుండుటవలన కుండలినీశక్తి ప్రబోధమునకు విశేషోపయోగముగ నున్నది. అనాహతమునకు క్రిందను మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక చక్రములును, పైని విశుద్ధ, ఆజ్ఞా, సహస్రార చక్రములును గలవు. హృదయస్థానము జీవాత్మస్థానము. జీవాత్మ ప్రాణశక్తులను భూలోకవిషయ వాసనలకు వినియోగించునది యును, సత్యలోకారోహణమునకు వినియోగించునదియును అనాహత శక్తి నిర్ణయింపగలదు. అనాహతమునకువలె నితరచక్రములకును దళములు వర్ణములు గల్పింపబడినవి. పటము 9యందు పోష్టము నందు వివరములు చూడనగును.

దళములు:— దళములు చక్రస్థానములందు వ్యక్తమగుచుండెడి శక్తులకు నిదర్శనము లైయుండును. మూలాధారము 4 దళము లను, సహస్రారము 1,000 దళములను గలిగియున్నవి. అనాహత మునకు దళములు 12.

వర్ణములు:— సృష్టియందు నాదము శబ్దముగను, శబ్దము రూపముగను పరిణామమును బొందుచున్నది. అవ్యక్తమైన నాదము వ్యక్తమై ధ్వనిశబ్దరూపములను దాల్చునపుడు వర్ణోచ్చారణ



మంగములందు సంచలనమును గలుగఁజేయుచున్నది. మూలాధారము వ శ ష స వర్ణములను, అనాహతము క నుండి ఠ వఱకుఁగల వర్ణములను గలిగియున్నవి. సహస్రారము 20× 50=1,000 వర్ణములను గలిగియున్నది. వర్ణోచ్చారణము సంచలింపఁ జేయఁగల శక్తులను వర్ణములు నిర్ణయించుచుండును. అక్షమాలను అం నుండి క్షం వఱకును అనులోమ విలోమమార్గమున నుచ్చరించుట చిత్తవృత్తినిరోధమునకు సాధనముగ నుండును. అక్షమాలాజప మజపాక్షరానుభవమునకు సాధనముగ నున్నది.

మండలములు:— రూపకల్పనయందు రేఖలు ప్రముఖములు. రేఖావికాసవిన్యాసములు రూపవికాస పరిణామములకు ప్రమాణములు. కమల మండలములు పంచభూతశక్తి స్వరూపములను మండలకోణాకృతులను నవగతము చేయుచున్నవి. పృథ్వీతత్త్వము చతుష్కోణము ; అప్తత్త్వము బాలచంద్రాకారము ; తేజస్తత్త్వము త్రికోణము ; వాయుతత్త్వము రెండు త్రికోణములు కలసిన షట్కోణము ; ఆకాశతత్త్వము మండలాకారము ; అనాహతము షట్కోణమును వాయుబీజములు గలిగియున్నది. యంత్రములు రేఖావిన్యాసమున బీజాక్షరములను గలిగి శక్తివశీకరణసాధనమును తెలుపుచున్నవి.

వాహనములు:— మూలాధారమునకు ఐరావతము, స్వాధిష్ఠానమునకు మకరము, మణిపూరమునకు మేషము, అనాహతమునకు కృష్ణసారము, విశుద్ధమునకు శ్వేతగజము, ఆజ్ఞాచక్రమునకు ఓంకారమును వాహనములు. కమలస్థానముల గుణస్వభావములకు వాహనములు చిహ్నములు. వాయుబీజస్థానమైన అనాహతమునకు కృష్ణసారము చిహ్నము.

అధిదేవతలు: — మంత్రశాస్త్రమునందు మహర్షులు మంత్రద్రష్టలు; అధిదేవతలు వరదాతలు. మంత్రములు కామితార్థఫలసాధనములు, మోక్షసాధనములు. మంత్రదేవతలు ఫలానురూపముగను ధ్యాన జపావాహనము చేయఁబడుదురు. సూర్యనమస్కారములందు అగ్నిబీజమైన 'రం' వర్ణ ముచ్చరింపఁబడుచున్నది. హ్రాం, హ్రీం, హ్రూం, హ్రైం మొదలగు బీజాక్షరములు పిండాండ బ్రహ్మాండము లందుఁగల తేజశ్శక్తుల కావాహన విసర్జనములను గలుగఁజేయుచున్నవి. అంగన్యాస, కరన్యాసములం దుపయోగించెడి బీజాక్షరములు మంత్రార్థమున కనురూపముగ నుండును. అంగన్యాస, కరన్యాసములు అం, ఈం, ఊం, ఐం, ఔం, అః బీజాక్షరములతోను, రాం, రీం, రూం, రైం, రౌం, రః బీజాక్షరములతోను, హ్రాం, హ్రీం, హ్రూం, హ్రైం, హ్రౌం, హ్రః బీజాక్షరములతోను వివిధముగ నితరబీజాక్షరములతోను మంత్రశక్తి కనురూపముగఁ జేయఁబడుచున్నవి. బీజాక్షరసంయోగము సూక్ష్మస్థూలశక్తుల నావాహనము చేయుటకు సాధనములుగ నున్నవి.

ధ్యానశ్లోకము దేవతాస్వరూపఫలములను వర్ణించుచున్నది. మంత్రద్రష్టలాదికాలమునుండియును క్షుద్రమంత్రములను నిరసించి సౌమ్యమంత్రముల నుపాసించిన విధమును మంత్రశాస్త్రము తెలుపుచున్నది. సకలమంత్రముల బీజాక్షరములును మంత్రములకు శీర్షమైన ఓంకారమునందు లయమును పొందుచున్నవి. శ్రీవిద్యకును పురుషవిద్యకును ప్రణవము ప్రధానము. ఆకాశమునందు సమస్తభూతములును లీనమైనటులు ప్రణవమునందు సకలమంత్రాక్షరములును లీనము లగుచున్నవి. నిత్యకర్మానుష్ఠానమునందు నియత కర్మముగ నిర్ణయింపఁబడిన గాయత్రీ మంత్రము భూతశుద్ధికిని, సాయుజ్యమునకును వినియోగపడుచున్నది. ప్రణవబీజ సాధనమును ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం అని సప్తకమలాంతర్వ్యాప్తమైన కుండలినీశక్తి స్వాధీనమగుటకు గాయత్రీ మంత్రము సులభసాధనముగ నున్నది. నిగమాగమములకు, కళాశాస్త్రములకు, మంత్రతంత్రములకు, సాంఖ్యయోగములకు, పురుష శ్రీవిద్యలకు ప్రయోజనము పురుషార్థము. పురుషార్థమున కాత్మజ్ఞానము సాధనము గాని బాహ్యవిషయోపభోగము సాధనము గాదు. హిందూ

మతశాస్త్ర కళావిజ్ఞానమునందు 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, ఓమిత్యేకాక్షరం శక్తిః' పరమార్థములు.

కుండలినీయోగము సగుణములైన దళములు, వర్ణములు, యంత్రములు, వాహనములు, దేవతలు, బీజాక్షరములు మొదలగు సాధనములద్వారా నిర్గుణమైన పరాశక్తి నారాధింపగల విధమును షట్చక్రకమలముల పరిజ్ఞానము సుగమము చేయుచున్నది.

శ్లో. శివశక్త్యైక్యదా వాసం కురుతే దేవి! సర్వదా,
రోగాదీంశ్చ హరేత్తస్య స్వదేహేన చ సిధ్యతి.

—ఆనందలహరి.

తా. ఓ దేవి! శివశక్తి యెప్పుడు ఎచ్చట వాసము చేయుచున్నదో, అప్పుడా శక్తి వానిరోగాదులను హరించును. అప్పుడా జీవునికి స్వదేహముచేతనే సిద్ధి గలుగును.

శ్లో. అత్రాస్తే శిశుసూర్యసోదరకలా చంద్రస్య యా షోడశీ
శుద్ధా నీరజ సూక్ష్మతంతుశతధాభాగైకరూపా పరా,
విద్యుత్కోటి సమాన కోమలతనూ ర్విద్యోతితాఽధోముఖీ
పూర్ణానన్దపరమ్పరాతివిగళ త్పీయూషధారాధరా.

—షట్చక్రనిరూపణము.

తా. ఈ సహస్రదళపద్మమునందు 'అమ' అను చంద్రుని పదునారవకళ యున్నది. ఆ కళ బాలసూర్యునితో సమానముగా ప్రకాశించునది; ఏ వికారము లేనిది గనుక నిర్మలమైనది. పద్మనాళమునందలి సూక్ష్మమైన దారమును నూఱుభాగములు చేయగా నందలి యొకభాగమువలె సూక్ష్మమైనది. శ్రేష్ఠమైనది లేక, పశ్యన్తీమధ్యమావైఖరీ సమష్టిరూప. కోట్లకొలది మెఱపుతీగల వలె కోమలమయిన యాకృతి గలది. నిత్యప్రకాశమానమైనది. అధోముఖము గలది. పూర్ణానందపరంపరనుండి యధికముగ స్రవించు చుండెడి యమృతధారను ధరించుచున్నది.

శ్లో. ఏతస్యా మధ్యదేశే విలసతి పరమాపూర్వనిర్వాణశక్తిః
కోట్యాదిత్య ప్రకాశా త్రిభువన జననీ కోటిభాగైకరూపా,
కేశాగ్రస్యాతిగుహ్యా నిరవధి విగళ త్ప్రేమధారాధరా సా
సర్వేషాం జీవభూతా మునిమనసి ముదా తత్త్వబోధం వహన్తీ.

తా. ఈ నిర్వాణ కళయొక్క మధ్యప్రదేశమందు శ్రేష్ఠమైనదియు, సృష్టికిముందే అవిర్భవించుటవలన దానికంటె ముందుగ నేమియు లేనిదియును నగు నిర్వాణశక్తి ప్రకాశించుచున్నది. అది కోటి సూర్యుల ప్రకాశమువంటి ప్రకాశము గలది. మూడు లోకములకును తల్లి. ఒక తలవెండ్రుకకొన కోటిభాగములు చేయగా నందొక భాగమునంత ప్రమాణము గలది. మిగుల సూక్ష్మమయినది. పరిమితి లేకుండ స్రవించుచుండెడి ప్రేమధారను ధరించునది; మఱియు నది యెల్లరకు జీవభూత యగుచు మునుల మనస్సు లందు సంతోషముచేతను తత్త్వజ్ఞానమును కలిగించుచుండును.

శ్లో॥ తస్యా మధ్యాన్తరాళే శివపద మమలం శాశ్వతం యోగిగమ్యం
నిత్యానందాభిధానం సకలసుఖమయం శుద్ధబోధస్వరూపమ్,
కేచి ద్బ్రహ్మాభిధానం పద మితి సుధియో వైష్ణవం తల్లపన్తి
కేచి ద్ధంసాఖ్య మేత త్కిమపి సుకృతినో మోక్ష మాత్మప్రబోధమ్॥

తా. ఆ నిర్వాణశక్తియొక్క మధ్యనున్న శూన్యమందు నిర్మలము, శాశ్వతము, యోగులకు జ్ఞానమాత్రగమ్యము నగు శివపద మున్నదని తత్త్వజ్ఞులు చెప్పెదరు. అది నిత్యానంద మను పేరు గలది. శుద్ధమయిన జ్ఞానమే స్వరూపముగాం గలది. ఆ పదమును కొందఱు విద్వాంసులు బ్రహ్మపదమునుగాను, కొందఱు బుద్ధిమంతులు వైష్ణవపదమునుగాను, మఱికొందఱు హంసమను పేరుగల మోక్షస్థానమునుగాను, కొందఱు లనిర్వచనీయమయిన ఆత్మసాక్షాత్కార స్థానమునుగాను చెప్పెదురు.

శ్లో॥. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః.
—గీత. అ, 2.

ఏకమును, పరిపూర్ణమును, జ్యోతిర్మయమును, నిర్గుణమును, సర్వవ్యాపకమును నైన చిచ్ఛక్తి సృష్టిపరిణామమునందు ఖండమును, పరిమితమును, జ్యోతిర్విహీనమును, సగుణమును, కూటస్థమును నగుచు పదార్థకమున కసత్కల్పనను గలుగఁజేయుచున్నది. అఖండమైనశక్తి నవావరణములందు విస్ఫోటావరణ కల్పితములైన ఖండరూపములను గనుపడుచున్నది. చరాచరాత్మక ప్రపంచము అవ్యక్తము, పురుషుఁడు, చంద్రుఁడు, సూర్యుఁడు, ఆకాశము వాయువు, తేజస్సు, జలము, పృథివ్యాది నవావరణము లందు భాసిల్లుచున్నది. శ్రీవిద్య నవావరణములందును సూక్ష్మాతిసూక్ష్మమైన పరాశక్తి స్థూలస్వరూపములందు పరిణామమును బొందుచున్న విధమును స్ఫుటము చేయుచున్నది. శ్రీచక్ర మీభావమును రేఖాబీజాక్షరరూపమునను వ్యక్తము చేయుచున్నది. అవ్యక్తమైన శక్తికి నాద మాదివ్యక్తస్వరూపము. బ్రహ్మాండమయమైన నాదశక్తి రేఖాబీజాక్షరరూపములను పిండాండములందు గోచర మగుచున్న విధమును శాస్త్రములు విశదము చేయుచున్నవి. ఆకాశతత్త్వమునం దపరిమితముగ నున్న నాదశక్తి పృథ్వీతత్త్వమునందు పరిమిత మగుచున్నది. పరిమితమైనశక్తి ఆత్మసాక్షాత్కారమును దుర్లభము చేయుచున్నది. పరిమితమైనశక్తి నపరిమితముచేసి సర్వాత్మత్వమును పరిస్ఫుటము చేయుట సకలయోగములకును పరమార్థము. సకలసాధనములును నీ పరమార్థమునకు వినియోగపడుచున్నవి. శక్తి సృష్టిపరిణామమునందు క్షేత్రధర్మముల కనురూపముగ పరిమితవికాసములను బొందుచున్నది. ఆకాశతత్త్వమునం దనంతకాంతులను గలిగియున్న పరాశక్తి సహస్రారమునందు సహస్రరేఖాకాంతులను, పృథ్వీతత్త్వమునందు పరిమితములైన రేఖాకాంతులను గలిగి పరిమితమైన శక్తిని గలిగియున్నది. పరిమితమైన శక్తిని స్వతస్సిద్ధముగను ప్రక్షిప్తముగ నున్న యపరిమితమైన శక్తినిగ పరిణమింపఁజేయుట సకలయోగ సాధనములకును ప్రయోజనము. ఊర్ధ్వముఖములై వికసితములైన శక్తులు సృష్టిపరిణామమునం దధోముఖములై ముకుళితము లగుచున్న విధమును కుండలినీశక్తి విశదము చేయుచున్నది. అధోముఖములును ముకుళితములును నైన శక్తికమలస్థానము లూర్ధ్వముఖములును వికసితములును నగునపు డనంతమైన శక్తికి సర్వవ్యాపకత్వము గలిగి సకలాభీష్టములును సిద్ధించుచున్నవి. పృథివ్యప్తేజో వాయ్వాకాశ తన్మాత్ర లంతర్లయమును బొందునపు డఖండమైన కుండలినీశక్తి ఆకాశతత్త్వస్థానమైన సహస్రారమునందువలె పృథ్వీతత్త్వస్థానమైన మూలాధారస్థానమునందు సమముగను ప్రజ్వలనమును గలిగియుండి, పృథ్వీబీజమైన లంకార మాకాశబీజమైన హంకారమునందు లయమును బొందును. హృదయస్థమైన జీవాత్మ విషయేంద్రియపరమైన లధోగమనమును విడిచి ఆత్మజ్ఞానపరమైన ఊర్ధ్వగమనమును చేయుచున్నది. సూక్ష్మమైన ఆకాశతన్మాత్ర సర్వగతమై యితర భూతములను లయము చేయఁగల విధమున కూటస్థములైన స్థూలభూత తన్మాత్రలు సర్వగతమైన ఆకాశతన్మాత్రను లయము చేయజాలవు. నాదస్వరూపమైన ఓంకారము సమస్తభువనసంస్థితమైన చిచ్ఛక్తిని విశ్వవ్యాప్తమైన చిచ్ఛక్తిని వేకశుతిగలందు మేళగించి ఆత్మజ్ఞానమును సమకూర్చుచున్నది. సకలమంత్రములకును, తంత్రములకును, శాస్త్రములకును, యోగములకును మూలమైన ఓంకారము కుండలినీయోగసిద్ధికి సాధనభూతముగ నున్నది.

శ్లో॥. యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవచ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా.

పృథగ్భావమున బాహ్యాభ్యంతరములందు వ్యాప్తమైయున్న పరాశక్తిని నేకరూపమున గనుఁగొనినపుడు బ్రహ్మసంపద ప్రాప్త మగుచున్నది. సకలయోగములకును పరమార్థ మాత్మజ్ఞానము. ఆత్మజ్ఞానమునకు సకలజనులకును ప్రత్యేకయోగములు సాధనములుగ నున్నను సకలజనులకును సులభసాధ్యమైన రాజయోగము సమాదరణీయముగ నున్నది. సమస్త విజ్ఞానమునందును నఖండపాండిత్యానుభవములను గలిగిన శ్రీ శంకరాచార్య అపరోక్షానుభూతియందు తెలిపిన ఆత్మజ్ఞానానుభవభావము ప్రాజ్ఞులకు సమాదరణీయము.

ఒక కాలమునందు వ్యాస, శంకరాదుల యాదరణమును బడసిన కుండలినీయోగము వర్తమానకాలమునం దపార్థములకును, దుర్ణయములకును పాలైనది. ధీమంతు లీ యోగ రహస్యములను, గుణదోషములను వర్తమానపరిస్థితుల కనురూపముగ పరిశీలించి నిర్ణయించుట విజ్ఞానసంరక్షణ వ్యాసములకు ప్రయోజనకరము.

[ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము ద్వితీయ సంపుటము - 1934]

# వీరశైవ సిద్ధాంత సారము

ఆంధ్రవాఙ్మయమునందు బసవపురాణము సుప్రసిద్ధమైన ప్రాచీన కావ్యము. బసవపురాణము జానుతెనుఁగు కావ్యము లందు రసవత్కావ్యమై, లింగధారులకు పవిత్రమైన పురాణముగ నున్నది. సోమనాథుఁడు తనరచనకు బసవపురాణ నామకరణము చేసినను బసవపురాణము కావ్యరూపమును దాల్చినది. ఆంధ్రవాఙ్మయ పరిశోధనలకు బసవపురాణము పెన్నిధిగా నున్నవిధమును మూలము సువ్యక్తము చేయుచున్నది. గ్రంథమునకుఁ గీలకమైన వీరశైవమత విషయమై పరిశోధనలు చేయవలసిన యవసరమును వర్తమాన కాలమునందు వీరశైవమునకుఁ బట్టిన దుస్థితి తెలియఁజేయు చున్నది. వీరశైవమునకును, వైదికమతములకును గల సంబంధ బాంధవ్యములను విరోధకలహములు విమర్శించి వివిధమతములకును గల సమానధర్మములను నిరూపించుట శ్రేయస్కరము.

## వైదికమతము

వేదయుగమునందుఁ గర్మపరమైన వైదికమతము క్రమముగ జ్ఞానపరమై పరివర్తనమును బొందినది. మతలక్ష్య మనిత్యము లైన యజ్ఞయాగాదుల ఫలములనుండి నిత్యమైన మోక్షమునకు మరలినది. కర్మకాండకును, జ్ఞానకాండకును సంఘర్షణము గలిగి నది. వేదములందలి మంత్రములకును, బ్రాహ్మణములకును సమ న్వయములేక కర్మలు పరిహాసపాత్రము లైనవి. జ్ఞానప్రధానము లైన జైనబౌద్ధాదిమతములు ప్రబలినవి. కర్మదీక్షాపరాయణులైన బ్రాహ్మణులకును, బ్రాహ్మణేతరవర్ణస్థులకును వైదిక మతలక్ష్యము నందు భేదదృష్టి గలిగినది. జైనబౌద్ధమతములు ప్రబలి బ్రాహ్మణ ప్రాబల్యమును తగ్గించినవి. జైనబౌద్ధమతములు బ్రాహ్మణ్యమును ప్రతిఘటించినను బ్రాహ్మణులయెడల శత్రుత్వమును బూనలేదు. బౌద్ధధర్మములు బ్రాహ్మణకర్మలను ఖండించినను బ్రాహ్మణధర్మమును గౌరవించినవి. ధమ్మపదమునందు బ్రాహ్మణవర్గ మను నధ్యాయము గలదు. ఆ వర్గమునందు బ్రాహ్మణ ధర్మములు నిర్దేశింపబడినవి. వైదిక మతపరిణామమునందుఁ గర్మయోగమును, జ్ఞానయోగమును భక్తిమార్గము జీవయాత్రయందు సమన్వయము చేయఁబడుచున్నది. కర్మమార్గము జ్ఞానమార్గమునకు సాధనమైనను బ్రాహ్మణాధీనమైన నిత్యకర్మానుష్ఠానము ప్రాణకళను గోల్పోయి ప్రజల నిత్యజీవ యాత్రకు నిరర్థకమైనది. కర్మాధికారులుగాని ప్రజలు జీవయాత్ర యందు దారి తెన్ను తెలియక పరితపించుచుండిరి. తత్త్వజ్ఞాన సిద్ధాంతములును అందరానిఫలములై, ప్రజ లజ్ఞానాంధకారము నందు మునిగియుండిరి. ఇట్టి విషమదశయందు వర్ధమానుఁడు, సిద్ధార్థుఁడు మొదలగు క్షత్రియవీరులు బ్రాహ్మణాధికారమును ప్రతిఘటించి జైనబౌద్ధాదిమతములను స్థాపించి, ప్రజలయందు నూతనమైన ప్రాణకళను బ్రతిష్ఠించిరి.

## జైన బౌద్ధమతములు

సిద్ధార్థవర్ధమానులు నిర్జీవమై క్రూరమైన కర్మకాండను, దుర్గ్రాహ్యమైన జ్ఞానమార్గమును నిరసించి ప్రజాజీవనమునందు ధర్మమార్గమును బ్రతిష్ఠించిరి. బుద్ధదేవుఁడు సంకుచితమైన బ్రాహ్మణ కర్మానుష్ఠానమును నిరాకరించినను విశాలమైన కర్మ సిద్ధాంతమును బ్రతిష్ఠించెను. యజ్ఞయాగాదిపరమైన కర్మ విశ్వ వ్యాపకమైన కర్మభావమును బొందినది. వైదికమతమునందు మంత్రోద్దిష్టమై యిష్టదేవతాపరమైన కర్మ బౌద్ధమతమునందు సర్వవ్యాపకత్వమును బొందినది. వైదికమతమునం దప్రధానముగ నున్న కర్మ బౌద్ధమతమునందుఁ బ్రధానస్థానము నాక్రమించినది. జాతిమతకులభేదములు లేక, శుభాశుభకర్మఫలము "అవశ్య మను భోక్తవ్యం" అను సిద్ధాంతము హిందూమతమునందు సుప్రతిష్ఠిత మైనది. కర్మసిద్ధాంతము పునర్జన్మసిద్ధాంతమును బరిపాటిచేసినది. కర్మసిద్ధాంతము, పునర్జన్మసిద్ధాంతము హిందూబౌద్ధమతములందు సమానప్రతిష్ఠను వడసినవి. జైనబౌద్ధమతములు 1000 ఏండ్లు భరతఖండమునందుఁ బ్రబలినవి. దేశమునం దంతటను మఠములు, విహారములు, స్తూపములు వెలసినవి. సన్న్యాసులు, శ్రమణకులు వేనవేలు దేశమునం దంతటను వ్యాపించిరి. దైవభావనలేని బౌద్ధ మతము సంకరమై, ప్రాణప్రతిష్ఠ లేక, ప్రజాజీవనమునకు నిరర్థక మైనది. శంకరాచార్యులు జైన బౌద్ధమతములను ఖండించి వైదిక మతమును బునరుద్ధారణ చేసెను. శంకరాచార్యులు జైనబౌద్ధమత ములను ఖండనము చేయుచు శైవ వైష్ణవాది షణ్మతముల నావే దించెను. శంకరాచార్యులు కర్మసిద్ధాంతమును, పునర్జన్మ సిద్ధాంత మును సర్వాత్మత్వసిద్ధాంతముతోను, సర్వబ్రహ్మసిద్ధాంతముతోను మేళవించి, వైదికమతపరిణామమును వేదాంతమునందు సార్థకము చేసెను. వైదికమత సంప్రదాయములైన ద్వైతాద్వైత విశిష్టా ద్వైతమతములు స్థాపితములై, వైదికకర్మలు, జాతికులభేదములు పుష్టిని బొందినవి. ప్రాకృతజనులు జీవయాత్రయందుఁ గడతేరు టకు వైదికకర్మల కనధికారులు; జ్ఞానమార్గము దుర్గమము. ఈ విషమదశయందు రామానుజుఁడు, చైతన్యుఁడు, బసవేశ్వరుఁడు మొదలగు మహాభక్తులు ఉదయించి ప్రజాజీవనమును సుఖప్రదము చేయుటకుఁ బూనుకొనిరి.

## భక్తిమార్గము

వ్యక్తావ్యక్తములకును, కర్మజ్ఞానమార్గములకును, సగుణ నిర్గుణోపాసనములకును మానవహృదయమునందు భక్తిమార్గము సంధిబంధనముగ నున్నది. ఋగ్వేదేంద్రవరుణాగ్ని దేవతోపాసనతో నారంభమైన వైదికమతము "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను తత్త్వవిజ్ఞానపరిణామమును బొందినది. ఈ పరిణామాంకుర

ములు ద్వైతాద్వైతములందును, శైవ వైష్ణవములందును, నిర్గుణసగుణోపాసనలందును, కర్మభక్తిజ్ఞాన యోగములందును, నిగమాగమ పురాణములందును జిజ్ఞాసువులకు గోచరంబగుచున్నవి. మానవుని నిత్యజీవితమునందు దుఃఖనివృత్తికిని, సుఖప్రాప్తికిని దైవసందర్శనము పరమసాధనముగ నున్నది. జైన బౌద్ధమతములు సంసారము దుఃఖసాగరమనియును, సన్న్యాసము సుఖసాధనమని యును నుపదేశించినవి. అద్వైతము సంసారము మాయాకల్పితమని యుపదేశించినది. పండితులు, బ్రాహ్మణులు కర్మంతోను, సిద్ధాంత ములతోను, సన్న్యాసాశ్రయముతోను గాలియాపనము చేయు చున్నను ప్రజ లజ్ఞానాంధకారమగ్నులై దుఃఖవేదన ననుభవించు చుండిరి. వైరాగ్యము, నిర్లిప్తత్వము, నిర్లక్ష్యము, నిస్పృహ, నిస్సహాయత్వము పరిపాటియై, భారతీయ చైతన్యము నిర్వీర్య మైనది. ఈ విషమావస్థయందు బసవేశ్వరో పదిష్టమైన వీర శైవము మతధర్మములందును, లక్ష్యములందును, సాంఘికార్థిక పరిస్థితులందును మహాపరివర్తనమును గలుగఁజేసినది.

## శైవము

శైవమత పరిణామము వైదికమత పరిణామమునకు ప్రత్యక్షప్రమాణముగ నున్నది. వైదిక మంత్రోపస్థితుఁడైన రుద్రుఁడు వేదాంతమునందు శివరూపపరిణామమును బొందుచు "శివోఽహం" అను తత్త్వమును సువ్యక్తము చేయుచున్నాఁడు. శివుడు యజ్ఞపురుషుఁడు. శివుఁడు సగుణనిర్గుణ పరబ్రహ్మ. శివుఁడు హిమాచలమునందు గౌరీశంకరుఁడు; రామేశ్వరమునందు రామలింగేశ్వరుఁడు; కాశ్మీరమునందు మహాదేవుఁడు; మధురయందు సుందరేశ్వరుఁడు; కాశియందు విశ్వేశ్వరుఁడు; సౌరాష్ట్రమునందు సోమనాథుఁడు; శ్రీశైలమునందు మల్లికార్జునుఁడు. శివాలయ ములు దేశావ్యాప్తములై శైవమతవ్యాప్తిని వెల్లడిచేయుచున్నవి. పాశుపతులు, కాలాముఖులు శివపూజాపరాయణులు. శైవులు లింగరూపమునను శివుని బూజించుచు శివోత్కర్షను జేయు చున్నారు. అథర్వశిఖయందలి "ఈశ్వరః శివ ఏవచ......శివ ఏకో ధ్యేయః శివఙ్కరః", స్కందోపనిషత్తునందలి "జీవ శ్శివ శ్శివో జీవః స జీవః కేవల శ్శివః", మొదలగు వాక్యములు శివో త్కర్షను దెలుపుచున్నవి. శైవులు శివాలయములయందును, పీఠ ములయందును, స్వాంగములయందును లింగమును ప్రతిష్ఠించి పూజించుచున్నారు. శివలింగార్చనమును అద్వైతమత స్థాపకులు శ్రీ శంకరాచార్యులవారి పీఠమునందుఁ బ్రతిష్ఠించిరి.

## శివలింగము

అవ్యక్తము నిర్గుణము, నిరాకారము, నిరహంకారము, నిరవద్యము. అవ్యక్తమును వ్యక్తమైన విశ్వమంతయును అనంత మైన నామరూపములను సేవించుచుఁ బ్రపంచించుచున్నది. అవ్యక్తము లింగాకృతిని విశ్వవ్యాప్తమై యొప్పుచున్నది. ఆకాశ లింగము, వాయులింగము, తేజోలింగము, ఆపోలింగము, పృథ్వీలింగము అవ్యక్తమునకు వ్యక్తస్వరూపములు. అవ్యక్త లింగస్వరూపములందుఁ బార్థివలింగము సగుణనిర్గుణ స్వరూప ములను గలిగి పూజాపాత్రమైనది. పార్థివలింగమును స్త్రీపుంసయోగ చిహ్నముగను పండితులు కొందఱు నిర్ణయించి నను, మహాత్మునకు బీజచిహ్నముగ నున్న లింగమున కీలక్షణ మప్రధానము. లింగము షడక్షరీమంత్రరూపమని శైవాగమములు విశదము చేయుచున్నవి. ఈ లింగ మాకాశాది పంచభూతము లందును గోచరం బగుచున్నవి.

శివలింగమును వర్ణవివక్షతలేక సకలవర్ణములవారును పూజించు చున్నారు. బ్రాహ్మణులు దేవతార్చనలందును, సకలవర్ణములవారును దేవళములందును శివలింగమును బూజించుచున్నారు. లింగధారులు లింగమును స్వీయాంగములందు ధరించుచు శైవులును, వీర శైవులును నగుచున్నారు. లింగధారణము గార్హస్థ్యమును, బాహ్యా ర్థమును గలిగి, వీరశైవమున కపూర్వమైన వ్యక్తిత్వమును గలుగఁ జేయుచున్నది.

## వీరశైవము

వీరశైవము వైదికమతమును, జైన బౌద్ధమతములను ప్రతిఘటించుట కేర్పడిన శైవమతము. శైవమతము భరత ఖండమునందు—ముఖ్యముగ దక్షిణప్రాంతములందు—వ్యాపకమును బొందిన ప్రాచీన మతమని శైవాచార్యుల చరిత్రలు తెలుపుచున్నవి. ద్రవిడాంధ్రకర్ణాటక దేశములందు శైవము వ్యాపించినవిధమును భక్తుల చరిత్రములు విశదము చేయుచున్నవి. శంకరాచార్యులు జైన బౌద్ధమతములను నిర్వీర్యములఁ జేసినను ప్రజాసామాన్య మునందా మతములు వ్యాప్తిని గాంచియున్నవి. అద్వైత సిద్ధాంత ములు ప్రజలకు దుర్బోధ్యములు. జైన బౌద్ధమతములు నాస్తిక మతములు. అద్వైత సిద్ధాంతములు, జైనబౌద్ధమతములు వైదిక కర్మల ప్రతిభను తగ్గించినవి. ప్రజాహృదయమునందు భక్తి మార్గము ప్రబలి నూతనవికాసము గలిగినది. ప్రజాహృదయము నందుఁ గలిగిన నూతనోత్సాహమును వీరశైవము పల్లవింపఁజేసిన విధమును బసవేశ్వరచరిత్రము తెల్లము చేయుచున్నది. బసవే శ్వరుఁడు బ్రాహ్మణకులమునందు జన్మించినను ఉపనయనమును నిరాకరించి వీరశైవదీక్షను బూనిన పరమశివభక్తుఁడు. వీరశైవము కర్మమార్గమును నిరసించుచున్న విధమును వీరశైవసిద్ధాంతములు వెల్లడిచేయుచున్నవి. బసవేశ్వరుఁడు వడుగును నిరాకరించుచుఁ దండ్రికిఁ జెప్పిన సమాధానము కర్మనిరసనమును జేయుచున్నది.

> భూరి భక్తుల కెత్తుకే అది ప్రాత
> మాలల కెత్తుట మఱి తప్పగాదె?
> కర్మపాశంబు లొక్కటఁ దెగ నీల్గి
> కర్మంబు ప్రాల్గ దాఁ గట్టుకోఁదగునె?
> రుద్రాక్షభసితాదిముద్రలు దాల్చి
> క్షుద్రముద్రలు దాల్పఁగూడునే చెపుమ?
> యారీతి ద్రాటికి దూరమై యున్న


అఖిల
భారతావని
కళాసర్వస్వం
శ్రీ ప్రకాష్ పిక్చర్స్ వారి
విజయభట్ సమర్పించు
రామరాజ్య
ఈస్ట్‌మన్ కలర్ చిత్రం
నిర్మాతలు: శంకర్‌భాయిభట్-విజయభట్
సంగీతం: వసంత్ దేశాయి

వీరమాహేశ్వరాచారదీక్షితుని
విర్మితోభయాకర్మనిర్మాలు నన్నుఁ
గర్మాబ్ధి ముంచుట ధర్మమే నీకుఁ?
గ్రచ్చులఁ గన్నులఁ గానవు గాక
నచ్చు నే బసవని వడుగు సేయంగ .
బ్రహ్మశిరోహరుఁ బ్రముఖైకవంశ్యు
బ్రహ్మవంశ్యుం డని భావించె వెట్లు?
జాతిగోత్రాతీతు సద్గురుజాతు
జాతిగోత్రక్రియాశ్రయుఁ జేసె దెట్లు?
అకులస్థుఁడై యున్న యభవుని భక్తు
నికి నేకులం బని నిర్ణయించెదవు?

జీవయాత్రను దేవయాత్రను జేయగలవిధమును వైదికమత ధర్మములు అనంతవిధములను నిర్దేశించుచున్నవి. దేహధారుల కవ్యక్తమును గ్రహించుట దుస్తరము. అవ్యక్తము వ్యక్తముద్వారా గ్రాహ్యమగుచున్నది :

శ్లో. క్లేశో ఒధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే.

జీవయాత్రను, విషయయాత్రను జేయక శివయాత్రను జేయుటకు సర్వకాల సర్వావస్థలయందును శివసందర్శన సంస్మరణ సంకీర్తనములు సాధనములుగ నున్నవి. జీవయాత్రను శివయాత్రను జేయుటకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు గురులింగజంగ మారాధనలందు భక్తిపరవశములు కావలయును. జీవయాత్రను దేహయాత్రార్థము గాక ఆత్మయాత్రార్థము చేయవలసిన విధమును సాధకునకు వీరశైవము వివరము చేయుచున్నది.

## సాధకుఁడు

మానవశరీర మద్భుతమైన నిర్మాణము. ఆ నిర్మాణము లోపలి కీలులను గనుఁగొనుటకు మహానుభావులు యత్నించిరి. దేహేంద్రియాదుల కీలులను ప్రకృతిశాస్త్రజ్ఞులు నిర్ణయించినను అతీంద్రియ రహస్యములను నిర్ణయించుటకు మహాయోగులు సమర్థులు. తత్త్వజ్ఞులు దేహమునందుఁగల తత్త్వములను భిన్న విధములను నిర్ణయించుచున్నారు. సాంఖ్యులు, యోగులు 5 తత్త్వములను, వీరశైవులు 36 తత్త్వములను నిర్ణయించుచున్నారు. సృష్టిక్రమమున అనులోమవిధాన మాకాశజన్యమైన శబ్దముతో నారంభమగుచున్నది. పంచభూతములు స్థూలసూక్ష్మములు పది, దశేంద్రియములు, మనోబుద్ధి చిత్తాహంకారములు, జీవుఁడు ఇరువదియైదు తత్త్వములు. స్థూలమైన శబ్దమునకు నాదము లింగరూపము. అవ్యక్తమున కాదిమవ్యక్తస్వరూపము నాదము. ఆ నాద మంతర్లింగరూపమున విశ్వమునం దంతటను విలసిల్లుచున్నది. మానవదేహమున సహస్రారమునందు దేదీప్యమానముగ వెలుఁగుచున్నది. బుద్ధ క్రీస్తు కృష్ణావతారములం దీ దివ్యతేజమును భక్తులు సందర్శించి చిత్రించిరి. సకలమానవులయందును సహస్రారమున తేజము ప్రచ్ఛన్నముగ నున్నది. నాదసంజాత మైన లింగశరీరము సకలదేహాంతర్యామియై జీవయాత్రను మోక్షయాత్రను జేయుటకు సాధనంబుగ నున్నది. జీవయాత్రను కైవల్యయాత్రను జేయుటకు బాహ్యలింగధారణమును, నంతర్లింగ ధారణమును నుపయోగపడఁగల విధమును వీరశైవాగమములు వివరించుచున్నవి. ఈ రహస్యమునే అపరోక్షానుభూతియందు శంకరాచార్యులు విశదము చేయుచున్నారు.

శ్లో. యత్ర యత్ర మనో యాతి బ్రహ్మణ స్తత్ర దర్శనాత్,
మనసో ధారణం చైవ ధారణా సా పరా మతా.

—అపరోక్షానుభూతి.

శ్రీ గురుకటాక్షము అధికారియైన భక్తునకు వీరశైవ దీక్ష నొసంగి కృతార్థునిఁ జేయుచున్నది. వీరశైవదీక్ష కధికారి లక్షణములను బసవపురాణము, వీరశైవదీక్షాబోధ ఇతులు వివరించుచున్నవి :

తగనివారికి దీక్షఁ దగఁ జేయుగురున
కగుఁ బ్రమాదంబు మహాదేవుచేత
గురువులు శిష్యునిగుణవిశేషముల
నరయక దీక్షఁ జేయుఁగ నెట్లు వచ్చు
బొంగకును మద్యపాయికి దన్యాత
శీలికి మాంసభక్షకి నజ్ఞానకును
ఆతురునకు వేశ్య కంగహీనునకు
నీతి గారట వ్యసనికి శిక్షఁజేయు
నిది దెలియక దీక్ష లిచ్చినగురున
కవు నరకంబని హరువాక్యమనఁడు.

*　　　*　　　*

గురునాథుఁడతనిఁ గన్గొని వత్స! వినుము
హరదీక్ష నిమ్మన్న నా పట్టు వినుము
శిష్యునిశక్తియు శిష్యునిభక్తి
శిష్యభావముఁ బరీక్షింప కీఁదగునె
యాముముక్షుఁడు దీక్ష యగుటయే చాలు
నావిహార నాచరణంబు దుర్ఘటము
మొదలు సర్వద్వంద్వములఁ బాయవలయు
మదము గర్వముఁ బొడమక యుండవలయు
కుత్సితనిష్ఠుర కోపమాలిన్య
మాత్సర్యశాఠ్యడంబము లుండఁదగదు
కష్టలోభజ్ఞాన కామమోహాది
దుష్టగుణంబులు దొలఁగంగవలయు
గుదపాదపాణివాగ్వాహ్యసౌఖ్యములు
గదిసిన వశవర్తి గాకుండవలయు
శాంతంబు ముఖవికాసంబు సద్వృత్తి
దాంతి నీతియు దెల్వి దయయును వలయు
సంతోషమును గతస్పర్థయు ధర్మ
చింతయు సద్గుణశీలంబు వలయు

మొగమోటయును దానమును వినయంబు
తగవు ధర్మార్థ సాధకబుద్ధి వలయు
నుచితజ్ఞతయు సత్క్రియోద్యోగధర్మ
రచన పరోపకారంబును వలయు
శివుఁడె దైవంబని చేపట్టవలయు
శివమహోత్సవములు సేయంగవలయు
నిత్యశివార్చనాన్వితుఁడు గావలయు
సత్యంబు గురుపరిచర్యయు వలయు
భయభక్తియును శివపరతంత్రతమతియు
నియమవ్రతంబులు నిష్ఠయు వలయు
నీగుణంబులు గల్గ కెట్లియ్యవచ్చు
నాగమోక్తంబగు సారభక్తిదీక్ష

—వీ. దీ. బో. 13- పుట.

* * *

శత్రులైనను లింగసహితులై యున్న
మిత్రులఁ గాఁ జూడుమీ బసవన్న!
పట్టినవ్రతములు ప్రాణంబుపోఁద
మెట్టిన విడువకుమీ బసవన్న!
హేయిభక్తులజాతి వెదకకుండుటయె
విహానపదము సుమీ బసవన్న!
చిత్తజాంతకుభక్తిఁ జెడనాడుఖలుల
మృత్యువుగతిఁ ద్రుంపుమీ బసవన్న!
వేదశాస్త్రార్థ సంపాదితభక్తి
మెదిని వెలయింపుమీ బసవన్న!
తిట్టిన, భక్తులు కొట్టినఁ, గాల
మెట్టిన, శరణనుమీ బసవన్న!
ఏఁ దప్పవట్టుదు నిలఁ బరస్త్రీల
నీకాఁదఁ గన్నార్పకుమీ బసవన్న!
సాధ్యమౌ భక్తప్రసాదేతరం బ
మేధ్యంబుగాఁ జూడుమీ బసవన్న!
నిష్కాంపుభక్తికి నిర్వంచకంబు
మిక్కిలి గుణము సుమీ బసవన్న!
ఏప్రొద్దు జంగమం బేసకాఁ జూడు
మీ ప్రసాదముఁ గొనుమీ బసవన్న!
వాలుక కింపుగా శాలిభక్తులను
మేలగా మతియింపుమీ బసవన్న!
యేమైన వలసిన యెడరైనఁ దలఁపు
మీ మమ్ము మఱవకుమీ బసవన్న!

—బసవపురాణము, ప్రథమాశ్వాసము—25.

గురువు శిష్యునకుఁ జిన్మయదీక్ష నొసంగి హస్తమస్తక సంయోగమును, పంచాక్షరీ మంత్రోపదేశమును జేసి, లింగమునకుఁ బ్రాణకళాన్యాసము చేసి లింగాంగ సంయోగమును జేయుచున్నాఁడు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములవలనఁ గలుగుచున్న జ్ఞాన మారూఢము గాక చంచలమగుచున్నది. ఇంద్రియములు సామాన్యముగ దేహయాత్రయందు లగ్నమగుచు దుఃఖహేతుకంబగుచున్నవి. జీవయాత్రయందు జీవుని కారూఢ జ్ఞానము గలుగుట కాత్మావలోకనము సాధనముగ నున్నది. ఆత్మావలోకనము బాహ్యాభ్యంతరంబులందు లింగ నిరీక్షణమూలమున సాధ్యమగుచున్నది.

కాన నీయిష్టలింగము భావగమ్యుఁ
డై విన్నుఁ బ్రేరేప నలరింతు క్రియలు

* * *

తనివి లింగముఁ జూడఁ దాఁ జూచు రూపు
వినకించి లింగంబు విన విను ధ్వనులు
సోకిది లింగము సోఁక సోఁకు స్పర్శనముఁ
జరమలింగము భుజింప భుజించు నవియు
నేఁడి లింగంబు ఘ్రాణింప ఘ్రాణించుఁ
దగ లింగదృష్టిచేఁ దా ద్రష్టయగును
సరి నిట్లు ప్రాణైక సహచరుండగుచుఁ
జరియించు భక్తుండు సర్వాంగలింగి
ప్రాణాంగములు దనప్రాణలింగంబు
ప్రాణాంగములు గాఁగ నమరించి చేష్ట
లును లింగమందుఁ గీలొత్తలిపి తా నంత
యును లింగమయమయి యుండు నాశరణు
డేనని మది నిర యింతుఁ గీర్తింతు
నామహాత్ముని యుపమాతీతమూర్తిఁ
జడబుద్బుదము నీట నడగినయట్లు
వడగండ్లు నీటిలో వర్షించునట్లు
ఆకల నింగలీకము రసమైన
జోకఁ గాష్ఠము లగ్ని సోఁకి తా నగ్ని
యైనట్లు లింగంబునం దైనతనువుఁ
దాను లింగక్రియఁ దగ లింగమయ్యె
మది నెవ్వఁ డెయ్యది మరిగి ధ్యానించు
నదియె వాక్కున నెళ్ళ వాడుచునుండు
నదియ కర్మంబుచే నలరింపుచుండు
విదితంబుగా నిది వేదవాక్యంబు.

—వీరశైవ దీక్షాబోధ 88; 90—పుటలు

లింగనిరీక్షణ మతీంద్రియజ్ఞానమును బ్రసాదింపఁగల విధమునకు సిద్ధపురుషుల యనుభవము ప్రసిద్ధముగ నున్నది. దివ్యదృష్టి, దూరశ్రవణము, దివ్యజ్ఞానము, అష్టసిద్ధులు, శివత్వము గలుగుచున్నవి. స్థూలశరీరము సూక్ష్మశరీరమునందును, సూక్ష్మశరీరము లింగశరీరమునందును, లింగశరీర మాత్మయందును, ఆత్మ పరశివునందును లీనమై, శివసాయుజ్యము గలుగుచున్నది. సాధకుఁడు పరశివుఁడైనను దేహభ్రాంతిని దనదృష్టిని దేహయాత్రయందు లగ్నము చేయుచున్నాఁడు. సాధకునిదృష్టి దేహ

యాత్రనుండి శైవయాత్రయందు లగ్నమగుటకు మలత్రయమును విడువవలయును.

ఆణవమలమును బాయుటకు మాతాపితసుతాదుల భ్రాంతిని వదలి తాను శివాంశమైన చైతన్యస్వరూపమని కనుఁగొనవలయును.

సకలంబుఁ దానయై పర్వేశ్వరుండు
సకలంబు నాడించు చైతన్యమూర్తి
శివుఁ డట్టిచైతన్య చేతనాత్మకుఁడు
తవిలి ప్రేరేపంగఁ దానాడు జగము
తల్లి పార్వతియును దండ్రి శివుండు
వెల్లభక్తులు తన హితబంధుజనులు
వనుచు వావాపురాణాగమార్థములు
మును జెప్పెఁ గావున ముందుండి నీవు
వాది నీశ్వరబీజమం ద్వైతిగాన
భేదంబులెల్లఁ గల్పితముగా నాత్మఁ
జింతించి తెలియుచు స్థిరమౌట నీవు
అంతట పాయు నీకాణవమలము.

—వీరశైవ దీక్షాబోధ 32—పుట.

మాయామలంబు తొలంగుటకుఁ గులభ్రాంతిని, స్త్రీపురుష భ్రాంతిని విడిచి, సర్వత్ర ఆత్మసందర్శనంబును జేయవలయును.

శిలలోపలఁ జనించిననేమి పసిడి
శిలయుఁ దానగునయ్య! చింతింపనట్లు
మానవులందు సంభవులైననేమి
మానవులగుదురె మాహేశ్వరులు
పూరుషులైన నపుంసకులైన
వారలైనను బ్రాహ్మణకులీనులయినఁ
జండాలులైనను శంభుఁ బూజింప
నొండేమి రుద్రపొమ్ములు విచారింప
వదిగాక నీవు నీయాత్మను గాంచి
వదలకుండినఁ గులవ్యామోహ ముడుగుఁ
మఱిదానె తొలఁగు నీమాయామలంబు
లొరలు సహంకృతి దోడ్తోన యడఁగు.

—వీరశైవ దీక్షాబోధ 39—పుట

కార్మికమలమును బోనాడుటకు యథాలాభ సంతుష్టుఁ డగుచుఁ తన సంపదలను గురులింగ జంగమములకు సమర్పించి వారి తీర్థప్రసాదములను స్వీకరింపవలయును.

ప్రాణేశ్వరునకుఁ బ్రాణార్థంబులొసఁగు
జాణవై ధనమిమ్ము సద్భక్తులకును
వినుము వెండియు నొక్క విత్తమే కాదు
తనుమనోధనములు దగఁ గురులింగ

* * *

"ధర నవ్యదేవతాన్మరణ మాత్రమున
విరువదేనిమ్మిదికోట్ల నరకంబు లొందు"
నవ శ్రుతులందును వినరె భావనికి
దినకరపావక దిక్పాలకులను
హరివిరించ్యాదుల నఖిలదేవతల
ధర మూఁడుసంధ్యలఁ దాఁ గొల్వవలయుఁ
గొలువక తక్కినఁ గొలిసె బ్రాహ్మణ్యంబు
కొలిచెనేనియు భక్తినొలిసెఁ గావునను
బ్రాహ్మణుఁడేనియు భక్తుఁ డెట్లగును ?
బ్రాహ్మణుఁడెట్లగు భక్తుఁడేనియును ?
మావిడిబీజంబు మహివిహాద విత్తఁ
గా వేమగునె పెక్కు గథలేమి చెప్ప ?
సహజలింగైక్యనిష్ఠయుక్తి భక్తి !
ఐహదేవతాసేవ బ్రాహ్మణపథముః

* * *

కర్మమార్గం బగుఁగాక బ్రాహ్మణ్యంబు
నిర్మల శివభక్తి నిష్ఠితం బగునె ?

—బ. పు. 19, 21—పుటలు.

వీరశైవమునకుఁ బ్రధానదీక్ష లింగధారణము. లింగధారణము నకుఁ గక్ష, కరము, ఫాలము, కంఠము, శిరస్సు, వక్షస్స్థలము ముఖ్యస్థానములు. లింగధారు లందఱు జాతిమత కులభేదములు లేని శివభక్తులు. బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు, మాలలు మొదలగు అష్టాదశ వర్ణములవారును వీరశైవులై కులభేదము లను నిరసించిన విధమును బసవచరిత్రము విశదము చేయుచున్నది. బిజ్జలునకు బ్రాహ్మణులు బసవేశ్వరుఁడు వర్ణసంకరము చేయు చున్న విధమును దెలిపినపుడు బసవేశ్వరుఁ డొసఁగిన ప్రత్యుత్తరము భక్తితత్త్వమును విశదము చేయుచున్నది.—

వేదము లాదియో విధికల్పితంబు
లాదియో జాతుల కది యెట్టు లనినఁ
జను వేదచోదితజాతులు రెండు
వినుము ప్రవర్తకంబును నివర్తకము
భవకర్మసంస్కారి భువిఁ బ్రవర్తకుఁడు
శివకర్మ సంస్కారి భువి నివర్తకుఁడు
సన్నుత వేదార్థ చరితంబు లుండ
మొన్నఁ బుట్టినకులమ్ములమాట లేల
ప్రస్ఫుటక్రమగునట్టి జాతులు గావె
యష్టాదశంబులు నవి యేల చెప్ప
మిక్కిలి పదునెనిమిది వర్ణములకు
చిక్క మారయ భక్తనిచయంబు కులము
భాగ్యహీనుండు దాఁ బసిఁడిఁ బట్టిన న
యోగ్యంపులోష్టమై యున్నట్లు శివుని
ప్రతిబింబమూర్తి యౌ భక్తుఁడు భవికి
మతిఁ జూడ మానవాకృతి నుండు ధరణిఁ

గావున శివభక్తగణముల మహిమ
భావింపఁదలప నీబ్రహ్మయే చెప్పుమ.

బ. పు. 209 పుట

వర్తమానకాలము నందువలెనె జాతిమతకుల వైషమ్యములతో నిండి నిర్వీర్యమైన సంఘమును వీరశైవము భక్తిపాశబద్ధముచేసి వీర్యవంతము చేసినవిధ మాశ్చర్యమును గలుగఁ జేయఁగలదు. వీరశైవులు లింగసహాయిత శస్త్రములను బట్టి శివద్రోహులను, జైనులను జంపుట ఘోరకార్యమైనను వీరశైవ ప్రభావమును విశదము చేయుచున్నది. జగదేవుఁడు వీరతాఁబూలంబును గొని బిజ్జలుని సంహరించి, ఆత్మహత్యను జేసికొనెను. నాచిదేవయ్యయును, పండ్రెండువేల శివభక్తులును జైనులను సంహరించినవిధము భయంకరమై వీరశైవదీక్షా ప్రభావమును విశదము చేయుచున్నది. వీరశైవ మచిరకాలముననే కర్ణాటాంధ్ర ద్రావిడ దేశములందు వ్యాపించి ప్రజాహృదయము నాకర్షించుటకు వీరమాహేశ్వర శక్తియును, సాంఘికవ్యవస్థలును గారణంబులు.

## వీరశైవ సంఘము

వీరశైవమునకు శివభక్తి, లింగధారణము, విభూతిరుద్రాక్షధారణము, పంచాక్షరీమంత్రము, లింగసహాయిత శస్త్రధారణము ప్రధానలక్షణములు. వీరశైవమునందు శివభక్తి నిరుపమానముగా దెల్పుచున్నది. శివభక్తిపరవశులైన భక్తులు తమ తనువులను, దారాపుత్రాదులను, ప్రాణములను శివార్పణముచేసి కైవల్యమును బొందిన విధమును భక్తులకథలు దెలుపుచున్నవి. కన్నప్ప, సిరియాళుఁడు, నిమ్మవ్వ, కుమ్మరగుండయ్య, చౌడయ్య, బొమ్మయ్య, వైజవ్వ, దూడయ్య, శ్వపదయ్య, కక్కయ్య. గుడ్డవ్వ, మొదలగు భక్తులకథ లత్యద్భుతమైన వీరభక్తిని దెలుపుచున్నవి. భక్తుల ప్రాకృతనామములె వర్ణపరివర్తనమును దెలుపుచున్నవి. వీరశైవధర్మము సాంఘిక పరివర్తనమును, మతపరివర్తనమును ప్రతిపాదించినది. వీరశైవసంఘమునకు బసవేశ్వరుఁడు దండనాయకుఁడు; మాహేశ్వరులు సేనాపతులు; భక్తులు సైనికులు. భక్తసైన్యము శత్రుమిత్రాభిమానమును, ప్రాణమానధనాభిమానమును లేక శైవధర్మ నిర్వహణమును జేయఁబూనినది. జంగములైన శివభక్తులందరును శివస్వరూపులు. వీరశైవులు బ్రాహ్మణులు—మాలలు, పండితులు—పామరులు, ప్రభువులు—ప్రజలు, స్త్రీలు—పురుషులు, దొంగలు—దొరలు మొదలగు భేదావరణము లేని శివభక్తులు. శివభక్తులు వారి సర్వస్వమును జంగముల కర్పించి శివానందమును బడయుదురు. వీరశైవము జంగమభక్తిని, భవివిరసమును బోధించినది. లింగధారణము లేని వారందఱును భవులు. భవులు విరసింపఁబడిన విధమును బసవపురాణము, వీరశైవాగమములు విశదము చేయుచున్నవి. వీరశైవము బ్రాహ్మణ్యమును, యజ్ఞయాగాదులను, కర్మలను నిరసించి నిందించుచున్నది. పాల్కురికి సోమనాథాది బ్రాహ్మణులు కొందఱు కులగోత్రములను విసర్జించి వీరశైవదీక్షను స్వీకరించి కృతార్థులైరి.

మల్లికార్జున పండితారాధ్యులు మొదలగువారు వీరశైవదీక్షను బూనియును గులముతో బొత్తును విడువఁజాలక, వీరశైవ సంఘమునందుఁ జేరఁజాలకపోయిరి. "భక్తినిగాదిపలవు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తు—బాయ లేను నేను బసవలింగ" యనుచు మల్లికార్జునపండితుఁ డాక్రోశమును జేయుట లింగధారణ స్వీకారమును; బసవమత స్వీకారాభిలాషను సూచించుచున్నది. లింగధారణ స్వీకారము కాక కేవలము శైవమత స్వీకారమునే తెలిపిన యెడలను బసవలింగ నామసంస్మరణమునకును, భక్తినలపుటకును నర్థము గనుపడదు. పితృమేధాదికర్మల విసర్జనమే లింగధారణమునకు నిదర్శనముగనున్నది. ప్రస్తుతము లింగధారి బ్రాహ్మణులందు వాదప్రతివాదములకు మూలమైన ఖననసంస్కారమును లింగధారణమును సూచించుచున్నది! బసవేశ్వరుని కాలమునందును, సన్నిహిత కాలమునందును శివభక్తిపరవశులై అష్టాదశకులములవారును లింగధారణను గొందఱు, వీరశైవదీక్షను గొందఱును గైకొనిరి. లింగధారణదీక్షను గైకొనినవారియందుఁ గొందఱు సంబంధబాంధవ్యములను విసర్జింపఁజాలక కులాచారముల నవలంబించుచుండిరి. లింగధారులయ్యును వీరశైవాచారపరాయణులుగాని బ్రాహ్మణ వైశ్యాదు లుండుట కిదియే కారణమై యుండవలయును. వీరశైవ ప్రతిభ తగ్గిన తరువాతను బ్రాహ్మణులు, వైశ్యులు లింగధారణదీక్షను బొందుట యసంభవము. ఆంధ్రదేశమునందు లింగధారి బ్రాహ్మణులకుఁ బ్రీతము లేకుండుటకుఁ గారణము మత్త్రయ బ్రాహ్మణుల ప్రాబల్యమును, వీరశైవప్రాబల్యమును, బ్రాహ్మణ లింగధారుల ప్రాబల్యమును నని యూహింపఁదగియున్నది. పండితత్రయవంశజాలు (శ్రీపతిపండిత శివలెంక మంచెన పండిత మల్లికార్జున పండిత వంశజాలు) పీఠస్థులనియే వ్యవహరింపఁబడుచున్నారు. లింగధారి బ్రాహ్మణులు వీరశైవ నామము నెప్పుడు స్వీకరించినను భిన్నమతముల వారును, భిన్నవర్ణములవారును వీరశైవులై, వర్ణాశ్రమధర్మములను బారఁద్రోలుటకుఁ జేసిన మహాప్రయత్నములను వీరశైవ మతచరిత్రము విశదము చేయుచున్నది. వీరశైవమతమునకు నేఁటికినిగల ప్రాబల్యమును గర్ణాటక దేశమునందుగల వీరశైవమఠములు విశదము జేయుచున్నవి. వీరశైవమఠాధిపతు లితరమఠాధిపతులవలె సకలగౌరవములను బొందుచున్నారు. వీరశైవము తలపెట్టిన కులావరణ నిర్మూలనము దుస్తరమైనది. లింగాయతులు, జంగములు, సాలెలు, జాండ్రలు ప్రత్యేకకులములవారై, మఱికొన్ని కులము లేర్పడినవి. వైదికధర్మ ప్రాబల్యము తిరిగి తలయెత్తినది. భక్తిప్రధానమైన వీరశైవము నిర్దిష్టమైన యాచార సంప్రదాయబద్ధమై సాంఘిక ప్రయోజనములకును, మానవకల్యాణమునకును నిరుపయోగమైనది.

## వీరశైవ తత్త్వము

వీరశైవతత్త్వార్థము నిగూఢముగ నున్నది. వీరశైవమునకు బాహ్యమునందువలె నంతరంగమునందును లింగధారణము బీజముగ నున్నది. వైదికమతమునందలి దేవతార్చనము, వేదాంతమునందలి తత్త్వార్థము, జైన బౌద్ధమతములందలి సంఘారాధనము, వివిధమతములందలి కర్మారాధనము వీరశైవభక్తియందు సంయోగ

మును బొందినవి. లింగార్చనము, లింగైక్యము, జంగమభక్తి, వీరదీక్ష వీరశైవమునందు సంయోగమును బొందినవి. వీరశైవులు జైనబౌద్ధమతములను ఖండించి ఆ మతస్థులను హింసించినను, ఆ మతధర్మములు వీరశైవమునందుఁ బ్రవేశించినవి. బౌద్ధమతమునకు మూలస్కంధములైన, "1, బుద్ధం శరణం గచ్ఛ, 2. ధర్మం శరణం గచ్ఛ, 3. సంఘం శరణం గచ్ఛ" యను మూఁడుధర్మములును గురులింగజంగమశరణు రూపములను దాల్చినవి. ఏతద్ధర్మానుష్ఠానము వ్యక్తికైవల్యమునకును, మానవకల్యాణమునకును సాధనంబుగ నున్న విధమును నిగమాగమాచారములు తెల్లము చేయుచున్నవి. వీరశైవులు జాతికుల భేదములు లేక జంగమలింగములకు శరణాగతు లగుచుందురు.

గురులింగజంగమారాధితభక్తి
దొరిది సుజ్ఞానంబు వ్రాసినములు
సరిఁ గరణముల్ ప్రాణంబులు సనుచుఁ
దుర్గంగ దేహచైతన్యము లగుచుఁ
ప్రగమమున వెలకొన్నఁ గడుసంతసిల్లి
భ్రమలేక పొడమిన ప్రజ్ఞచే నంత
గురుఁడు లింగంబని గుఱుతుగా నెఱిఁగి
యరయ లింగము గురుండనియు నెఱింగి
గరిమ జంగమము లింగంబుగా నెఱిఁ
మరలి లింగము జంగమంబుగా నెఱిఁగి
చను జంగమము గురుస్వామిగా నెఱిఁగి
ఘనగురువరుని జంగమముగా నెఱిఁగి
యొకరొక రొకరందు నుండుట నెఱిఁగి
యొకరీతి మువ్వురు నొకటిగా నెఱిఁగి
యిట్టి విజ్ఞానమహిమ్నుఁడై మనసు
ముట్టి మూర్తిత్రయంబును భజింపుచును
దాసదానంద భరితాత్ముఁడగుచు
వసుధైన గురుకరుణాబ్ధిఁ దేలుచును.

— దీక్షాబోధ 74– పుట.

## జీవయాత్ర

జీవయాత్రకుఁ బరమప్రయోజనము బ్రహ్మానందమయమైన విశ్వకల్యాణము. జీవుఁడు జీవయాత్రను జేయుటకు విశ్వమంతయును స్థానం బగుచున్నది. జీవుఁడు జీవయాత్రను జేయుటకు విశ్వమంతయును విశ్వేశ్వర జీవ విశ్వభావములను, జ్ఞేయజ్ఞాతృజ్ఞానభావములను, కార్యకర్తృకారణభావములను, గురులింగజంగమరూపములను, సాధ్యసాధకసాధనభావములను సంభవమగుచున్నది. అవ్యక్తమైన పరమాత్మకును, వ్యక్తమైన విశ్వమునకును వ్యక్తావ్యక్తమైన జీవునియందు ధర్మప్రతిష్ఠ గలుగుచున్నది. జీవుఁడు సహజముగ వ్యక్తమైన విశ్వమునందు దేహభ్రాంతిని బొంది సుఖప్రాప్తికి దూరస్థుఁ డగుచున్నాఁడు. అవ్యక్తమును గనుగొనుటకు సాధనమైన వ్యక్తము స్వయముగను ప్రతిబంధకమగుచున్నది. జీవయాత్రయందు వ్యక్తావ్యక్తముల సం జ్ఞానము మతములకు, ధర్మములకు, కర్మలకు, సాహిత్యములకు, కళలకు, శాస్త్రములకుఁ బరమఫలము. అవతారమూర్తులు, మహర్షులు, తత్త్వజ్ఞులు, జ్ఞానులు, యోగులు, త్యాగులు, శాస్త్రజ్ఞులు, ధర్మజ్ఞులు, కర్మజ్ఞులు, భక్తులు జీవయాత్రా ఫలమును సాధించుటకుఁ జేసిన తపఃఫలమును ప్రపంచవిజ్ఞానమనంతముగ బోధించుచున్నది. నిగమాగమములు, దర్శనములు, గీతలు, ధర్మశాస్త్రములు, పురాణములు, కావ్యములు, నాటకములు, కళలు సువ్యక్తము చేయుచున్న ఈ యనంతవిజ్ఞానము జీవయాత్రకు సాధనంబైనను, జనసామాన్యంబునకు దుర్గ్రాహ్యముగ నున్నది. జీవక్షేత్రమునందు వ్యక్తావ్యక్తములకు ధర్మప్రతిష్ఠను సమకూర్చుటకు భగవద్భక్తి పరమసాధనముగ నున్నది.

జంగమావలి వినిర్ణయ మెట్టు లనిన
సంగతలింగదీక్షాకాలములను
త్రివిధమూర్తులకును శ్రీ గురుస్వామి
త్రివిధ మిమ్మనియె నా త్రివిధ మెట్లనిన
తను వొప్పఁడును గురునాత్మమునకు మనముఁ
దనర లింగమునకు ధనము భక్తులకు
ఘనమనోవాక్కాయ కర్మప్రక్రియలఁ
దా గురుని యనుజ్ఞఁ దప్ప కిచ్చినను
ఘనములవెల్లను ఘనమైనలింగ
మును శ్రీగురులను ముదమార నిచ్చి
నటుగాక దీక్ష నీ వాసించినపుడు
తెలుసుకొని దను మహోదనముఁ ద్రిమూర్తు
లను సమర్పింప నాలయంబుగాన
నొకటియు సేదగా కుండుటఁ దెంపి
త్రివిధమూర్తులకును త్రివిధవస్తువుల
నవిరళప్రీతి నీ వర్పించితేని
బట్టించు సద్భక్తి భావ మంతటను
గిట్టిగాఁ దొలఁగు నీ కార్మికమలము.

— వీరశైవదీక్షాబోధ, 42 పుట

ఆణవమలమును, మాయామలమును, కార్మికమలమును బాసిన సాధకుఁడు ధర్మపరుఁడై, శ్రీ గురుకటాక్షమునకుఁ బాత్రుఁడై, లింగధారణరూపమైన చిన్మయదీక్షను బొంది శివస్వరూపుఁ డగుచున్నాఁడు.

శివలింగస్వరూపుఁడైన సాధకుఁడు శివలింగస్వరూపుఁడైన జంగమభక్తుని తీర్థప్రసాదములను గైకొని ప్రకృతి కల్పితములైన భేదాభిమానములను విడిచి గురులింగైక్యమును బొందుచున్నాఁడు.

సకలమలములకును లక్ష్యము జంగమసేవ. ప్రాణహింస చేయక ప్రాణులకు సంతోషమును గలుగఁజేయుటయే ఈశ్వర పూజాఫలమని మతములన్నియును జాటుచున్నవి. బసవేశ్వరుఁడు లింగనాదులైన భక్తులను జాతిమతభేదములను విసర్జించి పూజించి, మానవసోదరత్వమును జంగమరూపమునను స్థాపించిన విధమును బసవచరిత్ర రమ్యముగను బోధించుచున్నది.

## సాధన

సాధకునకు దుఃఖనివృత్తిని, సుఖప్రాప్తిని గలుగజేయుటకు శివాత్మకమైన విశ్వమంతయును సంసిద్ధముగ నున్నది. దేశకాలపాత్రల సంస్కారముల కనురూపముగ బహువిధములైన సాధనములను మహానుభావులు కల్పించి సాధకులకుఁ దరుణోపాయము విశదము చేయుచున్నారు. వైదిక, బౌద్ధ, జైన, శైవ, వైష్ణవ, శాక్తేయాది భారతీయమతములును, యూదు, క్రైస్తవ, మహమ్మదీయాది మతములును, షడ్దర్శనములును, కర్మజ్ఞాన భక్తి హఠ సన్న్యాసాదియోగములును కైవల్య ప్రాప్తికి సాధనంబులుగ నున్నవి. సాధకునకు సకలసాధనములును ధర్మక్షేత్రమైన శరీరమునందుఁ బ్రత్యక్షముగ నున్నవి. దేహేంద్రియ వశీకరణము సాధనలకు మూలము. సాధకుఁడు జీవయాత్రయందు దేహేంద్రియాది సాధనలను దేహయాత్రకు వినియోగించిన దుఃఖమును, ఆత్మయాత్రకు వినియోగించిన సుఖమును గలుగుచున్నవి. శ్రీకృష్ణుఁడు భగవద్గీతయందు జీవయాత్రను ఆత్మయాత్రను జేయఁగలవిధమును జక్కఁగా బోధించెను.

శ్లో. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః,
తదర్థం కర్మ కౌంతేయ, ముక్తసఙ్గస్సమాచర.
యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యన్తే సర్వకిల్బిషైః,
తే త్వఘం భుఞ్జతే పాపా యే పచన్త్యాత్మకారణాత్.
— భగవద్గీత, అ. 3—8, 13.

మానవులు యజ్ఞములను ఆత్మార్థము చేయునపుడు, పుణ్యమును దేహార్థము చేయునపుడు పాపమును బొందుచున్నారు. మానవులు కర్మలను పరహితార్థము చేయునపుడు మోక్షమును, స్వకామ్యార్థము చేయునపుడు బంధమును బడయుచున్నారు. గీతాశాస్త్రము బోధించుచున్న ఈ పవిత్రభావమునే వీరశైవము గురు లింగ జంగమసాధన రూపమున సార్థకము చేయుచున్నది. సాధకుఁడు సకల ప్రపంచమును లింగరూపమునను నారాధించునపుడు దేహభ్రాంతి పోయి పరశివధ్యాన గలుగుచున్నది. దేహమునందుఁ గర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు పంచభూతములను నాశ్రయించి విషయములను భోగించుచు జీవ స్వరూపమును విస్మరింపఁ జేయుచున్నవి. జీవ స్వరూపమును గనుఁగొనుటకు, నిరంతరమును విషయవాసనలను ఆత్మార్పణము చేయుటకు మహానిగ్రహము పరమసాధనమని మహానుభావులు బోధించుచున్నారు. వేదాంతులు వేదములందును, యోగులు యోగములందును, కర్మోపాసకులు యజ్ఞములందును, ఆగమజ్ఞులు ఆగమములందును నీ పరమరహస్యమును బోధించుచున్నారు. సాధకులు ఇంద్రియములను మనస్సునందును, మనస్సును చిత్తమునందును, చిత్తమును బుద్ధియందును, బుద్ధి నహంకారమునందును లయముచేసి బ్రహ్మానందమును అనుభవించుటకు లింగ నిరీక్షణము పరమసాధనమని వీరశైవము బోధించుచున్నది.

సహస్రారమునందుఁ బరంజ్యోతియై ప్రకాశించుచున్న పరబ్రహ్మమును సందర్శించుటకు దేహేంద్రియ ములు జ్యోతిస్స్వరూపమును బొందవలయును. ఇంద్రియాదులను వేధించి ఆత్మప్రసాదమును బడయుటకు దేహము మంత్రపూతమై చిన్మయము కావలయును. శివభూతశుద్ధి యోగము ప్రతిపాదించిన షట్చక్ర నిరూపణమును వీరశైవము షట్స్థలపూజ, షడ్లింగ సందర్శనము రూపమున భక్తుల నిత్యోపాసనమునందు సమన్వయము చేయుచున్నది వైదికమతమునందుఁ గామ్యార్థములకును, మోక్షమునకును మంత్రోపాసన ప్రాముఖ్యమును బడసిన విధమును వేదములు, వేదాంగములు విశదము చేయుచున్నవి. భూతశుద్ధికివి, కైవల్యమునకును పంచాక్షరీమంత్రము ప్రధానసాధనమని వీరశైవము వ్యక్తము చేయుచున్నది. ఆమహామంత్రము షట్చక్రములను షట్స్థలములను వేధించి నాదరూపమున సహస్రారమునందు సదాశివరూపమునను వెలుంగుచున్న విధమును శ్రీమచ్ఛంకరాచార్యులు సౌందర్యలహరియందు మనోహరముగను వర్ణించియున్నారు.

శ్లో. క్షితౌ షట్పఞ్చాశ ద్ద్విసమధికపఞ్చాశ దుదకే
హుతాశే ద్వాషష్టి శ్చతురధికపఞ్చాశ దనిలే,
దివి ద్విష్షట్త్రింశ న్మనసి చ చతుష్షష్టి రితి యే
మయూఖా స్తేషా మప్యుపరి తవ పాదామ్బుజయుగమ్.
— సౌందర్యలహరి — 14

శ్లో. మనస్త్వం వ్యోమత్వం మరు దసి మరుత్సారథి రసి
త్వ మాప స్త్వం భూమి స్త్వయి పరిణతాయాం నహి పరమ్,
త్వమేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా
చిదానన్దాకారం శివయువతి భావేన బిభృషే.
— సౌందర్యలహరి — 45

శ్లో. సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్.
దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః,
పరస్పరం భావయన్తః శ్రేయః పర మవాప్స్యథ.
— భ. 3 అ. 10 - 11.

మానవుల పురోవృద్ధికి కర్మలను సాధనంబులనుగ భగవంతుఁడు నిర్మించెను. ఆకర్మలు దేవతారాధనమునకు వినియోగపడునపుడు శ్రేయఃప్రాప్తికి సాధనంబు లగుచున్నవి.

### సహస్రారము

### ఓమ్ సత్యమ్

| షడ్లింగములు | షట్స్థలములు | షడక్షరి | షట్చక్రములు | వ్యాహృతులు |
|---|---|---|---|---|
| మహాలింగము | ఐక్య | ఓమ్ | ఆజ్ఞా | ఓమ్ తపః |
| ప్రసాదలింగము | శరణ | య | విశుద్ధ | ఓమ్ జనః |
| చరలింగము | ప్రాణ | వా | అనాహత | ఓమ్ మహః |
| శివలింగము | ప్రసాది | శి | మణిపూరక | ఓమ్ సువః |
| గురులింగము | మాహేశ్వర | మః | స్వాధిష్ఠాన | ఓమ్ భువః |
| ఆచారలింగము | భక్తి | న | మూలాధార | ఓమ్ భూః |

సాధకుఁడు ఆజ్ఞాచక్రవర్తియై తపోలోకమునందు దివ్యదృష్టిని గలిగి మహా శివలింగమును గాంచునపుడు ఓంకారాతీతమై

సదాశివైక్యమయమైన సాయుజ్యము గలుగుచున్నది. సహస్రారము లింగైక్యమునకు ముఖముగ నున్నది.

వీరశైవాగమములందు వేదాంత మంత్రశాస్త్రముల రహస్యములు భిన్నరూపములను సమన్వయమునుబొంది, భక్తియోగ ప్రభావమును నిత్యజీవనమునందు విస్తరింపజేసినవి. ఆత్మవికాసమునకును, సంఘజీవమునకును, భక్తప్రసాదమునకును, శివసాయుజ్యమునకును వీరశైవము పరమసాధనముగ నేర్పడినది.

పరమాత్మనిఁ గనుఁగొనుటకు భక్తి పరమసాధనమని అన్ని మతములును దెలుపుచున్నవి. విశ్వరూప సందర్శనమునకు భక్తి పరమసాధనమని శ్రీకృష్ణుఁడు పరమభక్తుఁడైన విజయున కుపదేశించినవిధము భక్తిప్రభావమునకు నిదర్శనము.

శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప!
మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు యః స మా మేతి పాండవ!
భగ. 11 – అధ్యా. 54—55.

హితసదాచారవృత్తి సద్భక్తి
సహజజంగమలింగ సద్భక్తి గలిగి
విను శివలాంఛన విశ్వాసియైన
ఘనుఁడు భక్తుం డనఁగా నుతికెక్కు
పరధనంబును బరభామలఁ గోర
కరయు లింగైకనిష్ఠాత్ముఁడై పేర్చి
భావశుద్ధియు దృఢభక్తియుఁ గలుగ
మావారు భక్తుని మాహేశుఁడండ్రు
ప్రేమ లింగమున కర్పింపని ద్రవ్య
మేమియు నంటక నిష్టలింగప్ర
సాదంబు భోగింప సావధానమున
నాదట వర్తించు నతఁడు ప్రసాది
యనురక్తి లింగంబుఁ బ్రాణంబుఁ గూర్చి
ఘనతర ప్రాణలింగ శరీరి యగుచు
నేసుఖదుఃఖము లెఱుఁగక శివుని
దానుఁడై కొలుచు నాతఁడు ప్రాణలింగి
తనకు లింగము పతి దాను సత్పత్ని
యని నమ్మి పంచేంద్రియముల సౌఖ్యంబు
దా నెఱుంగక లింగతత్పరుం డగుచు
జానొంద శివుఁ గొల్వ శరణుఁడౌ నతఁడు
ఒలసి షడ్వర్గ షడూర్మిషడ్భ్రమల
నలర కష్టవిధార్పనంబును లేక
శర్వునకుఁ దనకు సందింతలేక
నిర్వాణపద మంది నిర్వాణుఁడగుచు
ఒగి శిఖికర్పూరయోగంబుభంగిఁ
దగిలి వర్తించువాఁతడు శివైక్యుండు.
—దీక్షాబోధ 81—85

శ్రీకృష్ణపరమాత్ముఁడు ఉపదేశించిన భక్తిమార్గమునే లింగధారణరూపమున వీరశైవము వ్యక్తముచేయుచున్నది. సాధకుఁడు చిత్తమును శివునియందు లయముచేయుటకు నిరంతరమైన శివధ్యాన సాధనముగ నున్నది. అభ్యాసమువలన ధ్యాన కల్గుచున్నది, జంగమార్చనలవలనను అభ్యాసమును, కర్మఫలత్యాగమును, శివసందర్శనమును గలుగుచున్నవి. బాహ్యాభ్యంతరముల గురులింగ జంగమలింగార్చనలందు సాధకునకు భక్తి స్వరూపము గోచరంబగుచున్నది. బసవచరిత్రయందు సామాన్యజనులు మహాభక్తులై శివసాయుజ్యమును బొందినవిధము మనోహరముగ వివరింపఁబడినది. బసవమతము వైదికమతమును ప్రతిఘటించినను నిగమాగమ పురాణాదులందుఁ బ్రతిపాదితములైన సాధనలను స్వీకరించి లింగధారణకుఁ బ్రముఖతను గల్పించినది. వీరశైవము కొంతకాలము మహావ్యాపకత నొందినది. కాలక్రమమునఁ జిన్మయదీక్ష, లింగధారణము కులాచారములై, భేదాచరణమును గల్పించి, వ్యక్తివికాసములకును, సంఘజీవనమునకును, మానవకల్యాణమునకును నిరర్థకములై, వీరశైవప్రతిభను తగ్గించినవి.

## సాధ్యము

జీవుఁడు జీవయాత్రయందు శివస్వరూపమును బొందుటయే జీవయాత్రకుఁ బరమ ప్రయోజనము. "అహం బ్రహ్మాస్మి," "తత్త్వమసి," "శివోఽహం" ఇత్యాది మహావాక్యార్థములను జీవయాత్రయందు సార్థకము చేయుటకు వీరశైవము తలపెట్టినది. లింగధారణము శివభక్తులందు ద్వైతభావమును బోఁగొట్టి అద్వైతభావమును వ్యక్తము చేయుచున్నది. పరమశివుఁడు, జీవుఁడు, ప్రకృతి; ఆత్మ, జీవుఁడు, దేహము; గురువు, లింగము, జంగము; భావలింగము, ప్రాణలింగము, ఇష్టలింగము; లింగశరీరము, సూక్ష్మశరీరము, స్థూలశరీరము; నాదము, బిందు, కళ; ఇత్యాది త్రివిధ భావరూపములను విశ్వమంతయును గోచరం బగుచున్నది. సృష్టికి వ్యక్తరూపమైన నాదము విశ్వమును లింగరూపమున నావరించి కళారూపమునను సువ్యక్త మగుచున్నది. నాదము చైతన్యకళారూపమున సహస్రారమునందు విలసిల్లుచుఁ బ్రాణకళల నాకర్షించుచున్నది. ప్రపంచమంతయును చైతన్యాధిష్ఠితమైన జంగమస్థావర రూపములను బ్రభవించుచు శ్రేయఃప్రాప్తికి సాధనంబుగ నున్నది. బాహ్యాంతరములందు లింగధారణము పంచభూతములను, దశేంద్రియములను, అంతఃకరణచతుష్టయమును వేధించి సాధ్యమును జేరుటకుఁ బరమసాధన మని వీరశైవము బోధించుచున్నది. లింగాంగి జంగమలింగ ప్రసాదమునందు ఇష్టార్థసిద్ధిని, గురులింగప్రసాదమునందు భావార్థసిద్ధిని గలిగి, నైష్కర్మ్యఫలసిద్ధిని బొందుచు, శివకైవల్యమును బొందుచున్నాఁడు. సాధకుఁడు లింగాంగ సంయోగమును బొంది ద్వైతభావమును విడిచి, గురులింగజంగముల తీర్థప్రసాదములను సేవించి, అద్వైతసిద్ధిని బొందుచున్నాఁడు. వీరశైవమత సంప్రదాయములు తీర్థప్రసాదముల మహిమను విశేషముగ బోధించుచున్నవి. శ్రీ గురుప్రసాదము స్థూలరూపమునను, భావరూపమునను సాధకునిఁ జిన్మయునిఁజేసి, శివభక్తగణమునందుఁ జేర్చుచున్నది. జంగమార్పితములైన యిష్టపదార్థములు శివా ములై మహాప్రసాదభావమున సాధకునకు శివప్రసాదమును గ జేయుచున్నవి. మానవుల సుఖదుఃఖములకు కోపప్రసాదములు ణంబులుగ నున్నవి. కోపము పశులక్షణమై దుఃఖమును, ప్ర మీశ్వరలక్షణమై సుఖమును గలుగఁజేయుచున్నవి. భక్తియు మైన శ్రీ గురు లింగ జంగమ ప్రసాదము శివసాయుజ్యము సాధనమై యున్నది. భావప్రాణేష్టలింగపరమైన శ్రీ గురులింగజ మైక్యాత్మకమైన వీరశైవతత్త్వము, వీరశైవమునకు శివాద్వై మును ప్రతిపాదించుచున్నది. శైవసిద్ధాంతములు ద్వైతప్రతి కము లనియును, ద్వైతాద్వైత ప్రతిపాదకము లనియును భిన్నా ప్రాయములు ప్రబలియున్నను, వీరశైవము శివాద్వైతము ప్రతిపాదించుచున్నదని పండితాభిప్రాయము.

ఆలింగమునకుఁ బంచామృతస్నపన
మొనరిఁ గావించి సర్వోపచారముల
సగ్పించి ధూపదీపాదు లర్పించి
చర్చింప సూక్ష్మమై సకలదిక్కులను
బరమసత్కళ మున్నై భరితమై యుస్కి
సరయ శిష్యుని శిరంబా దున్న కళను
గని గురుమూర్తి యాకర్షించి లింగ
మునయందు మంత్రోక్తముగఁ బ్రతిష్ఠించి
యాలింగమును శిష్యహస్తాంబుజమునఁ
గీలించి నీవిందుఁ గృపతోడ నుండు
మని దేవుఁ బ్రార్థించి యతని కర్పించి
వినయస్థుఁడగు శిష్యు వీక్షించి నీకుఁ
బ్రాణలింగ మితండు భావించి యెపుడుఁ
బ్రాణపదంబుగ భజియింపుచుండు
ధరియింపు మేప్రమాణము లేకయుండ
ధరియింపఁ గాఁ బ్రమాదము వచ్చె నేని
ప్రాణపరిత్యాగ మర్థంబు సుమ్ము
ప్రాణలింగుల కని పదిలంబు పరచి
సుహితాంగలింగైక్య శోభనక్రియల
సహజైక్యసత్ప్రసాదాంగుఁ జేసి
సహజవాయుప్రాణ సంబంధ మొనరిచి
విహితలింగ ప్రాణవిశ్వాసుఁ జేసి
యమలాత్మఁ జిజ్జ్యోతియందు సంధించి
విమలతత్త్వార్థ వివేకంబు నొసఁగి
యిద్ధజీవన్ముక్తిహేతువై తనరు
శుద్ధశైవ రహస్యసూక్తులఁ దెలిపి
స్వాదుస్వకీయ ప్రసాదంబు నొసఁగి
వేదోక్తసద్భక్తివేత్తఁ గావింప
మూహించి గురువాక్యమౌళి శిష్యుండు
దేహభావములఁ దద్దేవు ధరించి
ఘనుని నిత్యుని సర్వగతుని సేవలుని
యనుపమశివుని జ్ఞానానందమయుని

నాదాత్ము నీశ్వరు నైర్గుణ్యమూర్తి
నాదిమధ్యరహితు ననుపము సూక్ష్మ
తనుని షట్త్రింశదుత్తరతత్త్వవర్తి
ఐనుఁ బరాత్పరతరుఁ బ్రహ్మస్వరూపు
నిట్టిలింగముఁ దన కిచ్చి రక్షించి
నట్టి శ్రీగురునాథు నంఘ్రిపద్మములు
తనశిరంబున నిరంతరమును దాల్చు
కొనియుండ భావించికొనుచు శిష్యుండు
నాగురునాథుని నాలింగమూర్తి
నాగురుప్రతిబింబ మగుజంగమంబు
వరుసతో నేకభావంబుగాఁ దెలిసి
స్థిరభక్తియుక్తిఁ బూజింపుచునుండె.

—వీ. దీ. బో. 46—47.

వీరశైవమునకు లింగధారణము బీజము; లింగభక్తి శక్తి; గురులింగ జంగమప్రసాదము కీలకము. శైవము ప్రాచీనవైదిక మార్గమునఁ గర్మలను, వర్ణాచారములను నాశ్రయించుచు వృద్ధిని బొందినది. వీరశైవము కర్మసంస్కారములను, జాతిభేదములను నిరసించుచు, లింగధారణదీక్షను శాసించుచు, శైవమునకు నూతన చైతన్యమును గలుగఁజేసినది. ఇష్టలింగారాధనము కైవల్యమునకు సాధనము గాఁగల విధమును వీరశైవ ముపదేశించుచున్నది.

పరికింప నీదేహ మరమేశుఁడుండు
గరిమతో నాదాత్మకం బండ్రు దీని
నదియె పో పరశివుండన్న యంతఁడు
నదియె మహాలింగ మనమున్న యాతఁ
డతనికి నెల్ల ద్రవ్యము నర్పింప
నతుల ప్రసాదసౌఖ్యము గల్గ ననుచుఁ
గౌరికి శంభుండు క్రమ మానతిచ్చె
నీరీతి నర్పింప నెఱుఁగ రెవ్వారు.

* * *

నీకాయమందును నీప్రాణమందు
నీకరణములందు నిండెడు నెద్ది
యది యనాద్యంతంబు నప్రమేయంబు
సదసదుత్తరము నక్షయము నసాధ్య
పదమనియును జెప్పఁ బడు పరశివుని
పదమంకళ శిరఃస్థానమం దుండి
యది యిట్టిదని వచియింప వర్ణింపఁ
గదిసి వేల్పులకు నశక్యం బెవ్వరికిని
దగు మనోజ్ఞానచింతల కందరాని
దగు నిర్మలంబు నిత్యము నిరంజనము
నరసిచూడఁగఁ దాన యత్యంతసూక్ష్మ
తరమగు పరకళ దానకాదెట్లు
నకళ దాన కాదే గురునాథుఁ
డాకర్షణముఁజేసి యాట లింగమందుఁ

జెట్టి శిష్యనికరపేటిక నిలువ
గట్టిగా ప్రాణలింగం బయ్యెఁ దెలియ.

* * *

అంగంబునను లింగ మధివసించుటను
లింగాంగి కంగంబు లేదని తెలిపి
యంగంబు లింగమం దణఁగుటఁజేసి
లింగాంగములు రెండు లేకుంట దెలిపె
మునుపు లింగము ప్రాణములయందు నెలవు
గొనఁ బ్రాణగుణ మణంగుట నెఱిఁగించె
కళయందుఁ బ్రాణంబుఁ గళ ప్రాణమందు
నిల రెండుఁ గలిసియుండెడికీలుఁ దెలిపె
నదిగానఁ గళతోడఁ బ్రాణంబుతోడఁ
పొదలిన లింగంబు పూజ్యలింగంబు.

—ప. దీక్షాబోధ 94–95.

బసవేశ్వరుని కాలమునందు జైనబౌద్ధమతముల ప్రతిభ తగ్గినది. శ్రీ శంకరాచార్యులు వైదికమత ప్రతిభను బునరుద్ధరించినను, ప్రజాసామాన్యమునకు నిరుపయోగమయినది. శైవాచార్యులు శివలింగార్చనరూపమున శైవమును గాపాడుచున్నను, శైవమునకు నిస్తేజస్త్వము గలిగినది. ఆళ్వారులు, శ్రీమద్రామానుజాచార్యులు వైష్ణవ మతవ్యాపనమునకుఁ బూనుకొనిరి. ప్రాచీనాచార ధర్మములు వికలత్వమును బొందినవి. నవీనాచార ధర్మములు వ్యాపకమును బడయలేదు. కులభేదములు, జాతిభేదములు, మతాచారభేదములు ప్రజాహృదయమును నిర్వీర్యము చేసి, నిర్జీవత్వముఁ బ్రబలఁజేసినవి. ఇట్టి విషాదస్థితియందు సంఘమునందు వీరశైవము చిత్కళాన్యాసమునుజేసి మహాపరివర్తనమును గలుగఁజేసినది, శివభక్తి చిహ్నమైన లింగధారణము వీరశైవమును వీర్యవంతము చేసినది. వీరశైవమునందు గురుప్రసాదితములైన భక్తిభావనలు జంగమార్చనలందు సార్థకములై భక్తిరసావేశమును గలుగఁజేసినవి. వీరశైవులైన లింగాంగులందఱు నగ్రజాంత్యజ కులభేదములు లేక తీర్థప్రసాదములను గ్రహించుచు, శివస్వరూపులై శివసాయుజ్యమును బొందుచున్నారు. వీరశైవమునందు సిద్ధాంతమైన శివభక్తి ప్రసాదము జంగమార్చనలందుఁ గ్రియారూపమున సార్థకమగుచున్నది. బసవపురాణమునందు మనోహరముగ వర్ణింపఁబడిన ప్రాకృతభక్తుల దివ్యచరితములు వీరశైవ మతప్రతిభను విశదము చేయుచున్నది.

## బసవేశ్వరుఁడు

బసవేశ్వరుఁ డొక మహావ్యక్తి. బ్రాహ్మణకులజాఁడైన బసవేశ్వరుఁడు బ్రాహ్మణకులమును విడుచుట బసవేశ్వరుని దృఢసంకల్పమును వెల్లడి చేయుచున్నది. బసవేశ్వరుఁడు పరమశివభక్తుఁడయ్యును, బిజ్జలునకు మంత్రిత్వమును, దండనాయకత్వము వహించి రాజ్యభారమును నిర్వహించెను. బసవేశ్వరుఁడు తన సర్వస్వమును, రాజ్యాదాయమును, రామదాసు శ్రీరామమూర్తికి కైంకర్యము చేసినరీతిని జంగమార్చనలకు సమర్పించుచుండెను. శివానుగ్రహమువలన బిజ్జలుని కోశమునందు ద్రవ్యమునకు లోటు లేకుండెడిది. ఆతఁడుఁ భక్తులకుఁ దనభార్యనగలను, వలువలను సమర్పించి జంగమార్చనలం దిష్టలింగార్చనలను జేయుచుండెను. బసవేశ్వరుఁడు తాను మంత్రియును నహంకారములేక జంగమకోటులకు సముచితార్చనలను సలుపుచుండెను. అనన్యమైన జంగమభక్తి బసవేశ్వరుని త్యాగశీలమును విశదముచేయుచు బసవేశ్వరభక్తిని విస్తరింపఁజేసినది. వైరాగ్య సన్న్యాసావహితమై జడమయమైన సంఘమునందు బసవేశ్వరుఁడు చైతన్యకళాన్యాసమును జేసి కర్మయోగ ప్రవృత్తి నుద్బోధించెను.

జైనబౌద్ధులు కర్మసన్న్యాసులై సంఘమునందు వైరాగ్యమును వ్యాపింపఁజేసిరి. భక్తికి, ప్రజాగౌరవమునకు కాషాయాంబరములు చిహ్నములైనవి. భిక్షాటనము పూజ్యమైన వృత్తియైనది. గృహస్థాశ్రమమునందు విరక్తి ప్రబలించినది. ప్రజలు నిరాశయులై, సంఘశక్తి క్షీణించినది. బలములేని సంఘము స్వధర్మనిర్వహణమునకు నిరుపయోగమైనది. భగవద్భక్తిని సార్థకము చేయుటకు మానవసేవయే పరమసాధనముగ నున్నది. బసవేశ్వరుఁడు నిత్యజంగమార్చనలందు ఆత్మపూజను, శివపూజను, సంఘపూజను సాధ్యముచేసి, సంకుచితమైన భక్తిమార్గమును సంఘజీవనమును విస్తరింపఁజేసి వీరశైవమును వీర్యవంతముఁజేసెను. బసవేశ్వరుని రాజ్యాధికారము, దృఢసంకల్పము, పరమశివభక్తి, త్యాగశీలము, కులనిరసనము, జంగమభక్తి, మాహాత్మ్యము వీరశైవవ్యాపనమునకు సాధకంబులై, బసవావతారము ప్రసిద్ధిని బడసినది. వీరశైవచరిత్ర బసవేశ్వరుని మహిమను వెల్లడి చేయుచున్నది.

కర్ణాటకాంధ్ర భాషలందుఁగల వీరశైవ వాఙ్మయమును పండితులు పరిశోధించి వీరశైవతత్త్వమును వ్యక్తము చేయుదురుగాక!

[బసవపురాణము, ప్రస్తావన - 1926]

# ఆంధ్రవాఙ్మయ చరిత్ర

ఆంధ్రవాఙ్మయము చిరకాలసంవర్ధితమై సువిష్పన్నముగ వర్ధిల్లుచున్నది. వాఙ్మయ వికాసపరిణామములకు ప్రజాజీవనవికాసపరిణామము లాధారములుగనున్నవి. ప్రజాజీవనమునందు గోచరమగు వృద్ధిక్షయములు వాఙ్మయ చరిత్రమునందు గోచరించుచుండును. రాజకీయవిజయములు, సాంఘిక పరివర్తనములు, మతమీమాంసలు, ప్రకృతిసంపదలు వాఙ్మయ స్వరూపములందు ప్రత్యక్షమగుచుండును. అనేకశతాబ్దములందు వృద్ధిక్షయములకు లోనగుచు వచ్చి నేటికిని జీవకళలతో విలసిల్లుచున్న ఆంధ్రవాఙ్మయపరిణామము ప్రజాహృదయక్షేత్రములందును, వాఙ్మయస్వరూపములందును ప్రత్యక్షముగ గోచరమగుచున్నది. ప్రత్యక్షముగ గనుపడుచున్న వాఙ్మయపరిశీలనము వాఙ్మయ హృదయ గ్రహణమునకును, భావివికాసమునకును ధనము గాగలదు.

ఆంధ్రులు ద్రవిడశాఖకు జెందినవారను సిద్ధాంతము సామాన్యముగ నంగీకరింపబడుచున్నది. బ్రాహ్మణులందు ఆంధ్రులు, తమిళులు, కర్ణాటకులు, ఘూర్జరులు, మహారాష్ట్రులు పంచద్రావిడబ్రాహ్మణులు. వింధ్యాద్రికి దక్షిణభాగములు వీరికి నివాసస్థలములు. ద్రవిడు లార్యులకు బూర్వము పశ్చిమోత్తరమార్గమున భరతఖండమునందు ప్రవేశించిన పరదేశీయులను సిద్ధాంతమును బండితులు ప్రతిపాదించుచున్నారు. దక్షిణదేశ ప్రాంతవాసులు —ముఖ్యముగ దమిళులు— ఆర్యులు రాకపూర్వము దక్షిణదేశమునందు స్థిరవాసము నేర్పరచుకొని శాస్త్రకళాకోవిదులై వర్ధిల్లుచుండిరి. పి.టి. శ్రీనివాసయ్యంగారు ద్రవిడు లాదిమనివాసులని సిద్ధాంతమును జేసినారు. ద్రవిడు లాదిమనివాసులైన యనార్యజాతులవలె ననాగరికులు గారని వారి ప్రాచీన సభ్యత విశదము సేయుచున్నది. బెలూచిస్థానమునందుగల బ్రాహూయీభాషకును, ద్రవిడభాషలకునుగల పోలికలనుబట్టి ద్రవిడులకును, బ్రాహూయీలకును సంబంధము గలదనికాని, ద్రవిడులు వాయవ్యదిశనుండి వచ్చినవారని కాని నిర్ణయించుట యసమంజసము. రామాయణము లంకయందు నాగరికత ప్రబలియున్నటులు తెలుపుచున్నది. లంకాపుర వర్ణన మిప్పటి కాలపు నగరవర్ణనలను స్మరింపజేయుచున్నది. రామాయణ కాలమునందు దక్షిణదేశము నాగరికతను గలిగియున్న విధమును రామాయణము తెలుపుచున్నది. ఆర్యశాఖకు చెందినవారు ప్రపంచమునందంతటను గనుపడుచున్నారు. ద్రవిడశాఖకు చెందినవారు ఇతర ప్రాంతములందు గనుపించుటలేదు. ద్రవిడు లార్యులు రాకపూర్వమే దక్షిణభాగమునందు ప్రబలమైన నాగరికతను గలిగియుండిరి. లంకకును, దక్షిణదేశమునకును సంబంధ ముండియుండుట సహజము. సంబంధము లేనియెడల లంకస్థితియే వారికి తెలిసియుండదు. లంకాద్వీపవాసులును, ద్రవిడులును మహాప్రళయమునందు మునిగిపోయిన సుమేరియా ఖండవాసులై యుందురేమో విమర్శింపదగిన విషయముగనున్నది. ద్రవిడులకును, డ్రూయిడులకును సంబంధమేమైనను గలదేమో పరిశీలింపదగినవిషయము. అస్సీరియనులకును, ద్రవిడులకును సంబంధము గలదని ద్రవిడ పండితులు కొందరు ప్రతిపాదించుచున్నారు. హిందూపత్రికయందు రామస్వామిఅయ్యరుగారు బైబిలునందలిహీబ్రూపదములకును, తమిళపదములకును జూపిన పోలికలు విచారయోగ్యములుగ నున్నవి. ఆర్యుల సంపర్కమువలనను గాలక్రమమునను ద్రావిడసభ్యతయందు మార్పులు గలిగినను ద్రవిడుల ప్రాచీనత, సభ్యత నిర్వివాదాంశములు. పండితులు విషయవిమర్శనమును ద్రావిడార్యాభిమానదృష్టితోగాక సత్యాన్వేషణాభిలాషతో జేయుట సమంజసము.

## ఆంధ్రులు

తెలుగు, తెనుగు, ఆంధ్ర శబ్దములు సమానార్థములుగా నిపుడు వాడుకయందున్నవి. ఈపదములం దాంధ్రపదమే ప్రాచీనము. ఈపదములు దేశమునకును, ప్రజలకును, భాషకును సమానార్థకములుగ వాడుకయందున్నవి. ఈపదముల వ్యుత్పత్తిని నిర్ణయించుటకు బండితు లింతవరకును జేసిన ప్రయత్నములు సంతృప్తికరంగా గనుపడవు. ఆంధ్రు లార్యులా, ఆర్యేతరులా యను విషయమై వాద ప్రతివాదములు జరుగుచున్నవి. ఆంధ్రుల చరిత్రను వ్రాసిన శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు మొదలగువా రాంధ్రు లార్యులని నిర్ణయించియున్నారు. ప్రజలవలన దేశభాషార్థము రూఢియైనదియు, దేశమువలన ప్రజాభాషార్థము రూఢియైనదియు నిర్ణయించుట దుష్కరముగ నున్నది. ఆంగ్లప్రజలవలన నాంగ్లదేశభాషార్థములు రూఢియైనవి. మహారాష్ట్ర ఘూర్జర ప్రజలవలనను దేశభాషార్థములు రూఢియైనవి. పాంచాలదేశనామము ప్రజార్థమును రూఢి చేసినది. ఆంధ్రపదమునందును, తెలుగుపదమునందును నీరెండు భావములును నిమిడియున్నటు లూహింపదగియున్నది. తెలుగుపదము త్రిలింగ పద జన్యమైనను త్రికళింగ పద జన్యమైనను నాదిని దేశపదార్థ ప్రతిపాదకమై కాలక్రమమున ప్రజాభాషాపరమైనటు లూహింప దగియున్నది. తెనుగు పదముకును, మాధుర్యమును సూచించెడు తేనెపదమునకును, తెన్, తిను, తెలుపు, తెలియు, తేటప పదములకును గల సంబంధమెట్టిదో విచారయోగ్యము. ఆంధ్రనామ మాదిని ప్రజాపరమై కాలక్రమమున రాజప్రాబల్యమువలన దేశభాషాపరమైనటులు తోచుచున్నది. ఆంధ్రరాజుల ప్రాభవ మాంధ్రపదార్థమును స్ఫుటముచేసినది. ఆంధ్ర, తెలుగు పదముల వ్యుత్పత్త్యర్థమును, చరిత్రార్థమును దురవగాహములుగ నున్నవి. ఆంధ్రశబ్దమును, తెలుగుపదమును సంస్కృతప్రాకృత ద్రవిడసంస్కారములందే సంస్కారప్రాభవమును సూచించినను వర్తమానకాలమునందు సమానార్థమును దెలుపుచున్నవి. సమానార్థమును దెలిపెడి పదప్రయోగములందు విపరీతాభిమానమును వహించుట ధీమంతుల కనుచితము.

ఆంధ్రు లుత్తరదేశమునుండి వచ్చిన యార్యులని సంస్కృతగ్రంథములవలన దెలియుచున్నది. ఆంధ్రులు కృష్ణాతీరమునందుగల శ్రీకాకుళమునుండి గోదావరి తీరమునందుగల నాసికవఱకును వ్యాపించినటులు గాథలు గలవు. ఈగాథలను సమర్థించుటకు దగిన యాధారములు గనుపడవు. ఆంధ్రరాజులకు ప్రతిష్ఠానపురము చిరకాలము ప్రారంభమునందు రాజధానిగ నుండినటులు శాసనాదులు తెలుపుచున్నవి. అనంతరము ధాన్యకటకము రాజధానిగ వెలసినది.

ఆంధ్రరాజుల ప్రాభవమువలన దేశమునకును, భాషకును, ప్రజలకును నాంధ్రనామము రూఢియైనది. ఆంధ్రప్రాభవము స్థిరపడని ఘూర్జర మహారాష్ట్ర కర్ణాటకాది దేశములందు సహజములైన ప్రజాభాషాబలములు స్థిరపడినవి. పదుమటి కనుమలం దాంధ్రలోయ యున్నను మహారాష్ట్ర వాసస్థానముగ నున్నది. నాసికా ప్రాంతమునందలి గుహ లాంధ్ర వైభవమునకు స్మరణ చిహ్నములుగ నున్నను మహారాష్ట్ర స్థానములుగ నున్నవి. ఆంధ్ర రాజుల ప్రాభవమును శిల్పములు, రాజ్యవిజయములు, దానధర్మములు మతాభినివేశమును చాటుచున్నను వారి ప్రతిభానురూపమైన వాఙ్మయ స్వరూపములు గోచరముగాకున్నవి. ఆకాలమునందు సంస్కృత ప్రాకృత భాషలకుగల ప్రముఖతయే యిందులకు గారణమని యూహింపదగి యున్నది. బౌద్ధయుగము వఱకును సంస్కృత వాఙ్మయము ప్రముఖతను వహించినది. ఆ యుగమునందు ప్రాకృతభాషలకు గొంత ప్రముఖత యేర్పడినను సంస్కృత భాషాప్రాబల్యమునకు బదచ్యుతి గలుగలేదు.

## ఆంధ్రరాజులు— వాఙ్మయము

ఆంధ్రరాజు లప్రతిహతముగ నాలుగువందల యేండ్లు భరతఖండమునందు విశేషభాగమును బాలించిరి. వారు నాసికనుండి మహేంద్రపర్వతమువఱకును, పాటలీపుత్రమునుండి కాంచీపురమువఱకునుగల దేశమును బాలించిరి: దిగ్విజయములను బడసిరి; కళలను బోషించిరి; పండితులను సన్మానించిరి; విహారములను,

స్తూపములను, ధర్మశాలలను గట్టించిరి. బ్రాహ్మణులను, సన్యాసులను, బౌద్ధులను నాదరించి వారికివసతులను గల్పించిరి; వర్ణాశ్రమమును బోషించిరి. ఇప్పటికి 1848 సంవత్సరముల క్రిందట ప్రారంభమై యవిచ్ఛిన్నముగ సాగుచున్న శాలివాహనశక మాంధ్రరాజుల ప్రతిభను వేయినోళ్ల జాటుచున్నది.*

ఆంధ్ర రాజుల ప్రతిభ ప్రజాభ్యుదయక్షేత్రములం దాంధ్రవాఙ్మయమున కంకురారోపణములను చేసినను వారి కాలమునం దా యంకురములు పల్లవించి యుండలేదు. పాలకుల భాషలు సంస్కృతప్రాకృతములు. ప్రజల భాష దేశభాష. బౌద్ధసన్యాసులు దేశభాషలందు బౌద్ధధర్మములను ప్రజలకు బోధించినను, ప్రాకృతభాషలే విశేషమైన వ్యాపకమునుగలిగియుండినవి. అమరావతిస్తూపమునందును, నాసిక, కార్లిగుహలందును, ఇతర ప్రాంతములందును లభ్యములగు శాసనములు ప్రాకృతభాషయందు గలవు. హాలుడు రచించిన శాలివాహన సప్తశతియును, గుణాఢ్యుడు రచియించిన బృహత్కథయును ప్రాకృతపైశాచీ భాషలందుగలవు. శాసనము లశోకలిపియందుగలవు. రాజావలంబనముగల భాషకుగల ప్రముఖత ప్రజాసామాన్యమునందు వాడుకయందున్న దేశభాషకు గలుగలేదు. అశోకలిపి ఆంధ్ర అక్షరముల స్వరూపమును దాల్చుటకును, దేశభాషకు వాఙ్మయస్వరూప మేర్పడుటకును చిరకాలము పట్టినది. ఆంధ్రరాజుల కాలము సంధైనను తమిళదేశమునకు గలిగిన శాంతి తెలుగుదేశమునకు గలుగలేదు. ఉత్తరదేశాగతులైన శత్రువుల నెదిరించవలసిన భారమునంతయు నాంధ్రరాజులువహించుచుండిరి. దేశీయవాఙ్మయాభివృద్ధికి సంగ్రామ పరంపరలును ప్రతికూలమై యుండియుండును. తమిళ వాఙ్మయమునకు గల ప్రాచీనత యాంధ్రవాఙ్మయమునకు లేకుండుటకీ పరదేశీయ సంస్కార ప్రాబల్యము ముఖ్యకారణమై యుండియుండును.

## పల్లవులు - ఆంధ్రవాఙ్మయము

పల్లవులును ఆంధ్రరాజులవలె సంస్కృత ప్రాకృత భాషలను పోషించుచుండిరి. ప్రాచీనపల్లవరాజులు శాస్త్రమతావలంబనులు. ఆంధ్రదేశస్థములైన వేంగిపురము, కాంచీపురములు వీరి రాజధానులుగ నుండినవి. వేంగిశాసనములును సామాన్యముగ సంస్కృతభాషయందు గనుపడుచున్నవి. వారికాలపు శాసనములును ఆరంభమునందు ప్రాకృతమునం దున్నను తరువాతివి సంస్కృతభాషయందు గలవు. పల్లవరాజులుదాల్చిన ముక్కంటి మొదలగు నామములనుబట్టి వారికాలమున దేశభాషయెడ నాదరణము ప్రబలినటు లూహింప దగియున్నది. ఏ దాంధ్రదేశ గ్రామస్థులైన బ్రాహ్మణులకు వృత్తుల నొసగి పోషించుటకూడ వీరి ఆంధ్రాభిమానమునకు నిదర్శనము.

## చాళుక్యులు - ఆంధ్రవాఙ్మయము

రాజరాజనరేంద్రుని కాలమునందు నన్నయభట్టారకుడు మహాభారతమును దెనిగించినను ఆకాలమునకు బూర్వమే యాంధ్రవాఙ్మయము వృద్ధిని బొందియుండవలయునని యందఱును నంగీకరించుచున్నారు. అప్పటి గ్రంథము లేవియును గనుపడకపోయినను నన్నయభట్టారక విరచితమైన మహాభారతమే ఆంధ్రవాఙ్మయము గలదని చాటుచున్నది. వాఙ్మయము లేనిది విలక్షణమైన మహాభారతమువంటి కావ్య మాకసమునుండి యుట్టిపడదు. తగినయాధారములు దొరకువఱకును నా కాలపు వాఙ్మయస్వరూపమునకు సంబంధించిన యూహాపోహలు నిరర్థకములు. పల్లవులకాలమునందు పల్లవించుట కారంభించిన యాంధ్రవాఙ్మయము రాజనరేంద్రుని కాలమునందు వికసించుట కుపక్రమించినది. గద్యరూపమునగల యాంధ్రశాసనము లాంధ్రవాఙ్మయాంకురముల స్వరూపస్వభావములను విశదము చేయుచున్నవి. గుత్తి విప్పర్లలో దొరికినట్టి చాళుక్యశాసనములును, కడప చోళుల శాసనములును ఆంధ్రవాఙ్మయమున నింతవఱకు గానవచ్చు మొదటి గద్యశాసనములు. అద్దంకి ధర్మవరములలోని పాండురంగనిశాసనములును, విజయవాడ యందలి యుద్ధమల్లుని శాసనమును ప్రాచీనాంధ్ర పద్యవాఙ్మయమునకు నిదర్శనములుగ నున్నవి. ఆపద్యములు మాత్రాగణబద్ధములై తరువోజాక్కరల రూపమున నున్నట్లు పండితుల నిర్ణయము. ఇట్టి గద్యపద్యశాసనముల నేర్పరిచి ఆంధ్రవాఙ్మయారంభములను నిర్ణయించుట వాఙ్మయపరిశోధన కవసరము. వేంగిపుర జీర్ణములను, నితరజీర్ణములను, ప్రాచీనాంధ్ర శాసనములను బరిశీలించుటవలన నాంధ్రవాఙ్మయారంభములను నిరూపించుట కవకాశములు గలుగగలవు. భాషాపరిశోధకులును, శాసన పరిశోధకులును జేసెడి పరిశోధన లిట్టి ఫలసిద్ధికి దోడ్పడగలవు. బర్మాదేశమునందు గల తలైంగు (తెలుంగు) రాజుల ప్రాచీన శాసనములును ఆంధ్రవాఙ్మయారంభములను నిరూపించుటకు దోడ్పడవచ్చును. ఈ రాజులు క్రీస్తుశకమునకు పూర్వమే తెలుగుదేశమునుండి వలసపోయి బర్మాయందు రాజ్యములను స్థాపించిరి. వారి శాసనముల లిపి వేంగిచాళుక్య లిపిని బోలియున్నటులు పండితుల మతము.

## ఆంధ్రవాఙ్మయ వికాసము

సకల శాస్త్రముల వికాసమువలె వాఙ్మయ వికాసమునకును సహజసత్త్వమును పరిసరములును సాధనములు. ప్రజాసత్త్వము ప్రకృతి పరిసరముల ననుసరించి భాషావాఙ్మయములందు సువ్యక్తమగుచుండును. అనుకూల పరిస్థితులు వృద్ధికిని, ప్రతికూలకూల పరిస్థితులు క్షయమునకు గారణము లగుచుండును. సృష్టిక్షయావస్థలందు స్థితము సూక్ష్మస్వరూపము గోచరమగుచుండును. ఆంధ్రభాషావాఙ్మయవికాసమునకు సంస్కృత ప్రాకృత ద్రావిడభాషా వాఙ్మయములు దోడ్పడినవి. ఆంధ్రప్రజా సత్త్వానురూపముగ భాషావాఙ్మయములు వికసించిన విధమును భాషా చరిత్రమును, వాఙ్మయ చరిత్రమును విశదము చేయుచున్నవి. ఆంధ్రభాష ద్రావిడభాషయని కొందరును, ప్రాకృతభాషయని కొందరును సిద్ధాంతమును జేయుచున్నారు. ఆంధ్రభాషకు ద్రావిడజన్యమనుగాని, ప్రాకృత బాంధవ్యముగాని గౌరవాగౌరవములకు గారణము గాజాలదు. తెలుగు తమిళ కర్ణాటక భాష లొకజాతి భాష లగుటవలన తెలుగుభాషకుగల గౌరవమునకు లోపము గలుగదు. తెలుగునకు సంస్కృతప్రాకృతభాషల బాంధవ్యమును ప్రతిపాదించుటవలన దానిగౌరవము హెచ్చదు. ఆంధ్రభాషావాఙ్మయముల యౌన్నత్యమునకు స్వకీయప్రతిభ సాధనముగాని పరకీయ సంబంధము కారణము గాజాలదు.

దక్షిణపీఠభూమియందు ద్రవిడు లార్యుల రాకపూర్వము నివసించుచుండిరి. ద్రవిడులకు బూర్వము ముండ, కోయ, చెంచు మొదలగు నారణ్యకజాతులు నివసించుచుండిరి. ఆదిమాంధ్రులును, సవరులును అనార్యులుగ పరిగణింపబడుచున్నారు. అనంతరము నాగులీ పీఠభూమి నాక్రమించిరి. నాగులును దక్షిణపీఠభూముల కాదిమవాసులై యుండిరని కొందరు తలంచుచున్నారు. చిలుకూరి వీరభద్రరావు గారాంధ్రదేశమునందును నాగులు నివసించినటుల చరిత్రయందు వ్రాసియుండిరి. నాగుల యనంతరము ద్రవిడులును, ఆర్యులును దక్షిణపీఠ భూముల నాక్రమించిరి.

తెలుగు తమిళ కన్నడములు ద్రవిడభాషలు. ఈ భాష లొకకుటుంబమునకు జెందిన భాషలు. ఈభాషలకు సహజమైన సంబంధము గలదు. ఆంధ్రభాష ద్రావిడభాషాకుటుంబమునందు ప్రత్యేక కుటుంబముగ సర్ జార్జిగ్రియర్సనుగారు నిర్ణయించిరి. తెలుగునుండి అరవము పుట్టినదనుటగాని, అరవమునుండి తెలుగు పుట్టినదనుటగాని యసంగతము. ఏకమాతృభాషా జన్యములైన తెలుగు తమిళ భాషా వాఙ్మయములు స్వీయతత్త్వమునకును, పరిసరములకును ననురూపముగ వర్ధిల్లి వ్యక్తిత్వమును బడసినవి.

దక్షిణ పీఠభూమి ఆదికాలమునుండియును ఆంధ్రభాషకు నిలయము. కృష్ణా గోదావరినదుల నడుమ నుండెడి తెలుగు భాషకు 'దమిళ' భాషాసంపర్కము బొత్తుగలేదు. తెలుగునకు సంస్కృతప్రాకృతభాషల ప్రాభవము తమిళమునకంటె నధికతరముగ సంక్రమించినది. సంస్కృతభాషా సంక్రమణము తెలుగునకు సంస్కారము నొడగూర్చినను భాషాసంప్రదాయమునకు భంగము గలుగలేదు. తెలుగు

---

* అయినను ఫ్లీటు మొదలగువారీ శకమును స్థాపించినవారు ఆంధ్రరాజులైన శాతవాహనులు కారని శంకించుచున్నారు. కొన్నికొన్ని ప్రాచీనశాసనములలో 'శక రాజ్యాభిషేక సంవత్సరములు' అనియు, 'శకనృపకాలాతీత సంవత్సరములు' అనియు నుండుటయే యట్టి శంకకు గారణము.

## తమిళభాషా వాఙ్మయములు

ద్రవిడభాషయందు తొల్ కాప్యము క్రీ. పూ. మూడవశతాబ్దమునందును, కురళ్ క్రీ. శ. మొదటిశతాబ్దమునందును, 'సిలప్పదికారం', 'మణిమేకలై' మూడవ శతాబ్దమునందును వ్రాయబడినటులు తమిళపండితులు నమ్ముచున్నారు. ఆంధ్రవాఙ్మయమునం దట్టి ప్రాచీనవాఙ్మయము గనుపడదు. ఈ ప్రాచీన వాఙ్మయ నిర్మాణమునకు దమిళదేశమునందున్న జైనబౌద్ధమతబోధకులు కారణ భూతులని యూహింప దగియున్నది. బ్రాహ్మణశైవమతవ్యాపనము జైనబౌద్ధ మతవిజ్ఞానవ్యాసనమును స్తంభింపజేసినది. మూడవయుగమునందు శంకరరామానుజాది మతాచార్యులు తమిళవాఙ్మయవికాసమునకు దోడ్పడినటులు మొదటియుగమునందును ఆర్యవిజ్ఞానప్రాబల్య మాంధ్రద్రావిడవాఙ్మయవికాసములకు దోడ్పడెను నుభయవాఙ్మయములును భిన్నమార్గములను వికసించినవి. ఆంధ్రులు సంస్కృతాక్షరామ్నాయమును, సంస్కృతవిజ్ఞానమును స్వీకరించిరి. తమిళులు 'వట్టెళుత్తు' అక్షరామ్నాయమును చిరకాలము వాడుచుండిరి. గ్రంథాక్షరములు కాలాంతరమున 'వట్టెళుత్తు' అక్షరామ్నాయము నాక్రమించినవి. సంస్కృత విజ్ఞానము నారంభమునుండియును తమిళులు సంశయభావముతో బరిగ్రహించుచుండిరి. ద్రవిడవాఙ్మయప్రాబల్య మాంధ్రవాఙ్మయముమీద గోచరము గాకుండుట కిదియే కారణమై యుండును. ఆంధ్రు లార్యవిజ్ఞానమున కొసగిన స్వాగతము ద్రావిడవిజ్ఞానమున కొసంగియుండలేదు. తెలుగు తమిళభాషలకుగల సామాన్యబాంధవ్యము నిలిచియున్నను తమిళ వాఙ్మయ ప్రాబల్య మాంధ్రభాషయందు విశేషముగ గనుపడదు. వర్తమాన కాలము నందును ఆంధ్రవాఙ్మయముమీద దూరస్థమైన వంగీయవాఙ్మయమునకుగల ప్రాబల్యము సమీపస్థమైన ద్రవిడ వాఙ్మయమునకు లేదు. శైవ వైష్ణవ మతములు వ్యాపించినకాలమునందు దమిళ వాఙ్మయ ప్రాబల్య మాంధ్రవాఙ్మయమునకు గొంతగలిగినది. నాయనారులచరితములును, ఆళ్వారుల వాఙ్మయమును నీ విషయమును విశదము చేయుచున్నవి.

## దేశము - వాఙ్మయము

దేశస్థితి శిల్పాభ్యుదయమునకు బరమప్రయోజనకరముగ నుండగలదు. దేశసౌందర్యము, దేశసౌభాగ్యము, దేశవైశాల్యము, దేశసంపదలు శిల్పవాఙ్మయ కళావికాసమున కనుకూలపరిస్థితులను సమకూర్పగలవు. గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రాది పావనస్రవంతులు, శ్రీగిరి భద్రగిరి సింహాద్రి శేషాద్రి వేదాద్రి మొదలగు పుణ్యగిరులు, సాగరసంగమములు, జలధారలు, ప్రకృతివైభవభాసమానములైన వనారామములు ప్రజాహృదయములను భక్త్యుత్సాహసమన్వితములు జేయుట కుపకరించినవి. దేశపరిమితియందు భిన్నకాలములందు హెచ్చుతగ్గు లేర్పడినను కేంద్రస్థాన మాదికాలమునుండియు ఆంధ్రసీమయై యాంధ్రవ్యక్తిత్వమును గాపాడుచున్నది. ఆంధ్రరాజులకాలమునందు బడమటికనుమలనుండి తూర్పుసీరమువరకును గృష్ణాగోదావరులనడుమ నాంధ్రావని వ్యాపించినది. శ్రీకృష్ణదేవరాయల కాలమునందు గటకమునుండి మధురవరకును ఆంధ్రరాజ్యము వ్యాపించినది. రాజ్యవ్యాపనముతో భాషా వాఙ్మయముల వ్యాపనమును నేర్పడినది. బ్రిటిషుయుగమునందు ఆంధ్రావని భిన్నరాష్ట్రములందు జీలికలై సహజబలమును గోల్పోయినను ఆంధ్రాభ్యుదయ మవిచ్ఛిన్నముగ జరుగుచున్నది. రాష్ట్రభేదము లున్నను మాతృభాషాభిమానమును, వాఙ్మయాభిరుచియును సకలప్రదేశములందును నభివృద్ధిని బొందుచున్నది. మహారాష్ట్రదేశస్థములైన బొంబాయి, నాగపురములందును, తమిళదేశస్థములైన దక్షిణస్థానములందును, నిజాము రాష్ట్రాంతర్గతమైన యాంధ్రభాగమునందును, బర్మాయందును ఆంధ్రభాషాభిమానము వర్ధిల్లుచున్నది.

## ప్రజలు - వాఙ్మయము

వాఙ్మయవికాసమునకు ప్రజాహృదయములు సుక్షేత్రములు. ప్రజల వృద్ధిక్షయములందు వాఙ్మయముల వృద్ధిక్షయములు ప్రతిబింబించుచుండును. ప్రజలవిజయములు, ప్రజాభివృద్ధి, ప్రజావ్యాపనము వాఙ్మయాభివృద్ధికిని, ప్రజాక్షయము, ప్రజాదౌర్బల్యము వాఙ్మయస్తంభనమునకును గారణము లగుచుండును. ప్రజలవిజయములు, సాహస పరాక్రమములు, మతావేశములు, శిల్పకళాకౌశలములు, విద్యావివేకములు, విజ్ఞాన సంపదలు, వ్యవసాయపరిశ్రమలవికాసము, ప్రశాంతవాతావరణము వాఙ్మయ వ్యాపనమున కనుకూలముగ నుండగలవు. పరరాజాక్రమణములు, మతకలహములు, దేశసంక్షోభము, నిస్సహాయస్థితి, అజ్ఞానావరణము, నిర్వ్యాపారత్వము వాఙ్మయ వికాసమునకు బ్రతికూలముగ నుండగలవు. ఆంధ్రదేశచరిత్రమును నితరదేశ చరిత్రమువలె నీవిషయమును సువ్యక్తము చేయుచున్నది. ఆదిని బ్రాహ్మణమతమును, అనంతరము బౌద్ధజైనమతములను, తదనంతరము బ్రాహ్మణశైవ వైష్ణవమతములును, పిమ్మట మహమ్మదీయ క్రైస్తవమతములును వాఙ్మయమున కుత్తేజనావసములను గలుగజేసినవి. మతములవలె రాజవంశములును వాఙ్మయాభ్యుదయమునకు దోడ్పడినవి. చాళుక్యరాజుల కాలమునందు బల్లవించిన యాంధ్రభాషావాఙ్మయములు చోళ కాకతీయ రెడ్డి విజయనగరరాజులకాలమునందు బుష్పించి ఫలించినవి. ఆరాజ్యముల నిర్గమన మాంధ్రవాఙ్మయవికాసమును స్తంభింపజేసినది. ఆంగ్లవిద్యాభ్యాసము, క్రైస్తవమతము వాఙ్మయమునకు నవీనవికాసము నొసగుచున్నను నాంధ్రసంస్కారము క్షీణించుచున్నది. వాఙ్మయవికాసమునకు సర్వతోముఖమైన ప్రజాహృదయ వికాసమే మూలాధారమని వాఙ్మయచరిత్రము విశదము చేయుచున్నది. వాఙ్మయాభివృద్ధికి ప్రజాభివృద్ధి, విద్యాభివృద్ధి నిదర్శనములుగ నుండగలవు.

ఆంధ్రమండలములందాంధ్రభాష మిశ్రమములేక వ్యాపించియున్నది. విశాఖపట్టణము, గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు మండలములందు 100 కి 90మంది తెలుగుభాషను మాటలాడుచున్నారు. పశ్చిమాంధ్ర మండలములైన కడప, కర్నూలు, అనంతపురము, బళ్లారియందును, బనగానపల్లియందును 100 కి 80 మందికి దెలుగుభాషమాతృభాష. ఈమండలములందు దమిళులసంఖ్య స్వల్పముగ నున్నది. అరవమండలములందు సేలము, కోయంబత్తూరు, మధుర తిరుచినాపల్లి, రామనాథము, ఉత్తరఆర్కాడు, చెంగల్పట్టు, తిరునల్వేలి మండలములం దాంధ్రభాషకు వ్యాపకము గలదు. చెన్నరాష్ట్రమునకు రాజధానియై ఆంధ్రదేశమునకు దూరస్థముగనున్న మద్రాసునందును ఆంధ్రమునకు వ్యాపక మతిశయిల్లుచున్నవిధమును జనాభాలెక్కలు తెల్లముచేయుచున్నవి.*

## నిజాము రాష్ట్రము - ఆంధ్రులు

ఆదికాలమునుండియు నిజామురాష్ట్రప్రాంత మాంధ్రభాషకు నిలయము. కాకతీయ ప్రభువుల కాలమునం దోరుగల్లు తెలుగుభాషకు ముఖ్యస్థానముగ నుండెడిది. ప్రతాపరుద్రుడు, విద్యానాథుడు, పండితారాధ్యుడు, శివదేవయ్య సుప్రసిద్ధులైన భాషాపోషకులు, పండితులు. పాల్కురికి సోమనాథుడు, పోతనామాత్యుడు కాకతీయరాజ్యవాసులు. నిజామురాష్ట్రమునం దాంధ్రభాషాభిమానము, వాఙ్మయాభిమానము వ్యాప్తిని గాంచుచున్న విధమును గ్రంథాలయములు, గ్రంథప్రచురణములు, పత్రికలు విశదము చేయుచున్నవి. ఆంధ్రప్రజ లధికముగ గల నిజామురాష్ట్రమునందు ఉస్మానియా విశ్వవిద్యాలయమువలె ఆంధ్రవిశ్వవిద్యాలయమునుగూడ స్థాపించుట ఆంధ్రభాషాభివృద్ధికిని, వాఙ్మయాభివృద్ధికిని, విద్యాభివృద్ధికిని, విజ్ఞానవ్యాపనమునకును నవసరము.

## ఆంధ్రుల ప్రాభవము

ఆంధ్రుల ప్రాభవము భరతఖండమునందు చిరకాలమునుండియు బ్రఖ్యాతి గలిగి యున్నది. ఒకకాలమునం దాంధ్రులు మగధరాజ్యసింహాసనము నధిష్ఠించి పాటలీపుత్రమునుండి కాంచీపురము వరకును, నాసికనుండి శ్రీకాకుళము వరకును బాలించిరి. విజయనగరరాజులు కటకమునుండి మధురవరకును బాలించిరి. ఆంధ్రులు జావా, బర్మా, మొదలగు విదేశములందును నివాసముల నేర్పరచుకొని వృద్ధిని బొందుచున్నారు. వర్తమానకాలమున భరతఖండమునందు వివిధప్రాంతములందును ఆంధ్రులు గలరు.

భరతఖండమునందు భిన్నభాషలను మాటలాడెడివారి సంఖ్యయం దాంధ్రులు మూడవస్థానము నలంకరించుచున్నారు.

---

* 1921—వ సంవత్సరపు జనాభా లెక్కలు.

ప్రాచీనసభ్యత్వము, దేశవైశాల్యము, ప్రజాబాహుళ్యమును నాంధ్రవ్యక్తిత్వమును బరిస్ఫుటము చేయుచున్నను కేంద్రస్థానమును, ప్రజలసంయోగమును, ప్రభుత్వావలంబనమును, వ్యాపారసౌకర్యములును, ధనసమృద్ధియును, సహజావకాశములును గలుగక దేశవికాసము, భాషావికాసమును యథావిధిగా సంభవముగాకున్నవి. ఆంధ్రోద్యమముతో నారంభమైన మహాసంచలనము ఫలోన్ముఖ మగుచున్నది.

## ఆంధ్రభాష - వాఙ్మయము

భగవద్దత్తములైన సృష్టి విశేషములందు మానవుని యౌన్నత్యమునకు భాష మూలాధారముగ నున్నది. భాషామూలమున విజ్ఞానసంరక్షణము, విజ్ఞానవ్యాపనము మానవులకు సాధ్యముగ నున్నది. చిరకాలము క్రితము మహర్షిప్రోక్తమైన విజ్ఞానము సంస్కృతభాషామూలమున మనుజులకు లభ్యమై బ్రహ్మానందమును గలుగజేయుచున్నది. వివిధభాషలందు సంచితమైన విజ్ఞానము మానవజాతికి లభ్యమై ప్రకృతియందు పరమార్థతత్త్వము నుపదేశించుచున్నది. పశుపక్షి మృగాదుల అవ్యక్తధ్వనులను గుర్తించినను సువ్యక్తశబ్దములు భాషారూపమున మనుజులకు మాత్రము గ్రాహ్యములగుచున్నవి. అవ్యక్తమున కాదిమవ్యక్తస్వరూపము శబ్దము. నాదబిందుకళాస్వరూపమైన ఓంకార మవ్యక్తమును సూక్ష్మరూపమున వ్యక్తము చేయుచున్నది. ఓంకారము అక్షరామ్నాయమునకును, అక్షరామ్నాయము పదములకును, పదములు పదార్థములకును మూలాధారములు. ప్రజల సంస్కారమున కనురూపముగ అక్షరామ్నాయమును, పదములును, భాషామ్నాయమును నేర్పడి మానవాభ్యుదయము గలుగుచున్నది.

అక్షరామ్నాయమునందు వివిధభాషలకు భేదము గలదు. ఆంగ్లభాషకు 26 అక్షరములు. అరవమునకు 31 అక్షరములు. ఉర్దూభాషకు 32 అక్షరములు. సంస్కృతభాషకు 50 వర్ణములు. ఆంధ్రభాషకు 36 వర్ణములైనను వాడుకయందు 56 వర్ణములు గలవు. పరిమితములైన వర్ణములుగల భాష కఠినమైన ధ్వనులను దెలుపుటయందు ద్విరుక్తి పునరుక్త్యాది దోషములు గలుగుచున్నవి. ఆంధ్రభాషయందలి అక్షరామ్నాయమున కట్టిలోపములు లేవు. ప్రత్యేక ధ్వనిని దెలుపుటకు ప్రత్యేకాక్షరములు గలవు. కొన్నిధ్వనులను దెలుపుట కక్షరములు లేకపోయినను నవి స్వల్పములు. సంస్కృతభాషా సంయోగ మాంధ్రభాష కిట్టి యమూల్యమైన ప్రయోజనమును సమకూర్చినది. అక్షరామ్నాయమునకువలె శబ్దామ్నాయమునకును సంస్కృతి మమూల్యప్రయోజనము నాంధ్రభాషకు గలుగజేసినది.

సంస్కృతభాషాపదము లనంతము లాంధ్రభాషయందు తత్సమ తద్భవ రూపముల ప్రవేశమును గాంచినవి. సంస్కృతపదజాల మాంధ్రభాషకు బలవీర్యముల నొసగినది. ఆంధ్రభాషయందలి సంస్కృత పదజాలము నిరసనామోదములకు కారణమైనది. సంస్కృతపదజాల మాంధ్రభాషకు సంస్కృతస్వరూపము నాపాదించినది. సంస్కృతసంస్కారము సహజమైన యాంధ్రభాషా వికాసమున కాటంకముగ పరిణమించినను సంస్కృతభాషా సాహచర్య మాంధ్రాభ్యుదయమునకు మహోపకార మొనర్చినది. ప్రజలకు, భాషకు, వాఙ్మయమునకు సంస్కృతము పరమోపకారము నొడగూర్చినది. భారత జాతీయ సంయోగమున కిట్టి సంస్కృతసంస్కారము సకలవిధములను వినియోగపడుచున్నది. ఉత్తరదక్షిణ దేశముల సంయోగసాహచర్యములకు సంస్కృతము వినియోగపడుచున్నది. ఆంధ్రభాషకు సంస్కృత సంస్కారము గలిగినను భాషా హృదయ మాంధ్రస్వరూపమును సంరక్షించుచు నాంధ్రభాషా వ్యక్తిత్వమును విశదము చేయుచున్నది.

ప్రాకృతభాషల సాహచర్య మాంధ్రభాష కనిర్వచనీయమైన మాధుర్యమును గలుగజేసినది. ఆంధ్రభాషకు 'దేశభాషలందు తెనుగు లెస్స' యను ప్రతీతి గలిగినది. ప్రాచ్యభాషలందు తెలుగుబాసమాధుర్యమునకును పేరొందినది. ఆంధ్రభాషయందు తమిళభాషాధ్వనులకుగల పారుష్యమును, సంస్కృతభాషాధ్వనులకు గల కాఠిన్యమును బోయి సరళధ్వను లేర్పడినవి. తత్సమపదములందు వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములు గలిగి పరుషధ్వనులు సరళధ్వనులుగ మారి యాంధ్రభాషకు సహజమాధుర్య మలవడినది. 'యజ్ఞము—జన్నము, లక్ష్మి—లచ్చి, శాపు—తావు, ముఖము—మోము, అగ్ని—అగ్గి, మృగము—మెకము, భాష—బాస' మొదలగు పదములు తెలుగుబాసయొక్క సరళస్వరూపమును విశదము చేయుచున్నవి. వ్యాకరణవేత్తలు ఆంధ్రభాష వికృతి యనుట కిట్టి తత్సమరూపములు కారణములై యుండును. ఆంధ్రమునందు తత్సమ తద్భవ పదము లసంఖ్యాకములు చేరినను మూలప్రకృతి దేశ్యమై వెలయుచున్నది. తద్భవ తత్సమ పదములు దేశ్యభాషా సంస్కారమును బొంది ఆంధ్రభాషార్ణవమునందు సంగమించినవి. ఆంధ్రభాషకు పరిపాటియైనను తత్సమ తద్భవపదములకు సమానాదరణమును జూపుట భావ్యముగాని ప్రత్యేకభాషాపదములకు మాత్రము పక్షపాతమును బూనుట ప్రయోజనకరముగాదు.

భాషకు ప్రయోజనము భావప్రకాశనము గాని శబ్దనిర్ణయము గాదు. ప్రజలకు సులభగ్రాహ్యమైన భాషను వాడుటయే జ్ఞానవ్యాపనమునకు సాధనము. సులభగ్రాహ్యములు తత్సమములైనను దేశ్యములైనను నన్యభాషాపదములైనను సమానాదరణమును బొందదగియున్నవి. ఆంధ్రభాషా సాహచర్య మన్యభాషాపదములకును నాంధ్రసంస్కారమును గర్పించి యాంధ్రభాషాస్వరూపము నొడగూర్చుచున్నది. ప్రాచీనకాలమునందు సంస్కృతభాషాభిమానమును, వర్తమానకాలమునం దాంగ్లభాషాభిమానమును నాంధ్రభాషాభ్యుదయమునకు ప్రతిబంధకములుగ నేర్పడినవి. సంస్కృతాంగ్లభాష లాంధ్రభాషాభివృద్ధికి గొంత ప్రతిబంధకములైనను నాంధ్రభాషావికాసమునకు దోడ్పడినవి. వర్తమాన కాలమునందు ప్రజాహృదయమునందు వర్ధిల్లుచున్న గాఢమైన మాతృభాషాభిమాన మాంధ్రభాషాభ్యుదయమునకు శుభసూచకముగ నున్నది.

ఆంధ్రభాష కొక విశిష్టలక్షణము గలదు. ఆ విశిష్టలక్షణ మాంధ్రభాషకు దేశభాషలందు ప్రతిష్ఠను సంపాదించినది. ఆంధ్రభాష అజంతభాష. ప్రతిపదమును అచ్చుతో నంతము నొందుచున్నది. సంస్కృత ఆంగ్ల తమిళభాషలందు హలంత పదములు గూడ గలవు. ఆ భాషలు హలంతములు. హలంతపదముల నుచ్చరించుట యందుగల శ్రమ యజంతపదముల నుచ్చరించుటయందు గలుగదు. అచ్చులు ప్రాణములు; హల్లులు ప్రాణులు. అచ్చు లన్యభాషాపదములకు ప్రాణము నొసగి వాని నాంధ్రభాషయందు గలుపుచున్నవి. స్వరాంతమైన ఆంధ్రభాష యుచ్చరించుటకు సుకరమై, సుశ్రావ్యమై, సరళమై, ప్రాణయుతమై వెలయుచున్నది. అన్యభాషాపదము లజంతసంస్కారమును బొంది సులభముగ నాంధ్రభాషాస్వరూపమును దాల్చుచున్నవి. ఆంధ్రభాష సంస్కృత ప్రాకృత ద్రవిడభాషల సహవాసమును గలిగి యున్నను అన్యభాషాపదములకు స్వజాతీయసంస్కారమును గర్పించి స్వరాంతమై శ్రావ్యమై, స్వయంవ్యక్తిత్వమును గలిగి వాఙ్మయనిర్మాణావసరముల కనురూపముగ వర్ధిల్లి యపారమైన వాఙ్మయస్వరూపములను దాల్చి యాంధ్రాభ్యుదయమునకు దోడ్పడుచున్నది. ఆంగ్లభాషయందు లాటిను, గ్రీకు, ఫ్రెంచిపదము లనేకములు చేరినవి. పారసీక సంస్కృతాద్యన్యభాషా పదములును జేరి యాంగ్లభాషా మహత్త్వమునకు దోడ్పడినవి. అన్యభాషల సంయోగ మాంగ్లభాషాతత్త్వమునకును, మహత్త్వమునకును భంగమును గలుగజేయలేదు. ఆంధ్రభాషకును సంస్కృత ప్రాకృత తమిళ కర్ణాటాంగ్లాదిభాషల సాహచర్యము భాషాతత్త్వమునకు భంగమును గలుగజేయక మహత్త్వమును గర్పించినది. ఆంధ్రభాష మాధుర్యమును, గాంభీర్యమును, చైతన్యమును గలిగి బహువిధములైన వాఙ్మయరచనలకు సాధనమైన విధమును వాఙ్మయ పరిశీలనము విశదము చేయుచున్నది.

## ఆంధ్రవాఙ్మయము

ఆంధ్రవాఙ్మయనిర్మాణమునకు దేశము, భాష, ప్రజలు, పరిసరములు దోడ్పడినవిధము సంక్షేపముగ దెలుపబడినవి. ఆంధ్రవాఙ్మయ చరిత్ర, ఆంధ్రుల చరిత్ర, ఆంధ్రభాషాచరిత్ర విషయాన్వేషణమును జేయుటకు సాధనములుగ నున్నవి.

ఆంధ్రవాఙ్మయము కాలమునుబట్టి 1. అజ్ఞాతయుగము, 2. ఆదియుగము, 3. మధ్యయుగము, 4. ఆధునికయుగము అని నాలుగు విభాగములుగ నేర్పరుపబడుచున్నది. నన్నయ్యకు బూర్వమునందలి వాఙ్మయ మజ్ఞాతయుగమునకు జెందియున్నది. అజ్ఞాతయుగవాఙ్మయమును దెలుపుటకు

గొన్ని శాసనములు మాత్రము గనుపడుచున్నవి. ఈయుగ మాంధ్రరాజుల కాలము నుండి 1050 వరకును వ్యాపించియున్నది. ఆదికాలమునం దాంధ్రపండితులు గ్రంధములను సంస్కృతభాషయందు రచియించిరి. ప్రభువులకును, పండితులకును ప్రజలభాషమీద నన్నయకాలమునందు గలిగిన యాదరణ మాకాలమునందు గలుగలేదు. ప్రభువులును, పండితులును నార్యులు, ఆర్యవిజ్ఞానసంపన్నులు. వారికి దేశభాషలు దూష్యములు, సారరహితములునైన పరభాషలు. ప్రజలు విద్యాసంపదలులేని పరాధీనులు. ఆంధ్రపండితులు వారి గ్రంథములను వారికభిమానము గల సంస్కృతప్రాకృత భాషలందు రచియించిరి.

## ఆంధ్రులు రచియించిన కొన్ని సంస్కృత ప్రాకృతగ్రంథములు

శాతవాహనుని సభలో పలువురు కవు లుండిరి. వారి ప్రాకృతరచనముల నుండి యుద్ధృతములైన గాథ లతని సప్తశతిలో నున్నవి.

### సంస్కృత కవులు—గ్రంథములు

సిద్ధనాగార్జునుడు— బౌద్ధ, తర్క, నీతి వైద్యగ్రంథము లనేకములు.
భవభూతి— ఉత్తరరామచరితాదులు
కుమారిలభట్టు—పూర్వమీమాంసా గ్రంథములు
మల్లికార్జున పండితారాధ్యుడు— శైవస్తోత్రములు
అగస్త్యుడు— బాలభారతాదులగు డెబ్బదినాల్గు గ్రంథములు
శాకల్యమల్లకవి— ఉదారరాఘవము
విద్యానాథుడు— ప్రతాపరుద్రీయాదులు
పాల్కురికిసోమన— సోమనాథభాష్యాదులు
నరసింహకవి— కాదంబరీనాటకము
గంగాధరకవి— భారతనాటకము
వేదవేదాచార్యుడు— శ్రౌతభాష్యము
కపర్ది— శ్రౌతభాష్యము
అమృతానందయోగి— అలంకారశాస్త్రము
కవిరాక్షసుడు— కవిరాక్షసీయము
కవిభల్లటుడు— భల్లటశతకము
పెన్నభట్టు— పెన్నుభట్టీయము (తర్కశాస్త్రము)
పసుపతి నాగనాథుడు— మదనవిలాసభాణము
సింగభూపతి— రసార్ణవసుధాకరము
విశ్వేశ్వరకవి— చమత్కారచంద్రిక
మల్లినాథుడు (కొలచెలమ)— కావ్యనాటకవ్యాఖ్యానాదులు
కుమారస్వామి సోమపీథి(మల్లినాథుని కొడుకు)— ప్రతాపరుద్రీయవ్యాఖ్య
గౌరన— లక్షణదీపిక
పెదకోమటి వేమారెడ్డి— సాహిత్య, సంగీతచింతామణ్యాదులు
వామనభట్టబాణుడు— వేమభూపాలచరితము
కాటయవేముడు— శాకుంతలాదులకు వ్యాఖ్యలు
భాస్కరుడు— ఉన్మత్తరాఘవనాటకము
ఓరుగంటి సీతారామకవి— సీతారామ విహారకావ్యము
అనంతకవి— భారతచంపు
లొల్లవారు, లక్ష్మీధరుడు మొదలయినవారు— సరస్వతీవిలాసాదులు
హోహారకవి— రతిరహస్యము
అన్నంభట్టు— తర్కసంగ్రహాదులు
బండారు లక్ష్మీనారాయణకవి— సంగీత సూర్యోదయము
చెరకూరివారు, లక్ష్మణసూరి, కొండుభట్టు మొదలయినవారు — షడ్భాషా చంద్రికాదులు
కంచం ఎల్లయార్యుడు— దైవజ్ఞవిలాసాదులు (జ్యోతిషము)
లింగమగుంట రామకవి— భాణము.
వారణాశి ధర్మభట్టు —సాహిత్యరత్నాకరము
నవనమంత్రి— అభినవ భారతము
లక్ష్మణకవి— చంపూరామాయణము
అహోబలకవి— సంగీతపారిజాతము
కృష్ణాధ్వరి— రఘునాథ భూపాలీయాదులు
శేషవంశమువారు, కృష్ణకవ్యాదులు— పారిజాతాపహరణనాటకాదులు
శ్రీధరవేంకటేశార్యుడు— ఆఖ్యాషష్టి ప్రబంధము
నారాయణతీర్థులు— కృష్ణలీలాతరంగిణి
తంజావూరి రఘునాథరాయలు— సంగీతసుధ మొదలయినవి
మధురవాణి— రామాయణము
జగన్నాథ పండితరాయలు— రసగంగాధరాదులు
రామామాత్యుడు— స్వరమేళకళానిధి
వెలిదిండ్ల అయ్యన్నశాస్త్రి— వ్యాసతాత్పర్యనిర్ణయము
రామభద్రాంబ— రఘునాథభూపాలీయము
తిరుమలాంబ— వరదాంబికాపరిణయము
అనేక్వర వేంకటశాస్త్రి— వేంకటాద్రి గుణరత్నావళి మొదలగునవి
సుసర్ల బ్రహ్మన్నశాస్త్రి— స్తోత్రకదంబము
పడమంటి మంగళేశ్వరశాస్త్రి— సమాసకుసుమావళ్యాదులు
పట్టాభిరామపండితుడు— పట్టాభిరామ పండితీయము
చిన్న కృష్ణమూర్తిశాస్త్రి— యక్షోల్లాసాదులు
పరవస్తు రంగాచార్యులు— మంజుభాషిణ్యాదులు

ఈ గ్రంథము లాంధ్రుల ప్రతిభకు నిదర్శనములైనను సంస్కృతప్రాకృత వాఙ్మయములకు సంబంధించినవి. ఆంధ్రవాఙ్మయ విమర్శమునందు వాని విచారణ నిరుపయోగము.

పర్తమానకాలమున నాంగ్లపరిపాలనమునం దీ విషయము మనకు నిత్యానుభవమునందు గలదు. ఆంగ్లేయులకు వారి భాషావాఙ్మయములపట్ల గల యభిమానము పూర్ణవికాసమును బొందిన సంస్కృతభాషా వాఙ్మయముల మీద గాని, దేశభాషలమీద గాని లేదు. విద్యాప్రవృత్తియందును, సర్వవ్యవహారములందును పాలకుల భాషకు గల యాదరణము పాలితుల భాషలకు లేదు. మహానుభావుడు మెకాలే ప్రభువు భారతవిద్యాప్రవృత్తియందు భారతీయ భాషలకు ప్రతిషేధమును గల్పించి తిలోదకములను జల్లెను. ఆ నిర్ణయము దేశభాషా వాఙ్మయముల వికాసమునకును, ప్రజలయందు విజ్ఞానవ్యాపనమునకును మహాపకారమును గావించినది. ఆకాలమునందు మన పండితుల నావహించిన సంస్కృతభాషాభిమాన స్వభావము నిప్పుడు మన యాంగ్లవిద్యావంతుల నావహించిన పరభాషాభిమానము సంస్మరింప జేయగలదు. పిల్లలను—పెద్దలను, స్త్రీలను—పురుషులను, పండితులను—పామరులను పరభాషావ్యామోహ మావహించుటచేత మాతృభాషాభిమాన మడుగంటినది. ఆంగ్లాక్షరములతో డొక్కశుద్ధియైనగాని పవిత్రత గలుగకున్నది. ప్రభుత్వమునను, విద్యావంతులను నపరిచితమైన విజాతీయసంస్కారమునట్ల గల గౌరవాభిమానములు నపరిచితమైన స్వజాతీయ సంస్కారము నెడ గలుగకున్నవి. ఇది యిరువదవ శతాబ్దమునందలి నాగరికాగ్రణుల కథ. అజ్ఞాతమైన శాలివాహన కాలారంభకథను వితర్కించుట యనవసరము. ఆ కాలమునందు దేశభాషలు బీజరూపమున నున్నవి: ఈకాలమున దేశభాషలు వికసించి యున్నవి. ఆకాలమునందు జనసామాన్యమునకు దేహబలములు లేవు: ఈకాలమునందు జనసామాన్యమునకు దేహబలములు గలవు. ఆకాలమునందు భాషా వాఙ్మయ వికాసములకుగల యవకాశము లతి స్వల్పములు: ఈకాలమునందు భాషా వాఙ్మయములకుగల యవకాశము లనేకములు. ఇట్టిపరిస్థితులందు సంస్కృతప్రాకృత భాషా వాఙ్మయములు ప్రబలుటయును, దేశభాషా వాఙ్మయములు ప్రబలకుండుటయును సహజము. ఆదియుగమున జైన బౌద్ధమతములు దేశభాషలందు వాఙ్మయాభ్యుదయమునకు సాధనభూతములైనవి.

బుద్ధభగవానునకు ప్రజోద్ధరణమువట్లగల గాఢానురాగమునకు గాంధి మహాత్ముడు ప్రత్యక్షప్రమాణముగ నున్నాడు. బుద్ధభగవానుడు సంసారమును బరిత్యజించి, సన్న్యాసమును స్వీకరించి ప్రేమాస్త్రమును సాధించి ప్రజోద్ధరణమునకు బూనుకొనెను. ప్రజలకు వారికి బరిచితమైన భాషలందు ధర్మోపదేశములను జేయుట కుపక్రమించెను. బౌద్ధభిక్షులును, జైనశ్రమ

బులునుచిరకాలము ప్రజలకు ధర్మోపదేశములను చేయుటకై పాటు పడినవిధమును బౌద్ధజైనమతచరిత్రములు విశదము చేయుచున్నవి. ఆంధ్ర దేశమున కీ యుపకృతి సహజముగ దక్షిణాపథమునందలి దేశములలో మొదట గలిగినది. లిఖితరూపమున నున్న యాంధ్రభాషకు బౌద్ధజైన యుగములందే వాఙ్మయాంకురము లేర్పడినవి.

వర్తమానయుగమునందు క్రైస్తవమతబోధకు లవలంబించు చున్న మార్గము ప్రత్యక్షానుభవమును గలుగజేయుచున్నది. క్రైస్తవమత ప్రచారకులైన స్త్రీలును, పురుషులును తెలిసి తెలియని దేశభాషలందు జేయు చున్న మతబోధలు మనకు నిత్యానుభవమునందు గలవు. క్రైస్తవుల బోధలు సామాన్య ప్రజలయందు విజ్ఞానాంకురముల నాటుచున్న విధమును క్రైస్తవమత వ్యాపనము విశదము చేయుచున్నది. క్రైస్తవ మత వ్యాపనము క్రైస్తవ వాఙ్మయమునకు గారణమైనది. ఆంధ్రవాఙ్మయమున నిపుడు పందల కొలది క్రైస్తవ మతగ్రంథములును, మతబోధకులు రచించిన యితర గ్రంథ ములును గలవు. ఈగ్రంథ జాల మాంధ్రవాఙ్మయాభ్యుదయమునకు విశేషోప కారమును జేయకపోయినను త్యాగమూర్తులైన మతాచార్యులు భాషావాఙ్మయ ములకును, దన్మూలమున ప్రజలకును జేయగల మహోపకారము విశదముగు చున్నది. ఆరణ్యక జాతులం దీకాలమున క్రైస్తవ మతబోధకులు చేయుచున్న ప్రబోధ మాకాలమునందు బౌద్ధజైనమతబోధకులు గలుగజేసిన ప్రబోధమున కనురూపముగ నున్నది. భిన్నసంస్కారముగల క్రైస్తవ మతబోధలు దేశీయ సంస్కారముతో నైక్యమును బొందజాలకున్నవి. ప్రాచీనభారత సంస్కార జన్యములైన జైన బౌద్ధధర్మబోధలు ప్రత్యేక రూపమును దాల్చినను దేశీయ సంస్కారముతో నైక్యమును బొందుటచే విజ్ఞానసంవర్ధనమునకు సంస్కార పారంపర్యము సాధ్యమయినది. అజ్ఞాతయుగమునందలి ఆంధ్రవాఙ్మయస్వరూ పము లగోచరములైనను ఆర్యజైనబౌద్ధమతబోధకులు నాటిన వాఙ్మయాం కురములు తరువాతి వాఙ్మయమున కాధారభూతములైనవని విశ్వసింపదగి యున్నది.

ఆ కాలపు శాసనములు సంస్కృత ప్రాకృతభాషలందు గలవు. తెలుగు శాసనములు కొన్ని క్రీ. శ. 700—1600 కాలమునందు గనుపడుచున్నవి. ఈ శాసనములు కొన్ని మాత్రాగణ బద్ధములైన మధ్యాక్కరలందున్నటులు పండితులు నిర్ణయించుచున్నారు. ఈ కాలపు శాసనముల సమగ్ర పరిశోధనము విషయ నిర్ణయమునకు దోడ్పడగలదు.

ఆదియుగము నన్నయకాలమునుండి తిక్కనాదుల కాలము వరకు వ్యాపించి యున్నది. ఈ యుగము క్రీ. శ 1050—1450 ప్రాంతము వరకును గలదు. ఈ యుగము పురాణయుగము. భారత రామాయణ భాగవతాది గ్రంథము లీ యుగమున నాంధ్రీకరింపబడినవి. తిక్కన, పాల్కురికి సోమ నాథుడు, ఎఱ్ఱాప్రెగ్గడ, మంత్రి భాస్కరుడు, నన్నిచోడడు, నాచనసోముడు, శ్రీనాథుడు, పోతరాజు మొదలగు మహాకవులు పురాణాదుల నాంధ్రీకరించినను నాంధ్రవాఙ్మయమునకు జీవకళల నుపపాదించి వ్యక్తిత్వమును గల్పించిరి.

మధ్యయుగము కృష్ణదేవరాయలకాలమునుండి కాకునూరి అప్పకవి కాలము వరకు గలదు. ఈ యుగము క్రీ. శ. 1500—1750 ప్రాంతము వరకు వ్యాపించినది. ఈ యుగము ప్రబంధయుగము. ఈ యుగమున నాంధ్ర కవులు స్వతంత్రకావ్యములను రచించి ఆంధ్రవాఙ్మయమునకు గళాన్యాసముచేసి ప్రతిష్ఠను జేసిరి. పెద్దన్న, శ్రీకృష్ణదేవరాయలు, రామరాజభూషణుడు, ముక్కు తిమ్మన్న, పింగళి సూరన్న, చేమకూర వెంకటకవి మొదలగు కవిశేఖరు లసదృశ వైభవముతో ప్రబంధయుగమును నిర్మించిరి. ఆంధ్ర వాఙ్మయయుగములం దీయుగ ముత్తమయుగముగ నెన్నబడుచున్నది. విజయనగరసామ్రాజ్య విధ్వం సనము, మహమ్మదీయ రాజ్యముల స్థాపనము వాఙ్మయవికాసమునకు భంగమును గలుగజేసినవి. కవులు పోషణము లేక కృశించిరి. కావ్యములు రసజ్ఞులు లేక రసహీ నములైనవి. స్వతంత్రరచనలతో నారంభమైన ప్రబంధయుగము నిర్జీవ యుగమై యనుకరణయుగముగ బరిణమించినది.

ఆధునికయుగ మాంగ్లవిద్యా వ్యాపనముతో నారంభించినది. విద్యా వ్యాపనము, నిరక్షరములు, ముద్రాశాలలు, ప్రజాదరణము వర్తమానయుగము నందు వాఙ్మయాభివృద్ధికి తోడ్పడుచున్నవి. ఈ యుగము క్రీ. శ. 1750 తరువాత నారంభమైనది. ఇది మిశ్రయుగము. బహువిషయవాఙ్మయరచన లీ యుగమందు బుట్టినవి. ఆధునికయుగమునందు వాఙ్నిర్మాతలలో కీ. శే. రావుబహదరు శ్రీ వీరేశలింగము పంతులుగారు సుప్రసిద్ధులు. ఆంధ్రవాఙ్మయ యుగమున నాధునికయుగము వచనయుగము. వీరేశలింగము పంతులుగారు వచనరచనకు జనకులు. ఆధునికయుగమునందు నాటకములు, నవలలు, శాస్త్ర ములు, చరిత్రములు, విమర్శనలు, భావగీతములు, పాటలు, పదములు వాఙ్మయ మును సారవంతము చేయుచున్నవి.

వాఙ్మయమునందు యుగవిభాగము విషయగ్రహణమునకు సాధన మైనను గాలపరిమితియందు ముందువెనుకలు గలుగుచుండును. పురాణ యుగమునందు ప్రబంధయుగారంభములు గోచరించు చుండును. ప్రబంధ యుగమునందును, వర్తమానయుగమునందును బురాణ ప్రబంధరచనలు గను పడుచుండును. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు భారతమును, వావిలి కొలను సుబ్బారావుగారు రామాయణమును, జనమంచి శేషాద్రిశర్మగారు బ్రహ్మాండ పురాణమును, రామాయణమును నాంధ్రీకరించిరి. ప్రబంధకావ్యములు వర్త మానకాలమునందును బుట్టుచునే యున్నవి. విషయ విభాగమును, గాలనిర్ణయ మును యుగసామాన్యలక్షణమును గనుగొనుటకు మాత్రము సాధనములుగ నుండగలవు.

వాఙ్మయపరిణామమును భావవికాసము ననుసరించి పరిశీలించుట వాఙ్మయ హృదయమును గ్రహించుటకు సాధన మగును. భారత విజ్ఞానమంతయు మానవ లక్ష్యమును నాధ్యాత్మికసంపదయందు లగ్నముచేసినది. ఆదిమ గ్రంథమైన వేదమునం దీ లక్ష్యమే సర్వత్ర ప్రత్యక్షమగుచున్నది. ప్రకృతిసంపదలు సమ కూర్చిన యానంద సౌఖ్యములకు భూతాధిదేవత లభివాదనములను బడయు చున్నారు. వేదయుగమున నారంభమైన యాధ్యాత్మిక ప్రవృత్తియే ఉపనిష త్తులందును, దర్శనములందును, పురాణములందును, స్మృతులందును, కావ్యము లందును, శాస్త్రములందును, స్తోత్రములందును ప్రత్యక్ష మగుచున్నది. ఆర్యులు వారి వాఙ్మయ రచనలను దైవప్రార్థనలతో నారంభించుచుండిరి. ఆర్యవిజ్ఞానసంజాతమైన జైనబౌద్ధవిజ్ఞానములును మానవలక్ష్యము నైహికము నందే కాక యాముష్మికమునందును లగ్నముచేయుట కుపచరించినవి. శంకర విజయము జైనబౌద్ధ యుగమునందు సంకలితమైన యాధ్యాత్మిక ధర్మమునకు సర్వవ్యాపకత్వమును గలుగజేసినది. ఆంధ్రవిజ్ఞానలక్ష్యమును నాధ్యాత్మికపరముగ బరిణతి నొందినది. ఆంధ్రహృదయము పరమార్థమునందు లగ్నమైన విధమును హిందూ బౌద్ధశైన శిల్పములు విశదము చేయుచున్నవి. అమరావతి, సాంచి, కార్లి మున్నగు స్తూపములందలి శిల్పనైపుణ్యములు, అజంతా ఎల్లోరా విహారము లందలి చిత్రవైభవములు శిల్పమున నాంధ్రహృదయలక్ష్యమును సువ్యక్తము చేయుచున్నవి. రాజరాజ నరేంద్రుడు భారతము నాంధ్రీకరించుటకు దెలిపిన కారణములును బరమార్థలక్ష్యమును విశదము చేయుచున్నవి.

> వు. ఇవి యేనును సతతంబు నాయెడ గరం బిష్టంబులై యుండు బా
> యువు భూదేవకులాభితర్పణమహాయః ప్రీతియున్ భారత
> శ్రవణాసక్తియు బార్వతీపతిపదాబ్జధ్యాన పూజా మహో
> త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.

చంద్రవంశజుడైన రాజరాజు భారతమునకు గృతిపతి. బ్రాహ్మణుడైన నన్నయభట్టు కృతికర్త. ఆర్యవిజ్ఞానాభిమాన ముభయులకును గాఢము. తిక్కన భారతమున నాధ్యాత్మిక విజ్ఞానమును గురించి యాంధ్రహృదయస్వరూప మును ప్రత్యక్షముచేసెను. పోతనామాత్యుడు భాగవతమునందు భక్తిరసమును గురించి జ్ఞానయోగమునకు, భక్తియోగమునకు నిరువమానమైన సంయోగ మును గలుగజేసెను. శంకర, రామానుజ, మధ్వాచార్యుల భాష్యములు, పండితా రాధ్య బసవేశ్వరాదుల మతసంస్కరణములు ప్రజాహృదయమున నాధ్యాత్మిక లక్ష్యమును నెలకొల్పినవి. ప్రబంధరాజమైన పెద్దన మనుచరిత్రమునందు

శ్రోత్రియ బ్రాహ్మణుడు నాయకుడు. ఆంధ్రదేశ వ్యాప్తములైన పాటలు పద్యములు, శతకములు భక్తిజ్ఞానవైరాగ్యసమ్మిళితమైన యాంధ్రహృదయమును విశదము చేయుచున్నవి. వర్తమానయుగమునందు తెలుగు దేశమున బ్రహ్మసమాజార్యసమాజ దివ్యజ్ఞానసమాజముల వ్యాపనమును నాంధ్రుల భక్తిహృదయమును విశదము చేయుచున్నది.

పురాణ యుగమునందు వర్ధిల్లిన భక్తిహృదయము ప్రబంధయుగమునందు శృంగార హృదయముగ బరిణమించినది. విజయనగరరాజుల విజయములు, సామ్రాజ్య సంపదలు, యోధుల సాహస పరాక్రమములు, ప్రభువుల భోగపరాయణత్వము, ప్రజల విషయ వాంఛలు, కవుల రాజసప్రవృత్తి శృంగార రసవికాసమును గలుగజేసినవి. పెద్దన మనుచరిత్రయందు సూచించిన శృంగార విలాసములు కాలక్రమమున దారాశశాంకవిజయాదులందు శృంగార విహారమును బొంది వాఙ్మయలక్ష్యము కామపరాయణమైనది. కవు లస్వతంత్రులై రాజాశ్రయజీవులై స్వీయప్రతిభను గోల్పోయిరి. శ్రీనాథుడు ధనార్జనమునకై కావ్యవిక్రయమును జేసినవిధము నాతని కావ్యములు తెలుపుచున్నవి. ఆ మహాకవి స్థితియే యిటులుండ సామాన్యకవుల విషయమై యోచింపవలసిన పనిలేదు. ధూర్జటికవి కాళహస్తీశ్వరశతకమునందును, రామభద్రుడు రఘువీరశతకమునందును, తిమ్మకవి కుక్కుటేశ్వరశతకమునందును, అడిదము సూరకవి రామలింగేశ శతకమునందును రాజాశ్రయవిషయమున దెలిపిన భావములు సార్థకములు. కాళహస్తీశ్వరశతకమునందలి "రాజాగ్రహ్మశ్రేణీద్వారము", "రాజన్మత్తులు వారిసేవ నరకప్రాయంబు", "భూభృచ్చండాలురు", "లోకకంటకుల" మొదలగు ప్రయోగములు రాజాశ్రయనిరసనమును దెలుపుచున్నవి. రఘువీరశతకమునందలి "అడిగే విద్యకు లోనుజేసితివి న న్నావంత యూవంత తే కడియాసల్ గొనుచుం దురాత్మకుల నే సర్థించుచున్నాడ"నను ప్రయోగములును రాజాశ్రయనిరసనమును దెలుపుచున్నవి. భాగవతకృతియందు పోతనామాత్యుడు కృతిసమర్పణము విషయమై వ్రాసిన

ఉ. కాటుక కంటి నీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ! యో
హాటక గర్భురాణి! నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాటకిరాటకీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్మ భారతీ!

అను పద్యార్థము సార్థకమైనది. కవిబ్రహ్మ తిక్కన సోమయాజి, మహామహుడు; రాజ్యచ్యుతుడైన మనుమసిద్ధికి రాజ్యమును గడించిన మహావీరుడు. ఆ మహానుభావుడు సర్వస్వతంత్రుడై భారతమును రచియించి యాకృతిని హరిహరనాథునకు సమర్పించిన ధర్మజ్ఞుడు. పోతన భాగవతోత్తముడు; భాగవతమును శ్రీరామార్పణము చేసిన భక్తాగ్రేసరుడును. పెద్దన రాజాశ్రయము గలిగినను ధర్మజ్ఞుడై స్వతంత్రమార్గము నవలంబింప గలిగెను. కాలక్రమమున రసజ్ఞులైన రాజు లంతరించిరి. స్వతంత్రులైన కవులు నిరాశ్రయులై కృశించిరి. నిర్జీవమైన యనుకరణము కావ్యరచనకు లక్ష్యమై ఆంధ్రవాఙ్మయము భావదారిద్ర్యమై కృశించినది. ద్వ్యర్థి, త్ర్యర్థి, గర్భకవిత్వాది కావ్యములు, శబ్దాలంకారములు కావ్యముల ప్రయోజనమును సంకుచితము చేసినవి.

ఆధునికయుగవాఙ్మయమునందు నవభావోదయము గలుగుచున్నది. ఆంగ్లవిద్యావ్యాపనము, పాశ్చాత్య సంస్కారము వాఙ్మయమునకు సంచలనమును గలుగజేసినవి. ఆంగ్లవిద్యావంతులు గ్రంథరచనలకు బూనుకొనిరి. వారి రచనలం దాంగ్ల వాఙ్మయానుకరణములు, నూతన నిర్మాణములు గోచరమగుచున్నవి. నాటకములు, నవలలు, కథలు, భావగీతములు, విమర్శనగ్రంథములు, శాస్త్రగ్రంథములు వర్తమానయుగ నిర్మాణములు. ఆంగ్లవిద్యాలయములం దాంగ్ల సాహిత్యాభ్యాసమునకుగల యవకాశము లాంధ్ర సాహిత్యాభ్యాసమునకు లేవు. నిత్యజీవనమునం దాంధ్రసాహిత్యమునకు పోషణము లేదు. పండితకులము క్షీణించుచున్నది. ఆంగ్ల సంస్కారము వర్ధిల్లి[illegible]భాషాపరిచయములేని గ్రంథకర్తల రచన లాంధ్రవాఙ్మయమునందు నూతన [illegible] రొప్పడుచున్నవి. ఈ రచనల భావములు భాష, రీ[illegible]మార్గము

నవలంబించుచున్నవి. వాడుకభాషకు, లోకవ్యవహారమునకు ప్రాబల్యము గలుగుచున్నది. ఈ ప్రాబల్యము సార్థకమగుటకు మాతృభాషాముఖమున విద్యాభ్యాసమవసరమగుచున్నది. మత వేదాంత గ్రంథము లాంధ్రహృదయమునకు సహజమైన యాధ్యాత్మిక సంస్కారమును దెలుపుచున్నవి. వర్తమాన యుగమునందు ప్రజలు వాఙ్మయపోషకులు. ప్రజలయందు విజ్ఞాన వ్యాపనమునకు సాధనమైన వాఙ్మయ మవసరమగుచున్నది. గ్రంథకర్త లాంధ్రహృదయమునకు సహజమైన యాధ్యాత్మిక లక్ష్యమును వారికవసరలందు బోధించి యాంధ్రవాఙ్మయ హృదయమును గాపాడుట ధర్మము.

ఆంధ్రహృదయమునకు శ్రీరాముడు కులదేవత. ఆంధ్రవాఙ్మయమునందు రామాయణగాథకు సంబంధించిన గ్రంథము లనేకములు గలవు. వాఙ్మయమునందు శ్రీరామవాఙ్మయము విశేషము గలదు. రామకీర్తనలు, రామశతకములు వాఙ్మయమునందు వ్యాప్తిని గాంచియున్నవి. రామభజనలు, రామాలయములు భక్తహృదయము శ్రీరామపరమని విదదము చేయుచున్నవి. ఆంధ్ర వాఙ్మయ నిర్మాణములందు గ్రంథకర్తల భావములు మారుచున్నను ప్రజాహృదయమునందు భక్తిజ్ఞాన వైరాగ్యములు సుప్రతిష్ఠితములై యున్న విధమును శ్రీరామోత్సవములు, రామకీర్తనలు, రామభజనలు, రామాలయములు చాటుచున్నవి.

భావవ్యాపనము ననుసరించి వాఙ్మయమునందు నాలుగు యుగములను గ్రహించుట కవకాశములు గలవు. 1. జ్ఞానయుగము, 2. భక్తియుగము, 3. శృంగారయుగము 4. సంకరయుగము. ఈ విభాగములు సామాన్య లక్షణములను గ్రహించుట కుపయోగపడగలవు; కాని, విశిష్టలక్షణములను గ్రహించుట కుపయోగపడవు.

వాఙ్మయములు పద్యకావ్యములతో నారంభమగుట ప్రకృతి స్వభావము. మానవులకు వారి యానందమును, మహోత్సవమును నృత్యగానములతో దెలుపుట సహజము. పాటలతోను, కీర్తనలతోను నారంభమైన వాఙ్మయ మితివృత్తరూపములను దాల్చుచు వీర సంకీర్తనము జేయుట కుపయోగపడుచున్నది. ఇలియడు, ఏయునియడు, రామాయణము, భారతము వీరసంకీర్తనమును జేయుచు జాతీయజీవనాభ్యుదయమునకు వినియోగపడినవి. ఆంధ్ర వాఙ్మయమునందలి వీరచరితములును నీమార్గము నవలంబించినవి. ఆదియుగమునందలి వాఙ్మయము గేయములైన మధ్యాక్కర, రగడ, గీత, ద్విపద, పాటల రూపమును దాల్చినది. సోమనాథుడు పేర్కొన్న ప్రభురగేయాదులు మాత్రాగణబద్ధములు. కాలక్రమమున వానినుండి అక్షరగణబద్ధములైన రచనలు వెలువడి మాత్రాగణబద్ధములగు రచనలను వెనుకకు ద్రొక్కినవి. కాలక్రమమున సంస్కృత వృత్తములు చేరి దేశీయవృత్తముల వ్యాప్తి కభ్యంతరమును గలుగజేసినవి. దేశీయవృత్తస్వరూపమునే సంస్కృత ప్రాబల్యము మాటుపరచినది. ఆర్యవిజ్ఞానమునకు మూలాధారములైన వేదములు లోకోత్తరమార్గము నవలంబించినవి. వేదములందు వీరసంకీర్తన సూచన లున్నను దైవసంకీర్తన లక్ష్యము ప్రబలియున్నది. ఆ లక్ష్యమే సంస్కృతాంధ్ర వాఙ్మయములం దవిచ్ఛిన్నముగ బరిణతి నొందినది. ఆంధ్రవాఙ్మయము నీ లక్ష్యములతో బరిశీలించినపుడు వాఙ్మయ హృదయము గ్రాహ్యము గాగలదు. సకల వాఙ్మయములందును పద్యకావ్యానంతరము గద్యకావ్యములు పుట్టుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునందు చిరకాలము పద్యయుగము ప్రబలినది. నేటికిని దేటతెలుగున గద్యములందు ప్రజాహితమునకై వ్రాయదగిన విషయములు పద్యములందు వ్రాయుట యాచారముగ నున్నది. ఆంధ్రుల సంభావనా ప్రవృత్తియు, నాంధ్రభాషా వైభవము నిందుకు గారణములై యుండును. ఆంధ్రవాఙ్మయమున నవయుగమునందు గద్యకావ్యము లనంతములు పుట్టుచున్నవి. ప్రజలయందు విజ్ఞాన వ్యాపనమునకు సర్వతోముఖమైన వచనవాఙ్మయ నిర్మాణము, వ్యాపనమును నత్యంతావసరములుగ నున్నవి.

ఆంధ్రవాఙ్మయమునం దనేకగ్రంథములు నశించినవి. గ్రంథములు నశించుటకు మతకలహములు, మతాభిమానము, ప్రజల యజ్ఞానము, రాజ్యవిప్లవములు కారణములై యుండును. వేంగీపురము, రాజమహేంద్రవరము, ఓరుగల్లు, విజయనగరము మొదలగు పట్టణములకు సంప్రాప్తమైన విప్లవములచే ననేకములగు గ్రంథములు నశించియుండును. పల్లెటూళ్లయందు బండితులు భద్రపరచిన గ్రంథములు వారి వంశజుల హస్తములందు శిథిలములైనవి. బ్రాహ్మణులైన వైష్ణవమతాభిమానము బౌద్ధజైనగ్రంథముల విలయమునకు దోడ్పడినది. ప్రబంధరత్నావళియందును, లక్షణగ్రంథములందును, చాటుపద్యమణిమంజరియందును పేర్కొనబడిన గ్రంథము లనేకము లిపు డలభ్యములుగ నున్నవి. నశించిన గ్రంథసముదాయమును నిర్ణయించుటకు సాధనములు గనబడవు. నన్నయకు బూర్వమును, నన్నయానంతరమును గల వాఙ్మయము కొంతవరకు నశించినదని స్పష్టముగ దెలియుచున్నది. ఆ గ్రంథముల నాశన మాంధ్ర వాఙ్మయమున కపారమైన నష్టమును గలుగజేసినది. శేషించిన గ్రంథములనైనను జక్కని యక్షరములతో దాటాకులమీద వ్రాసి గ్రంథములను రక్షించిన లేఖకులు ప్రశంసార్హులు. ఈ గ్రంథసముదాయమును విశేషవ్యయప్రయాసముల కోర్చి సేకరించి సురక్షితము గావించిన బ్రౌనుదొరగా రాంధ్రప్రపంచము యొక్క కృతజ్ఞతకు బాత్రులు.

ఆంధ్రగ్రంథముల ముద్రణము సీసాక్షర నిర్మాణముతో నారంభమైనది. మొదట మిషనరీలు వారి బైబిలు ప్రచారమునకై సీసాక్షర నిర్మాణమునకును, గ్రంథముద్రణమునకును బూనుకొనిరి. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమునందు అక్షరవ్యాసమునం దీవిషయమును కొ. వెం. లక్ష్మణరావుగారు వ్యక్తముచేసిరి. ఆంధ్ర గ్రంథముల ముద్రణ మారంభమై నూరేండ్లయినది. క్రీ. శ. 1827 వ సంవత్సరమున 'శబ్దమంజరి' యను సంస్కృతబాలబోధ వ్యావహారికాంధ్ర వివరణముతో చెన్నపురియం దప్పుడుండిన కాలేజీ ముద్రాలయమున ముద్రితమయినది. ఆ పుస్తకమునందలి ముఖపత్ర మీ విషయమును దెలుపుచున్నది.* ఇంతకన్న బూర్వము ముద్రితమైన యాంధ్రగ్రంథ మిప్పుడు లభించుట లేదు. తరువాత, పరవస్తు చిన్నయసూరిగారు నీతిచంద్రికను, బాలవ్యాకరణమును క్రీ. శ. 18[illegible]0 యందు ముద్రించిరి. క్రైస్తుజీవితమును టి. బి. రొస్పైట్ క్రీ. శ. 1873 నందు ముద్రించినది. ఆంధ్రగ్రంథముల ముద్రణమునకు ప్రథమమున దోడ్పడినవారిలో బరవస్తు రంగాచార్యులుగారు, బహుజనపల్లి సీతారామాచార్యులుగారు మొదలయినవారు పేర్కొనదగియున్నారు. ఇప్పుడు దేశమునందంతటను ముద్రాశాలలు వెలసినవి. గ్రంథముద్రణము సుకరమయినది. ఆంధ్రదేశమునం దనేకగ్రంథమండలులు ప్రాచీన నవీన గ్రంథములను ముద్రించి వాఙ్మయాభివృద్ధికి దోడ్పడుచున్నవి. విజ్ఞాన చంద్రికాగ్రంథమండలి నారంభించి లక్ష్మణరావుపంతులుగా రితరులకు మార్గదర్శకులైరి. ఆంధ్రభాషయందు గ్రంథముద్రణమునకును, ప్రచురణమునకును ఇతర దేశభాషలయందు వలె విశేషమైన వ్యాప్తి కనబడదు. శ్రీమంతుల సహాయమును, ప్రజల యాదరణమును గ్రంథప్రచురణమున కత్యంతావశ్యకములు. రాజులును, మహారాజులును, శ్రీమంతులును వాఙ్మయాభివృద్ధికి సహాయము చేయుట ధర్మము. శ్రీమంతుల సహాయముకంటెను వర్తమాన యుగమునందు ప్రజాదరణము వాఙ్మయాభివృద్ధికి సాధనముగ నున్నది. గ్రంథకర్తలు ప్రజాపోషణములేక కృశించుచున్నారు. ప్రజాపోషణము వలన వాఙ్మయాభివృద్ధి కవకాశములు గలుగగలవు. పఠనీయ గ్రంథములను నిర్ణయించుటయందు ప్రభుత్వమును, తాబేదారులును, విద్యాసంఘమును నవలంబించుచున్న మార్గము గర్హ్యముగ నున్నది. ఉత్తమ గ్రంథముల నాదరించుటకు బదులు పక్షపాతమును జూపుటయు, కారణాంతరములను గల్పించి పుస్తకములను నిరాకరించుటయు నన్యాయముగ నున్నది. వర్తమాన యుగమునందు గల ముద్రణసౌకర్యములు గ్రంథరచనలకు గ్రంథకర్తలను బురికొల్పుచున్నవి. గ్రంథకర్తలు జనాదరణమునకును, విజ్ఞానవ్యాపనమునకును సాధనములైన గ్రంథములను రచియించుట సంభావ్యము.

ఆంధ్రగ్రంథములందు భారత భాగవత రామాయణము లతివ్యాప్తిగల గ్రంథములుగ నున్నవి. భారత మెన్నియో ముద్రణములను బొంది లక్షలకొలది ప్రతులు గృహగృహమునందును వ్యాపించియున్నవి.

## గ్రంథకర్తలు

శ్రీయుతులు గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు, రావుబహద్దరు వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్రములందు ప్రఖ్యాత కవుల చరిత్రలను

* ఆ ముఖపత్ర మిచట ప్రత్యేకముగా ముద్రితమై యున్నది.

కాలీజికిసెక్రెటరియైనమహారాజరాజశ్రీ

హెర్రి - హార్కినెస్సు దొరగారిసముఖమునకు

కాలీజిలోకార్యదర్శి సంస్కృతప్రధానపండితులైనఅహోబలాచార్యులున్ను-యోగ్యతాపత్రికనుబొందిన - ముద్దురామశాస్త్రులున్ను - భీమసేనాచార్యులున్ను - ఆంధ్ర - ప్రధానపండితులైన-గురుమూర్తిశాస్త్రులున్ను - వ్రాశియిచ్చినదేమంటే

తమరు - అబద్ధములులేకుండాశోధించుమనిమావద్దయిచ్చిన - శబ్దమంజరియొక్క ప్రథమద్వితీయభాగములయిన - అకురగుచ్ఛము సంధివృంతము - ఈరెంటినిన్ని-మేమునలుగురమున్ను-బాగాశోధించితిమి-ఇందులోమాకుచూడగాఅబద్ధములులేవనిన్నియిదిబాలులకుచదవనుపయోగింపుననిన్నితోచుచున్నది ఈప్రకారముగా

౧౮౨౭ - సంవత్సరం
ఆగష్టునెల ౨౭ తేది

అహోబలాచార్యులు.
ముద్దురామశాస్త్రి.
భీమసేనాచార్యులు.
గురుమూర్తిశాస్త్రి.

వ్రాసిరి. ప్రఖ్యాత కవులైన నన్నయ, తిక్కన, పోతన, శ్రీనాథుడు, సూరన్న మొదలగు మహాకవుల విషయమై పండితులు ప్రత్యేక గ్రంథములను వ్రాసిరి. ప్రఖ్యాత గ్రంథముల పీఠికలయందు గూడ్య కవి విమర్శనలు చేయబడినవి. ఆవిషయములనే తిరిగి తెలుపుట పాఠకులకు ప్రయోజనకరముగాదు. కొన్ని విశేషంశములు మాత్ర మిచట బొందుపరుపబడును.

ఆదియుగ గ్రంథకర్తలు రచియించిన గ్రంథములు వర్తమానయుగ గ్రంథకర్తలు రచించిన గ్రంథములవలె బహుళములు గావు. నన్నయభట్టారక కృత గ్రంథము భారతము మాత్రము గలదు. తిక్కన సోమయాజి విరచిత గ్రంథములు భారతము, నిర్వచనోత్తర రామాయణము మాత్రము గలవు. పోతనామాత్య కృతములు భాగవతము, భోగినీదండకము, వీరభద్రవిజయము గలవు. పెద్దన్న కొక మనుచరిత్రము శాశ్వతమైన కీర్తిని గడించినది. పింగళి సూరన్నకు రాఘవపాండవీయము, ప్రభావతీ ప్రద్యుమ్నము, కళాపూర్ణోదయము నఖండకీర్తిని గడించినవి. పాల్కురికి సోమనాథునకు ద్విపదకావ్యములైన బసవపురాణము, పండితారాధ్య చరిత్రము ప్రతిభను గడించినవి. వాచసోమునకు నెర్రాప్రెగ్గడకు (?) ఉత్తర హరివంశము చాలినది. శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యము, శృంగారనైషధము, కాశీఖండము, పల్నాటి వీరచరిత్రము, భీమేశ్వరపురాణము, వీధినాటకము, హరవిలాసము నను గ్రంథములను రచియించెను. గ్రంథకర్తృ ప్రతిభకును, గ్రంథ ప్రచారమునకును గ్రంథబాహుళ్యము సాధనముగాని గ్రంథ సముదాయము సాధనము గాదు. గ్రంథకర్తలు రచియించెడి గ్రంథములు వారి మనోభావములను వ్యక్తము చేయుటకు వ్రాయబడుచుండును. ఆగ్రంథములు విజ్ఞాన వ్యాపనమునకు ప్రజాదరణ మెంతవరకు బడయగలవో కాలము నిర్ణయించగలదు. గ్రంథమహాత్మ్యమునకు చిరంజీవిత్వము ప్రమాణము. గ్రంథరచన యందు నూటికొక దానికైనను మహాత్మ్యముగలదని నిర్ణయించుట సాధ్యము గాదు. యుధావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకమును, కంచర్ల గోపన్న దాశరథీశతకమును వ్రాయునప్పుడు వ్రాసిన ప్రతిపద్యమును నదీప్రవాహము నందు బడవేసిరనియు, ఎదురీదివచ్చిన పద్యములను మాత్రము వారు గ్రహించి రనియు ఒక గాథ కలదు. ఈగాథవలన గ్రంథరచనలందు గ్రంథకర్తల యుద్దేశ లక్ష్యము తెల్లమగుచున్నది. భవభూతి మాలతీమాధవరచనయందు దెల్పిన భావము యథార్థమును దెలుపుచున్నది.

శ్లో. యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః,
ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.

విశాలమైన విశ్వమునందు దేశకాల పాత్రల పరిస్థితుల ననుసరించి గ్రంథరచన లేర్పడుచున్నవి. ఆ గ్రంథములను జదువుటకు బ్రాయుటకు లేకుండుచునే యుందురు. సృష్టిరచనయందలి పదార్థములవలె వాఙ్మయ ప్రపంచమునందలి గ్రంథములును నేదో కొంత ప్రయోజనము నొడగూర్చుట నిశ్చయము. స్వల్ప ప్రయోజనములను సమకూర్చెడి గ్రంథములు చిరంజీవిత్వము లేక యంతరించుటయు, మహా ప్రయోజనము నొడగూర్చెడి గ్రంథములు చిరంజీవిత్వము కలిగి మనుటయు ప్రకృతిధర్మము. లాక్షణికులు కావ్యముల కున్నతఫలమును నిర్ణయించిరి.

## కావ్యలక్షణము

"విశ్వః శ్రేయః కావ్యమ్"—విశ్వమునకు శ్రేయస్సు నొడగూర్చెడి గ్రంథములు మాత్రము కావ్యనామమున కర్హములై చిరంజీవితమునకు దగియున్నవని లాక్షణికుల మతము. "వాక్యం రసాత్మకం కావ్యం" అను భావ మిప్పుడు వ్యాప్తిని బొందుచున్నది. సకల వాఙ్మయములందును చిరంజీవితములగు గ్రంథములు స్వల్పముగ నున్నవి. విశ్వముయొక్క శ్రేయస్సునకు సాధనములైన గ్రంథములు దేశకాలపాత్రానవచ్ఛిన్నములై లోకమునం దంతటను పూజ్యతను బడయుచున్నవి. కాళిదాసుని కావ్యములు దిగంతవ్యాప్తములై చిరంజీవులై యున్నవి. సంస్కృత కావ్యములవలె లేటిను, గ్రీకు భాషా కావ్యములును, ఆంగ్ల, ఫ్రెంచి, జర్మనీ, జపాను మొదలగు భాషల యందలి యుత్తమ కావ్యములును చిరంజీవులై ప్రజాదరణమును బడయుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునందును భారత భాగవత రామాయణములు, మనుచరిత్ర కళాపూర్ణోదయాది ప్రబంధములు, పురాణములు, శతకములు మొదలగు నితరగ్రంథములు చిరంజీవులై ప్రజాదరణమును గలిగియున్నవి. రసహృదయము, భావౌన్నత్యము, భాషా మాధుర్యము కావ్యములను చిరంజీవులను జేయుచున్నవి. సుమతి వేమన భాస్కరాదిశతకములు చిన్నవయినను చిరంజీవులై ప్రజాదరణమును గలిగియున్నవి. పెద్ద గ్రంథములు పెక్కులు ప్రజాదరణము లేక పేటికలయందు నిద్రించుచున్నవి. వర్తమానకాలమున విద్యావ్యాపనము, ముద్రణాదిసౌకర్యములు గ్రంథరచనను సుకరము చేసినవి. అనుదినము క్రొత్త గ్రంథము లెన్నియో పుట్టుచున్నవి. ఆ గ్రంథములం దెన్నియో ప్రజాదరణము లేక కృశించుచున్నవి.

పూర్వకాలమునందు రాజాదరణము వాఙ్మయాభివృద్ధికి దోడ్పడిన విధమున వర్తమాన యుగమునందు ప్రజాదరణము వాఙ్మయ వికాసమునకు సాధనముగ నున్నది. రావుబహద్దరు వీరేశలింగము పంతులుగారు రచించిన 120 గ్రంథములు ప్రజాదరణమునకు బాత్రములై వాఙ్మయవికాసమునకు దోడ్పడినవి. ముద్రాక్షరశాలల పుణ్యమున వర్తమాన కాలమునందు గ్రంథకర్తలును, గ్రంథభర్తలును నగుట సులభసాధ్యమైనది. నిత్యమును వెలువడుచున్న గ్రంథము లీవిషయమును విశదము చేయుచున్నవి.

ఆంధ్రవాఙ్మయ వికాసమును యుగముల ననుసరించియు, ఛందస్సు ననుసరించియు, విషయవిభాగము ననుసరించియు, కావ్యవిభాగము ననుసరించియు నిర్ణయించుట కవకాశములు గలవు. కాని ఈ విభాగములు యుగభావ విభాగమువలె వాఙ్మయాభ్యుదయమును నిర్ణయించుటకు ప్రయోజనకరములు గావు. భిన్నయుగములందు భావవికాసము, భాషావికాసముతో ప్రజావికాసమునకును, దేశవికాసమునకును, ధర్మవికాసమునకును, రసోదయమునకును వినియోగపడిన విధమును వాఙ్మయములు విశదము చేయుచున్నవి. భిన్నయుగములం దాంధ్రాభ్యుదయము సంప్రాప్తమైన విధమును భావరూపమున ఆంధ్రవాఙ్మయము వ్యక్తము చేయుచున్నది. అవిచ్ఛిన్నముగ 2200 ఏండ్ల నుండియు చైతన్యము గలిగి వెలయుచున్న ఆంధ్ర సత్త్వస్వభావస్వరూపములను గనుగొనుట కాంధ్ర వాఙ్మయము పరమసాధనముగ నున్నది.

## వాఙ్మయ వికాసము

వాఙ్మయములు దేశకాలపాత్రల తత్త్వముల కనురూపముగ ప్రత్యేక భాషలందు ప్రత్యేక భావరూపములను భిన్నయుగములందు వికసించుచున్నవి. సకల సాహిత్యములకును విశ్వకల్యాణము ప్రయోజనము. విశ్వకల్యాణలక్ష్యము వివిధవాఙ్మయములందును ప్రజాభాషాతత్త్వముల కనురూపముగ వివిధములైన భావరూపములను విశదమగుచున్నది. వీరలక్ష్యము, శృంగారలక్ష్యము, శాంతి లక్ష్యము, ధర్మలక్ష్యము మున్నగు లక్ష్యములు వాఙ్మయములకు భిన్నములైన స్వరూప స్వభావములను గలుగజేయుచున్నవి. వీర శాంతి శృంగారాదిలక్ష్యములను దేశకాలపాత్రావరణములందు నానావిధములైన వాఙ్మయములకు భిన్నరూపములను వ్యక్తిత్వమును గలుగజేయుచున్నవి. గ్రీకు, లేటిను వాఙ్మయములు సన్నిహిత సాహచర్యమును గలిగియున్నను ప్రత్యేకలక్షణములను గలిగి వృద్ధిపొందినవి. గ్రీకు సాహిత్యమునకు రూప సౌందర్యమును, లేటిను సాహిత్యమునకు శాసన సంధానమును హృదయములుగ నున్నవి. గ్రీకులేటిను వాఙ్మయములందలి కళాసౌందర్యము, శాసన సంధానము పాశ్చాత్య విజ్ఞానమునందు భిన్నములైన భావరూపములందు గోచరమగుచున్నవి.

ఆంధ్ర గీర్వాణవాఙ్మయములకును, ఆంధ్రద్రావిడ వాఙ్మయములకును సన్నిహితమైన సాహచర్య సంబంధము లున్నను ఆంధ్రవాఙ్మయము వ్యక్తిత్వము గలిగి వికసించినది. ఆంధ్ర భారతభాగవతములును, ప్రబంధాదిరచనలును వీందులకు నిదర్శనములుగ నున్నవి. ఆంధ్ర వాఙ్మయ వికాసమును బరిశీలించునప్పుడు సహజమైన తత్త్వాధారమున విమర్శించుట ప్రయోజనకరముగాని యన్య వాఙ్మయ తత్త్వాధారమున విమర్శించుట ప్రయోజనకరము కాదు. వర్తమాన

సమయమునందు పాశ్చాత్యసంస్కారమితర సంస్కారములకువలె వాఙ్మయ సంస్కారమునకును ప్రమాణముగ నాంగ్లవిద్యావంతులచేత పరిగణింపబడుచున్నది. ఆంధ్ర వాఙ్మయతత్త్వమునకు భిన్నమైన ప్రమాణము ననుసరించి ఆ వాఙ్మయమును పరిశీలించుట వాఙ్మయతత్త్వమును గ్రహించుటకు ప్రయోజనకరము గాజాలదు.

సంస్కృత వాఙ్మయాధారముల ననుసరించి వికసించిన యాంధ్ర వాఙ్మయమును సంస్కృత లక్ష్యలక్షణ ప్రమాణముల ననుసరించి పరిశీలించుట ప్రయోజనకరము. ఆంగ్లవాఙ్మయ ప్రమాణముల ననుసరించి విమర్శించుట విషయావగాహనమునకు సాధనము గాదు. సంస్కృత సాహిత్యమునకు లక్ష్య మాధ్యాత్మికము. ఆంగ్ల సాహిత్యమునకు లక్ష్య మాధిభౌతికము. విమర్శకులు భారతీయ సాహిత్యలక్ష్యము భావమునందును, ఆంగ్లసాహిత్యలక్ష్యము రూపమునందును లగ్నమగుచున్నవి. ఆరూఢమైన భారతీయ సాహిత్యసంస్కారముగల పండితులు భారతీయ సాహిత్యములను విమర్శించుట కర్హులుగ నున్నారు. అట్టి యధికారులుగాని స్వదేశ విదేశ పండితుల విమర్శనలు భారతీయ సాహిత్యస్వాదయమును గ్రహించుటకు సాధనములు గాజాలవు. ఆంధ్రవాఙ్మయమిా లక్ష్యములతో నిందు సింహావలోకనము చేయబడును.

సంస్కృత వాఙ్మయమునందు గావ్యమును వాఙ్మయమునకు హృదయముగ లాక్షణికులు పరిగణించిరి. కావ్యములు కాలాంతరమున భిన్నరూపములను దాల్చినను వాఙ్మయతత్త్వమును గ్రహించుటకు గావ్యతత్త్వమును గ్రహించుట పరమసాధనముగ నున్నది. వాఙ్మయపరిణామమును భాష, భావము, రచన, రూపము, రసము విశదము చేయుచున్నవి. కావ్యములందును, నితర రచనలందును నీ విభాగములు వాఙ్మయపరిణామమునకు వినియోగపడిన విధమును వాఙ్మయ పరిశీలనము తెలుపుచున్నది.

ఆంధ్రవాఙ్మయము భిన్న యుగములందు స్వజాతీయ విజాతీయ విజ్ఞానముల ప్రాబల్యముల కనురూపముగ వికసించిన విధమును వాఙ్మయ రచనలు విశదము చేయుచున్నవి. వేదములు, వేదాంగములు, పురాణేతిహాసములు నితర భారతీయవాఙ్మయములకు వలె ఆంధ్రవాఙ్మయమునకును మూలాధారములుగ నున్నవి.

ప్రాచ్య పండితులును, పాశ్చాత్యపండితులును కావ్యలక్షణమును, కావ్యప్రయోజనమును భిన్నమార్గముల నిర్ణయించుచున్నారు. వేదము లపౌరుషేయములు. వేదాంగములు- శిక్ష, కల్పము, వ్యాకరణము,నిరుక్తము, జ్యోతిషము, ఛందస్సు వేదార్థనిర్ణయమున కేర్పడిన పౌరుషేయశాస్త్రములు. వైదికధర్మతత్త్వములను వేదాంగములద్వారా పురాణములు వ్యక్తము చేయుచున్నవి. వేదమంత్రములందు గల గాథలు పురాణములందు విస్తృతములై దైవత్వము మానవత్వమునందును, అపౌరుషేయము పౌరుషేయమునందును ప్రత్యక్షము చేయుచున్నవి. వేదములం దాహూతులైన దేవతలకు బురాణములును, ఉపపురాణములును నేర్పడినవి. ఋగ్వేదమునందు పర్కొనబడిన వసిష్ఠ విశ్వామిత్రులు, వినతాకద్రువలు, అశ్వివరుణేంద్రాదులు, బ్రహ్మ విష్ణు రుద్రసోమాది దేవతలు పురాణములందు నూతన వికాసమును బొందిన విధమును పురాణగాథలు వెల్లడి చేయుచున్నవి.

## 2

# సంస్కృత వాఙ్మయము

సంస్కృత వాఙ్మయము ప్రపంచ వాఙ్మయములం దత్రప్రాచీనమైన వాఙ్మయము. లోకమాన్య బాలగంగాధర తిలకుగారు 'ఓరియను', 'ఆర్యుల ఉత్తర ధ్రువవాసము" అను గ్రంథములందు వేదకాలమును 8000 ఏండ్లకు పూర్వముగ నిర్ణయించిరి. జేకోబీ పండితుండును తిలకుగారి సిద్ధాంతముల నంగీకరించి 6000 ఏండ్లకు పూర్వముగ సిద్ధాంతీకరించెను. ఆర్థరు మెక్డొనలుగారు 3500 సంవత్సరములుగ నిర్ధారణ చేసిరి. బైబిలు కాల ప్రణాళికయందును, గ్రీకువాఙ్మయాధిక్యమునందును విశ్వాసముగల పాశ్చాత్య పండితులు వేదకాల నిర్ణయమునందు సంకుచితాభిప్రాయములను గలిగి యుండుట సహజముగ నున్నది. ఈజిప్టు, అస్సిరియ, చాల్డియ, సింధు, గ్రీసు మొదలగు ప్రాచీన సామ్రాజ్యముల చరిత్రములు భారతీయ విజ్ఞానముయొక్క ప్రాచీనత్వమును విశదము చేయుచున్నవి. సింధులోయయందు బయల్పడిన మొహంజొదారో జీర్ణనగరములు 5300 ఏండ్లకు పూర్వము వర్తిల్లినటులు సర్ జాన్ మార్షలుగారు నిర్ణయించుచున్నప్పుడు వేదయుగప్రాచీనత్వము స్థిరపడుచున్నది. వేదకాలము 10,000 ఏండ్లైనను 4,000 ఏండ్లైనను వైదిక విజ్ఞానము మానవధర్మవికాసమునందు నిరుపమానముగ నున్నది. వైదికవిజ్ఞానము వేదాంతమును, బౌద్ధమతమును, శైవవైష్ణవభక్తిని లోకమునకు ప్రసాదించినది.

పురుష ప్రకృతిసంయోగవిలసితమైన విశ్వమునందు జీవవికాసమును, ప్రకృతివికాసమును విశ్వకల్యాణమునకు సాధనములుగ నున్నవి. ప్రకృతిసౌందర్యము, ప్రకృతిగాంభీర్యము, ప్రకృతి వైచిత్ర్యము, ప్రకృతి బీభత్సము మానవుల సుఖదుఃఖములకు గారణమగుచు జిజ్ఞాసకు సాధన మగుచున్నవి. మానవజిజ్ఞాస వేదవేదాంత పురాణేతిహాస కావ్యనాటక శాస్త్రకథాదుల భావరూపముల వాఙ్మయనిర్మాణమునకు సాధనమగుచున్నది. లోకమునందలి వివిధములైన వాఙ్మయముల పరిశీలన మీ తత్త్వార్థమును వెల్లడి చేయుచున్నది. భారతదేశ భాషావాఙ్మయములకు సంస్కృతవాఙ్మయమే మూలాధారముగ నున్నది. ప్రాచీనకాలమునందలి ప్రాకృత వాఙ్మయములకును, వర్తమానకాలమునందలి దేశభాషా వాఙ్మయములకును సంస్కృత వాఙ్మయమే మూలాధారముగ నున్నది. సంస్కృతవాఙ్మయము దేశభాషా వాఙ్మయములకు మహోపకారమును జేసినటులు మహాపకారమును గూడ జేసినది.

చతుర్వేదములు క్రీస్తుశకమునకు 5000 ఏండ్లకు పూర్వమే పూర్ణస్వరూపమును బొందినవి. వేదాంగములు— శిక్ష, కల్పము, ఛందస్సు, నిరుక్తము, వ్యాకరణము,జ్యోతిషము—క్రీస్తుశకమునకు 1000 ఏండ్లకు పూర్వమే రచింపబడినవి. పూర్వోత్తరమీమాంసలును నాకాలమునకే ఏర్పడినవి. ధర్మశాస్త్రములు క్రీస్తుశకమునకు 400 ఏండ్లకు పూర్వమే రచింపబడినవి. అష్టాదశపురాణములు, కావ్యములు, నాటకములు, లక్షణగ్రంథములు క్రీ. శ. 100 ఏండ్లలోపల పరిపూర్ణతను బొందినవి. అపారమైన సంస్కృతవాఙ్మయము సారస్వతోపాసకులకు సిద్ధముగ నున్నను ప్రజాసామాన్యమునకు దురారాధ్యమైనది. చతుర్దశ విద్యలును బ్రాహ్మణాధీనమునం దుండినవి. బ్రాహ్మణేతరులకీ విద్యలు నిషిద్ధములై దుర్లభములుగ నుండినవి. బ్రాహ్మణపోషకులైన క్షత్రియులకును నీవిద్యలు దుర్లభములై యుండెను. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యగుటకు బడిన పాట్లు విద్యోపార్జనమునందు బ్రాహ్మణేతరప్రజలకుగల ప్రతిబంధకములను విశదము చేయుచున్నవి.

వేదములు, వేదాంగములు కాలక్రమమున జ్ఞానప్రతిపాదకములైనను అవి కేవలము కర్మప్రతిపాదకములై జనసామాన్యమునకు నిరుపయోగములుగ నుండెను. కర్మాధికారము లేని ప్రజాసామాన్యమునకు గర్మకాండ యంతయు నయోమయముగ నుండెను. కర్మాధికారులైన బ్రాహ్మణులకును గర్మకాండ దురవగాహమై, దురారాధ్యమైనది. వైదికమతములందును, శ్రౌతమునందును శాఖాభేదము లేర్పడినవి. కర్మాధికారము గల క్షత్త్రియాదులకైనను బ్రాహ్మణ సహాయము లేక కర్మానుష్ఠానము జేయుట కవకాశములు లేక వారియందు ప్రతిఘటనము బయలుదేరినది. కర్మవేత్తలైన బ్రాహ్మణులకును ననంతమైన కర్మకాండ మయోమయమై పురుషార్థమునకు నిరర్థకమైనది. నిరుక్తకాలమునకే వేదచోదితమైన కర్మకాండ దుర్గమమైనది. వేదకాలాంతమునందే గర్మకాండ దుస్తరమై జ్ఞానమార్గ మారంభమైనది. వేదాంతములైన ఉపనిషత్తులు జ్ఞానమార్గమును ప్రతిపాదించినవి. క్షత్రియులైన జనకాదులు రాజయోగులై, బ్రాహ్మణోత్తములైన శుకాదులకు వేదాంత తత్త్వోపదేశములను జేయుటకు సమర్థులైరి. వైదికకర్మాధికారులైన బ్రాహ్మణులకును, వైదికకర్మాధికారములేని బ్రాహ్మణేతరులకును వేద వేదాంగములు పురుషార్థ

సిద్ధికిని, జీవయాత్రను సుఖప్రదము చేయుటకును నిరుపయోగములైనవి. బ్రాహ్మణపండితులకు ప్రజాహృదయమునందు ప్రవర్ధమానమగుచున్న జ్ఞానతృష్ణ నుపశమింప జేయుట యనివార్యమైనది. ఈ మార్గ మవలంబించనియెడల రాజ్యములేని రాజు వలె బ్రాహ్మణ మతము నిరర్థకము కాగలదు. ధర్మపరాయణులైన కొందరు బ్రాహ్మణులును, రాజులును స్వధర్మనిర్వహణమునకు బూనుకొనిరి.

పండితులు ప్రజలను జ్ఞానవంతులను జేయుటకు బురాణములను గల్పించిరి. భారతరామాయణములు ప్రజలను జ్ఞానవంతులను జేయుటకు రచింపబడినవి. వేదవ్యాస విరచితములైన పురాణాది గాథలను సూతుడు శౌనకాది మహామునులకు వినుపించుచుండెను. వైదిక పౌరాణికగాథలు కావ్యరూపములను దాల్చినవి. కావ్యరూపమున బ్రజలకు జ్ఞానోపదేశమును జేయుటకు పండితులు ప్రయత్నించుచుండిరి. వేదములు, పురాణములు, శాస్త్రములు, కావ్యములు విజ్ఞానవ్యాపనమునకు విద్వాంసులకు వినియోగపడినను బ్రజాసామాన్యమునకీ విజ్ఞానము దుర్లభముగనుండెను. వైదిక భాష, సూత్రభాష, పౌరాణికభాష, కావ్యభాష మహాపండితులకే దుర్గ్రాహ్యముగ నుండినప్పుడు సామాన్యులమాట విచారింప నవసరమే లేదు.

విజ్ఞానసంపాదనమునకును, విజ్ఞానవ్యాపనమునకును దీక్షను బూనిన మహర్షికులము క్షీణించినది. బ్రహ్మర్షులకు విజ్ఞానోపాసన దీక్ష నశించినది. బ్రహ్మర్షికులములు నామమాత్రావశిష్టములైనవి. ప్రజాహృదయమునందు విజ్ఞానతృష్ణ వర్ధిల్లినది. ప్రజల జ్ఞానతృష్ణను దీర్చుట కపారమైన సంస్కృత వాఙ్మయ మున్నను దానిని గ్రహించుటకు బండితులకును, ప్రజలకును సాధ్యము గాకుండెను. బ్రాహ్మణ పండితులు వేదవేదాంగములను గోప్యముగ నుంచిరి. ఇవి గురుముఖముననే యభ్యసింపదగినవి. వేదాధ్యయనము, వైదికకర్మలు బ్రాహ్మణులకు మాత్రమే సాధ్యములు. ఆరంభమునందు చైతన్యప్రదమైన వైదికకర్మకాండ సూత్రయుగమునాటికి నిశ్చేష్టతను వహించినది. పురుషార్థమునకు సాధనములైన వైదికకర్మలు ధర్మార్థకామములకు విముఖత్వమును బూనినవి. వేదాంతమునకు సాధనములైన వైదికకర్మలు జడములైనవి. జిన బుద్ధాదులు కర్మకాండను ధర్మపరము చేసి ప్రజాహృదయమును చైతన్యోజ్జ్వలము చేయుటకు సమకట్టిరి.

జినుడు, బుద్ధుడు పండితపామరులకు దుర్గమమైన సంస్కృత భాషను విడచి సుగమమైన వాడుకభాషయందు వారి ధర్మోపదేశములను జేయుట కుపక్రమించిరి. దేశభాషయందు వాఙ్మయనిర్మాణ మారంభమై సంస్కృత వాఙ్మయ విజ్ఞానము నవరూప భావముల సులభముగ ప్రజాహృదయము నావహించినది. పాలీభాషయందు ధమ్మపదము, బుద్ధజాతకములు మొదలగు గ్రంథములు విరచితములై, ప్రజాసామాన్యమునకు ధర్మపరిజ్ఞానము సుకరమైనది.

విక్రమార్క హర్షవర్ధన భోజరాజాదుల కాలమునందు సంస్కృత వాఙ్మయము పునరుద్ధృతమై ప్రాకృతవాఙ్మయమును గొంతవర కరికట్టినను జైనబౌద్ధ మతాచార్యు లవలంబించిన దేశభాషాదరణము వివిధ ప్రాంతములందును స్థిరపడినది. వివిధములైన దేశభాషలందు ప్రజావికాసమునకు సాధనములైన దేశభాషా వాఙ్మయనిర్మాణము లారంభములైనవి. ప్రభువులు, పండితులు, పామరులు దేశభాషల పట్ల యాదరణమును బూని సంస్కృత విజ్ఞానమును దేశీయవాఙ్మయస్వరూపమున బరివర్తనము చేయుట కుపక్రమించిరి. ఈ పరివర్తనమునందును వేదములు, వేదాంగములు దుర్గమములైన దుర్గములుగనే యుండెను. దేశభాషా వాఙ్మయము లన్నియు సామాన్యముగ బురాణేతిహాస కావ్యముల యనువాదములతో నారంభమైనవి. సంస్కృత వాఙ్మయము దేశభాషా వాఙ్మయములకు సిద్ధాన్నమును సమకూర్చి మహోపకారమును జేసినను వాని సహజవికాసమునకు గొంత ప్రతిబంధకముగ నేర్పడినది. పండితులును, ప్రజలును సహజమై సచేతనమైన దేశీయభాషా సంప్రదాయములను, ప్రజావాంఛలను ననుసరించుటకు బదులు పురాతనమై, చిరకాలప్రతిష్ఠితమైన, సంస్కృత వాఙ్మయము ననుసరించుచు నిర్మాణకౌశలమునకు భంగమును గలుగజేసిరి. ప్రాకృతవాఙ్మయములందును, ద్రవిడవాఙ్మయములందును భాష, భావములు, ఛందస్సు, రచనలు తత్సమ తద్భవ ప్రాయములై ప్రబలినవి. సంస్కృతమునకును, దేశభాషలకును జిరకాలమునుండియు గలుగుచున్న సంరంభమునందును, సంఘర్షమునందును సంస్కృతభాషాప్రతిభయే దేశీయవాఙ్మయములం దెల్లెడలను గోచరమగుచున్నది. పండితులు సామాన్యముగ సంస్కృతభాషాప్రియులు; సంస్కృతవిజ్ఞానప్రియులు. సామాన్యప్రజలు సహజమైన దేశభాషాప్రియులు. ఇది ప్రకృతి ధర్మము; కాలప్రభావము. పండితులుగాని, ప్రజలుగాని నిందార్హులుగారు. భారతీయవిజ్ఞాన వాఙ్మయములందు సంస్కృత విజ్ఞాత వాఙ్మయముల ప్రతిభ భిన్నకాలములందు భిన్నరూపముల నెల్లప్పుడును వ్యక్తమగుచునే యున్నది. దేశభాషల వాఙ్మయవికాసమున కెన్ని యవాంతరములు, విఘ్నములు, విపత్తులు గలిగినవో దేవున కెరుక! అయినను సజీవములైన దేశభాషా వాఙ్మయములు స్వయంవ్యక్తిత్వమును గలిగి వర్ధిల్లుట ప్రకృతిధర్మము.

క్రీస్తు శకమునందలి ఏడెనిమిది శతాబ్దములకు సంస్కృత వాఙ్మయమునందు నిర్మాణదక్షత క్షీణించినది. జైన బౌద్ధమత బోధకులు 800 ఏండ్లు వారి బోధలను దేశభాషలందు జేయుచు దేశీయ వాఙ్మయరచనలను జేయుటకుం దోడ్పడుచుండిరి. కుమారిలభట్టును, శ్రీశంకరాచార్యులును నేడెనిమిది శతాబ్దములందు జైనబౌద్ధమతములను శిథిలముచేసి వైదికమతమునకును, సంస్కృత సంస్కారమునకును తిరిగి యుత్తేజమును గలుగజేసిరి. వైదికమతప్రియులైన రాజులు శంకరదండయాత్రకు దోడ్పడి పడిపోవుచున్న వైదికమత ధ్వజమును దిరిగి ప్రతిష్ఠించిరి. కాని ఈ యుత్తేజము వైదికమతసంరక్షణమునకు గొంత వినియోగపడినను ప్రజాప్రయోజనములకు వాఙ్మయప్రయోజనమునకును విశేషముగ వినియోగపడలేదు. సంకుచితమైన వైదికకర్మమార్గము పండిత పామరులకు జీవయాత్రయందు విముఖత్వమును గలుగజేసినది. దుర్గమమైన జైనబౌద్ధధర్మమార్గము పండితపామరులకు జీవయాత్రయందు విరక్తిని గలుగజేసినది. ప్రజలకు జీవయాత్రయందు గలిగిన విముఖత్వమును బోగొట్టి యనురక్తిని గలుగజేసి పురుషార్థసిద్ధిని బడయుటకు భక్తిమార్గము ప్రముఖమైనది.

శ్రీశంకరాచార్యులు వైదికధర్మప్రతిష్ఠాపనము జేసినను వారి రచనలు భక్తిమార్గ ప్రభావమును సువ్యక్తము చేయుచున్నవి. వేదోక్తమైన కర్మమార్గము దురారాధ్యమై నిరర్థకమైనది. జైనబౌద్ధమత ప్రతిపాదితమైన ధర్మమార్గము దురారాధ్యమై సంకరమైనది. కర్మమార్గము, జ్ఞానమార్గము, ధర్మమార్గము పండితులకు సుగమములైనను బ్రజాసామాన్యమునకు దుర్గమములై వారి హృదయానందరస ప్రవాహమును శుష్కింపజేసినవి. ప్రజాహృదయమునందానందరసోదయమై దేశము, ప్రజలు వర్ధిల్లుటకు ప్రజాహృదయమున కనుభవసిద్ధమైన దేశీయ భాషావాఙ్మయ నిర్మాణము లవసరములైనవి. ఈ నిర్మాణములకు జీవకళను సజీవమైన భక్తిమార్గము సమకూర్చినది. ఇది కాలప్రభావము. పండితులకును, ప్రభువులకును ప్రజాసంకల్పము నాపుట దుష్కరమై ప్రజాహితార్థము గాకపోయినను దమ కీర్తి కొరకైనను దేశీయవాఙ్మయ నిర్మాణమునకు బూనుకొనవలసిన యవసరము గలిగినది. ప్రపంచమునందు సర్వకాల సర్వావస్థలయందును స్వప్రయోజనపరాయణులవలె త్యాగశీలురును గలుగుచుందురు. అట్టి త్యాగమూర్తులే చిరంజీవులై ప్రజాదరణమునకు పాత్రులగుచున్నారు. క్రీస్తుశకము తొమ్మిది పదిశతాబ్దములందు భరతవర్షమున నవయుగ మారంభమాయెనట. దేశభాషావాఙ్మయములు పల్లవించుట కారంభించి క్రమవికాసమును బొందినవి. ఆంధ్ర కర్ణాటక మహారాష్ట్ర ఘూర్జర వంగ హిందీ వాఙ్మయములు సామాన్యముగ బదవశతాబ్దము తరువాతనే వృద్ధిబొందినవి. ఈ సంగతిసందర్భములను గనుకొనుట యితర దేశభాషావాఙ్మయముల చరిత్రలకువలె నాంధ్ర వాఙ్మయపు చరిత్రమునకును నత్యంతావశ్యకముగ నున్నది.

## అజ్ఞాతయుగము

## 3

ఆంధ్రవాఙ్మయచరిత్రయం దజ్ఞాతయుగ మాంధ్రరాజుల కాలము నుండి నన్నయభట్టారకుని కాలమువరకును వ్యాపించియున్నది. ఆంధ్రరాజుల

శాసనములన్నియు ప్రాకృత భాషయందు గలవు. నాసిక, నానాఘాటు, అమరావతి, నాగార్జునకొండ మొదలగు స్థలములలోని శాసనములు సామాన్యముగ ప్రాకృత భాషయందు గలవు. ఆశాసనములలోని విషయములు దానధర్మములకు సంబంధించి యున్నవి. ఈ శాసనము లాంధ్రావనికి సంబంధించినవైనను నాంధ్ర వాఙ్మయమునకు సంబంధించినవి గావు.

## ప్రాకృత శాసనములు

ఈ శాసనము లాంధ్రవ్యాదయ భావాంకురములను గమనించుటకు, మాత్రమే వినియోగపడగలవు. పల్లవుల శాసనములు సామాన్యముగ ప్రాకృత సంస్కృతములందు గలవు. విష్ణుకుండి సంతజాల శాసనములు సంస్కృతమునం దున్నను తెలుగుపదములు గన్పడుచున్నవి. ఆ శాసనములం దాంధ్రవాఙ్మయాంకురములు పొడగట్టుచున్నవి.* చాళుక్యరాజుల శాసనములు సంస్కృతాంధ్రములందు గలవు. ఆశాసనములందలి విషయములును దానధర్మములకు సంబంధించియున్నవి.

ఈశాసనములందు యాంధ్ర దేశీయవాఙ్మయము బీజరూపమున గోచరము చున్నది. శాసనములందు పద్యగద్యరూపమున వాఙ్మయాంకురములు గనపడు చున్నవి. రగడ, మధ్యాక్కర, సీసము మొదలగు పద్యములు నన్నయకుఁ బూర్వమే వాడుకయం దున్నటులు శాసనములు దెలుపుచున్నవి. కాని ఆ పద్యములందు రచించిన గ్రంథము లేవియు గానరాకున్నవి. శ్రీయుత వంగూరి సుబ్బారావుగారు వారి యాంధ్రవాఙ్మయ చరిత్రమునందు నన్నయకు బూర్వమునందుండిన

---

## * మచ్చునకు మూఁడు ప్రాకృత శాసనములు

### 1

### నాసిక గుహలలోని శాసనము

[ఈ శాసనము నాసిక గుహలలో 3 వ గుహలోని వసారా తూర్పుగోడమీద ఉన్నది. ఈ నాసికగుహలలోని ఆంధ్రరాజుల ప్రాకృతశాసనములను 'సినార్టు' పండితుడు 'ఎపిగ్రాఫియా ఇండికా' ఎనిమిదవ సంపుటములో అర్థవివరణముల తోను, పాఠభేదములతోను ప్రకటించెను. అందుండియే ఈశాసన పాఠము గ్రైకొనఁబడినది.]

1. సిద్ధం సెనాయ వెజయంతియ విజయఖంధావారా గొవధనస బెనా కటకస్వామి గొతమిపుతో సిరిసదకణి

2. ఆనపయతి గొవధనె అమచ విణ్హుపాలిత గామె అపరకఖడియె యు శేతం అజకాలకియం ఉసభదతెన భూతం నివతన

3. సతాని బె 200 ఎత అమ్హ కేత నివతన సతాని బె 200 ఇమెస పవజితాన తెకిరసిన వితరామ ఎతస చ కేతస పరిహార

4. వితరామ అపావెస అనొమస అలొణఖాదక అరఠసవినయిక సవజాత పారిహారిక చ ఎతిహి నం పరిహారేహి పరిహరే. హి

5. ఎత చ కేతపరిహారే. చ ఎథ నిబధాపెహి అవియెన ఆణతం అమ చెన సివగుతెన ఛతో మహాసామియెహి ఉపరఖితా

6 దతా పటికా సవఛరె 18 వాసపఖ దివసె 1 తాపసెన కటా.

### 2

### జగ్గయ్యపేట స్తూపశాసనము

[ఈ శాసనము జగ్గయ్యపేట స్తూపపు రాతిమీఁద జెక్కఁబడి యున్నది, దీనిని బూలరుదొరగారు 'ఇండియన్ ఆంటిక్వెరి' పత్రిక 11 సంపుటము (1882) లోఁ బ్రకటించిరి. బర్జెస్‌దొరగారు తమ 'అమరావతి, జగ్గయ్యపేట స్తూపములు' అను గ్రంథములో దీనిని దిరిగి ప్రకటించిరి. ఇక్కడఁ జొందు పఱచిన శాసనపాఠము బర్జెస్ దొరగా రిచ్చినది.]

1. సిద్ధమ్ రాఞో మాఢరిపుతస ఇఖాకుణం సిరివిర పురిసదతస సంవఛర 20 వాసాపఖం 8 దివసం

2. 10 క (ం) మాకదకె నడతూరె ఆవెసిన నాకచందసపుతా గామె మహాకాండురూరె ఆవెసని

3. సిధథో అపనో మాతరం నాగిలని పురతొ కతూనం ఘరనిం చ పముదనిం బాలకం చ మూలసిరిం

4. బాలికంచ నాకబుధనికం భతుక (ం) చ బుధనికం తస మహనిం చ బా కం బాలకా చ నాగసిరి చంద

5. సిరి బాలికం చ సిధథనిక (ం) ఎవ (ం) నాతిమిత సంబంధిగాన సహ గామె వెలగిరియం భగవతో

6. బుధస మహాచెతియపువాడరె ఆయక కంబె 5 సవనియుతె అపనో దేయ ధమ్మం సవసతానం హి

7. త సుఖాయ పటిథాపిత తి

### 3

### కృష్ణాజిల్లా అల్లూరిలోని శాసనము

[ఈ శాసనము కృష్ణాజిల్లా నందిగామతాలూకా అల్లూరులోని శిలాస్తంభముమీఁద జెక్కఁబడియున్నది. శాసనముయొక్క ఆద్యంతములు గల శిలా భాగము విరిగిపోయి కానరాలేదు. అక్షరములను బట్టి ఇది క్రీ. శ. రెండవ శతాబ్ది నాటిదిగ దోచును. మనకు దొరకిన శాసనభాగమున రాజు పేరు లేదు. ఇందు భార్యతోను, కొడుకుతోను వచ్చి 'మహాతలవరు' డనునతడు చేసిన దానధర్మములు వర్ణితములైనవి. దీని ప్రతిబింబమును, ఇందలి సారాంశమును(ఇంగ్లీషున) చెన్నపురి శాసనశాఖవారు 1923—24 వ సాంవత్సరిక నివేదికలోఁ బ్రకటించి యున్నారు. శాసన పాఠము శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగా రిచ్చినది.]

1. ..ల (సి మట) వ (నచ)
2. నరామె విహారే దెయధమ పరిచా
3. నిగలసిమాయ నెటరకు లో న
4. తికేత పారసపాసికల సిమాయ
5. నివతనాని రాజదతని చారకే మధ (?)
6. పటసిమాయ బతిస నివతనాని రా
7. . పురసిమాయ చుపిస నివతనా న
8. ట లస గావిన పచసతాని చాయతి జలివా .
9. నకటాని పెనరుషాని దాసిదాస నచతాల .
10. కుధికటాహా నచతరి లోహియెుడి కటాహాని కంస (?)
11. పభాయణాని పతరి పదాలాథి కారొ కర్ణొడ యెుయెు
12. . క దివికాయెుచ అతరగిరియపిచ షాకెతకా
13. కాహాపనా పచ పురానం పహానం అఖయ నివ
14. ఎస మహాతలవరస దెయధమ పరిచాకో
15. అతపేటతరకెస బానవ నివతనాని
16. ఎతస భారియస పవుతకస నవసకాన
17. అయిరాన పుపసెలియాన వినాయన

యాంధ్రవాఙ్మయము నశించుటకుఁగల కారణములు బ్రాహ్మణాభిమానము, మతకలహములు అని నిర్ణయించిరి. జైనులును, బౌద్ధులును వారి మతధర్మవ్యాపనము ప్రారంభమునందు పాళీతెలుగు భాషల ముఖమున జేసియుందురు. జైనబౌద్ధమత బోధకులు సామాన్యముగ సంస్కృతపండితులై యుందురు. వారు మతబోధను బోధరూపమునసే శిష్యులకు చేయుచుండిరి. ఇదియే ప్రాచీన గురుకుల సంప్రదాయము. వారు తెలుగునందు మతబోధల జేసినను తెలుగుభాషయందు గొప్ప గ్రంథములను వ్రాయలేదనియే నమ్మదగియున్నది. అథర్వణాదులు వ్రాసిన వ్యాకరణగ్రంథ నామములను బట్టియు, నితరసాధనములను బట్టియు నాంధ్రవాఙ్మయ మున్నటుల యూహింపదగినను గ్రంథసముదాయములేని యూహలవలన ప్రయోజనము గలుగదు.

సంస్కృతపాండిత్యమే గౌరవప్రదమని తలంపబడు యుగము నందు దేశభాషావాఙ్మయము ఏర్పడుటకు అవకాశములు లేవు. సూత్రయుగము నుండి నేటి వరకును ఆంధ్రదేశమునందు సంస్కృతభాషా పాండిత్యమును, వైదిక మతాభిమానమును అవిచ్ఛిన్నముగ నిలిచియే యున్నవి. ఆంధ్రపండితులు వ్రాసిన కొన్ని సంస్కృత గ్రంథముల నామములు 73 వ పుటయందు పేర్కొనబడినవి. శ్రౌతసూత్రకారుడైన అశ్వలాయను డాంధ్రుడు. గృహ్యసూత్రములను, కల్పసూత్రములను, ధర్మసూత్రములను వ్రాసిన ఆపస్తంబు డాంధ్రుడు. పదునాల్గవ శతాబ్దమునందు ఋగ్వేదభాష్యమును రచించిన సాయనాచార్యుడును నాంధ్రబ్రాహ్మణు డను ప్రతీతి గలదు. సాంగోపాంగ వేదాధ్యయనసంపన్ను లాంధ్రదేశమునం దెందరో నేడును గలరు. ఆంధ్రదేశమునందు జైనబౌద్ధ మతములు వ్యాపించినను వైదికమతముగూడ ప్రబలియున్నది. పండితుల దృష్టి సంస్కృతముమీద నిలిచినటుల తెనుగుమీద నిలువలేదు. నన్నయ కాలమునందైనను సంస్కృతపండితులకు గల గౌరవము తెనుగు పండితులకు లేదు. ఆంధ్రవాఙ్మయము వర్ధిల్లినతరువాత వర్తమాన కాలమునందును నస్థితియే కొంతవరకు నిలిచియున్నది. ప్రభువులకును, పండితులకును సంస్కృతముమీదగల గాఢాభిమానమే తెలుగువాఙ్మయ నిర్మాణమునకు ప్రతిబంధకమైనది.

## తెనుఁగు శాసనములు

నన్నయకు బూర్వము తెలుగు వాఙ్మయ మెంతయున్నదో, ఏ స్వరూపమున నున్నదో, ఏల నశించినదో నిర్ణయించుటకు తగిన యాధారములు లేవు. ఇంతవరకును నుపలబ్ధములైన నన్నయకు వెనుకటి తెలుగు శాసనములవలన నీ విషయములు తెలియుచున్నవి. ఈ శాసనపరిష్కర్తలు శ్రీయుతులు జయంతి రామయ్యపంతులుగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, నేటూరి ప్రభాకరశాస్త్రిగారు, వేటుమళ్ల రాజగోపాలరావుగారు మొదలగు పరిశోధకు లీవిషయములను వ్యక్తముచేసిరి. నన్నయకు బూర్వ మాంధ్రవాఙ్మయమునందు పద్యగద్యరచనలు గలవు. పద్యములు దేశీయ చ్ఛందమునందు వ్రాయబడినవి. రగడలు, మంజరి, ద్విపదలు, సీసములు, మధ్యాక్కరలు, గీతములు, తరువోజలు శాసనములందు వాడుకయందున్నవి. ఈ పద్యములందు యతిప్రాస నియమము లున్నవి. సంస్కృతమునందువలె యతిస్థానము కేవలము విరతిమాత్రమే యగుటకాక ఆంధ్రమునందు శ్లిష్టరూపమును గలిగియున్నది. ఇది కర్ణాట తమిళ కావ్యములందువలె నాంధ్రకావ్యములందును సహజముగ నేర్పడినది. ఈ పద్యముల ఛందస్సు మాత్రాగణబద్ధమని పరిశోధకులు నిర్ణయించిరి. నన్నయ దేశీయ ఛందస్సును సంస్కరించి యతిప్రాసలను స్థిరపరచి ఆంధ్రవాఙ్మయ వృక్షమునకు దోహదము నొసఁగెను. ఆనాటి వాఙ్మయస్వరూపము ప్రజలు నేటికిని బాడెడు తందానపదములందును, భ్రమరగీతములందును, పాటలందును గోచరమగుచున్నది.

## నన్నయకుఁ బూర్వపు శాసనములు

(మచ్చునకు రెండు)

### అద్దంకి శిలాశాసనము

1. ......................................(పుర ?)
2. ......................................భూపాలకుణ్డు (॥*)
3. పట్టంబుగట్టిన ప్రథమంబునేణ్డు బలగర్వ్వమొ
4. ప్పగబైలేచి సేన (।*) పట్టంబు గట్టిఞ్చె ప్రభుం
5. బణ్డరంగు (ం) బ(న్చి)న సామ(ం*)త పదువతో బోయ (।*)
6. కొట్టంబు లోణ్ణెణ్డుం గొని వేంగినాణ్టిం గొఱల్పియ
7. త్రిభువనాంకుశబాణ నిల్పి (*) కట్టెపుదుర్గ్గంబు గడు
8. ముయుల్సేసి కణ్డుకు బ్బెజవాడ గావిఞ్చె మెచ్చి (*)
9. బణ్డరంగు సమరముహోన్నతుణ్డు ఆదిత్యభటరని
10. కి ఇచ్చిన భూమి ఎనుబోదివుట్ల, అడ్డ్ల పట్టునేల (।*) ద
11. మ్మపురంబున దమ్మపుల (।*)దిని రక్షిఞ్చువారికి అస్వ
12. మేధం (బు)న ఫలం (బు) (అ)గు (॥*) *

### సత్యాదిత్య చోళశాసనము*

(కడప మండలము)

1. స్వస్తిశ్రీ చోళమ
2. హారాజాధిరాజ ప
3. (ర)మేశ్వర విక్రమాది
4. (త్య) శక్తికొమర వి
5. (క్ర)మాదితుల కొడు (కు)
6. (శ్రీ) కాశ్యపగోత్రు
7. (స్తు) సత్యాదితున్ఱు సిద్ధి (వే*)
8. యురేనాణ్డు ఏఱు (నే*)
9. (యి)ఏఱుచున్ని కొ (పు)
10. (తి)పాఱ రేవ (శ)
11. (ర్మక) కాశ్యపగో
12. (త్ర)నికి ఇచ్చిన
13. చిఱుంబూరి ఉత్త
14. ర తూర్పున దిశ
15. . దు జగ్గిపాలగ(ఱు)
16. మ ద(క్షి)ణదిశ
18. ...పాఱ (మ)
19. ఏనుమఱ్ఱు (గా)
20. నుతాగిరి జేని
21. వర్పివవానికి

* శ్రీ హెచ్. కృష్ణశాస్త్రిగారి పాఠము.



అద్దంకి శిలాశాసనము

22. (వే) గుళ్ళువు వేసె
23. ఋవ్వుళ వేవా (న్లూ)
24. ఋ్ళ నిర్పినం పుణ్యా
25. (ంబు) దినికి వ్రకంబు
26. వచ్చువన్లు పుత్రవ
27. ద్య స్త్రీవద్య గో(వ)
28. ద్య పళ్ళు మహా
29. (పా) తక ళ్ళోసిన
30. వానిలోకంబు
31. (పుణ్ణు) వాప్లు.

భాష సంస్కృతపదములతో గూడినను దేశీయముగ వెలసినవి. శాసనవాక్యములందును, పాటలందును, పదములందును గొన్ని సంస్కృతపదములు దొల్లనను దెలుగుమాటలే అధికముగ వాడబడినవి. శాసనకర్తలకు గల సంస్కృతాభిమానము వారి వ్రాత అందలి వర్ణక్రమమునందు గనుపడుచున్నది. అనుస్వారమునకు బదులు వ్యాకరణయుక్తముగ ననునాసికములే వాడబడినవి శాసనములు గ్రాంథిక భాషయందును, వాడుకభాషయందును గలవు. కొంతవరకు వ్యాకరణయుక్తము, గను నున్నవి; లిపి రేఖాకృతి నున్నది. వర్తులాకారమును దల్పలేదు. భావములు, శాసనములందు సర్వసామాన్యములు. శాసనములందు దానములు, భూములు హద్దులు, దానవస్తువులు మున్నగు సామాన్య విషయములు మాత్రము వివరింపబడినవి. విశేషణములు సంస్కృతపదములుగనే యున్నవి.

## పదునొకండవ శతాబ్దికిఁ బూర్వపు ఆంధ్రభాషా శాసనముల పట్టిక

| జిల్లా | తాలూకా | గ్రామము | వంశము | రాజు పేరు | శాసనకాలము * |
|---|---|---|---|---|---|
| అనంతపురం | గుత్తి | కొండుపల్లి | బాదామిచాళుక్య | విజయాదిత్య సత్యాశ్రయ శ్రీపృథివీవల్లభ | క్రీ. శ. ఏడవ శతాబ్ది |
| ,, | ,, | దిమ్మగుడి | ,, | విక్రమాదిత్య సత్యాశ్రయ శ్రీపృథివీవల్లభ | క్రీ. శ. ఏడవ శతాబ్ది |
| చిత్తూరు | మదనపల్లి | ముడివేడు | వైదుంబ (?) | ...... | క్రీ.శ. ఎనిమిదవ శతాబ్ది (?) |
| ,, | ,, | వెలిగల్లు | ,, | గండత్రినేత్ర శ్రీ బయ్యుంబ మహారాజు | క్రీ.శ. ఎనిమిదవశతాబ్ద్యాంతము (?) |
| గుంటూరు | బాపట్ల | పిలపఱ్ఱు | ..... | ...... | ,, |
| ,, | ఒంగోలు | అద్దంకి | వేంగి చాళుక్య | [గుణగవిజయాదిత్య (?)] | క్రీ. శ. తొమ్మిదవ శతాబ్ది |
| నెల్లూరు | పొదిలి | బుడమగాయలపాడు | చాళుక్య (?) | విష్ణువర్ధన | ,, |
| కడప | కమలాపురం | మాలెపాడు | చోళ | సత్యాదిత్య చోళమహారాజు | ,, |
| గుంటూరు | ఒంగోలు | ధర్మవరం | చాళుక్య | విజయాదిత్య | ,, |
| ,, | ,, | ,, | ,, | భీమమహారాజు | ,, |
| ,, | ,, | మైలవరం | .... | ... ... | ,, |
| నెల్లూరు | కందుకూరు | కందుకూరు | వేంగిచాళుక్య ? | ... ... | ,, |
| ,, | ,, | పెట్లూరు | .... | ... ... | క్రీ. శ. పదవ శతాబ్ది |
| ,, | కనిగిరి | నలజనంపాడు | పల్లవ | బోదిరాజు | ,, |
| ,, | పొదిలి | కలుజువ్వలపాడు | చోళ | తొండయరాజు (?) | క్రీ. శ. పదవ శతాబ్ది |
| కడప | కమలాపురం | చిలమకూరు | చోళ | ...... | ,, |
| ,, | ,, | మాలెపాడు | రాష్ట్రకూట | నిత్యవర్ష | క్రీ. శ. పదవ శతాబ్ది |

* పై శాసనముల కాలము అక్షరస్వరూపము ననుసరించి నిర్ణయించినది.

నన్నయకుఁ బూర్వమునందు గల తామ్రశాసనములను, శిలాశాసనములను సమగ్రముగ బరిశీలించుటవలన నజ్ఞాతయుగమునందలి ఆంధ్రభాషాస్వరూపమును నిర్ణయించుటకు కొంత వీలు గలుగగలదు. ఆంధ్రసాహిత్య పరిషత్తువారు, ఆంధ్రదేశీయేతిహాస పరిశోధక మండలివారు గిడుగు రామమూర్తి పంతులుగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు మొదలయిన పరిశోధకులు చేసిన పరిశోధనము అమూల్యమైన ప్రయోజనమును సమకూర్చినది. ఈపరిశోధన లంధకారబంధురమైన యుగమునందుఁ దమ కాంతుల బ్రసరింపజేసిఁ ఆంధ్రవాఙ్మయాంగములను సూక్ష్మరూపమున ద్యోతకము చేయుచున్నవి. సూక్ష్మాంగములు పరిశోధనలవలన స్థూలరూపముగా స్ఫుటము కాగలవు. ఆంధ్రశాసన పరిశోధనల విషయమై ప్రభుత్వ మవలంబించుచున్న యులసత్వము సారస్వతోపాసకుల కసహ్యమై నిరుత్సాహమును గలుగజేయుచున్నది. వందలకొలది శాసనములు శాసనపరిశోధక కార్యాలయమునందు చిరకాలమునుండి నిద్రించుచున్నవి. శాఖాధికారులు ఆ శాసనముల పరిశోధనకు వెంటనే యేర్పాటులను జేసి పరిశోధకుల ప్రయత్నములను సార్థకము చేయుట ధర్మము.

శాసనముల విషయమై ప్రజలు చూపుచున్న విముఖత్వమును నసహ్యముగ నున్నది. ప్రజలు తామ్రశిలాశాసనములను దుర్వినియోగము చేయుచు నపారమైన నష్టమును గలుగ జేయుచున్నారు. ప్రజలు శాసనములను గాపాడియు, నకలులను బంపియు బరిశోధకుల ప్రయత్నములను సఫలముచేయుట పరమధర్మము.

## 4
# ఆ ది యు గ ము

క. మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

(కుమారసంభవము)

ఆంధ్రవాఙ్మయచరిత్రయందు బదునొకండవ శతాబ్ద మొక పుణ్యఘట్టము. ఆంధ్రవాఙ్మయముయొక్క సువ్యక్తమైన యారంభము నన్నయ భారతముతో నారంభమైనది. నన్నెచోడుని పద్య మీ విషయమునే ధ్రువపరచుచున్నది. వేంగిదేశాధీశుడు రాజరాజ నరేంద్రుడు 1026 మొదలు 10[illegible]3 వరకును రాజమహేంద్రవరము నందు రాజ్యముచేసెను. రాజరాజుకాలమునందు దేశము ప్రశాంత స్థితియం దుండినది. రాజేంద్రచోళుడు దిగ్విజయయాత్ర జేసి దక్షిణభాగమునందు శాంతిస్థాపన చేసెను. రాజేంద్రచోళుడు తన కుమార్తెను అంగమ్మదేవిని రాజరాజున కిచ్చి పెండ్లిచేసి చోళ చాళుక్య రాజ్యములకు మిత్రత్వమును బలపరచెను. రాజరాజుతల్లి కుందమాంబదేవి రాజేంద్ర చోళునకు తోడబుట్టువు. తూర్పు చాళుక్య వేంగిచోళరాజ్యములకు గల సంబంధబాంధవ్యములు రాజరాజు దృష్టిని భారతాంధ్రీకరణమునకు బ్రోత్సహించియుండును. తమిళ కర్ణాటక భాషలందు వాఙ్మయము ఇదివరకే వికసించుచుండెను. ఆంధ్రపండితులు వేంగిరాజ్యమును విడిచి కర్ణాటక రాజ్యమునందు గౌరవ పోషణములను బడయుచుండిరి. పంపయ్య బ్రాహ్మణ్యమును, వేంగి దేశమును వదలి కర్ణాటకమునకు బోయి 941వ సంవత్సరమునందు పంపభారతమును రచియించెను. రాజేంద్ర చోళుని కాలమునందు తమిళ శైవభక్తులు వాఙ్మయాభ్యుదయమును జేయుచుండిరి. భారతము తమిళసంఘములందు బారాయణగ్రంథముగ కోవెలలు నియమించిరి. ఈ పరిస్థితులందు ధర్మదయార్ద్ర సిద్ధబుద్ధిగల రాజరాజనరేంద్రుఁడు నన్నపార్యునిఁ దెనుగుభారత రచన జేయఁగోరుట రాజప్రవృత్తికి దగియున్నది.

క. బహుభాషల బహువిధముల
బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహ లగువారికి చెప్పుడు
బహుయాగంబులఫలంబు పరమార్థ మగున్.

(భార. ఆది. 1—17)

అందులకు నన్నయభట్టాంగీకరించుచు సవినయముగఁ దెలిపిన భావమే ఆ కవివర్యుని వినయవిధేయతలకు నిదర్శనములుగ నున్నవి.

చ. అమలినతారకా సముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజల గౌరవభారతభారతీసము
ద్రముఁ దరియంగ నీదను విధాతృనికైనను నేర బోలునే?
(భార. ఆది. 1—19.)

నన్నయభట్టు తన కాంధ్రభారతమును వ్రాయుటకుఁ గల ప్రతిభ నాతడే హృద్యముగనొక పద్యమునఁ దటస్థునివలె ప్రథమ పురుషమందు వివరించెను.

సీ. తన కులబ్రాహ్మణు ననురక్తు నవిరళజపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతు
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్రజాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్య రచనాభిశోభితు సత్ప్రతిభాభియోగ్యు
నిత్యసత్యవచను మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయాభరణుఁ డిట్లనియెఁ గరుణతోడ.
(భార. ఆది. 1—9.)

నన్నయకు భారత కావ్యరచన కవసరమైన ప్రతిభయంతయు గలదు. ఆతడు జపహోమతత్పరుడు; విపులశబ్దశాసనుడు; వేదాధ్యయన నిరతుడు; పురాణవిజ్ఞాననిరతుడు; లోకజ్ఞుడు; ఉభయభాషాకావ్యరచనాభిశోభితుడు; నిత్య సత్యవచనుఁడు.

ఈపద్యమునందలి "తనకులబ్రాహ్మణున్" అను పదము వాదప్రతివాదములకు గారణమైనది. శ్రీయుతులు బుర్రా శేషగిరిరావుగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు మొదలగువారు దానికి విచిత్రార్థములను గల్పించిరి. నన్నయ క్షత్రియ బ్రాహ్మణుడు, క్షత్రియనియోగి, వైదిక పురోహితుడు, నియోగిబ్రాహ్మణుడు మొదలగు సిద్ధాంతములు వెలువడినవి. ఈ సిద్ధాంతములను ఖండించుటయు, సమర్థించుటయును సాధ్యము. నిజస్థితి యేదో మాత్రము తెలియకున్నది. 'తన కులబ్రాహ్మణుడు' అను సమాసములో బ్రాహ్మణుడు ప్రధానపదము. నన్నయ బ్రాహ్మణుడనుట నిర్వివాదాంశము. ఆంధ్రమహాభారతము బ్రాహ్మణ ధర్మోద్ధరణమునకై పుట్టినది. పద్యమునందలి ఇతర గుణవర్ణనములును బ్రాహ్మణస్వభావమునే తెలుపుచున్నవి. రాజరాజు నన్నయ క్షత్రియ బ్రాహ్మణుడని చెప్పుటగాని, నన్నయ తన్ను గురించి యటుల వ్రాసికొనుటగాని యసంబద్ధము. క్షత్రియకులోద్భవు డెప్పుడును బ్రాహ్మణుడు కాజాలడు. నన్నయ రాజరాజునకుఁ గులబ్రాహ్మణుడు. రాజరాజు యొక్క సభయందు, "మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానా నంత సామంత.........విద్వజ్జనంబులు" ఉన్నటుల వచనము తెలుపుచున్నది. కులబ్రాహ్మణుడు పై నుదాహరించిన వారిలోనివాడు గాక యన్యుడును, రాజునకు బూజ్యుడును నై యుండవలయును. అట్టి పూజ్యుడు కులగురువో, కులమున కారాధ్యుడో మాత్రమే యగును. కులశబ్దమున కర్థములు చాల యున్నవి. కాని కులదేవత, కులగురువు, కులపతి పదములందు వలెనే కులబ్రాహ్మణ పదమునందును గులపదము రూఢ్యర్థమును సూచించుచున్నదని తోచుచున్నది. నన్నయ రాజరాజునకు గులబ్రాహ్మణుడు. రాజకులారాధ్యుడైన బ్రాహ్మణుడు. ఆకాలమునందు జైనులు, బౌద్ధులు, పండితులు రాజులకు గురువులై యుండుట కలదు. వైదిక మతాసక్తియు, బ్రాహ్మణ భక్తియు గల రాజరాజునకు బ్రాహ్మణోత్తముడు కులగురువై యుండుట సహజము. గురువునకు భక్తితత్పరుడైన రాజరాజుమీద ననురక్తి యుండుటయును సహజము. 'మత్యమరాధిపాచార్యు' నను పదమును నీయర్థమునే స్ఫురింపజేయుచున్నది. భారతరచనయందు నన్నయకు నారాయణభట్టు చేసిన సహాయము నీతాత్పర్యమును బలపరచుచున్నది. తెలుగు భారతమును రచియించిన నన్నపార్యుడు బ్రాహ్మణుడే కాక రాజరాజునకు గులగురువును నై యుండును. నన్నయ యెవరైనను ఆంధ్రవాఙ్మయ నిర్మాతయై, వాగనుశాసను డను కీర్తిని బడసిన మహానుభావుడు. ఈ వితర్కములు నన్నయ ప్రతిభకుగాని, సత్కీర్తికిగాని గౌరవమునకుగాని ప్రతిబంధకములు గావు.

భారత మాంధ్రభాషయందు మొదటికావ్యమై వెలయుచున్నది. నన్నయ భట్టారకుడు భారతరచనకు గారణములను దెలిపియున్నాడు. భారతము బహుభాషలయందు గలదు. రాజరాజ బ్రాహ్మణభక్తుడు; శివభక్తుడు; పాండవోత్తమ కథాశ్రవణాసక్తుడు. భారతమహిమను పౌరాణికులు కొనియాడిన విధమును గథా ప్రస్తావనయందు నన్నయ తెలిపియున్నాడు.

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయంబని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వ వేది వేదవ్యాసు డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీన మై పరఁగుచుండఁ జేసె భారతంబు
(భార. ఆది. 1-31)

వివిధవేదతత్త్వవేదియైన వేదవ్యాసుడు భారతమును విశ్వజనీనమై పరఁగుచుండునటుల చేసెను. మహాభారతము ధర్మతత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రము; అధ్యాత్మవిదులకు వేదాంతము; నీతివిచక్షణులకు నీతిశాస్త్రము; కవీంద్రులకు మహాకావ్యము; లాక్షణికులకు సర్వలక్ష్య సంగ్రహము; ఐతిహాసికుల కితిహాసము; పౌరాణికులకు బహుపురాణ సముచ్చయము. పరమార్థప్రదమైన భారతము సంక్షోభాయత్తమైన సమయమునందు నవయుగారంభమునకు ప్రజల సంస్కారమునకు ననురూపముగ వినియోగపడదగియున్నది. భారతమును వినుట వలన గలిగెడి ఫలమును బర్వానుక్రమణికయందు నన్నయ యొక సీసపద్యమున సంక్షేపముగ జెప్పియున్నాను.

సీ. ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు నర్థార్థులకు విపులార్థములును
ధర్మార్థులకు నిత్యధర్మసంప్రాప్తియు వినయార్థులకు మహావినయమతియుఁ
బుత్త్రార్థులకు బహుపుత్త్రసమృద్ధియు సంపదర్థుల కిష్టసంపదలును
గావించు నెప్పుడు భావించి వినుచుండునారల కిమ్మహాభారతంబు
భక్తియుక్తులైన భాగవతులకు శ్రీవల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబులెల్ల బాపి యిష్టార్థ సంసిద్ధిఁ గరుణతోడఁ జేయునట్లు.
(భార. ఆది. 1—32)

భారతమును భక్తితో నెప్పుడును వినుచుండెడి భక్తియుక్తులైన భాగవతులకు భక్తవత్సలుడైన శ్రీవల్లభుడు భవభయములను బాపి యిష్టార్థసిద్ధిని గరుణతోడ సమకూర్చును. ఆ సంకల్పము తోడనే నన్నయ భట్టారకు డాంధ్ర భారతమును జగద్ధితంబుగ రచియించెనని విశ్వసింపదగియున్నది.

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థ యుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు దెనుంగున న్మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.
(భార. ఆది. 1—25)

ఆంధ్రభారతమునందలి ప్రస్తావనావతారికలందు నన్నయ తన కావ్య రచనకు బరమప్రయోజనమును నువ్యక్తము చేసెను. స్థూలదృష్టితో ప్రస్తావనావతారికలను బరిశీలించునపుడు వైదికమతాభిమానమును, బ్రాహ్మణాభిమానమును, వర్ణాభిమానమును ద్యోతకములగుచున్నను సూక్ష్మదృష్టితో నవలోకించునపుడు నన్నయ సంకల్ప ముదారమని ద్యోతకమగుచున్నది. వేదవ్యాస భారతమునందు వేదముల యాధిక్యము, బ్రాహ్మణ ప్రభావము, వర్ణాశ్రమ ధర్మముల ప్రాధాన్యము విశేషముగ గనుపడుచున్నది. భారతము నాంధ్రీకరించిన నన్నయ కీకథన మంతయు నవసరమయినది. కాని మహాకావ్యరచనకు బూనుకొనిన నన్నయ బ్రాహ్మణధర్మసంరక్షణముతోపాటు మహాకావ్యలక్ష్యమైన "విశ్వశ్రేయః కావ్యమ్" అను నుత్తమకావ్యధర్మమును బాటించిన విధము నవతారికా ప్రస్తావనలు, గ్రంథమును విశదము చేయుచున్నవి. మంగళాచరణ శ్లోకమునందు 'శ్రేయసే' పదమును వాడి కావ్యప్రయోజనమును దెలిపెను. ఆ కావ్యప్రయోజనమునే

"నానారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు దెనుంగునన్ మహాభారత సంహితా రచనబంధురుడయ్యె జగద్ధితంబుగన్"

కవీంద్రులు మేలనునట్లు ప్రసన్న కథను, అర్థగాంభీర్యమును, రమ్యమైన శైలిని గలిగియుండునటులు నన్నయ యాంధ్రభారతమును రచియించెను. నన్నయ కృతికి లక్ష్యము విశాలమైన విప్రశ్రేయస్సుగాని సంకుచితమైన బ్రాహ్మణశ్రేయస్సు గాదు. అయినను ఆ సంకుచిత లక్ష్యము భారతమునందంతటను ముఖ్యముగ బ్రాహ్మణాభిమానమునందు ప్రత్యక్షమగుచున్నను జగద్ధితమే కావ్యరచనకు ముఖ్యకారణము.

## కర్మమార్గము

ఈతత్త్వార్థమును వైదికవిజ్ఞాన పరిణామము సరిస్ఫుటము చేయుచున్నది. వైదిక మతమునకు కర్మప్రాధాన్యము, బ్రాహ్మణాధిక్యము కీలకములు. వీనిని దేశకాలపాత్రములు శిథిలము చేసినవి. విశాలమైన దేశమునందు దేశావసరముల కనురూపముగ కర్మములు భిన్నరూపములను దాల్చినవి. కాలక్రమమున కర్మస్వరూప స్వభావములు మారినవి. ప్రజాశయముల కనురూపముగ కర్మప్రయోజనములును మారినవి. వేదములందే కర్మప్రాధాన్యము పోయి వేదాంతము స్థిరపడినది. మత విప్లవములు, రాజ్యవిప్లవములు, సాంఘికవిప్లవములు వేదాంతమును స్థిరపరచినవి. జైనబౌద్ధమతములు వైదికమతమును శిథిలము చేసినవి. వైదికమతోద్ధరణమును జేయుటకు వైదిక మతప్రియు లెంత పాటుపడినను నది శిథిలమైన దనియే యొప్పుకొనవలయును. రాజులును, బ్రాహ్మణులును వైదిక మతసంరక్షణమును జేయుటకు దా మెంతపాటుపడినను నిర్జీవమైన కర్మకాండను, వర్ణాశ్రమధర్మమును బునరుద్ధరణముచేయుట దుస్తరమైనది. కర్మకాండ దురాచారమై నిరర్థకమైన విధమును జైనబౌద్ధమతములు, వేదాంతమును జెప్పి చెప్పుచున్నవి. వైరాగ్య ధర్మకాండపరములైన జైనబౌద్ధములు క్షీణించినను వైదికమత దుస్థితిని శిథిలము చేసినవి. వైదిక మతమునకును, జైన బౌద్ధమతములకును వేదాంతము సామాన్య ధర్మమైనది. జైనబౌద్ధమతములవలె వేదాంతమును, కర్మకాండను, వర్ణాశ్రమధర్మములను నిరాకరించినది. వైదికమతస్థులందువలె జైన బౌద్ధమతస్థులందును, బ్రాహ్మణులందువలె బ్రాహ్మణేతరులందును వేదాంతులు బయలుదేరిరి. వారు సంకుచితమైన కర్మమార్గమును విడిచి విశాలమైన జ్ఞానమార్గము నవలంబించిరి. అద్వైతమతాచార్యులగు శ్రీ శంకరాచార్యులు వైదికమతోద్ధరణమును జేసిన రీతినే వైదికమతపతనమును గూడ జేసెను. ఇది కాల మహిమ; చిరకాలగతమైన వైదికమత సంఘర్షణమునకు బరిణామము.

అద్వైతము సకలభేదముల నంతరింపజేసి జ్ఞానమార్గమున నేకత్వమును ప్రతిపాదించినది. జ్ఞానమార్గమునఁ బురుషార్థమును బడయుటకుఁ గర్మమార్గము నిరుపయోగమై భక్తిమార్గ మేర్పడినది. కర్మమార్గము వైదికమతాధికారులైన బ్రాహ్మణోత్తములకు ప్రయోజనకరమైనను లట్టి యధికారములేని తదితరులకు మార్గాంతరము లేక భక్తిమార్గము శరణ్యమైనది. "భక్తియుక్తులైన భాగవతులకు భక్తవత్సలుండు శ్రీవల్లభుండు పరమార్థమును దయచేయు"నని పర్వానుక్రమణికాంతమునందు నన్నయ తెలియజేసెను. మహాకావ్యనిర్మాత నన్నయ విప్రశ్రేయస్సునకు సాధనమైన భక్తిమార్గము నాంధ్రభారతముఖమున నాంధ్రలోకమునకు వ్యక్తము చేసెను.

## పదునొకొండవ శతాబ్దము

నన్నయ సంకల్పమును సఫలము చేయుటకుఁ గావ్యమును, గాలమును దగియున్నవి. భారతము పంచమ వేదము. వైదికమత పరిణామము నితిహాసరూపమున భారతము వ్యక్తము చేయుచున్నది. భారతము వేదయుగాంతమునం దారంభమైనను వర్తమాన రూపమును బడయుటకుఁ గొన్ని శతాబ్దములు పట్టినవి. వైదికమతాచార్యుఁడు వేదవ్యాసుఁడే మహాభారతమును రచించి పండితపామర హృదయములకు వైదికమతపరిణామమును సుగమము చేసెను. ధర్మాధర్మ సంఘర్షణమునందు ధర్మవిజయమును మహాభారతేతిహాసము సహస్రముఖములఁ బ్రతిపాదించుచున్నది. కౌరవ పాండవ యుద్ధమునందుఁ బాండవ విజయము ధర్మవిజయము. రాజు లన్యోన్య కలహములతో మహాసంక్షోభమును గలుగజేయుచుండిరి. నిరంతర యుద్ధములచేత సంక్షుభితమైన కాలమునందు యుద్ధధర్మము నాంధ్ర భారతము వ్యక్తము చేసినది. జ్ఞానోపార్జనము వేదాధ్యయన మూలమున గాక ధర్మారాధన మూలముననే సాధ్యమని ధర్మవ్యాధోపాఖ్యానము మొదలగు ననంతములైన యితిహాసములు విశదము చేయుచున్నవి. మహాభారతము సాంఖ్యయోగమును, కర్మయోగమును, జ్ఞానయోగమును, భక్తియోగమును సమన్వయముచేసినది. వేదాంతము "తత్త్వమసి" ఇత్యాది మహావాక్యముఖమునఁ బ్రతిపాదించిన మోక్షమును మహాభారతము "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" ఇత్యాది భక్తిసాధనముల మూలమునఁ బ్రతిపాదించినది. భక్తవత్సలుఁడైన శ్రీకృష్ణుఁడు భక్తులైన భీష్మార్జునులకుఁ బురుషార్థమును సాధ్యము చేసిన విధమును భారతమునందు సర్వత్ర గోచరమగుచున్నది. శ్రీకృష్ణ సారథ్యమే భక్తుడైన పార్థునకు విజయమును సమకూర్చినది. భగవద్భక్తిపరాయణులైన ధర్మరాజభీష్మప్రముఖ విదురాదులు కృతార్థులైరి.

> చ. ప్రియహితసత్యవాక్య యరిభీషణ కృష్ణ భవన్నియోగసం
> శ్రయమున నున్న మా కధికశత్రుజయం బగు టేమి పెద్ద ని
> శ్చయముగ నింక మోక్షితుల సర్వమహీశులు నిమ్మహాధ్వర
> క్రియయును సిద్ధిఁ బొందెన యకిల్బిషకీర్తి వెలుంగుచుండగన్.
>
> క. ధరణీధర సర్వగుణాకర కరుణానిరత సర్వకార్యైక ధురం
> ధర నిను బడసిన మాకును హరివిక్రమ వడయరాని యవియుం గలవే?
>
> (భార. సభా. 1—165, 166.)

పదునొకండవ శతాబ్దమునం దారంభమైన భక్తిమార్గము కాలక్రమమున వికసించి వాఙ్మయాభ్యుదయమునకుఁ దోడ్పడినది. ఆంధ్రకర్ణాటమహారాష్ట్ర ఘూర్జర వంగ హిందీ వాఙ్మయము పదుమూఁడు పదునాలుగు శతాబ్దములందు భాగవత భక్తివిలసితములై వర్ధిల్లిన విధమును వాఙ్మయ చరిత్రలు విశదము చేయుచున్నవి. నన్నయ భారతభాగమునందు సూచితమైన భాగవతభక్తి లిక్కన కాలమునందు బరిస్ఫుటమైన విధమును భారతము విశదము చేయుచున్నది.

కాలమును భారత రచనకుఁ బరిపక్వముగనున్నది. కుమారిలభట్టు శంకరాచార్యులు వైదికమత ప్రతిష్ఠాపనను జేసినను భక్తిమార్గము ప్రజాహృదయము నావరించినది. ప్రజలు భాగవత భక్తిపరాయణులై పాటలను బాడుచు, స్తవములను జేయుచు, భజనలను గావించుచు బ్రహ్మానందమును బొందుచుండిరి. తమిళ వాఙ్మయము భక్తిప్రభావమును విశదము చేయుచున్నది. క్రీస్తుశక మేడెనిమిది శతాబ్దములందే సంబందరు, అప్పర్‌స్వామి, సుందరమూర్తి, మానిక్యవాచకరు మొదలగు శివభక్తులును తమిళభాషయందు శివస్తోత్రములను భక్త్యావేశముతో రచియించి భక్తిమార్గమును దక్షిణభాగమునందు స్థాపింపజేసిరి. ఆ శైవస్తోత్రములు నేటికిని బ్రాహ్మణ బ్రాహ్మణేతరులకు బ్రహ్మానందదాయకములుగ నున్నవి. బ్రాహ్మణేతరులైన శైవభక్తులు భక్తిభరితులై దేవాలయములందుఁ దంబూర్ శ్రుతితో మేళవించి రమ్యముగఁ బాటలను, పద్యములను బాడుచు భాగవతభక్తిని వ్యాపింపజేసిరి. చాళుక్యచోళ రాజ్యముల సంబంధ బాంధవ్యములతో రాజరాజు కాలమునకుఁ దెలుగు దేశమునందును శైవభక్తులు సహజముగ వ్యాపించి యుందురు. పదునొకండవ శతాబ్దారంభమునందుఁ గర్మమార్గముకన్నను భక్తిమార్గమే ప్రబలముగనుండెనని యూహింపఁ దగియున్నది. ఆ పరిస్థితులందు వివిధమార్గములను సమన్వయము చేయఁగల భారత మాంధ్రానువాదమునకు సకలవిధములఁ దగియున్నది. ఆంధ్ర భాగవత రచన కింకను గాలము పరిపక్వము కాలేదు. రామాయణమునకు, పంచమవేదమైన భారతమునకుఁ గల ప్రతిభ వైదికమత పరిణామమును బ్రతిపాదించుటకు జాలదు.

భారతరచన 1050 ప్రాంతముల నారంభమైనను 1270 ప్రాంతములందు ముగిసినది. నన్నయభట్టారకుఁ డాదిసభాపర్వములును, అరణ్యపర్వములోని వాల్గవ యాశ్వాసమునందు మూఁడువందలును దెలిగించెను. ఎఱ్ఱాప్రెగడ

భారతారణ్యపర్వ శేషమును దెనిఁగించెను. ఆయన 1280 లో జననమొంది 1350 వరకును జీవించియుండెనని వీరేశలింగము పంతులుగా రాంధ్ర కవుల చరిత్రమునందు నిర్ణయించిరి. శేషించిన పదునైదుపర్వములను తిక్కన సోమయాజి తెనిఁగించెను. తిక్కన సోమయాజి 1220 ప్రాంతమునందు జనించి 1300 ప్రాంతములందు మృతినొందినటులు వీరేశలింగము పంతులుగారు నిర్ణయించిరి. ఆంధ్రభారత మారంభమైన తరువాత ముగియుటకు 220 ఏండ్లు పట్టినవి. ఆంధ్ర మహాభారతమును రచియించిన ముప్పురు కవులును 'కవిత్రయ' మని ప్రసిద్ధిగాంచిరి. ఆంధ్రవాఙ్మయ వ్యాపనమునం దాదియుగమునందుఁ బ్రందగమనము నీ మహాభారతరచన దెలుపుచున్నది. ఆ కవిత్రయమున ఆంధ్రవాఙ్మయమునందు వాగనుశాసనుఁడు, ప్రబంధ పరమేశ్వరుఁడు, కవిబ్రహ్మయును సార్థక నామధేయములఁ విరాజిల్లుచున్నారు. భారతకావ్యమునకుఁ బరమేశ్వరుని బట్టభద్రునిఁ జేసిన తిక్కన ఆంధ్రవాఙ్మయ సామ్రాజ్యమునకు బట్టభద్రుఁడుగ నున్నాఁడు. ఈ గ్రంథమునందుఁ గవిత తత్త్వ విచారణ కవకాశములేదు. అయినను వీరేశలింగము పంతులుగారి కవుల చరిత్రమునందు తిక్కనవిషయమై వ్రాసిన భావములను దెలుపుట ధర్మముగ నున్నది. ఈ భావముల సారమునే వేర్వేరురీతుల వారి సంస్కారము కనురూపముగ విమర్శకులు, పండితులు సందర్భానుసారముగ దెలిపియున్నారు.

"తెలుఁగు భాషయం దెన్నో గ్రంథము లున్నను, తిక్కనసోమయాజి కవిత్వముతో సమానముగాఁగాని, దానిని మించునట్లుగాఁగాని కవిత్వము చెప్పఁగలిగినవారు నేటివఱ కొక్కరును కనఁబడలేదు. తిక్కన కవిత్వము ద్రాక్షాపాకమై మిక్కిలి రసవంతముగా నుండును; ఈతని కవిత్వమునందు పాదపూరణమునకుఁ దెచ్చి పెట్టుకొనెడు వ్యర్థపదము లెంతగా నుండవు; పదముల కూర్పు మాత్రమే కాక యర్థసందర్భమును మిక్కిలి పొందికగా నుండును ఏవిషయమును చెప్పినను యుక్తియుక్తముగాను, ప్రౌఢముగాను నుండును; ఎక్కడ నే విశేషణము లుంచవలెనో యేరీతి నేపదములు ప్రయోగించి రసము పుట్టింపవలయునో, యా కవి దెలిసినట్లు మఱి యొకరికి తెలియదు; ఈయనకవిత్వము లోకోక్తులతోఁ గూడి జాతీయముగా నుండును; ఈయన పదలాలిత్యమును, యుక్తి బాహుళ్యమును, అర్థగౌరవమును, రచనాచమత్కృతియు, శయ్యావిశేషమును, సందర్భశుద్ధియు, కల్పనాకౌశలమును అన్యులకు రావు; ఈ కవిశిఖామణియొక్క కవిత్వమునం దొకవంతు సంస్కృతపదములును, రెండు వంతులు తెలుఁగుపదములు నుండును."

తిక్కన వాడుకయందున్న తెలుఁగుమాటలను దనకృతులయందు వాడి తెలుఁగుసొంపును జెంపొందఁజేసిన విధమును భారత నిర్వచనోత్తర రామాయణములు తెలుపుచున్నవి. ఇందులకు దృష్టాంతము లనంతములు గలవు.

సీ. అరుదారు మేలుకట్లాయితంబై చూడ
నొప్పారి తనుపారు చప్పరములుఁ
బరపైన చెలువంబు గరగరికయుఁ దియ్య
తెలిసిరుఁ గలిగిన దీర్ఘికలును
బొడవైన ముఖ్వంచఁ బొలుచునట్లుగ నేమఁ
గుఱుకు గుజ్జుములకుఁ గొట్టములును
ముందర బయలైన చందంబుఁ జతురాభి
మతమైన యాస్థానమండపములు
ఓయ్యములును నేయిఁ బెరుఁగును గూరగా
యలును వంటగట్టియలును గడ్డి
కవణములును జెల్లుగాఁ నొడఁగూర్చి వి
గూఢవృత్తిఁ దానుఁ గూడ నడచె.

(ఉద్యో. 1-93)

సీ. లలితంబు లగు మట్టియల చప్పుడింపార నంచకైవడి నడ వల్ల వచ్చి
యొడ పేనివెత్తావి నుడియుంగఁ బయ్యెద సగము దూలించి పైఁ మగుడఁ దిగిచి
పొలెడు నెలడీఁగెలీలఁ గ్రాలుచు నింత చెలువంబు దలకొనఁ జేరి నిలిచి
తెలిగన్నుఁగవకు వెన్నెలయైన లేత నవ్వొలయంగ సరసంపుఁ బలుకు పలికి
మెఱియు చెయ్యుల రాగంబు మెయికొనంగ
నెమ్మొదిసాగియుంచు మాటల నెలమి మిగుల
నిన్ను ననురక్తిఁ గొలుచు నన్నెంత లుండ
నీరసాకార శైరంధ్రిఁ గోరఁ దగునె?

(విరా. 2-64)

ఈ పద్యమునందు నాలుగైదు సంస్కృతపు పదములు మాత్రమే వాడఁబడినవి. ఈ కారణమువలననే "తెన్నుఁబాస వినిర్మింపఁ దివురుటరయ ధన్యపురుషార్థతరు పక్వఫలము" అని తిక్కన సంభావించెను.

ఆంధ్రభారత రచన వాఙ్మయచరిత్రమునందుఁ గవిత్రయ కాలమునందుఁ గలిగిన పరిణామమును దెలుపుచున్నది. నన్నయ భారతమును [illegible] తిగఁ దెనిఁగించెను. నన్నయ రెండు వంతులు సంస్కృత పదములను, ఒకవంతు తెనుఁగుపదములను వాడెను. నన్నయ శైలి సరళముగను, గంభీరముగను, ద్రాక్షాపాకముగా నున్నది. నన్నయరచన సంస్కృతసంస్కారమయముగ నున్నది. నన్నయ శివభక్తుఁడు; నన్నయకావ్యము ప్రథమాంధ్రకావ్యము. తిక్కన హరిహరులకుఁ గృతిగ భారతమును రచించెను తిక్కన రెండువంతులు తెలుఁగుపదములను, ఒకవంతు సంస్కృతపదములను వాడెను. తిక్కనరచన సంస్కృతాంధ్ర సంస్కారముల సమ్మేళమును బొంది ఆంధ్రహృదయమునకు లక్ష్యమై యున్నది. తిక్కన అద్వైతి. తిక్కన కావ్యము పరిపక్వమైన కావ్యము. తిక్కన భారతములోని పదునైదు పర్వములను "జనసంప్రార్థ్యంబుగను" తెనుఁగు బాసను రచియించెను. భారత రచనయందు నన్నయకును, తిక్కనకును లక్ష్యములు భిన్నములుగ నున్నవి. నన్నయకు భారతరచనకు ప్రయోజనము రాజరాజానుగ్రహమును, తెనుఁగు కావ్యరచనయును. తిక్కనకు భారతరచనకు ప్రయోజనము తెనుఁగుబాస, తెనుఁగుజనులు, తెనుఁగుదేశము, [illegible] మోక్షము, పరమేశ్వర సాక్షాత్కారము. నన్నయ భట్టారకుఁడు తన కృతిని రాజరాజున కంకితము చేసెను. తిక్కన సోమయాజి తన కృతిని ఆంధ్రదేశమునకును, పరమేశ్వరునకును సమర్పించెను.

క. పారాశర్యునికృతి యయి భారత మను పేరఁ బరఁగు పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్

(విరా. 1-17)

తే. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురుటరయ ధన్యపురుషార్థతరుపక్వఫలము గాదె
దీని కెద నియ్యకొని వేడ్కనూని కృతిసేత్య మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ.

(విరా. 1-1)

ఉ. కావున భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్.

(విరా. 1-31)

తిక్కన జనాభ్యర్చితమైన భారతమును దేవదేవున కర్పించి వాఙ్మయ భక్తకోటికి వరణీయుఁడై, పుణ్యచరిత్రుఁడై జన్మసాఫల్యము గాంచెను.

ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగున్ జనా
భ్యర్చితమైన భారత మహారసపాపరతంత్ర వృత్తిమై
చేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్.

(విరా. 1-28)

ఉ. ఇట్టిపదంబుఁ గాంచి పరమేశ్వరునిం గృతినాథుఁ జేసి యే
పట్టునఁ బూజ్యమూర్తి యగు భారతసంహితఁ జెప్పఁ గంటె నా

పుట్టువు గృతార్థతం బొరసెఁ బూతచరిత్రుఁడ నైతి నవ్విభుం
గట్టెద: ఒట్టు మత్ప్రతిమ కారుణికత్వ మహావిభూతికిన్.

(విరా. 1—27)

పదుమూడవ శతాబ్దమునందు నన్నయకాలమునందుఁ బునరుద్ధృతమైన వైదికమార్గ నిష్ఠయును, పల్లవించిన భేదముతో భక్తిమార్గమును తిక్కన యందు బరిపక్వతను బొందినవి. తిక్కన నియోగి బ్రాహ్మణుడు; లోకవ్యవహారజ్ఞుడు; సంగ్రామదక్షుడు; సోమయాజి; కవిబ్రహ్మ; తత్త్వజ్ఞుడు; పరమేశ్వర భక్తుడు. తిక్కన సోమయాజి "విశ్వశ్రేయః కావ్యమ్" అను పరమార్థమును గర్భించిన మహానుభావుడు. ఆంధ్రప్రజాభ్యుదయము, ఆంధ్రభాషాభ్యుదయము, ఆంధ్రదేశాభ్యుదయము, పరమేశ్వరారాధనము కావ్యరచనకు బరమప్రయోజనము లని తిక్కన వ్యక్తముచేసి ఆంధ్రవాఙ్మయమున కఖండమైన ప్రతిభను సమకూర్చెను.

ఉ. వైదికమార్గనిష్ఠ మగు వర్తనముం దగ నిర్వహించుచున్
భేదము లేని భక్తిమతి నిర్మలవృత్తిఁ జేయుచుండు మ
త్స్వాంత నిరంతరస్మరణ తత్పరభావము కర్మి నాత్మ న
హ్లాదము బొందఁ గావ్యరసముం గొనియాడుచు నుండు దెప్పుడున్.

(విరా. 1—15)

కావ్యప్రయోజనము విశ్వకల్యాణము. కావ్యము రసాత్మకము. విశ్వకల్యాణము రసోదయమువలననే కలుగుచున్నది. రసాత్మకమైన కావ్యము చిన్నదైనను, పెద్దదైనను గావ్య ప్రయోజనమును సమకూర్చుచున్నది. విశ్వమంతయు రసాత్మకమై వెలయుచున్నది. రసాన్వేషకులైన కావ్యతీర్థులు సర్వత్ర రస ప్రవాహమును గనుగొనుచున్నారు. విశ్వవ్యాప్తములైన భగవద్విభూతులు రసాత్మకములై పరమానందమును గలుగజేయుచున్నవి. ఇంత వ్యాప్తములైన దివ్యవిభూతులను గన్నులు చూచుచున్నవి; చెవులు వినుచున్నవి; బుద్ధి తెలిసికొనుచున్నది; ఇతరేంద్రియములు యథోచితముగ నింద్రియవ్యాపారములను నిర్వహించుచున్నవి. అయినను దివ్యవిభూతుల రసహృదయము విజ్ఞానసంపన్నులకు మాత్రము ప్రత్యక్షమగుచున్నది. సామాన్యులకు రసహృదయము గోచరము గాదు.

కర్మేంద్రియములు కార్యరూపమునను, జ్ఞానేంద్రియములు భావరూపమునను రసానందమును గలుగజేయుచున్నవి. కరచరణాది కర్మేంద్రియములకు విషయరస మానందకరము; చెవులకు శబ్దరస మానందకరము; కన్నులకు రూపరస మానందకరము; ముక్కునకు గంధరస మానందకరము. త్వక్కునకు స్పర్శరస మానందకరము; జిహ్వకు రుచ్యరస మానందకరము; కర్మేంద్రియ జ్ఞానేంద్రియాయత్తమైన విషయవాంఛల రసానంద మారంభమునం దుత్కృత ప్రియముగఁ గనుపడినను విషపరిణామమును బొందుచున్నది. విషయోపలాలితమైన రసానందము కావ్యమునకు క్షుద్ర ప్రయోజనముగాని యుత్తమప్రయోజనము గాదు. కావ్యమునకు బరమప్రయోజనము విషయాతీతమైన రసానందము మూలముననె గలుగుచున్నది. నవరసములు బుట్టజేసెడి యానందము విషయోపభోగమువలననే కలుగుచున్నది. శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము, వాత్సల్యము వలన గలిగెడి రసానందము విషయాసక్తముగాక విషయాతీతముగ నుండుట విశ్వశ్రేయస్సునకు సాధనము. విషయాసక్తమైన రసానందము తాత్కాలికము; పరిమితము; స్వార్థపరము; దుఃఖదాయకము; మానసికము.

విషయాతీతమైన రసానందము విశాలము; పరార్థపరము; సుఖదాయకము; ఆధ్యాత్మికము. విషయాసక్తమైన రసానందప్రాప్తికి సాధనము భోగము. విషయాతీతమైన ఆనందప్రాప్తికి సాధనము త్యాగము. కావ్యలక్ష్యము "యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే—సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత

మోపదేశయుజే" అని మమ్మటాచార్యుడు చేసిన నిర్వచనమునకు విశ్వశ్రేయస్సు ప్రధాన లక్ష్యముగాక యప్రధానలక్ష్య మగుచున్నది. విశ్వనాథుల పెద్దన్న కావ్యాలంకార చూడామణియందుఁ జేసిన భావనిర్వచనము నుత్తమకావ్యమునకుఁ దగియుండదు.

క. బహిరర్థాలంబనమై
విహరించు మనోవికార విలసితము సువి
విహిత మగు భావ మన; నది
మహి విజ్ఞానంబు నా సుమతులం బరగున్.

క. ఘనవిజ్ఞానం బాత్మకు
మనసుననే కలుగు నట్టి మనసున కబ్బున్
కనదింద్రియములచేతన్
వినఁగా వీనులకు నొదవు విషయప్రాప్తిన్.

మనోవికారవిలసితమైన భావము విషయరసానందమును గలుగఁజేసినను విజ్ఞానదాయకము, విషయాతీతము నైన రసానందమును గలుగఁజేయఁజాలదు.

విశ్వకల్యాణలక్ష్యము భక్తిరసమునందుఁ బ్రత్యక్షమగుచున్నది. అనన్యమైన భక్తిరసమునందు సకలరసములును నిమిడియున్నవి. శ్రీకృష్ణుని శృంగార విలాసములు, మురళీగానము, పార్వతీ పరమేశ్వరుల యఖండప్రేమ, సీతారాముల విలాసములు, పురాణేతిహాసములు, కావ్యనాటకములు, కీర్తనలు భక్తిరసావేశమును విశదము చేయుచున్నవి.

మహాదీక్షాపరాయణులు గానివారు మహాకావ్య నిర్మాణాధికారులు గాఁజాలరు. తిక్కన భారతరచనకు "శ్రీవిభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వ దీక్షావిధిని" బూనెను. తిక్కన పూనిన యజ్ఞదీక్ష సోమయాగదీక్ష మాత్రమే కాదు; ఆయన పూనినది మహాకవితా యజ్ఞదీక్ష. కావ్యదీక్షయు నితర యాగ దీక్షలవలె వానిఫలితకమై భోగపరమైనపుడు విషయాసక్తమై సామాన్య ప్రయోజనమును గలిగించుచున్నది. కావ్యదీక్ష యాధ్యాత్మికమైనపుడు విషయాతీతమై "భవ్యపురుషార్థ తరు పక్వఫలము" గలిగించుచున్నది. కావ్యయజ్ఞమునందు విశ్వాత్మకమైన కావ్యరసమే అధియజ్ఞము. విశ్వాత్మకమైన రసఫలమును సాధించుటకును, నిర్మించుటకును, ననుభవించుటకును సర్వసాక్షియైన ఆత్మకు సామర్థ్యము గలదు గాని దేహేంద్రియాదులకు సామర్థ్యము లేదు. మహాకవిత్వ దీక్షకు ఫలమైన కావ్యరసమును బొందుటకు వలయు సాధనములను బరమేశ్వరుఁడు సాక్షాత్కరించి తిక్కనకుఁ బ్రసాదించెను. ఆత్మానందమును బడయఁగల కావ్యరసము భగవంతుని ప్రీతికి భాజనమగుచున్నది. ఇయ్యది వైదికమత పరమగు ప్రవర్తనమును గలిగి, చిత్తశుద్ధితోడను, భావసంశుద్ధితోడఁ జేసెడి పరమేశ్వర భక్తిప్రభావమునఁ గలుగుచున్నది. విశ్వశ్రేయస్సే భగవత్సంకల్పము; కావ్యమునకుఁ బ్రయోజనము; యజ్ఞమునకు ఫలము; పురుషార్థమునకుఁ బరిణామము; సకల మతములకు బరమార్థము. విశ్వశ్రేయస్సున కధికారులుగాని కవులు, యాజకులు, మతాచార్యులు మొదలగువారు చేసెడి ప్రయత్నములు విశ్వకల్యాణమునకును, నాత్మానందమునకును సాధనములు కావు.

తిక్కన సంస్కృతాంధ్రములందు మహాపండితుడు: వైదికమత పరిణామములైన కర్మజ్ఞాన వైరాగ్య భక్తిమార్గములం దప్రతిమానమైన ప్రజ్ఞగల పరమవేదాంతి. ఆ మహానుభావుడు కావ్యదీక్షను బూని రచించిన యాంధ్ర కావ్య మాంధ్రవాఙ్మయమునందుఁ బరంజ్యోతివలె వెలుఁగుచున్నది; ఆంధ్ర రసహృదయమునందుఁ గావ్యరసామృతమును బ్రవహింపఁ జేయుచున్నది; ఆత్మానందమును గలుగఁ జేయుచున్నది; విశ్వకల్యాణమునకు సాధనముగనున్నది. తిక్కనామాత్యుఁడు భక్తిమయమైన జ్ఞానరసామృతమును గ్రోలి బ్రహ్మపదము నధిష్ఠించెను. పోతనామాత్యుఁడు జ్ఞానమయమైన భక్తిరసామృతమును గ్రోలి శ్రీకైవల్యపదము నధిష్ఠించెను. ఆంధ్రవాఙ్మయ పరిణామమునందు గర్మజ్ఞాన వైరాగ్య సంపర్ధితములైన భక్తిఘట్టము లుత్తమఘట్టములుగ నున్నవి.

సంస్కృత వాఙ్మయమునందు వలెనే ఆంధ్రవాఙ్మయమునందును వాఙ్మయమునకు మతము ప్రధానవిషయముగ నున్నది. ఆదియుగపుఁ గవులు చాలమంది మత విషయక కావ్యములను రచియించిరి. ముఖ్యముగాఁ బురాణేతిహాస కావ్యములనో, వానియందలి భాగములనో, ఉపాఖ్యానములనో తెనిఁగించిరి. ఆది యుగము పురాణయుగము. అయినను తెనుఁగురచనలు కేవల మనువాదములు గావు. కథా సందర్భములు, భావములు, వర్ణనలు, జాతీయములు, పద్యములు తెనుఁగు హృదయమున కనురూపముగ నాంధ్ర సంస్కారమును బొందినవి. భారత, భాగవత, రామాయణాది పురాణములు తెనుఁగు హృదయమును గలిగి స్వతంత్ర రచనలుగ నున్నవి. భారతము, భాగవతము, రామాయణము, నృసింహ పురాణము, ఉత్తర హరివంశము, పద్మపురాణము, మార్కండేయ పురాణము, వరాహ పురాణము, విష్ణు పురాణము మొదలగు పురాణేతిహాసములు పదునైదవ శతాబ్దాంతము లోపల తెనిఁగింపఁబడినవి. దశకుమార చరిత్రము, కేయూరబాహు చరిత్రము, భోజరాజీయము, కాదంబరి, విక్రమార్క చరిత్రము మొదలగు చరిత్రములును తెనిఁగింపఁబడినవి. అథర్వణ వ్యాకరణము, కావ్యాలంకారచూడామణి, అనంత ఛందస్సు మొదలగు లక్షణగ్రంథములు, కొన్ని ప్రబంధములు, ఉపాఖ్యానములు, మాహాత్మ్యములు, శాస్త్రములు, నీతిసార ముక్తావళి, సుమతి శతకము, పంచతంత్రము మొదలగు నీతిగ్రంథములును నీయుగమునకుఁ జెందినవే. వల్లభరాయవిరచితమైన క్రీడాభిరామ మను మొదటి ఆంధ్రనాటకమీ యుగమునకు జెందియున్నది. ఈయుగపు కవులందు నాచనసోముడు, పాల్కురికి సోమనాథుఁడు, నన్నెచోడ, పిల్లలమర్రి పినవీరన్న, శ్రీనాథుడు ప్రతిభాశాలురైన కవులు. ఆంధ్రవాఙ్మయ పరిణామమునం దాదియుగ మనువాదయుగమైనను వ్యక్తిత్వమును గలిగి ప్రతిభగల యుగముగ నున్నది. కారణము నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, పోతనాదుల మహత్త్వము. భావికవులకీ మహాకవుల ప్రతిభయే కొంతవరకు ప్రతిబంధకమైనది. కవిత్రయము నడిచిన మార్గమే ప్రమాణమై నేటికిని స్వతంత్రరచనలు దూష్యములుగాఁ బరిగణింపఁబడుచున్నవి.

## వాఙ్మయ స్వరూపములు

ఆంధ్ర కావ్యములు సామాన్యముగ సంస్కృత కావ్యముల మార్గము ననుసరించినవి. సంస్కృత వాఙ్మయము సామాన్యముగ గద్యపద్యాత్మకముగ నున్నది. వేదములు పద్యాత్మకములు; ఉపనిషత్తులు, పురాణములు, చంపూ కావ్యములు గద్యపద్యాత్మకములుగ నున్నవి. నన్నయ తిక్కనాదికవులు సంస్కృత వాఙ్మయమార్గమునే నడచిరి. నన్నయ భారత రచనయందు 100 పంక్తులలో పద్యపంక్తులు 54 ను, గద్యపంక్తులు 46ను, తిక్కన భారత రచనయందు 100 పంక్తులలో పద్య పంక్తులు 67 ను, గద్యపంక్తులు 33 ను ఉన్నవి. తిక్కన నిర్వచనోత్తరరామాయణమును రచించినను నిది యసాధారణము. భాగవతమునందు 100 పంక్తులలో 65 పద్య పంక్తులును, 35 గద్యపంక్తులును గలవు. పదునేడవ శతాబ్దమునకుఁ గావ్యములందు గద్యరచన తగ్గినది. పురాణయుగమునందును, ప్రబంధ యుగమునందును చంపువులు ప్రధానములైనవి. చంపువులందు దేశికవితకు సహజమైన జాతుల పద్యముల వాడుక తగ్గి వృత్తముల వాడుక హెచ్చినది. ఆదియుగమునందు సామాన్యముగ గవులందఱును నన్నయ మార్గము నవలంబించినను ద్విపదకావ్యములను రచించిన మహాకవులును గలరు. ఆ కవులందుఁ బాల్కురికి సోమనాథుఁడు, గోరన, శ్రీనాథుఁడు, రంగనాథుఁడు సుప్రసిద్ధులు.

## పండ్రెండు పదుమూఁడు శతాబ్దముల వాఙ్మయము

ఆంధ్రవాఙ్మయ చరిత్రమునందును, వైదిక మతపరిణామము నందును బండ్రెండవ శతాబ్దము ప్రముఖముగ నున్నది. రాజరాజ నరేంద్రుని కాలము నందు బునఃప్రతిపాదితమైన కర్మమార్గమునకుఁ బండ్రెండవ శతాబ్దమునందుఁ బ్రబలమయిన ప్రతిఘటనములు గలిగినవి. శ్రీరామానుజాచార్యులు, యామునాచార్యులు, దేశికాచార్యులు వైష్ణవమతమును వ్యాపింపజేసిరి. చోళరాజులు వైష్ణవమతమును స్వీకరించి వైష్ణవమత వ్యాపనమునకుఁ దోడ్పడిరి. వైష్ణవభక్తులు భక్తిపరమయిన విశిష్టాద్వైతమును బోధించిరి. రామానుజాచార్యులు ప్రస్థానత్రయమునకును విశిష్టాద్వైత పరమైన భాష్యములను రచియించి భక్తిమార్గ వ్యాపనమునకు దోడ్పడెను. శంకరాచార్యులు రచియించిన

## ఆదియుగమునందలి ప్రసిద్ధ కవులు, వారి కాలము, గ్రంథములు క్రి. 11-వ శతాబ్దము మొదలు 15-వ శతాబ్దమువరకు

| క్రమ సంఖ్య | కవి పేరు | కవి కాలము | గ్రంథము పేరు | గ్రంథ వివరణము | విశేష విషయములు |
|---|---|---|---|---|---|
| 1 | నన్నయ | 1022-1063 | మహాభారతము | ఇతిహాసము | |
| 2 | తిక్కన | 1230-1300 | ,, | ,, | |
| | ,, | ,, | నిర్వచనోత్తర రామాయణము | పద్యకావ్యము | |
| 3 | ఎఱ్ఱాప్రగడ | 1280-1350 | మహాభారతము, నృసింహ పురాణము | ఇతిహాస పురాణములు | |
| 4 | నన్నెచోడుడు | 1151-1170 | కుమారసంభవము | కావ్యము (ప్రబంధము) | |
| 5 | పాల్కురికి సోమన | 1170-1220 | పండితారాధ్య చరిత్రము, బసవపురాణము | ,, | |
| 6 | రంగనాథుడు | 1200-1276 | రంగనాథరామాయణము (ద్విపద) | ఇతిహాసము | |
| 7 | కేతన | 1250-1270 | దశకుమారచరిత్రము | కావ్యము (ప్రబంధము) | |
| 8 | బద్దెనకవి | 1260-1300 | నీతిశాస్త్రముక్తావళి | పద్యకావ్యము | నీతి |
| 9 | మంచెన | 1300- | కేయూరబాహుచరిత్రము | ప్రబంధము | |
| 10 | అథర్వణాచార్యుడు | 1240-1300 | అథర్వణకారికలు | సూత్రగ్రంథము | వ్యాకరణము |
| 11 | కాచవిభుడు, విట్ఠలరాజు | | రంగనాథోత్తరరామాయణము (ద్విపద) | ఇతిహాసము | |
| 12 | మారన | 1250-1300 | మార్కండేయపురాణము | పురాణము | |
| 13 | విన్నకోట పెద్దన్న | 1300- | కావ్యాలంకారచూడామణి | పద్యకావ్యము | లక్షణగ్రంథము |
| 14 | చిమ్మపూడి అమరేశ్వరుడు | | విక్రమసేనము | ప్రబంధము | |
| 15 | హుళక్కి భాస్కరుడు | 1295-1360 | భాస్కరరామాయణము | ఇతిహాసము | |
| 16 | నాచనసోముడు | 1360- | ఉత్తరహరివంశము | ,, | |
| | ,, | | వసంతవిలాసము | ప్రబంధము | |
| 17 | వేములవాడ భీమకవి | 1400- | కవిజనాశ్రయము | పద్యకావ్యము | లక్షణగ్రంథము |
| 18 | మడికి సింగన | 1420- | వాసిష్ఠరామాయణము, పద్మపురాణము, దశమ [స్కంధము | ఇతిహాస పురాణములు | |
| 19 | జక్కయకవి | 1406-1422 | విక్రమార్కచరిత్రము | ప్రబంధము | |
| 20 | అనంతామాత్యుడు | 1430- | భోజరాజీయము | ,, | |
| | | | రసాభరణము | అలంకారశాస్త్రము | |
| 21 | రావిపాటి తిప్పన | 1380- | చంద్రతారావళి, మదనవిజయము, అంబికా శత [కము | | |
| 22 | వి. వల్లభరాయుడు | 1420- | క్రీడాభిరామము | పద్యకావ్యము | |
| 23 | శ్రీనాథుడు | 1400- | హరవిలాసము మొదలయినవి | ,, | |
| 24 | పోతన | 1405-1470 | భాగవతము, వీరభద్రవిజయము | పురాణము, పద్యకావ్యము | |
| 25 | నిశ్శంక కొమ్మన్న | 1430-1470 | శివలీలావిలాసము, | ప్రబంధము | |
| 26 | గౌరనమంత్రి | 1440- | హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథచరిత్రము | ద్విపద | |
| 27 | దగ్గుపల్లి దుగ్గయ్య | 1480- | నాచికేతోపాఖ్యానము | ప్రబంధము | |
| | ,, | | కాంచీపురమాహాత్మ్యము | ,, | |
| 28 | భైరవ కవి | 1460- | శ్రీరంగమాహాత్మ్యము | ,, | క్షేత్రమాహాత్మ్యము |
| | ,, | | రత్నశాస్త్రము | పద్యకావ్యము | ,, |
| | ,, | | కవిగజాంకుశము | ,, | |
| 29 | పిల్లలమర్రి పినవీరన | 1450-1480 | జైమినీ భారతాశ్వమేధపర్వము | ,, | లక్షణగ్రంథము |
| 30 | నంది మల్లయ్య, ఘంట సిం (గయ్య | 1480 | ప్రబోధచంద్రోదయము | ప్రబంధము | |
| | ,, | | వరాహపురాణము | పురాణము | వేదాంతము |
| 31 | దూబగుంట నారాయణకవి | 1480 | పంచతంత్రము | ప్రబంధము | |
| 32 | వెన్నెలకంటి సూరన్న | 1480 | విష్ణుపురాణము | పురాణము | నీతి |
| 33 | ఫణిభట్టు | | పరతత్త్వసారము | పద్యకావ్యము | |
| 34 | మనుమంచిభట్టు | | హయలక్షణసారము | ,, | వేదాంతము |
| 35 | కేతనమంత్రి | | కాదంబరి | ప్రబంధము | అశ్వశాస్త్రము |
| 36 | కవిభల్లటుడు | | విక్రమార్క చరిత్రము, లక్షణగ్రంథము, | ప్రబంధము,పద్యకావ్యములు | |
| 37 | కవిరాక్షసుడు | | ఆదినారాయణచరిత్రము [నిఘంటువు | ప్రబంధము | |

1. కుమారసంభవ కర్తయైన నన్నెచోడుడు నన్నయకు పూర్వుడని శ్రీ మానవల్లి రామకృష్ణ కవి గారును, నడకుదుటి వీరరాజు పంతులుగారును వ్రాసిరి. కాని శ్రీ వీరేశలింగము పంతులుగారును, శ్రీ జయంతి రామయ్య పంతులుగారును, వేటూరి ప్రభాకరశాస్త్రిగారును నన్నయకు నూరేండ్ల తరువాతి వాడని తేల్చియున్నారు.

2. వేములవాడ భీమకవి నన్నయకు పూర్వుడనియు, తిక్కనసోమయాజి నన్నయకు సమకాలీనుడనియు శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు వ్రాసియున్నారు. కాని శ్రీ వీరేశలింగము పంతులుగారు వీరి వాదములను ఖండించి భీమన, తిక్కనలు నన్నయకు తరువాతివారని తేల్చిరి.

3. శ్రీనాథునికాలము శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు వ్రాసినదాని ననుసరించి క్రీ. శ. 1360 మొదలు 1440 వఱకు; బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మతప్రకారము క్రీ. శ. 1385 మొదలు 1475 వఱకు.

4. శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు హుళక్కి భాస్కరుడు శా. శ. 950-1000 నాటివాడని వ్రాసియున్నారు.

పై పట్టికలోని కవుల కాలములు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి కవుల చరిత్రలోని నిర్ణయముల ననుసరించి యీయబడినవి.

అద్వైత పరమ్ములైన భాష్యములకును, రామానుజాచార్యులవారి భాష్యములకును ప్రతిఘటనము గలిగినది. మధ్వాచార్యులును నీకాలమునందు ద్వైతపరమ్మైన భాష్యములను రచియించెను.

## వీ ర శై వ ము

బసవేశ్వరుఁడు 1140—68 ప్రాంతములందు వీరశైవమతమును వ్యాపింపజేసెను. ఆంధ్రదేశమునుండి వెడలిపోయిన జైన బౌద్ధమతములకు బదకొండవ శతాబ్దములోఁ దమిళ కర్ణాటక దేశములందు స్థావరము లేర్పడినవి. శైవ వైష్ణవమతములు పండ్రెండవ శతాబ్దమున నారంభములై క్రమవికాసమును బొందినవి. వీరశైవము జైనబౌద్ధమతములను బదుమూఁడు పదునాలుగు శతాబ్దములందు కర్ణాటకదేశమునుండి వెడలఁగొట్టినది. ఆంధ్ర కర్ణాట వాఙ్మయములకు వీరశైవమత వ్యాపనము రెండుమూఁడు వందలేండ్ల ఉత్తేజమును కలుగజేసినది. భక్తిమార్గ ప్రతిపాదకములైన వీరశైవ వైష్ణవ మతములు పండ్రెండు పదుమూఁడు శతాబ్దములందును, తరువాతను నాంధ్ర వాఙ్మయాభ్యుదయమునకు విశేషముగ దోడ్పడినవి.

బసవేశ్వరుఁడు బ్రాహ్మణకులమునందుఁ బుట్టినను కర్మసంస్కారమును విడిచి భక్తిసంస్కారమును స్వీకరించెను. బసవేశ్వరుఁడు వీరశైవమును వ్యాపింపజేసినను, శైవము భిన్నరూపములను దేశమునం దంతటను బూర్వమే వ్యాపించియున్నది. వీరశైవమునందు దుఃఖనివృత్తికి అష్టావరణములును సాధనములు. గురు లింగ జంగమార్చనలు, విభూతి రుద్రాక్షధారణము, తీర్థప్రసాదములు, పంచాక్షరి దుఃఖనివృత్తికి సాధనములు. భక్త మాహేశ్వర ప్రసాద ప్రాణ శర ణైక్య స్థలములు ముక్తికి సోపానములు. ఆచారలింగ, గురులింగ, శివలింగ, చరలింగ, పత్య్రప్రసాదలింగ, మహాలింగములు శివలింగ రూపములు.

శైవమతము భరతఖండమునందు ప్రాచీనమ్మైన మతము. శైవమతము శివోత్కర్ష ప్రధానమ్మైన మతము. ఆరంభమునందు వైదికమతమ్మైన కర్మమార్గము నవలంబించినను గాలక్రమమున భక్తిమార్గము ప్రధానమ్మైనది. శైవము ప్రాచీన వైదికమార్గమునఁ గర్మలను, వర్ణాచారములను నాశ్రయించుచు వృద్ధిని బొందినది. లింగధారణశైవము శైవముతోపాటు లింగధారణమును ప్రధానముగ స్వీకరించినది. వీరశైవము కర్మసంస్కారములను, జాతిభేదమును నిరసించుచు లింగధారణదీక్షను శాసించినది. వీరశైవమునకు లింగధారణము ఓజము, లింగభక్తి శక్తి, గురులింగ జంగము ప్రసాదము కీలకము. జైనబౌద్ధ మతములు కర్మసన్న్యాసమును, జీవయాత్రయందు వైరాగ్యమును వ్యాపింపఁజేసినవి. భక్తికి, బ్రజాగౌరవమునకు కాషాయాంబరములు చిహ్నములైనవి. భిక్షాటనము పూజ్యమ్మైన వృత్తియ్యైనది. గృహస్థాశ్రమమునందు విరక్తి ప్రబలినది. ప్రజలు నిరాశ్రయులైరి. సంఘశక్తి క్షీణించినది. వేదాంతమును నీమార్గమునే యవలంబించినది. వైదికమతప్రోక్తమ్మైన కర్మానుష్ఠానము ప్రజాసామాన్యమునకు స్వధర్మనిర్వహణమునకు నిరుపయోగమ్మైనది. భగవద్భక్తిని సార్థకము చేయుటకు మానవసేవ యవసరమ్మైనది. వీరశైవము నిత్యజంగమార్చనలందు ఆత్మానందమును, శివానందమును, విశ్వకల్యాణమును సాధ్యముచేసి వైదికమత పరిణామమును భక్తిమార్గరూపమున విస్తరింపఁజేసినది. వీరశైవ ప్రభావము పండ్రెండు పదుమూఁడు శతాబ్దములందలి ఆంధ్రవాఙ్మయమునందు గోచరమగుచున్నది. ముఖ్యముగ ద్విపద కావ్యములందును, శతకము లందును, పాటలందును, కీర్తనలందును వీరశైవ ప్రాబల్యము గోచరమగుచున్నది. తిక్కన భారతమునందును, పోతన భాగవతమునందును పండ్రెండవ శతాబ్దమునందుఁ బ్రబలిన భక్తిమార్గ ప్రాభవము వారి భావములందును, భాషయందును, రచనలయందును వ్యక్తమగుచున్నది.

## తెనుఁగు స్వరూపము: ద్విపద కావ్యములు

ఆంధ్రవాఙ్మయ స్రవంతి రెండు ప్రధానములైన మహాప్రవాహములను గలిగి శోభిలుచున్నది. ఒకటి సంస్కృత సంస్కార ప్రవాహము; రెండవది తెనుఁగు సంస్కార ప్రవాహము. ఈ మహాస్రవంతియం దింకను నెన్నియో నదీనదములు సంగమించి జీవనదీ మహత్త్వమును వృద్ధిచేసినను సంస్కృతాంధ్ర ప్రవాహములు మాత్రమే ప్రధానములుగ నున్నవి. జీవనది కాధారభూతములైన రెండు ప్రవాహములందును మూలప్రవాహమును నిర్ణయించుట దుర్ఘటము. సంస్కృతవాహిని హిమసంజాతమ్మైన నిర్మల జలపూరితమ్మై ఋతుధర్మము ననుసరించుచు బ్రవహించుచున్నది. తెలుఁగు వాహిని నిర్ఝరసంజాతమ్మైన సంకుల జలపూరితమ్మై కాలధర్మము ననుసరించుచు బ్రవహించుచున్నది. రెండు వాహినులును గలిసి అన్యోన్యాశ్రయమును గలిగి ఆంధ్రస్రవంతీరూపమును బొంది ప్రవహించుచున్నను సంగమమునకుఁ బూర్వమును, సంగమానంతరమును బ్రత్యేకముగఁ బ్రబలిన ఘట్టములు సంభవించినవి. రెండు వాహినులు నిండినపుడును, రెండు వాహినులు ఎండినప్పుడును, ఒకటి యెండి రెండవది నిండినపుడు ఆంధ్రవాఙ్మయ స్రవంతియందు రసప్రవాహము, రసశోషణము గలుగుచున్నవి. ఇందులకు గారణములు వాహినుల ప్రవృత్తులందే కలవు. ఒకటి పురాతనము, రెండవది నవీనము; ఒకటి వేదోక్తమ్మైన కర్మపరము, రెండవది భాగవతాయత్తమ్మైన భక్తిరసము; ఒకటి గ్రంథస్థము, రెండవది ముఖస్థము; ఒకటి బ్రాహ్మణసాహిత్య సంవర్ధితము, రెండవది ప్రజాసాహిత్య సంవర్ధితము.

రెండు ప్రవాహములను ఆంధ్రముద్రాంకితములై కలిసి తెనుఁగు వాఙ్మయ ప్రవాహమున నైక్యమును బొందినను రెంటికిని ప్రత్యేక లక్ష్య లక్షణములు గోచరమగుచున్నవి. ఒక వాహిని కూలంకషముగ వెల్లువలై పారుచున్నప్పుడు రెండవ వాహిని తగ్గియుండుట ప్రకృతిధర్మము. కాని వెల్లువ తగ్గిపోయిన తరువాత రెండు వాహినులు కలిసి యథాప్రకారము పారునపుడు రెండు వాహినులకుఁ గల యన్యోన్యాశ్రయము విశదమగుచున్నది.

ఆంధ్రవాఙ్మయ స్రవంతి యుపనదుల సంగమము వలన స్వరూప స్వభావములందు మార్పులను బొందుచున్నను నాంధ్రవాఙ్మయ ప్రవాహము జీవనదియ్యై ప్రవహించుచున్నది. దేశకాలపాత్రల ననుసరించి వాఙ్మయ ప్రవాహము విశాలమ్మైనను సంకుచితమ్మైనను, నిర్మలమ్మైనను కలుషితమ్మైనను, పర్వతములందు ప్రవహించినను బయళ్ళయందు పారినను తెలుఁగు స్వభావము, తెలుఁగు స్వరూపము సర్వత్ర గనుపడుచుండును.

పదునొకండవ శతాబ్దమునందు నన్నయ భారత మాంధ్రవాఙ్మయమునందు సంస్కృత వాహినిని గూలంకషముగఁ బ్రవహింపఁజేసిన విధ మిదివఱకే సందర్భానుసారముగ దెలుపఁబడినది. నన్నయ భారతము దలపెట్టిన వైదికమత వ్యాపనమునకును, సంస్కృత సంస్కార ప్రాబల్యమునకును వెంటనే ప్రతిరోధము గలిగినది. శైవ వైష్ణవమతములు వ్యాపించినవి. మహాభక్తులు, నాయనారులు, ఆళ్వారులు ప్రజాహృదయము నాకర్షించిరి. ప్రజలకు భక్తిమార్గము నుపదేశించుటకు జానుదెను గవసరమ్మైనది. పండ్రెండు పదుమూఁడు శతాబ్దములందు బుట్టిన వాఙ్మయము ప్రజల మేలుకొలుపును దెలుపుచున్నది. ఈ కాలపు వాఙ్మయము భావమునందును, రూపమునందును, లక్ష్యమునందును దెనుఁగు హృదయమును దెలుపుచున్నది. నన్నయ విరచితమ్మైన భారతభాగము 10 ·3 ప్రాంతములందు ముగిసినది. నన్నెచోడుఁడు 1151—1170 నడుమ కుమార సంభవమును రచించెను. పాల్కురికి సోమనాథుడు 1170—1220 నడుమ బసవపురాణమును, పండితారాధ్య చరిత్రమును జానుదెనుఁగున ద్విపదయందు రచించెను. రంగనాథరామాయణము, లేక బుద్ధ రామాయణము ద్విపదయందు 1200—1276 నడుమ వ్రాయబడినది.

నన్నెచోడుఁడు క్షత్రియుఁడు. అయన కాళిదాసకృతమ్మైన కుమారసంభవమునే కాక ఉద్భటకవికృతమ్మైన కుమారసంభవమును గూడ మాతృకనుగఁ గైకొనెను. నన్నెచోడుఁడు తన కుమారసంభవమును జంగమ మల్లికార్జున యోగి కంకితము చేసెను. ఆయనకుఁ గల గాఢమ్మైన శైవభక్తిని కుమారసంభవము దెలుపుచున్నది.

గీ. మగువ జంగమమ్మల్లయ దగిలి చూచి
యుంద కన్నులఁ మనమును నంటియున్న

> సకలభావన విర్భోదానట్ల పరము
> సభవుఁ గని జను లచలాత్ము లగుట యరుదె?

సోమనాథుఁడు బసవపురాణమునం దఖండముగ వర్ణించిన గురులింగ జంగమభక్తినే నన్నెచోడుఁడును నీపద్యమునందు సువ్యక్తము చేసెను. ఈ కవి తన కావ్యములందుఁ దెనుఁగు మాటల నధికముగ వాడియుండెను. దేశికవితఁ బుట్టించి తెనుఁగును నిలుపుటయం దీ కవి కత్యంతాదరము గలదు. ఈయన సంస్కృతకవులను స్తుతించి తెలుఁగుకవుల పేరే యెత్తలేదు. ఈ సందర్భము లన్నియు వైదిక మత ప్రతిఘటనమునకును, దెనుఁగు ప్రీతికిని శివభక్తి పరత్వమునకును, ఆంధ్రవాహినీ వికాసమునకును నిదర్శనములుగ నున్నవి.

సోమనాథ కృతములైన బసవపురాణమును, పండితారాధ్య చరిత్రమును నీసందర్భములను బోషించుచున్నవి. సోమనాథుఁడు బ్రాహ్మణ్యమును విడిచి వీరశైవమును స్వీకరించెను. ఆయన శివకవులను మాత్రమే ప్రశంసించెను. సోమనాథుఁడు బసవపురాణమును, పండితారాధ్య చరిత్రమును తేటతెనుఁగున ద్విపదయందు రచియించెను.

> అరూఢ గద్యపద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భాషావిస్తృత రచన
> మానుగా సర్వసామాన్యంబు గామి జాను దెనుఁగు విశేషము ప్రసన్నతకు.
> (పండితారాధ్య చరిత్రము)

> ఉరుతర గద్య పద్యోక్తులకంటె సరసమై పరగిన జానుఁదెనుంగు
> చర్చింపఁగా సర్వసామాన్య మగుట గూర్చెద ద్విపదలు గోర్కి దైవార
> దెలుగుమాటలనంగవలదు; వేదములకొలదియ కాఁ జూడుఁ డెట్టులనిన
> జాటి తూమునకును జాటి యగునేనిఁ బాటింప సోలయు బాటియుఁ గాదె.
> అల్పాక్షరముల ననల్పార్థరచన కల్పించుటయు కాదె కవివివేకంబు

> అలరుచు బసవనిఁ దలచు తలంపు గలుగునేఁ గాఁజేసి భావమ్ము మెఱసి
> యుక్తలంక లింగ రహస్యసిద్ధాంత సకల వేదపురాణ సమ్మతంబైన
> యాతత బసవపురాతనభక్త గీతార్థసమితియే మాతృక గాఁగ
> బూరితంబై యొప్పు పూనలలోన దారంబు క్రియ బురాతనభక్తవితతి
> (బసవ పురాణము. పుట—5)

సోమనాథుఁడు నన్నయ ప్రారంభించిన సంస్కృత మార్గకవిత్వమును విడిచి దేశీయ కవిత్వమార్గమును సంపూర్ణముగ నవలంబించెను. గద్యపద్యాది సంస్కృత భూయిష్ఠమైన కావ్యరచనలు సర్వసామాన్యముగాఁ దెలియవనియు, జానుదెనుఁగు ప్రసన్నతకు సాధనమనియు సోమనాథుడు ద్విపదరచనకు గారణమును దెలియఁజేసెను. సోమనాథుడు తన కావ్యములందు దెనుగుమాటలను విచ్చలవిడిగ వాడి తెలుగుసొంపును బాడెను. సోమనాథుని ద్విపదలు తెనుగువాహినీ సౌందర్యమును దెలుపుచున్నవి. సోమనాథుడు ద్విపదరచనయందును నూతన మార్గము నవలంబించెను. ఆ కాలమునందు గర్ణాటకవాఙ్మయ వ్యాపనమునం దున్న వచనములు, రగడలు, త్రిపదులు, షట్పదులు సోమనాథుని ద్విపదలకుఁ బ్రోత్సాహ మొసగియుండును.

కర్ణాటక వాఙ్మయమునందును బన్నెండవ శతాబ్దాంతమునందు చంపూరచనలను, సంస్కృత వృత్తములను వీరశైవకవులు నిరసించి దేశీయ రచనలకు బూనుకొనిరి. రైసుగారును, నరసింహాచార్యులుగారును గన్నడ వాఙ్మయ చరిత్రమునం దీ విషయమును సువ్యక్తము చేసిరి. ఆంధ్ర కర్ణాట దేశముల గూడలియందు నివసించిన సోమనాథుడు వీరశైవమత వ్యాపనమున గర్ణాటక కవుల మార్గము నవలంబించుటయు సహజము. కావ్యరసానందమును జనులందరు ననుభవించుటకు మాటలు, తలంపులు వారికి దెలిసినవై యుండవలయును. బసవపురాణమును, పండితారాధ్య చరిత్రమును వైదికమత భక్తిని

ప్రతిపాదించినవి ప్రజల కనుభవసిద్ధమైన భక్తిమార్గమును జానుతెనుగున నుపదేశించినవి. వీరశైవ బృందావనమునందు గురులింగజంగము రూపమున సర్వసమానత్వమును బోధించినవి.

వేదంబు లాదియో విధికల్పితంబు
లాదియో జాతుల కది యెట్టు లనినఁ
జను వేదచోదితజాతులు రెండు
వినుము ప్రవర్తకంబును నివర్తకము
భవకర్మసంస్కారి భువిఁ బ్రవర్తకుడు
శివకర్మసంస్కారి భువి నివర్తకుడు
విస్తృత వేదగ్రచరితంబు లుండ
మొన్న బుట్టిన కులమ్ములమాట లేల
ప్రస్తావ్యాక్తి మిగునట్టి జాతులు గావె
యష్టాదశంబులు నవి యేల చెప్ప
మిక్కిలి పదునెనిమిదివర్ణములకు
నిక్క మారయ భక్తనిచయుంబు కులము
భాగ్యహీనుండు దా బసిడి బట్టిన న
యోగ్యంపులోహ్మమై యున్నట్లు శివుని
ప్రతిబింబమూర్తి యీ భక్తుడు భువికి
మఱిఁ జూడ మానవాకృతి నుండు ధరణిఁ
గావున శివభక్తగణముల మహిమ
భావింపఁ దలప నీ ప్రాప్తియే చెపుమ

(బసవ పురాణము. పుట—209)

ఆంధ్రవాఙ్మయమునం దాదియుగమునందు నన్నయ యుపక్రమముగఁ జెలిపిన "తెనుగు రచనయును, భక్తిమార్గమును" పండ్రెండవ శతాబ్దాంతమున ద్విపదకావ్యముల యందు పరిస్ఫుటమైన విధము నా కాలపు వాఙ్మయము విశదము చేయుచున్నది. పదుమూడవ శతాబ్దాంతమునందు భారత రచనను బూరించిన తిక్కనసోమయాజి పండ్రెండు పదుమూఁడు శతాబ్దములందు బరిస్ఫుటమైన తెనుఁగు వాహిని నాదరించి రెండువాహినుల సంయోగమును జేసిన విధమును తిక్కన కవిత్వ మహాత్మ్యము విశదము చేయుచున్నది.

పండ్రెండవ శతాబ్దమునందు ప్రజాహృదయమున ప్రబలిన భక్తిమార్గము తెనుగు వాహినికి పోషణమును గలుగ జేసినది. ఆ పోషణమే తిక్కన రచించిన భారతమునందు ప్రత్యక్షమగుచున్నది. తిక్కన రచించిన భారతమునం దాంధ్రస్వరూపము భాషయందును, భావములందును, రూపములందును హృద్యముగ ప్రత్యక్షమగుచున్నది. పదునైదవ శతాబ్దారంభమునందు భాగవతమును రచించిన పోతనామాత్యుడు రెండు వాహినులను గలిపి గంభీరమైన భాగవత ప్రవాహములు విస్తరించి ఆంధ్రవాఙ్మయమునందు దెలుగు మహిమను, భక్తిప్రభావమును పోషించి కావ్యరసానందమును వ్యక్తము చేసెను. పదునైదవ శతాబ్దమునందు గౌరనమంత్రి హరిశ్చంద్రోపాఖ్యానమును, నవనాథచరిత్రమును, శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రమును ద్విపదయందు హృద్యముగ రచించి ఆంధ్రవాఙ్మయ స్వభావమును, ద్విపదకావ్యముల ప్రతిష్ఠను గాపాడిరి.

ఆంధ్రవాఙ్మయ చరిత్రయందు ఆదియుగము ఆంధ్రభాగవత రచనతో నంతమందుచున్నది. ఆదియుగము వైదికమార్గ యుగము; అనువాదయుగము; సంస్కృతమార్గ యుగము; పండితయుగము; పురాణయుగము. ఆ యుగమునందు కర్మమార్గమునకును భక్తిమార్గమునకును, సంస్కృత కావ్యములకును తెలుగు కబ్బములకును, పురాణేతిహాసములకును చంపువులకును, పండితులకును ప్రజలకును సంరంభసాహచర్యములు ప్రబలుచు ఆంధ్రవాఙ్మయ స్వరూప స్వభావములు పరిస్ఫుటములైనవి. నన్నయ్య సంస్కృత సాహిత్యమున కాంధ్ర సంస్కారము చేసి ఆంధ్రసాహిత్య నిర్మాణమున కుపక్రమించెను. తిక్కన దేశీయసాహిత్యమునకు సంస్కృత సంస్కారము చేసి ఆంధ్ర సాహిత్యస్వరూపమును బరిస్ఫుటము చేసెను. పోతన సంస్కృతాంధ్ర సాహిత్యములను మేళవించి ఆంధ్రసాహిత్య స్వరూపస్వభావములను బండితపామర హృదయములకు సన్నిగ్రాహము చేసెను. నన్నయ ప్రారంభించిన సంస్కృతవాహిని పోతన హస్తమునందు దెలుగువాహిని అయినది. భారతము ప్రతిపాదించిన కర్మమార్గము భాగవతమునందు భక్తిస్వరూపమును దాల్చినది. భారత ముద్ధరించిన సంస్కృత పాండిత్యము భాగవతమునందు బండితపామరులకు గ్రాహ్యమయిన తెలుగు స్వరూపమును దాల్చినది. ఆంధ్రమహాభాగవతమునకు గల ప్రజాదరణ మీ విషయమును సువ్యక్తము చేయుచున్నది.

## ఆంధ్ర మహాభాగవతము

బమ్మెర పోతరాజు భాగవతమును మహాకావ్యలక్ష్యముతో రచించెను. పోతన త్రిలింగదేశస్థమైన బమ్మెరయందు జనన మొందెను. బమ్మెర నిజాము రాష్ట్రమునందలి ఓరుగల్లు ప్రాంతములందు గలదు. సుప్రసిద్ధమైన ఏకశిలా నగరమే ఓరుగల్లు నామమున వన్నెకెక్కినది. పోతరాజు కాలమును నిర్ణయించుట యందు భేదాభిప్రాయములు గలవు. పోతరాజు పదునైదవ శతాబ్దారంభమున భాగవతమును రచించియుండును. పోతరాజు సహజపాండిత్యసంపన్నుఁడను ప్రతీతి గలదు. భాగవతరచన యీప్రతీతికి దగియున్నది. గ్రంథపాతము, గ్రంథపూరణము మొదలగు విషయముల విమర్శనలు ప్రస్తుత సందర్భములం దసాధ్యములు. పోతరాజామాత్యుని స్వతంత్ర ప్రవృత్తి నీపద్యము వెల్లడి చేయుచున్నది:

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటపోటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

క్రిలిపతి నిర్ణయమునందు పోతరాజు దెలిపిన భావము లా మహాసుభావుని యుదాత్తసంకల్పమును విశదము చేయుచున్నవి.

పోతరాజు శ్రీకైవల్యపదంబు జేరుటకునై భాగవతమును శ్రీరామభద్రున కంకితముచేసి జగద్ధితంబుగ రచియించి పరమార్థమును బడసెను. పోతరాజు సంస్కృతాంధ్రవాహినుల నాంధ్రవాహినీ స్వరూపమున భాగవతమునందు ప్రవహింపజేసి ఆంధ్రవాఙ్మయ హృదయమును భావరూపములందు బరిస్ఫుటము చేసెను.

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతు గృతుల నయ్యై యెడలన్.

పోతన భాగవతరచనయందు సంస్కృత పదముల నధికముగ వాడినను సంస్కృత పదజాలమున కాంధ్రసంస్కారమును జేసి తెలుఁగునం దైక్యమును బొందించెను. ఈ యైక్య మాంధ్రభాషామాధుర్యమును, నాంధ్రభాషాతత్త్వమును బరిస్ఫుటము చేసినది. తెనుగు బాసకు సహజమైన తియ్యదనము పోతరాజ త్యాగరాజ రచనలందు మనోహరముగ గోచరమగుచున్నది. భాగవతమునందలి పద్యములు కర్ణరసాయనములై పరమాహ్లాదమును గలుగజేయుచున్నవి. భాగవతరచనయం దాంధ్రహృదయము భాషయందును, భావమునందును, శైలియందును గోచరమగుచున్నది.

పదలాలిత్యము, భావలాలిత్యము భాగవతమునం దేకస్థాయిని బొంది ఆంధ్రసాహిత్య స్వరూపహృదయమును విశదము చేయుచున్నవి. సంస్కృతాంధ్రపదములు, భక్తిజ్ఞానమార్గములు, భాగవతమునం దేకస్థాయిని బొంది కావ్యమునకు పరమప్రయోజనమైన యానందమును ప్రత్యక్షము చేయుచున్నవి. వైదికమత ప్రతిపాదితమైన కర్మమార్గము భాగవతమునందు, భక్తిస్వరూపమును దాల్చినది. వేదవ్యాసుఁడు పంచమవేద మనబరగు భారతమును రచించియును మనశ్శాంతిని బొందలేదు.

. ప్రతిభారి నై వేదవిద్యా గురుశ్రేణి మస్సింతు విహితకర్మములఁ గొఱఁత
పడకుండ నడుపుదు భారతమిషమునఁ బలికితి వేదార్థభావ మెల్ల
మునుకొని స్త్రీశూద్రముఖ్యధర్మము లెందుఁ దెలిపితి వేఁ జెల్ల దీక్షఁ జేసి
యాత్మ సంతస మంద దాత్మలో నీకుండు సంతసింపకయున్న జాడ దోఁచె.

ఆ. హరికి యోగివరుల కభిలషితంబైన
భాగవతవిధంబుఁ బలుక నైతి
హాస మయ్యెఁ దెలివి మొనయదు మఱచితి
వనుచు వగచుచున్న యవసరమున.

మనశ్శాంతి లేక వగచుచున్న వేదవ్యాసునకు నారదుడు చేసిన హితోప
దేశము, భాగవత కావ్యప్రయోజనమును విశదము చేయుచున్నది.

ఉ. అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోపలం
జించుక గాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నఁగ గాక నీకు ని
క్కొంచెము వచ్చు నెల్ల హరిఁ గోరి నుతింపుమి నార్యపూజితా.

మ. హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేనికావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోల గర్తాకృతిన్.

మ. అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
పపరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబుఁ గీర్తించుచుం
దపముల్ సాధులు ధన్యులౌదురు గదా తత్త్వజ్ఞ చింతింపుమా.

నారదుని యుపదేశము ననుసరించి వేదవ్యాసుడు భాగవతమును
రచించి మోక్షమును బొందిన విధమున పోతరాజు శ్రీరామభద్రుని యాదేశము
ననుసరించి భాగవతమును రచించి పునర్జన్మము లేకుండ దన జన్మమును
సఫలము చేసికొనెను. మానవులు సంసార చక్రమునందు నిర్మవరతంత్రులై
పరిభ్రమణము చేయుచున్నను భక్తిమార్గముల మోక్షమును బొందగల
విధమును భాగవతము విశదము చేయుచున్నది.

క. వినుమీ సంసారం బను వననిధిలో మునిఁగి కర్మవాంఛలచే వే
దనఁ బొందెడువానికి విష్ణుని గుణవర్ణనము తెప్ప సుమ్ము మునీంద్రా.

ఉ. యమనియమాదియోగముల నాత్మ నియంత్రిత మయ్యుఁ గామరో
షములఁ బ్రచోదితంబ యగు శాంతి వహింపదు విష్ణుసేవనా
గ్రమమున శాంతి గైకొనిన కైవడి నాదు శరీరజన్మక
ర్మముల రహస్య మెల్ల మునిమండన చెప్పితి నీవు కోరినన్.

క. నిగమములు వేయుఁ జదివిన సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్
సుగమంబు భాగవత మను నిగమంబు పఠింప ముక్తినివాసము బుధా.

ఆంధ్రసాహిత్య రచన పూర్ణయుగమునందు భాగవత రచనయందు
పరిపక్వము నొందినది. ఆంధ్రభాగవతమునకు సంస్కృత భాగవతము మాతృక
యైనను వర్ణనలు, పద్యములు, శైలి, భావములు ప్రజాదరణమునకు పాత్ర
మైన తెనుగు స్వభావస్వరూపములను దాల్చినవి. సరళమైన పోతనంచన
సరళమైన ఆంధ్రహృదయమును విశదము చేయుచున్నది. భాగవతమునందు
గల శబ్దాలంకారములును, అంత్యప్రాసలును తెలుగుబాసకు సహజాలంకార
ములు. ఆంధ్రభారతి కిట్టి సహజాలంకారములను సమకూర్చిన కవులయందు
పోతనామాత్యు డగ్రగణ్యుడు. భాగవత భక్తిపారవశ్యమును, కావ్యరసానందమును
కలుగజేయుటయందు పోతనామాత్యుని ప్రతిభ యసామాన్యము. గజేంద్ర
మోక్షము, రుక్మిణీకల్యాణము, ప్రహ్లాద చరిత్రము మున్నగు ఘట్టముల
కాంధ్రసాహిత్యమునందు గల యాదరణము పోతనామాత్యుని ప్రతిభను విశదము
చేయుచున్నది. భాగవత రచన సహజమై, రసవంతమై, భాగవత భక్తిభరితమై
ఆంధ్రహృదయ స్వరూపమును సర్వత్ర ప్రత్యక్షము చేయుచున్నది.

మ. సిరికిం జెప్పడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింప డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

ఆంధ్రవాఙ్మయ పరిణామమున భారత రచనయందు నన్నయ యవ
లంబించిన సంస్కృతమార్గము భాగవత రచనమున పోతన రచనయందు దేశి
రూపమును బొందినది. వైదిక కర్మమార్గము భక్తిరూపమును దాల్చినది;
పండితాశ్రయము ప్రజాశ్రయపరమైనది. కావ్యమునకు బరమప్రయోజన
మైన విశ్వశ్రేయస్సు సార్థకమైనది. జీవయాత్రను, విశ్వశ్రేయస్సును సార్థ
కము చేయుటకు సాధనములైన నిర్గుణసగుణోపాసనలు భాగవతమునందు
సమన్వయమును బొందినవి. సంసార యాత్రకు సహజములైన శృంగార
వైరాగ్యములు, సుఖదుఃఖములు, కలిమిలేములు, నిరహంకార దురహంకార
ములు భాగవత భక్తియందు సమన్వయమును బొందగలవిధమును పోతనా
మాత్యుడు భాగవత ఘట్టములందు దివ్యతరముగ వినిర్మించి కైవల్యమార్గము
నను[illegible].

[illegible]యుగకవులందు నాచనసోముడు, భాస్కరకవులు, మడికి సింగన,
పిల్లలమర్రి పినవీరన మొదలగు కవు లాంధ్రవాఙ్మయ వికాసకర్తలందు ప్రము
ఖులు. పదునాల్గవ శతాబ్దారంభమునందు నివసించిన నాచనసోము డాంధ్ర
వాఙ్మయమునకు సహజమైన స్వరూప స్వభావములను గల్పించిన కవిబృందము
నకుఁ జెందిన మహానుభావుడు. కవిబ్రహ్మ తిక్కన సోమయాజివలె నీమహాకవి
యాంధ్రవాఙ్మయమునకు, గళాన్యాసము చేసి మూర్తిమంతము చేసెను. నాడుక
యందున్న తెలుఁగుభాష, కంగన్యాస హృదయన్యాసములను జేసి కళాస్వరూప
మును ప్రతిపాదించిన మహాకవి యితడు. నాడుకయందున్న తెలుగు సాహిత్యము
నకు గావ్యసంస్కారము చేసి ఆంధ్ర సాహిత్యవాహినిని వీర్యవంతము చేసిన సోమ
నాథ కవీంద్రుని ప్రతిభ ఆంధ్రవాఙ్మయ ప్రవాహమునం దఖండముగ వెలుగు
చున్నది. ఆంధ్రవాఙ్మయమునందు సంస్కృతాంధ్ర సాహిత్యముల సంయోగ
మును దిక్కన సోమయాజివలెనే సోమనాథుడును నిరుపమానముగఁ జేసి ఆంధ్ర
సాహిత్య హృదయమును విస్పష్టము చేసెను. ఉత్తర హరివంశము సోముని
ప్రతిభను విశదము చేయుచున్నది.

చ. లలిత లతావితానముల లత్తుక సోఁకులచాయ చల్ల నే
యుల పెంగొమ్మ లందికొనఁ దొరఁపునప్పులు పిక్కటిల్ల నె
మ్మెలుల వెలింగ మావిరులు చెందొవ లయ్యె నవం దడంబడన్
దలిరులఁ గోయు రాచిలుక దాటులు దేటులు నాసచేయఁగన్.

చ. సడక తెఱంగు మాటబటసంబు నహంగవిలాసమున్ మునుం
గడిన తెఱంగు ముద్దుమొగ మించుక వంచిన సిగ్గుఁ బార్వతిం
దడఁ బఱువంగ నొప్పెసఁగె దర్పకవైరికి నాసపాటుగా
నడరుమఁ జిత్రరేఖ యను నచ్చర నెచ్చెలు లిప్పు మెచ్చఁగన్.

చ. తిరిపెమ కూడు దెచ్చి నలుదిక్కుల బోడలు తిండి పెట్టఁగాఁ
జెరిగిన పొట్టతోడ నొక కోటపంబుం దొరవోలె నెవ్వరిన్
సరకుగొనండు పట్టుకొని చాఁగజక్కొన్న బలే యెఱుంగు డ
క్కరి బల మోపు మోచు నయుగారితనం బఱ నట్టి గట్టిగన్.

(హరివంశము)

ఉ. ఈ కొఱగానికార్య మిటు లెవ్వఁ డొకో యుమకు లక్షణుఁడై
యీకుఁ ప్రియంబుగాఁ బలికె నీవును విత్తఱఁ గాచరింపఁగా

తాళ తలంచిమాడ నిది రాక్షసవంశవినాశకాలమో
కా కటుగాన వీకొనునె కాదన కీద్రుశ మెచ్చఁ జేనియున్.

(భాస్కరుడు)

ఉ. చనదు మహాద్విరోధ మని చక్కటి చెప్పిత వింతతప్పునన్
గనలితి నీతిశాస్త్రులకుఁ గార్యము లేటికిఁ దోఁచు? నిప్పు వే
యును బనిలేదు; నీవలన నొప్పని నావచనంబు లెల్ల నీ
వనిమొన రాముచేఁ బడినయప్పు డెఱింగెదుగాక పోయెదన్.

(హుళక్కి భాస్కరుడు)

పురాణయుగము పోతనతో నంతము నొందినను శ్రీనాథునితో నీయు గము సహజముగ ముగియుచున్నది. శ్రీనాథుడు పదునైదవ శతాబ్దారంభము నందు నివసించియున్నటులు విమర్శకులు నిర్ణయించుచున్నారు. శ్రీనాథుడు పోతన సమకాలికుఁ డనియు, బావమరది యనియు గాథలు గలవు. శ్రీనాథుడు సరస్వతీప్రసన్నుఁ డయ్యును లక్ష్మీప్రసాదమునకై తనకృతులను విక్రయము చేసెను. పోతన శ్రీనాథులకుఁ గావ్యరచనయందుఁ గల పరమప్రయోజనమున లక్ష్యభేదము నిక్రింది పోతనకృతమైన పద్యమును, శ్రీనాథకృతమైన పద్య మును విస్పష్టము చేయుచున్నవి:

ఉ. బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకం
గూళల కిచ్చి యప్పడుపుఁ గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి గహనాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై.

(పోతన)

సీ. దీనారటంకాల దీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుఁ దోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు
గుసుల గొట్టించి యుద్భటవివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచు ఢక్కఁ
జంద్రభూషక్రియాశక్తి రాయల యొద్దఁ
బాదుగొల్పితి సార్వభౌమ బిరుద

తే. మెటులు మెప్పించెదో నన్ను వింకమీఁద
రావుసింగమహీపాలు దీవిశాల
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణనికురుంబ శారదాంబ.

(శ్రీనాథుడు)

శ్రీనాథుఁడు సంస్కృతాంధ్రములం దఖండమైన పాండిత్యము గల మహాకవి. ఆయన రచించిన శివరాత్రిమాహాత్మ్యము, శృంగార నైషధము, కాశీఖండము, పల్నాటి వీరచరిత్రము, భీమేశ్వరపురాణము, వీథినాటకము, హర విలాసము అతని ప్రతిభాపాండిత్యములను వెల్లడి చేయుచున్నవి. "నైషధం విద్వదౌషధం" అను పండితాభిప్రాయము శ్రీనాథుని పాండిత్య ప్రకర్షను చాటు చున్నది. ఆంధ్రవాఙ్మయమునందు సంస్కృత వాహిని నత్యద్భుతముగ ప్రవ హింపఁజేసిన కవులందు శ్రీనాథుఁడు ప్రముఖుఁడు. శ్రీనాథుని శైలి సంస్కృత పదభూయిష్ఠమైనను సరళమై, సుబోధమై ప్రజాదరణమును బడయు చున్నది. శ్రీనాథు డాంధ్రవాఙ్మయమున నాంధ్రతకళావ్యాసమును జేసిన స్వతంత్రకవి. శ్రీనాథుఁడు తన పల్నాటి వీరచరిత్రమునందు దేశియచ్ఛందస్సును, దేశియగాథలను, దేశియసాహిత్యమును నుపయోగించి ఆంధ్రవాఙ్మయము నందు స్వతంత్ర కావ్యరచనలకు మార్గదర్శకు డయ్యెను. వీథినాటకమునందు హాస్యరస మసహ్యముగ నుండుటవలననే వీథినాటక మైనది. శ్రీనాథుఁడు రాజాను గ్రహమును, ప్రజాదరణమును బడసిన మహాకవి. శ్రీనాథుని ప్రజ్ఞాపాండిత్యము లాంధ్రసాహిత్య బృందావనమునందుఁ దేజోవంతములై విరాజిల్లుచున్న విధము వాతని పలువిధములైన రచనలు విశదము చేయుచున్నవి.

సీ. శిశిరభూధరకన్య చెలువుబంతి పసుపాడు
నెందు సాయంకాల మింపెలర్ప
వరుఁ డెందు జలము నుద్ధరణంబు సేయించి
శంభులింగము దాల్చు జఠరసీతరి
వినువీథిఁ బోరాడి వివశంబులై కూలి
హంసంబు లయ్యె వాయసము లెందుఁ
బ్రవహించు నెందు శ్రీభాగీరథికిఁ బోటి
యమృతస్రవాహ్వయ యైన తటిని

గీ. యది విముక్త వధూకంఠహారలతిక
దివ్యకేదారలింగేశ తీర్థభూమి
సదనదీవాపివల్యలప్రహదసమగ్ర
ద్రాక్షపందిరి కాశికోద్యానమునకు.

(కాశీఖండము)

చ. అటు తగునే సురేశ్వరుని యంతటివాఁ డఖిలాప్సరోంగనా
విటుఁ డొక మర్త్యభామినికి వేడుక చేయుచు నున్నవాఁడు వి
స్ఫుటబహురత్న భూషణవిభూషితు లయ్యెడు రాచవారికిన్
గటకట యారకూటకటకంబు రుచించునొ కాక యొక్కెడన్.

ఉ. నీ చరితంబు చూడ నతినిష్ఠుర మయ్యెడు లోకపాల దు
ర్వాచికసూచికాంకురపరంపర దూర్చెదు మాటిమాటికిన్
నాచెవులందు నీకుఁ దగునా యిటు చేయఁగఁ దప్ప దన్న బా
ధాచరణంబు నైజమె కదా తలపోయఁ గృతాంతదూతకున్.

(శృంగారనైషధము)

గీ. పువ్వు ముడిచిన పురవీథిభూమియందు
గట్టి మోవంగ వలసిన కారణమున
వీరభద్రునిచే దైన్యవృత్తి నొందెఁ
దక్షు డట్టిమహాధ్వరస్థానమునను.

మ. జగతీవర్ణితశంసభూషణము విశ్వఖ్యాతముం గాశికా
నగరంబుం బెడబాసి నీకును జగన్మాన్యైకచారిత్ర [illegible]
చిగురుంబోడికి నాకునుం గటకటా చేడ్పాటు వాటిల్లనే
ముగురిం గూర్చిన ముండదైవమునకు న్మోమోట లేదే సుమీ.

(భీమఖండము)

మ. జవ మేపారి మురారిపద్మజభుజా చక్రీభవచ్ఛార్ఙ్గగాం
డివకోదండ వివిర్గతప్రబలనందీప్రాస్త సంఘాతముల్
భువనక్రోడము నిండి భానుకిరణంబుల్ దూర నీకుండఁగన్
బవలుం బర్వె మహాంధకారములు పై పై సూచినిర్భేద్యముల్.

చ. కమలవనాళికాకణిశకంటకకోటులచేతఁ జాడ్కి కిం
పలవఱిచెన్ ధరిత్రి తుహినాగమవేళఁ దటాకసారణిన్
నలిలము పాటి పండినయజాంగలసీమము లెన్ని యన్నిటన్
దలముగ నీతు పేర్మి గరు దాల్చినభావము ప్రస్ఫుటంబుగన్.

(శివరాత్రి మాహాత్మ్యము)

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి పు
త్తెంచిన మంచికజ్జములు తేనియ నేతను దోఁచి తోఁచి భ

క్షించుచుఁ దల్లిదండ్రి దన చిన్నికరాంగుళి వంచి వంచి యూ
రించుచు వాడె మిన్న గమిరేడు కుమారకుఁ డింటిముంగటన్.

ఉ. మాటలు వేయు నేమిటికి మంగళలక్షణలక్ష్మియైన యా
కోటికి భర్త గాఁగలఁడు సోమకిరీటుఁడు సర్వదేవతా
కోటికిరీటకోటివరికుంచితభవ్యమణిద్యుతిచ్ఛటా
పాటలపాదపీఠుఁడగు నట్టి కృతార్థుఁడనైతి భూధరా.

(హరవిలాసము)

మంజరి. పేరె బాలుఁడు గాని బిరుదుమగండు
జగవారి గొట్టవిదాలత్వ మేల?
తలిదండ్రులను బ్రోవఁ దనయుఁడె కర్త
మానాభిమానముల్ మగఁటిమి మించ
బ్రబలింపఁ గలవారు బాలురె సుమ్ము
బాలురె పెద్దల బల్లిదు ల్వారె
బాలురకే బుద్ధి పరికించి చూడఁ
బెద్దలు మతి చెడి పిఱికిపాఱుదురు
పాంచభౌతిక దేహపటిమ క్షీణించు
ధైర్యంబు తగ్గు నుత్సాహంబు ఉడుగు
వయసు విహీనవేళ వచ్చునా బలిమి
కీర్తి కెఱనను నపకీర్తికి నైన
బాలురపై నుండు భార మంతయును.

(పల్నాటివీరచరిత్ర)

సాహిత్యోపాసనమునందు శ్రీనాథునకును, పోతనామాత్యునకును గల లక్ష్యభేదము వారి ప్రతిభావిశేషములను సార్థకము చేసినది. శ్రీనాథుని లక్ష్యము పోతనామాత్యుని లక్ష్యమువలె విశాలమును, విశుద్ధమును, పరమార్థబోధకమును గాక సంకుచితమును, సంకీర్ణమును, సామాన్యమును నగుటచే కావ్యప్రయోజనమును సామాన్యముగఁ బరిణమించినది.

## 5

# మధ్య యుగము

## (1450 - 1700)

### ప్రబంధ యుగము—స్వతంత్ర యుగము

వాఙ్మయము ప్రజాజీవనమునకు ప్రతిబింబము. ప్రజాశయములు, ప్రజాభీష్టములు, ప్రజాశీలము, ప్రజాహృదయము వాఙ్మయమునందు గోచరమగుచుండును. సంస్కృతవాఙ్మయము సామాన్యముగ మతవాఙ్మయము. సంస్కృత వాఙ్మయాధారమున నభివృద్ధిని బొందిన దేశభాషావాఙ్మయములును సామాన్యముగ మతవాఙ్మయములుగ వెలసినవి. ఆంధ్రవాఙ్మయము ముఖ్యముగ నాదియుగము నందు మతధర్మాధారమున నభివృద్ధిని బొందినది. ఆంధ్రవాఙ్మయమున కమూల్యాలంకారములైన భారత భాగవత రామాయణములాంధ్రవాఙ్మయతత్త్వమును నిర్ధారణ చేసినవి. ఆంధ్రవాఙ్మయరచనలందు నేటికిని నన్నయ తిక్కన పోతనాదుల మహత్త్వము నిలిచి యున్న విధమును వాఙ్మయస్వరూపములు విశదము చేయుచున్నవి. మధ్యయుగము స్వతంత్ర యుగముగ బరిగణింపబడుచున్నను ఆదియుగ స్వరూపములు స్థిరతరములైన విధమును ప్రబంధయుగ వాఙ్మయము విశదము చేయుచున్నది.

నన్నయ తిక్కన పోతనాదికవులు సంస్కృతగ్రంథములను తెనిగించుట యందు వారి కవిత్వమహత్త్వమును వెల్లడిచేసినను వారి రచనలందు చిత్రకథా కల్పనలకును, రాజస శృంగారమునకును నవకాశములు లేవు. కావ్యమునకు పరమ ప్రయోజనములైన విశ్వకల్యాణము, రసానందమును బ్రహ్మానందమునందు ప్రత్యక్షమగుచున్నవి. బ్రహ్మదీక్షాపరాయణులైన మహాత్ములు విశ్వకల్యాణప్రదములైన కావ్యములను రచించి పరమానందమును గలుగజేయుదురు. తిక్కన, పోతనలు దివ్యగుణ సంకీర్తనమునందు భాగవత భక్తి రసపరమైన కావ్యరసానందమును గలుగజేసిరి. అగమ్యమైన జీవయాత్రయందనన్యమైన భక్తి ఆనందరసానుభవమునకు సాధనముగ నున్నది. అనన్యమైన భక్తి సంసారప్రవృత్తియందు, నానావిధములైన యవస్థలందు నానావిధమైన రసానందమును గలుగజేయుచు విశ్వకల్యాణమునకు సాధనమగుచున్నది. సకల రసములకును స్థాయిభావము శాంతరసమునందు గలుగుచున్నది. శృంగార శాంత వీరకరుణాది రసానందమునకును స్థాయిభావము శాంతరసమునందు గలుగుచున్నది. విశ్వప్రవృత్తియందు సాత్త్వికరసానందము దుఃఖనివృత్తికిని సుఖప్రాప్తికిని, రాజసతామసరసానందము సుఖారాధనమునకును దుఃఖమునకును సాధనమగుచున్నవి. వేదపురాణేతిహాసములందుఁ బ్రతిపాదితమైన సాత్త్విక శృంగారము ప్రబంధములందు రాజసతామస శృంగారరూపములను దాల్చినది. అప్సరసలు, వారాంగనలు నాయికలై, మాయాగంధర్వులు నాయకులై శృంగార రసము కేవలము కామపరమైనది. ఇది కాలమహిమ.

పదునాల్గవ శతాబ్దారంభమునందు మహమ్మదీయ విజయములు, హిందూదేశమునందు ధర్మపరివర్తనమును గలుగజేసినవి. చాళుక్యరాజులు భారత రచనమూలమున వైదికధర్మ సంరక్షణమును జేయుటకు జేసిన ప్రయత్నములు మొదట ఫలవంతములైనను కాలక్రమమున నిర్వీర్యములైనవి. పదునాల్గవ శతాబ్దారంభమునందు కాకతీయరాజ్యక్షయము వైదికధర్మ ప్రాబల్యము నాంధ్రదేశమునందు కృశింపజేసినది. బసవేశ్వరమతమును వైదికమత ధర్మమును శిథిలము చేయుటకు వినియోగపడినది. పదునైదవ శతాబ్దమునందు సంప్రాప్తమైన మహమ్మదీయ రాజ్యస్థాపనము దక్షిణదేశమునందును వైదికమతమునందు బరివర్తనమును గలుగజేసినది.

మహమ్మదీయ విజృంభణమును ఉత్తరహిందూస్థానమునందు రాజపుత్రవీరులు ప్రతిఘటించిన విధమునసే దక్షిణదిగ్భాగమునందును నాంధ్రవీరులు ప్రతిఘటించుటకు బూనుకొనిరి. విద్యారణ్యస్వాముల సహాయమున హరిహరరాయలు, బుక్కరాయలు స్థాపించిన విజయనగరసామ్రాజ్యము వైదిక మతోద్ధరణమునకు కొంతవరకు వినియోగపడినను, హిందూసంఘమునందు బరివర్తనమును గలుగజేసినది. ఆ పరివర్తనము ప్రజాజీవనమునకు ప్రతిబింబమైన వాఙ్మయమునందు గోచరమగుచున్నది.

మహమ్మదీయ రాజ్య వైభవములు, సమాజాలు హిందూసంఘమునందును, మతధర్మమునందును మహాపరివర్తనమును గలుగజేసినవి. మతధర్మమునందు వైరాగ్యభావము ఉప్తమై భోగాభిలాష వర్ధిల్లినది. కర్మమార్గము శిథిలమై భక్తిమార్గము ప్రబలినది. సాత్త్విక శృంగారరస మస్తంగతమై రాజసతామసశృంగారరసములు ప్రబలినవి. విజయనగర సామ్రాజ్య విజయములు రాజస తామస శృంగార రసములను పోషించిన విధము నా కాలపు వాఙ్మయము విశదము చేయుచున్నది. విజయనగరాధీశులు పండితులను, కవులను, కళలను పోషించి ఆంధ్రవాఙ్మయమునకు నూతనవికాసమును గలుగజేసిన విధమును విజయనగర సామ్రాజ్య చరిత్ర విశదము చేయుచున్నది.

విజయనగర సామ్రాజ్యాధీశులందు ప్రతిభాశాలియైన శ్రీకృష్ణదేవరాయల కాలమునం దాంధ్రవాఙ్మయమునకు గలిగిన మహావికాస మాంధ్ర సాహిత్య హృదయమును పరిస్ఫుటము చేసినది. పెద్దన కృతమైన మనుచరిత్ర మాంధ్రవాఙ్మయ వికాసమునందు స్వతంత్ర యుగ వాఙ్మయ స్వరూపస్వభావములను దెలుపుటకు బరమ ప్రమాణముగ నున్నది. శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయములు, విజయనగరవైభవములు, శృంగారవిలాసములు, ధర్మసంస్థాపనలు, మహోత్సవములు, విద్యావినోదములు ప్రజల ధర్మప్రవృత్తియందు భావపరివర్తనమును గలుగజేసినవి. దేశమునందును, సంఘము నందును, ధర్మము నందును గలిగిన భావపరివర్తనము వాఙ్మయమునందు గోచర మగుచున్నది. స్వారోచిష మనుసంభవమునందు విజయనగర సామ్రాజ్య ప్రతిభయు, శ్రీకృష్ణదేవరాయల ప్రతిభయు సూచితమై యుండును.

శా. హిందూరాజ్యరమాధురంధరభుజాహ్రామణి కంచుక
త్కుందస్వచ్ఛయశోగుళుచ్ఛ యవనక్షోణీధవస్తాపనా
మందీభూతకృపాకటాక్ష యుసత్పన్మాద్యత్కళింగాంగనా
బందిగ్రాహవిగాహితోత్తరకకుబ్జాటీపవాటీతవా.

మనుచరిత్రకుఁ గృతికర్తయైన పెద్దనామాత్యుడు వైదికధర్మ పరాయణుడు; కృతిపతియైన శ్రీకృష్ణదేవరాయలు రాజనీధర్మ పరాయణుడు. వైదికపరమైన కర్మమార్గమునకును, వైదికపరమైన భక్తిమార్గమునకును నిత్యజీవనమునందు ధర్మప్రవృత్తియందు సంరంభ సాహచర్యములు ప్రబలినవి. నిరంతరసంగ్రామములు, సంగ్రామ సంప్రాప్తములైన భోగభాగ్యములు ప్రజాజీవనమునందు నూతన సంచలనమును గలుగజేసినవి. ప్రజాహృదయము నందు గలిగిన నూతన సంచలనమును ధర్మపరివర్తనమును వాఙ్మయహృదయము నందు ప్రతిబింబించుచున్నది.

ఆంధ్రవాఙ్మయ చరిత్రయందు మనుచరిత్రతో నారంభమైన ప్రబంధ యుగము స్వతంత్రయుగమైనను అనుకరణయుగముగ బరిణమించినది. ప్రబంధములకు శిరోభూషణమైన మనుచరిత్రయందే అనుకరణ బీజములు గోచరమగుచున్నవి. కథ, భావములు, వర్ణనలు, పద్యములు, శైలి పూర్వోదాహృతము లైనను కావ్యనిర్మాణము నందు మనోహరములైన నవీనరూపము ను దాల్చినవి. పెద్దనార్యుడు మనుచరిత్రమున "శిరీషకుసుమ పేశల సుధామయోక్తులను" రచియించి తెలుగుతియ్యదనమును ప్రత్యక్షము చేసెను. ఆంధ్ర సాహిత్య రసమును తన మనుచరిత్రయందు మూర్తీభవింప జేసిన పెద్దనామాత్యుడు 'ఆంధ్రకవితా పితామహుడు' అను సార్థకనామధేయుడు.

ప్రవరాఖ్యుడు శ్రోత్రియ బ్రాహ్మణుడు, గృహమేధి. వరూధిని, కామాసక్తయైన అప్సరస. ప్రవరాఖ్య వరూధినుల సంభాషణలు సంఘము నందు పురుషార్థములకు ప్రవర్తమానమయ్యెడి సంఘర్షణను విశదము చేయుచున్నవి. చిరకాల సంరక్షితమైన వైదిక కర్మానుష్ఠానమునకు జడచ్యుతి గలిగినది. వైదికకర్మపరాయణత్వమును పెద్దనార్యుడు ప్రవరాఖ్యుముఖమున ప్రతిపాదించెను, వరూధినీ మనోరథాదుల ముఖమునను, గంధర్వమనువుల ముఖమునను వర్ణించిన రాజశృంగార విలాసములు వైదికమత విలయమునకు నిదర్శనములు. మహమ్మదీయ రాజ్య విజృంభణము హిందూమత సంఘము నందు పరివర్తనమును గలుగజేసినది. మహమ్మదీయప్రభువుల భోగపరాయత్వము హిందూ ప్రభువులను భోగపరాయణులను జేసినది. మహమ్మదీయ ప్రభువుల పోషపద్ధతులు బహుభార్యాగ్రహణము, కామారాధనము హిందూ ప్రభువు లావరించినవి. మహమ్మదీయుల సమాజులు, ప్రార్థనలు కర్మ మార్గమును శిథిలము చేసి భాగవతభక్తిని, భాగవత సంకీర్తనములను ప్రజ్వరింపజేసినవి.

విజయనగరసామ్రాజ్యమునందు వీరాగ్రేసరుల శౌర్యప్రతాపములు, కవీశ్వరుల కావ్యసంపదలు, వారాంగనల శృంగారవిలాసములు, శ్రోత్రియుల వైదికసిద్ధాంతములు, దేశికాచార్యుల విశిష్టాద్వైత సిద్ధాంతములు, శిల్పాచార్యుల కళాదక్షత్వము, గాయకుల శ్రావ్యగీతములు, హిందూరాజుల ధర్మరక్షణ పరత్వము, ప్రజల స్వదేశ స్వధర్మ స్వభాషాభిమానము విలాసవంతము లైనవి. ఆ మహావిలాసములను పెద్దనామాత్యుడు స్వారోచిషమనుసంభవమునందు హృద్యముగ చిత్రించెను. దురవస్థలకు లో నగుచున్న వైదిక విజ్ఞానమును దక్షిణాపథమునందు సంరక్షించుటకు శ్రీకృష్ణదేవరాయలు కంకణము గట్టుకొనెను. పెద్దనామాత్యుడు స్వారోచిష మనుసంభవమునం దీ మహాఫలమును సంభావించెను. కాని, వైదిక విజ్ఞానము నావహించిన మహాప్రతిబంధకములను సంభావించుట మహాకవియైన పెద్దనామాత్యునకును సాధ్యము గాకపోయినది. మనుచరిత్రయందలి కథాప్రవృత్తియే కావ్యప్రయోజనమును సంకుచితము చేయుచున్నది.

విస్తృతియున్నను సాధనమైన కావ్యప్రయోజనమును రాజాశ్రయము సంకుచితము చేసినది. శుద్ధశ్రోత్రియుడైన ప్రవరాఖ్యుడు నిమిత్తమాత్రుడు. శిష్టాచారపరాయణుడైన ప్రవరాఖ్యుడు నిరవలంబనుడు, నిస్సహాయుడు. ప్రవరాఖ్యుడు ప్రకటించిన ప్రధానమైన శాంతరసమునకు గావ్యమునం దప్రధానస్థానమును, వరూధిని వరించిన కామాయత్తమైన శృంగారరసమునకు ప్రధానస్థానమును గలిగినవి. ఇందువలననే కవి "బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అని వ్రాయవలసి వచ్చినది. కావ్య మంతయు గామపరమై కావ్యప్రయోజనమును సంకుచితము చేసినది. తిక్కనపోతనాదుల వలె పెద్దన కావ్యనిర్మాణమునకు పరమార్థమును సంకల్పించియుండలేదు. రాజాశ్రయమును, ప్రజాదరణమును నుదారమైన కావ్యప్రయోజనమును దుస్తరము చేసినవి. భావసంశుద్ధి దుస్తరమై కావ్యప్రయోజనము సంకుచితమైనను పెద్దనామాత్యు డాంధ్ర కవితా పితామహు డను ప్రసిద్ధిని బడసినాడు.

మనుచరిత్ర స్వతంత్రకావ్యము. ఈ కావ్యమునందు సంస్కృతాంధ్ర సాహిత్యములు సమ్మేళనమును బొంది ఆంధ్రసాహిత్య స్వరూపము పరిస్ఫుటమైనది. కథ పురాణగాథయైనను కథాసందర్భములు ప్రజాజీవనమునకు ప్రతిబింబములు. ఆంధ్రభోజుడు కృతిపతి. ఆంధ్రశ్రోత్రియుడు కృతికర్త. ఆంధ్రసాహిత్యము కావ్యహృదయము. ఆంధ్రభాషామాధుర్యము, తెనుగుపదముల లాలిత్యము, తెలుగు రీతులు, ఆంధ్రహృదయ సౌహార్దము కావ్యమునందు విలసితములు. పెద్దనామాత్యు డాంధ్రవాఙ్మయమునుండి రసభావములను, లలిత పదములను, తెలుగు సాహిత్యమును, తెలుగు ఛందస్సులను క్రోడీకరించి మనోహరముగ మనుచరిత్రయం దమర్చి ఆంధ్రకవితా పితామహుడని పేరొందెను. ఆ కవితామాధుర్యమును కావ్యాలంకారములైన భావములు, పద్యములు తెలుపుచున్నవి.

సీ. తెలఁగుల పున్నె తంగేటిజున్ను గృహమేధి
యజమాను డంకస్థితార్థపేటి
పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు
దొడ్డిఁ బెట్టిన వేల్పుగిడ్డి కాపు
కసవేని యమృతంపు నడబావి సంసారి
సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశపథమధ్యమప్రవ కులపతి
యాకటఁ గొదవు సస్యము కుటుంబి
బధిరపంగ్వంధభిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజకాతిథి క్షపణకావ
ధూతకాపాలికాద్యనాథులకు గాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్ను దన్ని సుధాబ్ధి
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిఁ బుట్ట జంత్రగాత్రముల రాగ్గరగించు
విమలగాంధర్వంబు విద్య మాకు
ననవిల్తుశాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోఁ బెట్టినది మాకు
హయమేధరాజసూయము లనఁ బేర్పడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకు
గనకనగసీమఁ గల్పవృక్షములనీడ
బచ్చరాపట్టుగమి రచ్చపట్టు మాకు
బద్మసంభవ వైకుంఠ భర్గ సభల
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర.

సీ. కొనఘు నామినిగోన్ప్ర ప్రౌఢముల్లైన
యురుటాణావుల తెప్పతుడల నాని

## మధ్యయుగమునందలి ప్రసిద్ధ కవులు, వారి గ్రంథములు—క్రీ. 16 మొదలు 18-వ శతాబ్దము వఱకు

| క్రమ సంఖ్య | కవి పేరు | కవి కాలము* | గ్రంథము పేరు | గ్రంథ విభాగము | విశేష విషయము |
|---|---|---|---|---|---|
| 1 | పిడుపర్తి సోమనాథుడు | 1510– | బసవపురాణము | పురాణము | |
| 2 | పిడుపర్తి బసవకవి | 1520 | ప్రభులింగలీల | ,, | |
| 3 | కృష్ణదేవరాయలు | 1510–1530 | ఆముక్తమాల్యద | ప్రబంధము | |
| 4 | అల్లసాని పెద్దన్న | 1510–1535 | స్వారోచిష మనుచరిత్రము | ,, | |
| 5 | నంది తిమ్మన | 1510–1526 | పారిజాతాపహరణము | ,, | |
| 6 | ధూర్జటి కవి | 1520–1530 | కాళహస్తిమాహాత్మ్యము | ,, | మాహాత్మ్యము |
| 7 | తెనాలి రామలింగకవి | 1525–1560 | ఉద్భటారాధ్య చరిత్ర | ,, | |
| | | | పాండురంగమాహాత్మ్యము | ,, | మాహాత్మ్యము |
| 8 | నాదెండ్ల గోపన్న | 1517–1526 | కృష్ణార్జున సంవాదము | ద్విపదకావ్యము | |
| 9 | సంకుసాల నృసింహ కవి | 1525– | కవికర్ణ రసాయనము | ప్రబంధము | |
| 10 | మాదయగారి మల్లన్న | 1517–1526 | రాజశేఖర చరిత్ర | ,, | |
| 11 | చింతలపూడి ఎల్లకవి (రాధామాధవకవి) | 1520–1540 | రాధామాధవము, | ,, | |
| | | | తారకబ్రహ్మరాజీయము | వేదాంతము | |
| 12 | కుమ్మరమొల్ల | 1526– | రామాయణము | ఇతిహాసము | |
| 13 | అయ్యలరాజు రామభద్రుడు | 1530–1570 | సకలకథాసారసంగ్రహము, | పద్యకావ్యము | |
| | | | రామాభ్యుదయము | ప్రబంధము | |
| 14 | దోనూరి కోనేరుకవి | 1547–1565 | బాలభాగవతము | పురాణము | |
| 15 | అద్దంకి గంగాధరకవి | 1550–1580 | తపతీసంవరణము | ప్రబంధము | |
| 16 | పొన్నికంటి తెలగన్న | 1550–1580 | యయాతి చరిత్ర | ,, | |
| 17 | శంకరకవి | 1550–1581 | హరిశ్చంద్రోపాఖ్యానము | ,, | |
| 18 | తెనాలి అన్నయ్య | 1565– | సుదక్షిణా పరిణయము | ,, | |
| 19 | పింగళి సూరన్న | 1560– | కళాపూర్ణోదయము, | ,, | |
| | | | ప్రభావతీ ప్రద్యుమ్నము, | ,, | |
| | | | రాఘవ పాండవీయము | ,, | శ్లేషకావ్యము |
| 20 | రామరాజభూషణుడు | 1560– | వసుచరిత్ర, | ప్రబంధము | |
| | | | హరిశ్చంద్రనలోపాఖ్యానము | ,, | శ్లేషకావ్యము |
| 21 | మల్లారెడ్డి | 1550–1600 | షట్చక్రవర్తి చరిత్ర | ,, | |
| 22 | మట్ల అనంతభూపాలుడు | 1570–1610 | కకుత్స్థవిజయము | ,, | |
| 23 | సారంగు తమ్మయ్య | 1590–1620 | వైజయంతీవిలాసము | ,, | |
| 24 | చేమకూర వెంకటకవి | 1630– | విజయవిలాసము | ,, | |
| | | | సారంగధర చరిత్రము | ,, | |
| 25 | వెంగళపూడి కృష్ణకవి | 1690–1717 | వేదాంతసారసంగ్రహము, | వచనము | వేదాంతము |
| | | | మాలినీమాధవీయము | ప్రబంధము | |
| 26 | కుందుర్తి వెంకటాచలకవి | 1690–1717 | మిత్రవిందాపరిణయము | ,, | |
| 27 | సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు | 1690–1717 | అహల్యాసంక్రందనము | ,, | |
| | | | రాధికా సాంత్వనము, | ,, | |
| | | | సారంగధర, | వచనము | చరిత్రము |
| | | | జైమినిభారతము | ,, | |
| 28 | వక్కలంక వీరభద్రకవి | 1720– | వాసవదత్తాపరిణయము | ప్రబంధము | |
| 29 | ఏనుగు లక్ష్మణకవి | 1760– | రామవిలాసము | ,, | |
| 30 | అడిదము సూరకవి | 1750– | కవిజనరంజనము, | పద్యకావ్యము | లక్షణగ్రంథము |
| | | | ఆంధ్రచంద్రాలోకము, | ,, | ,, |
| | | | ఆంధ్రనామశేషము, | ,, | నిఘంటు |
| | | | కవిసంశయవిచ్ఛేదము | ,, | |
| 31 | కస్తూరి రంగకవి | 1736–1761 | ఆనందరంగరాట్ఛందస్సు | ,, | లక్షణగ్రంథము |
| 32 | అబూరి కుప్పకవి | 1765–1788 | ఆచార్యవిజయము, | ,, | |
| | | | పరమభాగవత చరిత్ర, | ,, | |
| | | | ఇందుమతీ పరిణయము, | ,, | |
| | | | రామాయణభాగవతములు | ప్రబంధము | |
| 33 | ముద్దుపళని | 1790– | రాధికాసాంత్వనము | ,, | |

* ఈ పంక్తిలోని సంవత్సరములు కవి యున్న కాలమును ఉజ్జాయింపుగా తెలియజేయును. ఇవి ప్రధానముగ శ్రీ. శ్రీ. కందుకూరి వీరేశలింగము పంతులుగారి కవుల చరిత్రమునుండి గ్రహింపబడినవి.

పంతసంబున ముఖాబ్జమునందు గిరుసవ్వు
కందళింపక యుండ డిండుపఱచి
బింగారు పై బోచు శృంగారకోట్ల
తమిఁ దెచ్చికొను పాగ్గ్యమున దాచి
పాపము రసావేశమున వచ్చు పర్నోక్తు
లాదవి నాలుకకు రాకుండఁ గ్రుక్కి

మస్తకము వాంచి యుసురని పరానముద్ర
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచికొంత
సేపు వెడవెడ చింతించి శిర సాకింత
యెత్తి సన్నంపుటెలుగుతో నిట్టులనియె.

సీ. నను నిముసంబు గానకయున్న మారెల్ల
నరయు మజ్జనకుఁ డెం తడలునొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలు వెళ్లనీక న
న్నేమెడు తల్లి యెంతేడలునొక్కొ
యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందునొక్కొ
గీడఁ బోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకు నెంత చింతింతు రొక్కొ

యతిథిసంతర్పణంబు లేమయ్యెనొక్కొ
యగ్ను లేమయ్యెనొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ కినుక నిట్లు
పాపివై చితె మిన్నులు పడ్డచోట!

(మను)

## వ సు చ రి త్ర

రామరాజభూషణుడు మనుచరిత్ర ననుకరించిన విధమును వసుచరిత్ర విశదము చేయుచున్నది. భావనాశక్తియందలి లోటును పదముల పొందిక కప్పుచున్నది. కావ్యము శ్లేషాలంకారమున కాలవాలమై శ్లేషప్రబంధరచనలకు మాతృకయైనది. వసుచరిత్ర హృద్యములైన పద్యములతో నిండియున్నను కావ్యప్రయోజనము సంకుచితమైనది. శబ్దాలంకారములు శ్రావ్యములై, మనోహరములై యానందదాయకములైనను కావ్యమునకు బరమార్థమైన ఆత్మానందమును సంకుచితము చేయుచున్నవి. చిత్తప్రవృత్తి ప్రధానమైన భావమునందు [illegible]ముగాక అప్రధానమైన భాషయందు లగ్నమై కావ్య ప్రయోజనము పరిమితమగుచున్నది. రామరాజభూషణుని రచనయందు సరసముగను, [illegible]ముగను వినిర్మితమైన శ్లేషకావ్యము కాలక్రమమున, ప్రబంధకవుల హస్తములందు విరసమును, క్లిష్టమును నై, వాఙ్మయప్రాదయమును నష్టింపజేసినది. మహాకవియైన రామరాజభూషణుడు శ్లేషాలంకారములను మనోహరముగ రచించినను సామాన్యకవుల రచనలందు శ్లేష కావ్యములు నీరసములైనవి. వసుచరిత్రశైలి శ్లేషాలంకారములతో నిండియున్నను, మనోహరమై, ఆంధ్రవాఙ్మయమునకు అమూల్యాలంకారముగ నున్నది.

సీ. మును సుమనోరాగమున వసంతము సూపఁ
గానవేందిర యశోకంపుఁగొమ్మ
కాకొమ్మ నగుచు నెయ్యమునఁ గ్రొన్ననతేనె
మెలఁగెడు సరసాళివిభాదఁ జల్లె
నాసరసాళి సోయగపుబాటలతోడ
జని మాధవి ప్రవాళశాటిఁ దుడిచె
నామాధవి సరాగ మక్తిరాగము మించ
బరతెంచు కలకంఠిపై విదిర్చె
నిట్లు లతికలు హితకోటి నెనసి యపుడు
మదనదేవోత్సవక్రీడఁ బాదలు సనిన

విరులఁ దరుణులు విరులయో వరుల వఱల
విరుల వలరాచజాతరల్ సేయు [illegible]!

సీ. ఇమ్ములై మరుహజారమ్ములై పొద లుండఁ
బూజవికలు వేఱ పూనవలదు
తెప్పలై నెత్తావికుప్పలై పుప్పొళ్ళ
రుల గందవడి త్రోవఁ జలకవలదు
సారమై హిమజలాసారమై పూఁదేనె
నెఱియఁ గేళాకూళి నింపవలదు
మొత్తమై మారుతాయత్తమై గంబూర
మెగయ వితానముల్ బిగియవలదు

స్వామి యారామశుభనై భవములు చూడ
నెపుడు విచ్చేయుదురొ యంచు నెదురుసూచు
సహజసౌభాగ్యములు గూర్చి చైత్రుఁ డతడు
కూర్మి భవదీయవనపాలకుండు కాఁడె?

సీ. అడుసువెట్టదు నవ్యహరిచందనలతాంత
సరణిపై గాని యా యరుణచరణ
కేల నంటదు కోరకితపారిజాతవ
ల్లరి గాని యా యతిలలితబాహ
తనువుఁ జేర్పదు నవోదారమందారమం
జులశయ్యగాని యాసురభిళాంగి
పెదవి జేర్పదు కల్పవృతివిజఫలసంత
తియెకాని యానెహావిత్రివులాడి

గురుకులక్రమాయాత మీ గిరిజపల్లఁ
దనము ఘనమై కరాఢ్య మీతటినిపట్టి
సరసగంభీరభావంబు సహజసిద్ధ
మానలినసోదరీమణి మేనితావి.

సీ. తలయెత్తదయ్యెఁ గేవలజడస్థితి రంభ
జళుకుఁ జూపులఁ జూడసాగె హరిణి
కుందుకుందునఁ జెంది కొదఁ దెల్పె శశిరేఖ
వలవలనై వెల్లపాలెఁ దార
మఱవక పూనె మైమఱుపు వరూధిని
చెయ్యి లన్నియుఁ దక్కెఁ జిత్రరేఖ
యుచితకార్యవివేక ముడిగె మదాలస
మానె సుద్ధతభాష మంజుఘోష

తావడియె సామమతి సాంద్రతావమునఁ గ
రంగె హేమాభిధాన నిర్ఝరలతాంగు
లిట్లు దనుఁ జూచి సిగ్గుపా టొనయ వినయ
వినతయై యున్న నగరాజ తనయఁ జేరి.

## క ళా పూ ర్ణో ద య ము

ఆంధ్రవాఙ్మయమునందు రమారమి 800 ప్రబంధములు కలవు. ప్రబంధకవులందు పింగళి సూరన్న ప్రతిభావంతుడై వెలయుచున్నాడు. సూరన కృతములైన గ్రంథములందు కళాపూర్ణోదయము కథాకల్పనయందును, భావనాశక్తియందును, భాషాసౌష్ఠవమునందును, రసపోషణమునందును నిరుపమానముగ నున్నది. ఆంధ్రసాహిత్యమును పరిస్ఫుటము చేసిన కవులందు సూరనార్యుడు పరంజ్యోతి వలె ప్రకాశించుచున్నాడు. కళాపూర్ణోదయము భాషయందును, భావములందును ప్రజాజీవనమునకు ప్రతిబింబముగ నున్నది. సూరనార్యుడు కావ్యరచన కవసరమైన ప్రతిభను కళాపూర్ణోదయమునందును, ప్రభావతీప్రద్యుమ్నమునందును దెలిపియున్నాడు.

సీ. సొనగ ముత్తెపుసరు లేర్పాటించినలీల
  దమలోన దొరయు శబ్దములు గూర్చి
యర్థంబు వాచ్య లక్ష్య వ్యంగ్యభేదంబు
  లెఱిఁగి విస్పష్టత నొనఁగఁజేసి
ఘనభావములకు సర్షంబుగ వైదర్భి
  మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
  ప్రాణంబు లింపుగా బాదుకొల్పి

తే. యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టియర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవిత జెప్పంగ నేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగువారు గలరె?

లయవిభాతి—

చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
  గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలు పెసఁగు కప్పురపు బలుకులకుఁ గోమలత
  వెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో
మలతయును గలిగి జనముల మిగుల బెంపెసఁగు
  మలయపవనంపు గొదమలకు మధురత్వం
బలవడిన నీడు మతి కల దనఁగవచ్చుఁ గడు
  వెలయుఁ గల యీ సుకవిపలుకులకు నెంచన్.

సీ. విశ్రాంతి విరతి గావింపక సారస
  త్సాహిత్యసామరస్యంబు లెఱిఁగి
సమయంబు దప్పక శ్రవణకఠోరంబు
  లైన శబ్దముల సత్యాకులాత్మఁ
జేయక సత్పరిచితసుకుమార వా
  క్పరిణితాభిప్రాయఁ గా నొనర్చి
పదబంధశిథిలతఁ బాటిల్లఁగానీక
  యేచందములయందు నేమఱిలక

ఆ. పరఁగుకవియు దోషకరుఁడును యశము దు
గ్ధమును బడయునట్లు గానివాడు
కృతి దురావ మొదవు కీర్తియుఁ బాలు నీ
కుంట గాదు హాసయోగ్య జేయు.

సూరనార్యుడు "అపూర్వకథా సంవిధాన వైచిత్రీమహనీయంబును, శృంగార రసప్రాయంబును, బుణ్యవస్తు వర్ణనాకర్ణనీయంబును" నగు కళాపూర్ణోదయ మను మహాకావ్యము నిర్మింప గడఁగినట్లు తెలిపియున్నాడు. కళాపూర్ణోదయమునందలి కథ అపూర్వమై సంవిధానము మాత్రము క్లిష్టముగ నున్నను, రసానందమున కాలవాలముగ నున్నది. శృంగారరసప్రాయమై అపూర్వ విధానమున కావ్యప్రయోజనమును సమకూర్చుచున్నది. కళాపూర్ణోదయము నందు సంస్కృతాంధ్రసాహిత్యములు సమ్మేళనమును పొంది, ఆంధ్రసాహిత్య స్వరూపము సర్వత్ర ప్రత్యక్ష మగుచున్నది. వైదికకర్మమార్గము శిథిలమై వైష్ణవభక్తిమార్గము ప్రజాహృదయమునందు ప్రబలిన విధము సీకావ్యము తెలుపుచున్నది.

"ఏ ప్రార్థనంబునం జేసి యిప్పు డొనర్చు విశేషంబు విను మట్లు లోకానుగ్రహార్థంబుగా నేను విశ్వసవృద్ధిస్థానంబులుగా నంగీకరించిన శ్రీరంగకాంచి వేంకటాచలాహోబల పురుషోత్తమాది దివ్యస్థలంబుల కరిగి సేవింపనోపకున్నను దమయున్న చోటనే యుండి తత్తద్దివ్యదేశ నివాసు నన్ను నిజేచ్ఛానుసారంబున దలంచి కేలు మోగుచువారికి సంసారంబు సద్ధరింప జేయుదునని యానతిచ్చిన సంతసిల్లి యదియె చాలునని యమ్మహాదేవుని దీనవాత్సల్యంబు సనేక ప్రకారంబుల సన్నుతించెనని చెప్పి మధురలాలస యా కళాపూర్ణ మహారాజుం గనుంగొని యది యిప్పుడు మీర లడిగిన భవదీయ పూర్వజన్మవిరచిత లక్ష్మీనారాయణ సంవాద కథాప్రకారంబు దేవరప్రశ్న నిమిత్తంబున నిశ్శ్రేయసము లోపాయంబు దొరికె. నేడు సుదినం బయ్యె. మదీయజన్మంబు సఫలంబయ్యె నని పలికి శ్రీరంగాదిదివ్యదేశ మాహాత్మ్యంబునకు వెఱఁగందుచు నింత భక్తవత్సలుండనే యని పరమ పురుషు నఖిలలోకైకనాథు నారాయణుఁ దలంచి ప్రణమిల్లెఁ గళాపూర్ణుండును దదాదిగా సత్యాదరంబున విష్ణుసేవ గావింపుచు ధర్మమార్గంబున రాజ్యపరిపాలనంబు సేయుచుండెను."

మహాకవులు ప్రజల ప్రవృత్తిని దమ కావ్యములందు ప్రతిబింబింప జేయుచు సాహిత్యమును బురుషార్థమునకు సాధనము జేయుచున్నారు. ఈ ప్రయోజనమును సంకుచితముగనైనను సమకూర్ప గలిగిన విధమును కావ్యము నందలి పుణ్యవస్తు వర్ణనలు, కళానుసంధానమును విశదము చేయుచున్నవి.

పింగళి సూరనార్యుడు గారుడసంహితాది కృతులను, రాఘవ పాండవీయమును, ప్రభావతీ ప్రద్యుమ్నమును, కళాపూర్ణోదయమును రచియించెను. రాఘవపాండవీయము శ్లేషప్రబంధము. ప్రభావతీ ప్రద్యుమ్నము పురాణప్రసిద్ధమైన శృంగారప్రబంధము. కళాపూర్ణోదయము అసామాన్య కల్పనావిలసితమైన మహాప్రబంధము. సూరనార్యుడు కళాపూర్ణోదయ రచనయం దప్రతిమానమైన ప్రతిభను విశదము చేసెను. కథ నిర్నిద్ర సారస్య లీలాచిత్రంబై నిగూఢమైన శారదాచతుర్ముఖుల విలాసములతో నారంభమై కలభాషిణీ కళాపూర్ణుల పరిణయముతో పరిసమాప్తి నొందుచున్నది. ఉత్తర కథయందు విలసితములైన పాత్రలు భావాశ్రయములై పూర్వకథయందు విలసితములైన పాత్రలకు రూపాశ్రయములై యున్నవి. కళాపూర్ణుఁడు, మధురలాలస, బ్రహ్మ, సరస్వతి, సదాశయుఁడు, రూపానుభూతి, స్వభావుఁడు, సత్వదాత్ముఁడు మొదలగు పాత్రలు పూర్వకథయందు మణికంధరుఁడు, కలభాషిణి, మృగేంద్రవాహన, మాయారంభ, మాయానలకూబరుఁడు, సుగాత్రి, శాలీనుఁడు మొదలగు రూపములను గథాపరిణామమును బ్రత్యక్షము చేయుచున్నవి.

జీవయాత్రయందు నివృత్తిమార్గమునకును బ్రవృత్తిమార్గమునకును, భావమునకును రూపమునకును, సిద్ధాంతములకును గార్యములకును, తత్త్వమునకును కళలకును గల సంబంధము, సాహచర్యము పండితులకు నహితము సమ్మోహమును గలుగజేయుచున్నవి. కళాపూర్ణోదయము సాహిత్యమునకు గుణరూపములను సమకూర్చెడి గుణావగుణములను హృద్యముగ విశదము చేయుచున్నది.

కలభాషిణి వేశ్యబాలిక. శ్రీకృష్ణాంతఃపురమునందు సంగీతమున ప్రావీణ్యమును గడించినది. నారదుని యనుగ్రహమును బడసినది. సాహిత్యమునందును కొంత ప్రవేశమును సంపాదించినది. మణికంధరుఁడు సంగీత సాహిత్యములందు ప్రజ్ఞావంతుఁడు. కలభాషిణీ మణికంధరుల యన్యోన్యానురాగమునకు రూపగుణ సాంగత్యములు దగియున్నను నలకూబర రంభల రూపలావణ్యములు సమ్మోహమునకుం గారణములైనవి. మాయారూపములను దాల్చి కామభోగముల ననుభవించిరి. గుణభావానుభూతి రహితమైన రూపసాంగత్యము ప్రేమరసాశ్రయమైన పురుషార్థసిద్ధికి సాధనము గాఁజాలదు. నిత్యమైన భావగుణాశ్రయము పురుషార్థమునకు సాధన మగుచున్నది. మధురలాలస సదాశయుని తండ్రిగను, రూపానుభూతిని తల్లిగను, కళాపూర్ణుని పతిగను బడసి జీవయాత్రను సఫలము చేసికొనినది.

ఉ. శ్రీయుత మైన దివ్యమణి చేతికి నబ్బఁగ బాలిశవైచిత
చ్ఛాయ యొకింత యున్కిఁగని చాలఁ గృశించితి గాజుపూసకై
వాయువివేక మే మనుకొనం దుదఁ దన్మణి యబ్బె నన్నన
త్యాయతతత్త్వమాగమసుఖాప్తికి నోచమి నెంచి కుందెదన్.

సంసార ప్రవృత్తి యందు సామాన్యజనులు కళాపూర్ణులు, మధుర లాలసలు గాకపోయినను ప్రేమాశ్రయమైన సంసారసౌఖ్యముల ననుభవించగల విధమును సుగాత్రీశాలీనుల యుదంతము విశదము చేయుచున్నది. సుగాత్రి అరమర లెఱుగని ముగ్ధాంగన. శాలీనుడు పల్లెటూరి బ్రాహ్మణుడు; రసికత్వము నెఱుగని సంసారి. ప్రేమాస్పదియైన సుగాత్రి తన భర్తయైన శాలీనుని ప్రేమాభిముఖుని జేసినది. మనుచరిత్రయందు వరూధిని చూపిన కామోద్రేకమునకును, సుగాత్రి చూపిన ప్రేమోద్రేకమునకును గల భేదమును సూరనార్యుడు స్పష్టముగ సుగాత్రి ప్రవృత్తియందు వర్ణించెను. మొదటిది కామాసక్తయైన అప్సరఃస్త్రీమోహము. రెండవది సాంసారికమైన కులాంగన ప్రేమ. అభినవకౌముదికి కల్యాణుడు చూపిన కామోద్రేకము ప్రవరాఖ్యునకు వరూధిని చూపిన కామోద్రేకమువంటిదే నిష్ఫలమైనది. కామాసక్తుడైన కల్యాణుడు కామమున కాహుతి యగుట ప్రేమతత్త్వమునందు మహోన్నతమైన పరిపాకమును తెలుపుచున్నది.

కామకళామాత్రపరిణామమును సూరనార్యుడు భిన్నములైన పాత్రల రూపమున భిన్నరీతుల మనోహరముగ కళాపూర్ణోదయమునందు వర్ణించి శృంగారరసపరిణామమును బరిస్ఫుటము చేసెను. జీవయాత్రయందు శృంగార రసము మనోహరమై సుఖదుఃఖములకు గారణ మగుచున్నది. శృంగారరసము కామపరమై రూపాసక్తమైనపుడు దుఃఖము కలుగు చున్నది. శృంగార రసము ప్రేమపరమై భావాసక్తమైనపుడు సుఖము కలుగుచున్నది. కలభాషిణీ మణికంధరులు, రంభా నలకూబరులు, సుగాత్రీ శాలీనులు, అభినవకౌముదీ మణిస్తంభరులు పూర్వోత్తర కథలందు వ్యక్తము చేసిన శృంగార రసము రూప భావాశ్రయములయిన కామప్రేమల మూలమున సంసార ప్రవృత్తియందు గలిగెడి సుఖ దుఃఖములను విశదము చేయుచున్నది.

కలభాషిణి మధురలాలసజన్మము నెత్తుటకు మదాశయ రూపానుభూతుల ఫలవిత్య మవసరమైనది. మణికంధరుడు కళాపూర్ణజన్మము నొందుటకు సుముఖాసక్తి శాలినులు తల్లిదండ్రులైరి. పూర్వ కథ యందలి రూపానుభూతికిని, ఉత్తర కథ యందలి భావానుభూతికిని సంయోగము గలిగినపుడు మాయా రహితమైన శృంగార రసానందము గలుగుచున్నది. భావసౌందర్యమునకును, రూపసౌందర్యమునకును గావ్య రచనయందు సంయోగము గలుగునపుడు కావ్యానందము గలిగి కళాపూర్ణోదయము సాధ్యమగు చున్నది.

సీ. మెఱుఁగాకుముంజేయు మేనికోమలికంబుఁ
గడుదిట్టగుణము గుర్కొడు మొగంబు
పసపుగోఁచులయొప్పు బ్రహ్మతేజంబును
జారు కృష్ణాజినధారణంబు
తళుకుజన్నిదము మేధావిపొట్టును జిన్ని
పట్టవర్ధనమును జట్టితడుపు
మొలవంక యుంగరంబుల సొంపు దండపుఁ
గోలయు సన్నపు బ్రేలు సిగయు

ఆ. నొప్పు బ్రహ్మచారి యొకఁడేగుదెంచె బు
స్తకము గొంచు మిగుల సంభ్రమమున
వొఱ్ఱ యతని జూచి యోరి యేమిర, కడు
వాఁసెలచి తనియె నసిన సతడు.

సీ. లిలఁ బొత్తులమీఁద లేచి కూర్చుండుచోఁ
దద్దయు నొక క్రొత్త ముద్దు గులుకు
క్షితిమీఁద లేతకెంగే లిడి తడవుచో
మొసలిడి యొండొక ముద్దు గులుకు
వల్ల వల్లన తప్పటడుగులు పెట్టుచో
విద్దపుబు బనపర ముద్దు చెలువు

కొదలుమాటలు లేని గులుకుమూఁ బలుకుచోఁ
మోహనంబగు నెంత ముద్దు చెలువు

తే. కలిగి యాబాల నవచంద్రకళ యనంగఁ
దివుట నామనిఁ దనరు లేఁదీఁగ యనఁగ
సంతకంతకుఁ బ్రోదివే నతిశయిలుచుఁ
బరఁగెఁ జావ కుకును గనువండు వగుచు.

సీ. ఇట్లు సింగారించి యెదుట నద్దము పెట్టి
చూచుకొమ్మన లజ్జఁ జూడఁ గొంకుఁ
జెలు లెడగాఁ జన్న విలువుటద్దము చూచి
కొనగోర నటు దిద్దు కురులు విరుల
నంత నా రేతేర నెంత మూక్ష్మ గ్రాహి
యిది యంచు ముకురపరీక్ష సెఱపు
నా యలంకారరమ్యత చెదరకమున్న
యధిపుఁడు తనుఁ జూడ నాత్మఁ గోరు

తే. సిగ్గు కతమున నకియల చేర్పు నాని
చనవుఁ బరికింమతోడవుల యువిక మట్టు
మచ్చుమరలేక యుండ నేమరక యోము
మిగుల మేగరగరికె యా మెఱుఁగుబోఁడి.

సీ. తలికిక న్గాసలచూపుల పేరఁ బర్వు మ
ల్లెవు వల్లఁగల్వలు పైచి పైచి
మందహాసము లను చందనోదకములు
పలుమాఱు మోములఁ జిలికి చిలికి
హారంబు లిడుచు బాహారుచిచ్ఛలమున
భుజములందు పారిద్రఁ బూసి పూసి
శ్రుతిభూషణము లమర్చుచు హస్తకాంతి కుం
కుమములు చెక్కులఁ జమరి చమరి

ఆ. యలరఁజేయు నప్పరల సిందు ముక్తి
ప్యలను బెండ్లి యాడి బలియుచున్న
క్రొత్తపెండ్లికొడుకుఁ గొమరులనయ్యాట
లాడు తద్భావయుష్క లనఁగ.

అనంతములైన కళాతరంగములందు గావ్యకళారసానుమునఁ గాస సంఘమును గలుగ జేయుటకు పింగళి సూరనామాత్యుఁడు చేసిన మహాసంకల్పము కళాపూర్ణోదయరూపమునఁ బరిణమించినది.

సీ. కాంత మువ్విన్న యా కథ యాకథయు వాఁగ
వమ్మనాచ్యత తోఁచినట్టి నామ
జాతి క్రియాదిక సకలపదార్థవా
క్యార్థాంతరము లెవ్వి యవియ యందుఁ
గలయవి యిందుఁ దక్కటకంబు భేదంబు
పరికింపనొసరించెఁ బడసె వెలసె
వనువివి మొదలైన యట్టి భూతార్థంబు
క్రియలవట్టున నొనరించఁ బడయు

తే. నిలువు సమనివి యాదిగా గల భవిష్య
దర్థవచనంబులైన క్రియాపదంబు
లుసుమకొమటయు వానియందును దలంత
హో మహాంబువిలాస ప్రహాసివదన.

సీ. వివరింప సకలవస్తువుల ప్రసిద్ధి నా
గ్వాతముగాలంబు వాగ్గాల మెల్లఁ

దన్మయుం బిట్లుండ దనరు నీమది కవ
మ్మత మ్మైన యట్టిచి మహి వెలయునె
యీ కళాపూర్ణమహారాజకథ తావ
కీనశృంగారలీలానిమిత్త
మగుచు మన్మథజాత మగుచు నవశ్యంబు
గరము ప్రసిద్ధంబు గాఁగలయది

తే. నీకుఁ బ్రియమని వేఱె వర్ణింపనేల
నీ విపుడు పల్కువల్కు స్వాభావికంబ
పతుల యనురాగలీల లే వగిదినైన
వెలయ గోరియు దాచఁ టెంతుల గుణంబు.

ప్రతిభాశాలియైన సూరనామాత్యునకును కాలప్రభావ మలంఘనీయ మైనది. రాజాశ్రయమునకు సహజమైన శృంగారవిలాసములు కళాపూర్ణోదయమునకు గుణదోషములను గల్పించినవి. ప్రతిభాశాలియైన సూరనార్యుఁడు ఖమ్మహాకావ్యమును భావప్రబంధరూపమున రచియించి ప్రేమరసానందమును ప్రత్యక్షముచేసి యుత్తమమైన కావ్య ప్రయోజనమును సార్థకము చేసెను.

ఉ. పూర్ణ సమస్త సద్గుణవిభూషితుఁ డై పొలుపొందు నా కళా
పూర్ణు కథల్ వినం జదువఁ బొల్పుగ సంతతినై భవాదివి
స్తీర్ణశుభంబు కల్మి కడా దీవన పలు వ్రుది గల్గెఁ గాన నా
నిర్ణయ మార్యు లెల్ల మది నిల్పి వినుండు పఠింపుఁ డింపుతోన్.

ఆంధ్రసాహిత్య స్వరూపస్వభావములను నిర్మించిన కవులందు సూర నార్యుని ప్రతిభ యఖండమై వెలయుచున్నది. సరస్వతీ చతుర్ముఖుల భావ గర్భితమైన శృంగారవిలాసములు ప్రేమమయమై వెలయుచున్నవి. భావ గర్భితములైన శృంగారవిలాసములు ప్రపంచ ప్రవృత్తియందు శృంగారకళా స్వరూపమున వ్యక్తమైనపుడు కావ్యకల్పనకు సాధనము లగుచున్నవి.

వైదికవిజ్ఞానము కాలాంతరమునను, ఆగమరూపములను నారాధ్యమై పురుషార్థసిద్ధికి సాధనమైనది. ఆగమముల మూలమున వేద ప్రతిపాదిత మైన కర్మమార్గమునకును, జ్ఞానమార్గమునకును సంసారప్రవృత్తియందు సామరస్యమును గలుగ జేయుటకు భారతీయ తత్త్వజ్ఞులు చేసిన సాధనలు నిగూఢమైన కళాస్వరూపమున వెలయుచున్నవి. చతుష్షష్టికళోపేతమైన విజ్ఞానము సంసారప్రవృత్తియందు రసానందమును గలుగ జేయుచు పురుషార్థప్రదముగ నున్నది. సకల కళలును, శృంగారములును, రసములును సృష్టికర్తలైన సనాతన దంపతుల శృంగారకళావిలాసములందు సుప్రతిష్ఠితములు. భారతీయతత్త్వజ్ఞులు నిత్యమైన కళాభినివేశమునకు శ్రీవిద్యోపాసన మును సాధనముగ నేర్పరచిరి.

పూజాకల్పమునందలి నవావరణలును నవరసావరణములుగ నున్నవి. ప్రథ మావరణమునందు త్రిపురసుందరి శృంగారరసాత్మకయై సర్వసంక్షోభిణ ముద్రారూపమున వెలయుచున్నది. ధ్యానము:—

శ్లో. త్రిపురా స్ఫటికాభాసా ముక్తాదామవిభూషితా;
పుస్తకం చాక్షమాలాం చ కపాలం పద్మముత్తమమ్;
బిభ్రతీ సిద్ధయే చింత్యా మహాపాతకనాశినీ;
అభీష్టసిద్ధిం మే దేహి శరణాగతవత్సలే;
భక్త్యా సమర్పయే చాహం ప్రథమావరణార్చనమ్.

కళాపూర్ణోదయమునందు ప్రథమాశ్వాసము శృంగార రసముతో నారంభమై గ్రంథము శాంతరసముతో నంతమునొందుచున్నది. త్రిపుర సుందరి శాంతరసాత్మికయై సర్వయోనిముద్రారూపమున నవమావరణము నందు వెలయుచున్న విధమును ధ్యానశ్లోకము విశదము చేయుచున్నది.

శ్లో. యా విద్యా శివకేశవాదిజననీ యా వై జగన్మోహినీ
యా బ్రహ్మాది పిపీలికాది జగదానందైకసంధాయినీ,
యా పంచప్రణవద్విరేఫనళినీ యా చిత్కళామాలినీ
సా మాయా పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ.

ఈ సాధనములనే పింగళి సూరనార్యుడు కళాపూర్ణోదయము నందు హృద్యముగ ద్యోతకము చేసెను. కళానిర్వచనమునందు ప్రాచీనార్య సంప్రదాయములకును, వర్తమాన సంప్రదాయములకును గల భేదము కళోపాసకులును, కళావిమర్శకులును గ్రహించుట కావ్యహృదయమును గ్రహించుటకు ప్రయోజనకరము. వాగర్థముల వలెనే వాణీ హిరణ్యగర్భుల శృంగారకళాకేళులు సంసార ప్రవృత్తియందు సర్వవ్యాప్తిని గలిగియున్న విధమును కళాపూర్ణోదయము విశదము చేయుచున్నది. దివ్యమైన మణిహారము హృదయ స్పర్శనము వలన దివ్యజ్ఞానమును గలుగ జేసిన విధమున దివ్యమైన కావ్యము హృదయమునకు రసానందమును గలుగజేయుచున్నది.

సూరనార్యుడు భావగర్భితమైన సరస్వతీ చతుర్ముఖుల శృంగార విహారములతో గథ నారంభించినను కావ్య ప్రవృత్తియందుఁ గాలానుగుణమైన కాముక శృంగారరసమునకు దాసుడై కావ్యప్రయోజనమును సంకుచితముఁ జేసెను. ప్రతిభావంతుడైన సూరనార్యుడే కాలప్రవాహమునందు గొట్టుకొని పోయినపుడు సామాన్యులమాట చెప్పవలసిన యవసరము లేదు. కాముక శృంగారానుకరణము సహజమైన ఆంధ్రసాహిత్య వికాసమును స్తంభింపచేసి చిరకాలము వరకును సహజ వికాసమును దుర్లభము చేసినది.

ప్రబంధకవులందు ఆముక్తమాల్యదను రచించిన శ్రీకృష్ణదేవరాయలు, పారిజాతాపహరణమును రచించిన ముక్కుతిమ్మన్న, విజయ విలాసమును రచించిన వేంకటకవి, రాజశేఖర చరిత్రమును రచించిన కూచిమంచి తిమ్మకవి మొదలగు కవులు ఆంధ్రవాఙ్మయమునకు మనోహరాలంకారములని నవకూర్చిరి. ఈ కవుల ప్రతిభ మృదుమధుర రచనలందు గోచరమైనట్లు భావసంపద్దియందు గోచరము కాకయున్నది.

సీ. దట్టంపుఁ జెలనీటి తరఁగచాల్కడకొత్తి
నలతోలఁజగిలి దా నిలుచు టేమి
కొలఁకు, దామరగందవముల గ్రింద బడసైచి
కప్పరంపు దావిఁ దాఁ గవియు టేమి
చివురుఁబొంపపు మావిఁజేఁప నాయము సేసి
పసిఁడి యుప్పరిగఁ దాఁ బ్రబలు టేమి
విద్దెంపుటెనుముతిన్నియసాన్పు దిగఁ ద్రావి
యలరులపాన్పుఁ దా హత్తు టేమి

తే. మసమసకసంజ కెంజాయ మలఁగఁ బెట్టి
మిసిమి తెంపుల కాంతి దా మెఱయు టేమి
మొదల నే గంగతటి నున్న యదియు లేదొ
మాయయో కాక యిది యుంచు మరఁ జూడ.

ఉ. నా విని యావిలాసవ నవ్య్యముగల బటు గొంత వంది యొం
తే వాని సివ్వాలెన్ మునిఁగి యాతనిఁ జూర్చునిఁగా నొకింత మున్
భావమునం దలంచియును నమ్మక యమ్మకచెల్ల యూరకే
సేవ లొనర్చుచుంటి నని సిగ్గున దిగ్గన లేచి పోవఁగన్.

(విజయవిలాసము)

ఉ. గట్టిన చేలలుం బసిఁడి గట్టదనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన, నెందు లేని పలు పోకల వాయులు నీకు నెప్పుడో
బెట్టిన కొం చెలంగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గట్టును చేటము నిగ్గులఁ గోల్పడిపోయితి నేమి సేయుదున్.

(పారిజాతాపహరణము)

సీ. పరువంబు గాఁగ చొప్పడని మామిడి లేతలౌన నాసాన నటొప్పడునదియు,
దమకించి చిగురాకు గమిచి నోరొగ రైన
గడఁగి గొబ్బెఁగసిటఁ గడుగునదియు
నంపంగి పొదరింటిచక్కిఁ గోరఁటఁ గాంచి
యును రంతు మగిడి నోరూరునదియు
గలిగొట్టుపసరుమొగ్గలఁ గొర్కి పాలిపోయి
మునుపటి మొల్లల మూఁగునదియు

ఆ. నగుమ దేటికదుపుఁ లామనిఁ దలనూపెఁ
జావుదనుక నెల్ల చోటఁ దోట
యందు దామ యగుచు నమ్మరు నెలగోలా
హాజ లనఁగఁ జాడ్కినుండు నగుమ.

ఆంధ్రవాఙ్మయమునందు ప్రబంధవాఙ్మయము ప్రతిభాయుతమైన సరసవాఙ్మయము. కాని యనుకరణవాఙ్మయమై ఆంధ్రవాఙ్మయ ప్రవాహమును స్తంభింప జేసినది. విజయనగర సామ్రాజ్య విలయము ప్రజాప్రవృత్తిని స్తంభింప జేసినది. సాహిత్యవికాసము దుర్లభమైనది. రాజులు, జమీందారులు, శ్రీమంతులు కృతిపతులై కావ్యములను పోషించినను ప్రతిభలేని రాజ్యములవలెనే ప్రతిభలేని సాహిత్యము వెలసినది. సత్పాత్రాశయము లేని కృతిపతులు, కృతికర్తలు బాహ్యాడంబరముల నాశ్రయించి అంతరంగిక ప్రయోజనములను విస్మరించి కావ్యప్రయోజనమును నీరసము చేసిరి. భావనాశక్తి, స్వాతంత్ర్యశీలము శుష్కించి, పదముల హటాటోపము ప్రబలినది. సుప్రసిద్ధమైన వసుచరిత్రయందే అనుకరణము ప్రారంభమై కాలక్రమమున సర్వవ్యాప్తిని గాంచినది.

## 6

# శతక వాఙ్మయము

ఆంధ్రవాఙ్మయాంగములందు శతక వాఙ్మయాంగము విశేష వ్యాప్తి గలిగి పండిత పామరహృదయరంజకముగ నున్నది. పురాణములు, శాస్త్రములు, కావ్యములు, ప్రబంధములు, నాటకములు, నవలలు, కథలు వాఙ్మయాంగము లైనను ప్రధానాంగములైనను శతకాంగమువలె పండిత పామరహృదయముల నాకర్షింప జాలవు. ఆంధ్రభాషయందు మహాకవులును, సామాన్య కవులును రసభరితములైన శతకములను రచియించి వాఙ్మయ వికాసమునకు దోడ్పడిన విధమును శతకములు విశదము చేయుచున్నవి. లాక్షణికులు సామాన్యముగ శతకములను కావ్యగ్రంథములుగ బరిగణింపకపోయినను శతకవాఙ్మయము వ్యాప్తి గలిగి ప్రజాదరణమును బడసినది.

శతకార్థము:— శతపదజన్యమైన శతకపదము సంఖ్యాబాహుళ్యమును దెలుపుచున్నది. సంస్కృత, ప్రాకృత వాఙ్మయములందుగల శతపథ బ్రాహ్మణము, అవదానశతకము మున్నగు నామము లధిక సంఖ్యార్థమును విశదము చేయుచున్నవి. జపమంత్ర విధానములందు సహస్రము, అష్టోత్తరశతము నియతసంఖ్యలుగ నేర్పడినవి. శైవ పార్థివపూజాదికములం దష్టోత్తరశత సంఖ్య బహుసంఖ్యార్థమును దెలుపుచున్నది. దేవీ దేవతల యర్చనలందు సహస్రనామములను, అష్టోత్తర శతనామములను జెప్పుట సదాచారము. అక్షమాలలష్టోత్తరశతసంఖ్యగల పూసలను గలిగియున్నవి. శతకములందు సామాన్యముగను నీ సంప్రదాయసిద్ధముగను 108 పద్యము లుండును. శివతత్త్వసారము, వేమనశతకము మొదలగు శతకములు వందలకొలది పద్యములను గలిగియున్నవి. మరికొన్ని శతకములందు 100 పద్యములును గలవు. కాలాంతరమున నితర కవులు వారి సొంతపద్యములను మంచి శతకములందు జేర్చుటయు శతకపదము లందు సంఖ్యాభేదమునకుఁ గారణమై యుండును.

ఆంధ్రవాఙ్మయమునందు 1000 శతకములైనను నుండియుండును. శ్రీయుత వంగూరి సుబ్బారావుగారు 600 శతకములను జూపిరి. శతక

వాఙ్మయ చరిత్రమునందు వ్రాసియున్నారు. ఎన్నియో శతకములు నష్టమైనవియు, నజ్ఞాతములైనవియు గలవు. కవిత్వ ధోరణిగల కవులు ప్రబంధాదికృతి నిర్మాణములకు బూర్వము శతకములను రచియించుట సామాన్యము. శ్రీనాథ పోతనాది మహాకవులును శతకములను రచియించినటులు ప్రతీతి గలదు.

శతకములందు శృంగార హాస్యనీతిపరములైన శతకములు కొన్నియున్నను భక్తి శతకము లధికముగ నున్నవి. కవులు తమ యిష్ట దేవతా స్తవపరములైన శతకములను రచియించి కవితాకన్యక నీశ్వరార్పణము చేయుట సంప్రదాయ సిద్ధముగ నున్నది. శ్రీ రామశతకములు, కృష్ణశతకములు, శివపరములైన శతకములు, దేవీపరములైన శతకములు శతక వాఙ్మయమునందు విశేషముగ గలవు. వేమనశతకము, సుమతిశతకము, కుమారీశతకము మొదలగు నీతిశతకములు గలవు. వేణుగోపాల శతకము, మల్లికార్జున శతకము మొదలగు శృంగార భక్తి శతకములు గలవు. శృంగారశతకములు ప్రబంధ సంస్కారమునకు ఫలములై యున్నవి. వీర శృంగార భక్తి రస సమ్మిళితములైన శతకములు గలవు. ఆంధ్ర వాఙ్మయమునందు వేలకొలది శతకములు పుట్టినను శతకము లనేకములు నష్టమైనవి.

ఆంధ్రశతకముల వ్యక్తిత్వము:— ఆంధ్రశతక వాఙ్మయమునకు ప్రాకృత, సంస్కృత శతకవాఙ్మయములు మూలాధారమైనను నీ వాఙ్మయాంగవికాసము ప్రత్యేక వ్యక్తిత్వమును గలిగియున్నది. ఆంధ్రశతకములకు మకుటము ప్రధానముగా నున్నది. సామాన్యముగ మకుటమే శతకనామమును దాల్చుచున్నది. దాశరథి, కాళహస్తీశ్వర, రంగశాయి, రామతారక, సుమతి, వేమనాది శతకముల మకుటము లాంధ్రశతకముల స్వరూపమును విశదము చేయుచున్నవి. భక్తిశతకములందు మకుటము లిష్టదేవతాపరములై యున్నవి. ధూర్జటి కాళహస్తీశ్వరుని, సోమనాథుడు బసవేశ్వరుని, అన్నమయ్య సర్వేశ్వరుని, గోపన్న శ్రీ భద్రాద్రిరాముని, పోతరాజు శ్రీమన్నారాయణుని దమ శతకములందు సంబోధించి మకుటరూపమైన శతక నామకరణమును జేసిరి. వేమన, సుమతి, కుమారి మొదలగు నీతిశతకముల మకుటములు భావార్థపరములుగ నున్నవి. నారాయణాది శతకములందుగల ఆదిదశకాది శతకవిభాగము లును వాంధ్ర శతకముల వ్యక్తిత్వమును దెలుపుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునందు శతకాంగము ప్రముఖాంగముగ నున్నను కావ్యాంగములయందు సందిగ్ధాంగముగ నున్నది.

కావ్యాంగములు:— లాక్షణికులు కావ్యాంగములయందు బహుసేతిహాస ప్రబంధ నాటకాదుల కొసగిన ప్రాముఖ్యమును శతకముల కొసగియుండలేదు. అప్పకవి శతకములనుండి కావ్యలక్షణముల కుదాహరణములను సంగ్రహించెను. అప్పకవి, చిన్న కోట పెద్దన్నగారలు శతకములను క్షుద్ర కావ్యములందు జేర్చిరి. అనంతామాత్యుడు శతకములను చాటుప్రబంధములందు జేర్చెను. కవిచరిత్రకారులు శ్రీ గురజాడ శ్రీరామమూర్తి, వీరేశలింగము పంతులుగార్లు కవుల చరిత్రములందు శతకముల ప్రశంసను జేసియుండలేదు. శతకములు లక్షణ గ్రంథములందు ప్రవేశమును గాంచకపోయినను ప్రజాహృదయమునందు స్థిర ప్రవేశమును గాంచిన విధమును శతకముల సంఖ్య, శతకకర్తల నామములు, శతకముల ప్రచారము విశదము చేయుచున్నవి.

కావ్యాంగములను నిర్ణయించుటయందు శతకాంగమును నాంగ్లకావ్య సంప్రదాయానుసారముగ నిర్ణయించుట యాంగ్ల విద్యా శిక్షితుల కావారమైనది. శతకకవుల చరిత్రను రచియించిన కీ. శే. వంగూరి సుబ్బారావుగారును నీమార్గము నవలంబించి శతకములు భావగీతములు (Lyrics) అను కావ్యాంగమునకు జేరునటుల నిర్ణయించిరి. ఈ నిర్ణయ మాంధ్రకావ్య సంప్రదాయములకు సమన్వితము గాక సందిగ్ధముగ నున్నది. శతకవాఙ్మయమును నాంధ్ర వాఙ్మయమునకు బరిచితమైన ద్రాక్షకావ్య విభాగమునందు జేర్చుటయే భావ్యముగ నుండును. నీతిశతకములందు విషయసమన్వయము లేకపోయినను భక్తిశృంగార శతకములందు విషయసమన్వయమును, భావసమన్వయమును గలవు. శతక వాఙ్మయము లాక్షణికుల యాదరణమును బడయుత పోయినను ప్రజాదరణమును బడసిన విధమును వాఙ్మయ వ్యాపనము విశదము చేయుచున్నది. భక్తిశతకములు, నీతి శతకములు, శృంగార శతకములు ప్రజాజీవనమును రసవంతము చేయగల విధమును శతకముల యాదరణము దెలుపుచున్నది.

భక్తిశతకములు:— మానవులకు సకలార్థములందును భక్తి తరణోపాయమునకు సాధనముగ నున్నది. పితృభక్తి, మాతృభక్తి, పతిభక్తి, గురుభక్తి, దేశభక్తి, దైవభక్తి మహత్తరమైన భక్తికి భిన్న రూపములు. భక్తులు తాము తరించి లోకమును తరింపజేయుచున్నారు. శ్రీరామచంద్రుని పితృభక్తి, సావిత్రి పతిభక్తి, ప్రహ్లాదుని దైవభక్తి భక్తిప్రభావమునకు నిదర్శనములు. అనన్యమైన భక్తి యిహపరలోక సౌఖ్యములకు బరమసాధనము. దైవానుగ్రహమును బడయుటకు భక్తియోగము పరమసాధనముగ నున్నవిధమును భక్తుల చరిత్రలు తెలుపుచున్నవి. పండితులకు సాధ్యముగాని పరమపదము భక్తులకు సులభసాధ్యముగ నున్నది. వ్యాసులు జ్ఞానసాగరమైన భారతరచనానంతరము మోక్షప్రాప్తికి భక్తిసాగరమైన భాగవతరచనను జేసిన యితిహాస వృత్తము భక్తి ప్రభావమును దెలుపుచున్నది. విశ్వరూప సందర్శనమున కనన్యమైన భక్తియే సాధనమని శ్రీకృష్ణభగవానుడు ప్రియభక్తుడైన యర్జునున కుపదేశించెను.

శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!

శ్లో. మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ!

భాగవత భక్తిభరితమైన ఆంధ్రహృదయ బృందావనమునకు శతకములు సహజఫలములుగ నున్నవి. భక్తిరసభరితములైన శతకముల వాంధ్ర కవులు హృద్యముగ బాడి ప్రజాహృదయములందు భక్త్యుత్సాహములను బ్రజ్వలింప జేయగలిగిరి. రామదాసుగారి దాశరథిశతకము, ధూర్జటి కాళహస్తీశ్వర శతకము, పోతనామాత్యుని నారాయణశతకము, సుబ్బారాయుడుగారి భక్తచింతామణిశతకము మొదలగు భక్తిభరితములైన పెంపలకొలది శతకము లాంధ్రభక్త హృదయమును వివశము చేయుచున్నవి. శతకములు పండితపామర హృదయములందును, బాలవృద్ధ హృదయములందును గలుగజేయగల భక్తిరసావేశ మనుభవజ్ఞులకు విదితము. బ్రాహ్మముహూర్తమున లేచి భక్తిరసపూరితమైన హృదయముతో దైవసంకీర్తనమును జేయుటకు శతకములు పరమ ప్రయోజనకరములుగ నున్నవి.

వైదిక ధర్మమును, కర్మమార్గమును నుద్ధరించుటకై రాజులు, బ్రాహ్మణులు సాహిత్యసాధనమున జేసిన ప్రయత్నములు విరర్థకములైన విధమును శతకవాఙ్మయము విశదము చేయుచున్నది. పండితాధీనమునందున్న సాహిత్యమును శతకములు ప్రజాధీనము చేసినవి. శతకకర్తలందు సామాన్యముగ వైదిక కర్మమార్గమున నధికారములేని బ్రాహ్మణేతరులు కలరు. వారు శిథిలమైన కర్మమార్గమును నిరసించుచు భక్తిమార్గము నారాధించిన విధమును శతకమును తెలుపుచున్నవి. ఆ శతకములందు వేమనవిరచితమైన వేమనశతకము సకలవిధముల శ్లాఘ్యముగ నున్నది. వేమన మహాయోగి, మహాకవి, వేదాంతి, సత్యవాది. వేమన పద్యములు జడమయములైన వైదిక కర్మమార్గమును దురాచారములను బరిహాసపాత్రముగ వర్ణించుచున్నవి. వర్తమానకాలమునందు గాంధి మహాత్మునివలెనే యాకాలమునందు మతమును, సంఘమును నావరించిన మహాజాడ్యములను బరిహాసమునకును, ఖండనమునకును గురిచేసి ప్రజావికాసము చేయుటకు వేమన చేసిన ప్రయత్నము ప్రశంసనీయముగ నున్నది. ఆ కాలమునందు పండితాదరణము లేకుండినను మనోహరమైన వేమన శతకమున కాంధ్రవాఙ్మయమునందు స్థిరమైన స్థానము లభించినది.

ఆంధ్రసాహిత్యము సంస్కృత సాహిత్యప్రభావమునుండి విడిచి స్వీయ వ్యక్తిత్వము గలిగి వికసింపగల విధమును శతక వాఙ్మయము విశదము చేయు

మున్నది. శతక వాఙ్మయమునందలి భావములు, భాష, సాహిత్యము, శైలి ప్రాచీనమైన సంస్కృత సాహిత్యము మీద నాధారపడక నిత్య వ్యవహారములందు వ్యాప్తియందున్న తెలుగు సాహిత్యముమీదను, శైలిమీదను, రీతులమీదను, గీతముల మీదను నాధారపడి యథార్థమైన ప్రజాహృదయమును వెల్లడి చేయుచున్నది. వేమన, సుమతి, భాస్కర, రామతారక, దాశరథీ, భక్తచింతామణి మొదలగు శతకములు స్వతంత్ర కల్పనలతోను, తెలుగు సాహిత్యముతోను, జాతీయ వృత్తచ్ఛందస్సులతోను నిండియున్నవి. అనంతకృష్ణశర్మగారు తెలిపినటులు వేమన హస్తములం దాటవెలది ఆటబంతివలె మెలగినది. శతకవాఙ్మయము సహజమైన ఆంధ్ర ప్రజా హృదయమును సువ్యక్తము చేయుచున్నను పండితాదరణమును బడయకపోవుట ఆంధ్ర సాహిత్యోపాసకుల వావరించిన సంకుచిత భావమునకు లక్ష్యముగ నున్నది.

ఉర్వివారి కెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము పొలయఁ జేసి
తలను చేయిఁ బెట్టి తగనమ్మ జెప్పరా!
విశ్వదాభిరామ వినుర వేమ.

జాపఁ డనఁగ నేమి? భక్తుఁ డనఁగ నేమి?
జోగి యనఁగ నేమి? సొంపు లేక
యున్ని పేరు లైన వినజోడు పనిఁ దీర్పు
విశ్వదాభిరామ వినుర వేమ..

ఎద్దు కైనఁగాని యేడాది తెల్పిన
మాట దెలిసి నడుచు మర్మ మెఱిఁగి
మొప్ప దెలియలేడు ముప్పదేండ్లకు నైన
విశ్వదాభిరామ వినురవేమ.

కూలివారి చేసి గుల్లాముపనిచేసి
తెచ్చి పెట్టనేని మెచ్చు వాలు
చిక్కు పడ్డవేళఁ జీకాకుపరుచురా
విశ్వదాభిరామ వినుర వేమ.

ఉ. తంగేటిజున్ను ముంగిటి విధానము పంచిటికల్పవల్లి సుం
గొంగున ముత్తియం బనగ గూర్మి మనంబున దొంగిలింపగా
జంగమకోటి కర్పనలు సల్పుచు నున్న యగణ్యపుణ్య పీ
పంగడమే క్షమయ్య బసవా! బసవా! బసవా! వృషాధిపా.

(వృషాధిప శతకము)

శా. ఏ విన్నే శరణంబు బాంధవులు గానీ యెల్లవారుం బగే
కానీ మృత్యువు తల్లక్రిందుపడనీ కాలుండు గివెట్టనీ
నానాకర్మచయంబు గింజకొననీ నా కేమి నే రాజ విం
తే నీచాటున దాగియున్నపుడు భీతే యింక సర్వేశ్వరా!

(సర్వేశ్వర శతకము)

మ. చరణాబ్జంబులు పీద్వడ న్నిలిచి యోజన్ దట్టిలో బిల్లఁగ్రోల్
కర మొప్పారగ మంచి యుంపాదవఁ జంకన్ గోల వందిచ్చి స
ఖ్యరు గోపాలురు చుట్టునుం గొలువ వేల్పు ల్మ్రొక్కులన్ ప్రింగగా
నరయం జల్ది భుజింపవే యడవిః గృష్ణా! దేవకీనందనా!

(దేవకీనందన శతకము)

మ. గడియల్ రెంటికొ మూఁటికో గడియకో కాదేని నేఁ డెల్లియో
కడ వేఁడాదికొ యెన్నఁడో యెఱుఁగ రీ కాయంబు లీ భూమిపైఁ
బడఁగా నున్నవి, ధర్మమార్గ మొకటిం బాటింప రీ మానవుల్
చెడుగు ల్నీపదభక్తియుం దెలియ రో శ్రీ కాళహస్తీశ్వరా.

(కాళహస్తీశ్వర శతకము)

సీ. ఎందుల కేగిన నేమి జేసినఁ
చలమున్నైనను చదువున్నైన
బంగారు పనినైన శృంగారములనైన
సుద్దులనైనను ముద్దునైన
యాత్రలనైనను రాత్రులనైనను
సువాసనములనైన ముక్తినైన
జపములనైనను తపములనైనను
గలుగదు మీ దివ్యనుపదంబు
భక్తిచే నిన్నుఁ దలఁచిన భాగ్యవంతు
లిందు నందును వేడ్కతో నంది విన్ను
ప్రబలుదురుగాన నన్నుఁ గావు పంకజాక్ష
రామతారక దశరథ రాజతనయ.

(రామతారక శతకము)

## 7

# గేయవాఙ్మయము

ఆంధ్రవాఙ్మయాంగములయందు గేయవాఙ్మయము సహజమైన ప్రజాసాహిత్యమునకు లక్ష్యముగ నున్నది. పండిత సాహిత్యమునకును, ప్రజా సాహిత్యమునకును వాఙ్మయ స్వరూప స్వభావములందు భేదము గనుపట్టు చున్నది. పండితులందు ప్రతిభావంతులు వారి కావ్యములను ప్రజాసాహిత్యమునకు ప్రతిబింబములనుగ రచియించినను సామాన్యులు పాడిన పాటనే పాడుచు వారి కావ్యములను ప్రజాసాహిత్యమునకు ప్రతిబింబము చేయజాలరు. సంస్కృతసాహిత్యాధారమున నభివృద్ధిజెందిన ఆంధ్రవాఙ్మయ మీ విషయ మును విశదము చేయుచున్నది. ఆంధ్రకావ్యములందు భాష, భావములు, వృత్తములు, సంప్రదాయములు, కథాసందర్భములు విశేషముగ సంస్కృత వాఙ్మయమునకు ప్రతిబింబములుగ నున్నవి. కవులకు లక్ష్యము తెలుగురచన లైనను లక్షణము సంస్కృత వాఙ్మయము. సామాన్యముగ అగ్రజాతుల వారు కవులును, గ్రంథకర్తలును నై ఈ లక్ష్యమునే యారాధించు చుండిరి. పామరులు— ముఖ్యముగా నిమ్నజాతులవారు కావ్యరసానందము ననుభవించు టకు మనోహరములైన గేయములు సాధనములుగ నుండెను. జంగములు, దాసరులు, భట్రాజులు, బైరాగులు, భాగవతులు మొదలగువారు మాలపల్లె లందును, పల్లెలందును జంగమకథలను, సుద్దులను జెప్పుచు, కీర్తనలను బాడుచు ప్రజల కానందమును గలుగజేయుచుండిరి. ద్విపదలు, కీర్తనలు, వచనములు, తుమ్మెదపాటలు, ఏలపాటలు, యక్షగానములు గేయకావ్యముల రూపమున గావ్యరసానందమును పామరులకు గలుగ జేయుచుండెడివి. ద్విపద కావ్యములు కావ్యరసానందమును, భక్తిని, వీరావేశమును గలుగజేయగల విధ మును బసవ పురాణము, పల్నాటి వీరచరిత్రము, పవచోళ చరిత్రము, రంగనాథ రామాయణము, హరిశ్చంద్రోపాఖ్యానము మొదలగు ద్విపద కావ్యములు విశ దము చేయుచున్నవి. స్త్రీలు, జంగములు, దాసరులు పురాణేతిహాసములలోని విషయములను యక్షగానరూపమున మనోహరముగ బాడుచు బ్రహ్మానందము ననుభవించుచుండిరి. యాచకులు, బైరాగులు రామదాసుకీర్తనలను, తత్త్వ ములను బాడుచు ప్రజాహృదయమునందు భక్తిజ్ఞానములను గలుగజేయు చుండిరి. పాటకజనము పని చేయునపుడు శృంగార హాస్యరస భరితములైన ప్రేమగీతములను బాడుచు నానందమును గలుగ జేయుచుండిరి. ప్రజాసామాన్య మునకు పరిచితమైన సాహిత్యమునకు పండితులు చూపిన నిరాదరణ, నిరసన భావము లాంధ్రవాఙ్మయవికాసమున కభ్యంతరములుగ నేర్పడిన విధము నాంధ్ర సాహిత్య చరిత్రము విశదము చేయుచున్నది. శిష్టులకును, సామాన్యులకును సాంఘిక జీవనమందు సామరస్యమును గలుగ జేయుటకు రసానుభవబృందా వనము సాధనముగ నున్నది. రసానుభవమునకు సాహిత్యాంగములైన కావ్య ములు, గేయములు, కీర్తనలు, కృతులు, పాటలు సాధనములుగ నున్నవి. ప్రజాశక్తి విజృంభించునపుడు సాహిత్యాంగములు విజృంభించి యానందము

**సుప్రసిద్ధ శతక కవులు, వారి కాలము, వారి శతకములు. 12-వ శతాబ్దము మొదలు 19-వ శతాబ్దము వరకు**

| కవి పేరు | కవి కాలము | శతక నామము | విషయములు |
|---|---|---|---|
| పండితారాధ్యులు | 1170 | శివతత్త్వసారము | భక్తి (శైవము) |
| పాల్కురికి సోమనాథుడు | 1180 | వృషాధిపశతకము | ,, |
| బద్దెన | 1185 | సుమతిశతకము | నీతి |
| యథావాక్కుల అన్నమయ్య | 1241 | సర్వేశ్వరశతకము | భక్తి |
| శివదేవమంత్రి | 1290 | శివదేవశతకము | వైరాగ్యము |
| రావిపాటి త్రిపురాంతకుడు | 1380 | అంబికాశతకము | శృంగారము |
| వెన్నెలకంటి జన్నయ్య కవి | 1450 | దేవకీనందనశతకము | భక్తి |
| వేమన | 15-వ శతాబ్ది | వేమనశతకము | నీతి |
| బమ్మెరపోతనామాత్యుడు | 1480 | నారాయణశతకము | భక్తి |
| అయ్యలరాజు త్రిపురాంతకుడు | 1460 | రఘువీరశతకము | ,, |
| ధూర్జటి కవి | 1530 | శ్రీకాళహస్తీశ్వరశతకము | ,, |
| తాళ్ళపాక అన్నమయ్య | ,, | వేంకటేశ్వరశతకము | శృంగారము |
| కందుకూరి రుద్రకవి | 1565 | జలవదరీశతకము | భక్తి |
| పరమానందయతి | 1590 | సంపంగిమన్న, పరమానంద, దత్తాత్రేయ శతకములు | ,, |
| ఎకుర్తి రామరాజు | 1600 | రామలింగశతకము | ,, |
| పైడిపాటి వేంకటనృసింహకవి | 1660 | రామచంద్ర, మువ్వారుకృష్ణ శతకములు | ,, |
| అయ్యలరాజు నారాయణకవి | 1660 | ఆంజనేయశతకము | ,, |
| కంచర్ల గోపన్న | 1647-1684 | దాశరథీశతకము | ,, |
| కూచిమంచి తిమ్మకవి | 1715 | కుక్కుటేశ్వరశతకము | ,, |
| గోగులపాటి కూర్మనాథకవి | 1624 | సింహాద్రినారసింహశతకము | ,, |
| అడిదము సూరకవి | 18-వ శతాబ్ది | రామలింగేశ శతకము | నీతి |
| మరిగంటి సింగరాచార్యులు | 1750 | సీతాపతిశతకము | భక్తి |
| ఆణివెల్ల సీతారాముడు | 1750 | జానకీపతిశతకము | ,, |
| శేషప్ప కవి | 18-వ శతాబ్ది | నృసింహశతకము | నీతి |
| పాపుజారి మల్లన | 1750 | భద్రాద్రిరామశతకము | భక్తి |
| నృసింహకవి | 1760 | కృష్ణశతకము | ,, |
| కాండూరు వెంకటదాసు | 1800 | దీనచింతామణిశతకము | ,, |
| కాసుల పురుషోత్తమకవి | 1800 | ఆంధ్రనాయక, హంసలదీవి, గోపాల, మానసబోధ, భక్తకల్పద్రుమ శతకములు | ,, |
| సదానంద వరదరాజయోగి | 1800 | సదానందవరదరాజయోగిశతకము | వేదాంతము |
| తరిగొండ వెంకమ్మ | 1840 | కృష్ణమంజరీద్విపద | భక్తి |
| బండి బాపనమ్మ | 18-వ శతాబ్ది | మీనాక్షీశతకము | ,, |
| అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | 1735 | సింహాద్రి, రమాధిప, కృష్ణ, భూపతిలాలమాది శతకములు | ,, |
| శిష్టు సర్వశాస్త్రి | 1870 | శిష్టు సర్వశాస్త్రిశతకము | ,, |
| విజయనగరపు వెంగళ్వరాయకవి | ,, | మదనగోపాలశతకము | ,, |
| గుజ్జింకొండ భక్తవత్సలుడు | 1885 | సుబుద్ధిశతకము | ,, |

గలుగుటయు, ప్రజాశక్తి కృశించునపుడు సాహిత్యాంగములు కృశించి యానందము లేకుండుటయు ప్రపంచేతిహాసములం దనుభవసిద్ధమైన విషయము. హృదయవికాసమే సాహిత్యవికాసమునకు సాధనము.

బుద్ధయుగమునందును, మౌర్య గుప్త సామ్రాజ్యకాలములందును, వీరశైవ వీర వైష్ణవ యుగములందును, కాకతీయ విజయనగర సామ్రాజ్య కాలములందును, వర్తమానగాంధియుగమునందును ప్రజాప్రబోధము సాహిత్యాభ్యుదయమునకు వినియోగపడిన విధము నాయా కాలములం దప్రయత్నముగ ప్రజాహృదయాంతరాళమునుండి వెడలిన కీర్తనలు, పాటలు, గీతములు, నాటకములు మొదలయిన సాహిత్య స్వరూపములు విశదము చేయుచున్నవి. సత్యాశ్రయములేని సాహిత్యము మానవధర్మాభ్యుదయమునకు నిరాశ్రయముగ నున్నది. వర్తమాన యుగమునందు విద్యావంతులకును, సామాన్యులకును సంఘజీవనమునందు రసానందము ననుభవించుటకు సంయోగసాహచర్యములు దుర్లభములుగ నున్నవి. రసావేశపరాయణమైన యువజన హృదయము ప్రజాశక్తిని సకలరంగములందును వికసింప జేసి ఆంధ్ర సాహిత్య మహోదయమును జేయుటకు శ్రీ శారదాదేవి యనుగ్రహించు గాత!

గేయవాఙ్మయమునందు శృంగారరసభరితములైన క్షేత్రయ్యగారి మువ్వగోపాల పదములు, తాళ్ల పాకవారి తత్త్వవచనములు, త్యాగరాజస్వామి వారి కృతులును ఆంధ్రసాహిత్యమునకు సహజాలంకారములుగ నున్నవి. త్యాగ

రాజకృతు లాంధ్రసాహిత్య రసామృతమును దివ్యమార్గమున బ్రసాదించుచు బ్రహ్మానందమును గలుగ జేయుచున్నవి.

## శ్రీ రామ భ క్తి

త్యాగరాజస్వామి శ్రీరామభక్తిపరిపక్వుడై పాడిన కృతులు శ్రీరామభక్తులకు భక్తిరసావేశమును గలుగజేయుచున్నవి. ఆంధ్రహృదయేశ్వరుడైన శ్రీరామమూర్తి త్యాగరాజునకు ఇష్టదైవము. వాల్మీకి మునిపుంగవుడు కావ్యరూపమున మనోహరముగ రామాయణమునందు ప్రత్యక్షము చేసిన శ్రీరామ చరితమును త్యాగరాజస్వామి గానరూపమున కృతులందు ప్రత్యక్షము చేసి పండిత పామరులకు శ్రీరామభజనానందమును సులభసాధ్యము చేసెను.

తిక్కన కవిబ్రహ్మ; త్యాగరాజు గాయకబ్రహ్మ. ఆంధ్రభక్తిహృదయము, ఆంధ్రభాషామాధుర్యము, ఆంధ్రకావ్యరసామృతము, ఆంధ్రగానానాదమును త్యాగరాజకృతులం దేకస్థాయియందు సమ్మేళనము బొంది బ్రహ్మానందమును గలుగ జేయుచున్నవి. త్యాగరాజకృతులు రసరాగభావభరితములై నాదబ్రహ్మానందమును గలుగజేయుచున్నవి.

## నాదోపాసనము - బ్రహ్మానందము

బ్రహ్మానందానుభవమునకు రసరాగలయబద్ధమైన నాదోపాసనము పరమసాధనముగ నున్నది.

విశ్వావృతమైన పంచవింశతితత్త్వములును శ్రుతిరాగలయబద్ధములై విశ్వశ్రుతియందు సమ్మేళనమును బొందుచున్నవి. సృష్టిక్రమమునం దాకాశతత్త్వ మవ్యక్తస్థితిని దెలుపుచున్నది. నిర్గుణమైన ఆకాశతత్త్వము సగుణమైన స్వరరూపమున బోధ్య మగుచున్నది. అనంతమైన యాకాశతత్త్వము అనంతశయమని మాహాత్మ్యమును నాదరూపమున వ్యక్తము చేయుచున్నది. నాదము బిందుకళారూప పరిణామమును బొందుచు స్వరరాగసాహిత్య స్వరూపముల వ్యక్తమగుచున్నది. అఖండమైన నాదము శబ్దస్పర్శరూప రసగంధాపఞ్చయందు నాదప్రభావమును కర్మేంద్రియములకును, జ్ఞానేంద్రియములకును వ్యక్తము చేయుచున్నది,

ఓంకార ప్రభావ మనిర్వాచ్యము. నాదబ్రహ్మోపాసకు లఖండమైన నాదప్రభావమును స్వరరాగలయబద్ధమైన గానరూపమున విశ్వమునకు ప్రత్యక్షము చేసి బ్రహ్మానందమును గలుగజేయుచున్నారు. నారదుని తుంబురు నాదము ముల్లోకములను బాలించుచున్నది. శ్రీకృష్ణుని మురళీగానము విశ్వశ్రుతిని మేళవించి విశ్వమునంతను బ్రహ్మానందపరవశము చేయుచున్నది. గానరసము విశ్వమును బ్రహ్మానందపరవశము చేయగల విధమును నిత్యానుభవము విశదము చేయుచున్నది. పశువులు, పక్షులు, మృగములు, పండితులు పామరులు, శిశువులు వృద్ధులు, స్త్రీలు పురుషులు గానరసాస్వాదనమును జేయుచు పరమానందము ననుభవించుచున్నారు. గాయకబ్రహ్మ రచించిన కృతు లాంధ్రహృదయరంజకములై భక్తిరసమును, గానామృతమును, కావ్యానందమును కురియుచు ఇహపరానందమును గలుగ జేయుచున్నవి.

## గానము - భక్తియోగము

మానవులు చతుర్విధపురుషార్థములను సాధించుటకు భక్తియోగము ప్రశస్తమైన సాధనముగ నున్నది. ధర్మార్థకామమోక్షములను బడయుటకు భక్తియోగ ముత్తమసాధనము. పితృభక్తి, దేశభక్తి, దైవభక్తి ధర్మార్థకామములకును, మోక్షమునకును సాధనములుగ నున్నవి. అనన్యమైన భక్తి విశ్వరూప సందర్శనమునకు సాధనమని భగవద్గీతోక్తముల యనుభవము విశదము చేయుచున్నది.

చిత్తము ప్రవృత్తినుండి మరలి భక్తిరసానందము ననుభవించుటకు గానము హృద్యమైన సాధనముగ నున్నది. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, అంతఃకరణచతుష్టయము ఏకస్థాయియం దాత్మానుసంధానమును బొంది బ్రహ్మానందానుభవము గలుగుటకు గానము సులభసాధనముగ నున్నది. వాక్కు, శ్రోత్రము, చిత్తము గానమునం దేకస్థాయిని బొందుచు భక్తియోగానుభవము సులభసాధ్య మగుచున్నది. సాహిత్యము, స్వరము, భావము గానమునందు సుశ్రుతిబద్ధములై భక్తియోగానందమును గలుగ జేయుచున్నవి. గానయోగము భక్తియోగానందమునకును, విశ్వశ్రుతియం దాత్మానుసంధానమునకును సాధనముగ నున్నది. విశ్వమునందు సుశ్రుతి నిరతిశయానందమునకును, అపశ్రుతి దుఃఖమునకును మూలములగు చున్నవి. త్యాగరాజు నాదోపాసన చేయుచు రామబ్రహ్మభక్తియోగానందము ననుభవించిన విధమును కృతులు వెల్లడిచేయుచున్నవి. గాన మఖండమైన భక్తియోగపరమైనపుడు బ్రహ్మానందమును, కామయోగపరమైనపుడు దుఃఖమును గలుగ జేసెడివిధమును త్యాగరాజకృతులు మనోహరముగ బోధించుచున్నవి.

## త్యాగరాజు - గాయకబ్రహ్మ

త్యాగరాజు రచియించిన కృతులు సంగీతమునకును, కర్ణాటకగానమునకును, ఆంధ్రసాహిత్య సంగీతములకును ప్రతిభను సమకూర్చినవి. చిరకాలమున నపరిచితముగ నున్న రాగములకు స్వర సాహిత్య స్వరూపముల గల్పించి రాగములను సువ్యక్తము చేసిన గాయకబ్రహ్మ త్యాగరాజు. స్వల్పమైన భేదములు గల రాగములకును సాంకర్యదోషము గలుగకుండ శుద్ధరాగములను నిర్మించి గానకళ కపూర్వమైన ప్రతిభను గల్పించి త్యాగరాజు మహాత్మ్యమును బడయ గలిగెను. పాటలయందును, కీర్తనలయందును సాంకర్యబీజరూపమున నాడుకయందున్న రాగములు త్యాగరాజకృతులయందు ప్రస్తారమును బొంది సాహిత్యస్వరూపమును దాల్చినవి. శృంగార నామకీర్తనలపరమై యుండిన పాటైన సంగీతము త్యాగరాజకృతులయందు భగవద్భక్తిపరమై యున్నత స్థానము నధిష్ఠించినది. వేశ్యాంగనలపాలైన గానము భాగవతోత్తముల వశమైనది. నీచాశ్రయమువలన నిందాపాత్రమైన సంగీతము మహాదరమును బొంది పూజాపాత్రమైనది. త్యాగరాజు సాహిత్య సంగీతమునకును, భక్తిగానమునకును, భావరాగమునకును తన కృతులయందు పరమార్థయోగమును గల్పించి సంసారప్రవృత్తియందు పురుషార్థమును సుభాగ్యము చేసిన ధన్యాత్ముడు. ఆంధ్ర హృదయవైభవమునకు లక్ష్యమైన త్యాగరాజగానామృతము నాంధ్రులు సేవించి ఆత్మసాక్షాత్కారమును బొంది చరితార్థు లగుదురు గాత!

తేట తెలుగుమాటలు, మధుర రాగములు, సరళభావములు త్యాగరాజకృతుల కనిర్వచనీయమైన మాహాత్మ్యమును గాయకభక్తబృందావనమునందును నాంధ్రవాఙ్మయమునందును సమకూర్చుచున్న విధము నీకృతులు తెలుపుచున్నవి.

ప. విను వినా నా మ దెందు
నిల్వదే శ్రీ హరి హరి.

అ. కనులకు నీ సొగ సెంతో
కమ్మియున్నది; గనుక

చ. నీదుకథలు వీనులందు నిండియున్నవి రామ
శ్రీద నీ నామము నోట దెలిగియున్నది గనుక

నేను ఎచట జూచినను నీవై యున్నది రామ
భానువంశతిలక! నీదు భక్తు డనుచు పేరుగనుక

కనుటనో మాట లెల్ల కమ్మనైనవి నాదు
తనువు యొక్క పంపు నీవె త్యాగరాజసన్నుత.

* * *

ప. నాదోపాసన చేసే శంకర
నారాయణ విధులు వెలసిరి; ఓ మనసా!

అ. వేదోద్ధరులు, వేదాతీతులు,
విశ్వమెల్ల నిండియుండెడి వారలు.

చ. మంత్రాత్ములు యంత్ర తంత్రాత్ములు మరి
మంత్రము లన్నిగలవారలు,
తంత్రీ లయ స్వరరాగ విలోలులు
త్యాగరాజవంద్యులు స్వతంత్రులు.

* * *

ప. నాదలోలుడై బ్రహ్మా
నంద మందవే; మనసా!

అ. స్వాదుఫలప్రద సప్త
స్వర రాగ నిచయ సహిత

చ. హరిహ రాత్మభూ సురపతి
శరజన్మ గణేశాది
వర మౌను లుపాసించిన
ధర త్యాగరాజ వినుత!

* * *

ప. నిధి చాలసుఖమా? రాముని స
న్నిధిసేవ సుఖమా? నిజముగ బల్కు మనసా

అ. దధి నవనీత క్షీరములు రుచియో? దాశ
రథి ధ్యాన భజన సుధారసము రుచియో?

చ. దమశమమను గంగాస్నానము సుఖమా? క
ర్దమ దుర్విషయకూపస్నానము సుఖమా?
మమత బంధనయుత నరస్తుతి సుఖమా?
సుమతి త్యాగరాజనుతుని కీర్తన సుఖమా?

(త్యాగయ్య)

ఓ వెఱ్ఱిగొల్ల! నీయువిద మేలే పొద్దు,
దాని బంపగ నాయుతం క్షితి వశట!
తుగువవల్లనె కదా మగనికి ముక్తి,
మగు వెట్టినపైన బంపగ రాదు మగడు
పరజీవములకు గొని నరు డెంతవాడు?
పరహంత కూలును నరకంబునందు,
పుడమిపై నే కార్యమును వాదుమువల
లేక పాటిందు; వలెంపదు చీమ!
అటః వోయి చూడుమా యువనీసురుడు......

(మరాఠాంధ్రేశ్వరుడు)

## 8

# వర్తమాన యుగము

### నాటక వాఙ్మయము

వాఙ్మయవికాసమునకు నాటకాంగము పరిపక్వఫలముగ నున్నది. దృశ్య కావ్యములను రచియింపగల కవులు మహానుభావులు. సంస్కృతమునం దుత్తమ మైన నాటకములు గలవు. మృచ్ఛకటి, శాకుంతలము, మాలతీమాధవము,

త్నావళి, మాళవికాగ్నిమిత్రము, ప్రియదర్శిక, విక్రమోర్వశీయము, ఉత్తర రామ చరిత్రము, ముద్రారాక్షసము, ప్రబోధ చంద్రోదయము మొదలగు ఉత్తమమైన నాటకములు గలవు. భారత భాగవత రామాయణాది మహాకావ్యములు, పురాణేతిహాసాదులు, మాహాత్మ్యములు, చంపువులు మొదలగు సంస్కృత గ్రంథముల నాంధ్రీకరించిన ప్రతిభావంతులైన యాంధ్రకవులు నాటకముల నేల యాంధ్రీకరింపలేదో దురూహ్యముగ నున్నది. శ్రవ్యకావ్యముల నాంధ్రీకరించిన పండితులకు దృశ్యకావ్యముల నాంధ్రీకరించుట దుర్లభము గాదు. ఆంధ్రకవుల నావహించిన భయభ్రాంతులే నాటకానువాదమునకును, నాటక రచనకును బూనుకొనకుండుటకుం గారణమై యుండును. పూర్వ కాలమున "నాటకాంతం హి సాహిత్యమ్" అని పెద్ద లభిప్రాయపడుచుండిరి. ఆ కారణము చేతనే ఆంధ్రకవులు నాటకముల నాంధ్రీకరించుటకును, వ్రాయుటకును బూనుకొనజాలకుండిరి. కారణ మేమైనను వర్తమాన యుగము వరకును ఆంధ్రవాఙ్మయమునందు నాటకములు వెలువడలేదు. యక్షగానములు, కూచిపూడివారి భాగవతములు, నాటకములు మొదలగు వీధి నాటకములు కొంతకాలము ప్రజాహృదయము నాకర్షించినవి. వర్తమాన కాలమునందు ఆంగ్లవిద్య వ్యాపించిన తరువాత నాంధ్ర వాఙ్మయమునందు నాటక రచన లేర్పడినవి. నాటకములందు సంస్కృత నాటకముల కనువాదములును, ఆంగ్లేయ నాటకముల కనువాదములును, స్వతంత్ర నాటకములును గలవు. వర్తమాన యుగమునం దారంభమైన నాటక వాఙ్మయ విమర్శనమునకు బూనుకొనుట ప్రస్తుతాంశమునకు ప్రయోజనకరము కాదు.

ఆంధ్రవాఙ్మయమునందు ఇంతవరకును రమారమి 1000 నాటకములు రచింపబడి యుండును. నాటక రచయితలందు సంస్కృత మార్గమును ప్రశంసించెడివారు కొందరును, ఆంగ్ల మార్గమును ప్రశంసించెడివారు కొందరును కలరు. రెండు మార్గముల నవలంబించెడివారును బరసాహిత్యారాధనమునకు బూనుకొనుచున్నారే కాని ఆంధ్రసాహిత్యారాధనమునకు బూనుకొనుట లేదు. నాటకములు దృశ్య కావ్యములు. ప్రజాజీవనమును ప్రేక్షకులకు ప్రత్యక్షము చేయుట కేర్పడినవి. ప్రాచ్య సాహిత్యమునకును, పాశ్చాత్య సాహిత్యమునకును సంబంధించిన పురాణకథలను నాటక రూపమున ప్రదర్శించుటవలన వర్తమాన కాలమందలి ధర్మాభ్యుదయమునకు ప్రయోజనము కలుగ జాలదు. నాటకములు ప్రజల ధర్మాభ్యుదయములకు ప్రయోజనకరము లగుటకు నాటక విషయములు ప్రజాభీష్టములకు ప్రతిబింబములై యుండవలయును. ఈ ప్రయోజనమును సమకూర్పగల నాటకము లాంధ్ర భాషయందు నకృత్రిమముగ నున్నవి.

వర్తమాన యుగమునందు నాటకరచయితలందు బళ్ళారి కృష్ణమాచార్యులుగారు, కోలాచలము శ్రీనివాసరావుగారు, కందుకూరి వీరేశలింగంగారు, చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారు, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు, బలిజేపల్లి లక్ష్మీకాంతముగారు మొదలైనవారు ప్రజాదరణమునకు పాత్రులయినవారు. గురజాడ అప్పారావుగారు రచించిన కన్యాశుల్కము సంఘజీవనమునకు ప్రతిబింబమై ప్రజాచిత్తము నాకర్షించినది. వేదము వేంకటరాయ శాస్త్రిగారి ప్రతాపరుద్రీయమును ప్రజాదరణమును బడసినది. ఆంధ్ర వాఙ్మయమునకు నాటకాంగము ప్రయోజనకరమైన సాహిత్యాంగముగ బరిణమించుటకు స్వతంత్రమైన నాటకరచనలు కావలసి యున్నవి.

పూర్వకాలమునందు కాళిదాసాది మహాకవులు రాజాస్థానములందు పండితుల సమక్షమునందు నాటకములను ప్రదర్శించుచుండిరి. వారి నాటకములును పండితులను రంజింప జేయుటకు నేర్పడినవిగాని, ప్రజలను రంజింప జేయుట కేర్పడలేదు. వర్తమాన కాలమునం దాస్థితి యంతయు మారినది. రాజాస్థానములు లేవు. రాజపోషకులు లేరు. రంగములు మారినవి. భావములు మారినవి. నాటక ప్రదర్శనమునకు ప్రజాపోషణ సాధనమైనది. ఈ నవీన పరిస్థితులందు నాటకములును నవీనరూపములను దాల్పవలసి యున్నవి. వర్తమానయుగ ప్రయోజనములకు భరతాచార్యుని సిద్ధాంతములును, షేక్స్పియరు సిద్ధాంతములును— నవి యెంత ఉత్తమములైనను— సాధనములు కావు. నాటక కర్త లాంధ్రసాహిత్య హృదయమున కనురూపముగ నాటకములను రచియించి వాఙ్మయాభ్యుదయమునకును, విశ్వకల్యాణమునకును తోడ్పడవలసి యుందురు. నాటకములందు పాటలను, పద్యములను జేర్చుటయందు గల భేదాభిప్రాయములను నాటకకర్తలు గ్రహించి నాటకము నున్నతస్థానము నధిష్ఠింప జేయుదురుగాత!

## గద్య వాఙ్మయము

సకల భాషలయందును మొదట పద్య వాఙ్మయమును, తదనంతరమే గద్య వాఙ్మయమును బుట్టుట సహజస్థితిగ నున్నది. భాష వికసించి వియమము లేర్పడిన తరువాతనే గద్యకావ్యములను వ్రాయుట సాధ్యమగును. రస ప్రధానమైన పద్యకావ్యమునకును, విషయ ప్రధానమైన గద్యకావ్యమునకును భాషయును, భావములును మూలాధారములైనను భిన్నమైన రచనల కవసరమైన సాధన సామగ్రి భిన్నముగ నున్నది. పద్య రచన రసానందమునకు సాధనమై, ఉత్సాహోద్రేకములతో గవుల ముఖమునుండి వెలువడుచున్నది. పద్య కావ్యములు పాడుటకు వీలై, శ్రావ్యములై కావ్యరసానందమును గలుగజేయుచున్నవి. కవులు వీరగుణసంకీర్తనమును జేయుచు ప్రజలకు హృదయ ప్రమోదమును గలుగ జేయుదురు. పద్య కావ్యములు నియమబద్ధములుగ రచియింపబడినను పదముల పొందిక, నడక, కల్పనలు, భావనాశక్తి కవిత్వతత్త్వాశ్రయములుగ నుండును. గద్య కావ్యములు వ్యాకరణ తత్త్వాశ్రయములై విషయ ప్రధానములుగ నుండును.

ఆంధ్రవాఙ్మయమునం దాదియుగమునుండియు గద్యరచన గోచరమగుచున్నను గద్య వాఙ్మయము చిరకాలమువరకు నభివృద్ధిని బొందియుండ లేదు. గద్య రచనలు శాసనములందు గలవు; భారత రామాయణ భాగవతాది గ్రంథములందును, ప్రబంధములందును గలవు. నన్నయకృత భారతమునందలి గద్యములు సంస్కృతప్రాయము లయినను ఆంధ్రభాషాహృదయమును విశదము చేయుచున్నవి. పదముల లాలిత్యము, శైలి, విషయావబోధము, రచనా కౌశల్యమును ఆంధ్రగద్యరచనలకు ప్రమాణములుగ నున్నవి. నన్నయ గద్యరచనయందు పద్యరచనయందువలెనే సంస్కృత వాహినీ ప్రాబల్యము ద్యోతకమగు చున్నది:

వ. అట దుర్యోధనుండు శకునియుం దానును సభావిభవంబు జూచు వేడుక నందు గొన్ని దినంబు లుండి యొక్కనాడు దాని యపూర్వరమణీయతకు విస్మితుం డగుచు నయ్యయిప్రదేశంబులం గ్రుమ్మరువాఁడు వివృతంబైన ద్వారదేశంబు సంవృతంబుగా వగచి చొరనొల్లక సంవృతంబైన దాని వివృతంబుగా వగచి చొరంబోయి లలాట ఘట్టిత గృహద్వారుండయి సమప్రదేశం బున్నతంబుగా వగచి యెక్కనమకట్టి నీలాశ్మరశ్మిస్థగితం బైన విమలమణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానం బెగఁద్రోచికొని స్ఫటికదీప్తిజాలపరివృతంబైన జలాశయంబు స్థలంబుగా వగచి కట్టినపుట్టంబు దడియం జొచ్చి క్రమ్మఱిన వానింజూచి పాంచాలియుఁ బాండుకుమారులును నగి రంత......

(శ్రీమదాంధ్రమహాభారతము—సభాపర్వము.)

తిక్కన సోమయాజి పద్యరచనలయందు జూపిన ఆంధ్రసాహిత్య వాహినీ ప్రాబల్యమును గద్యరచనలందు జూపియుండ లేదు. ఆంధ్రహృదయమునకు ప్రియమైన పద్యరచనానుభూతియే ఆంధ్రసాహిత్యవాహిని తిక్కన గద్యరచనలయందు పద్యరచనలందు వలె పరిస్ఫుటము గాకుండుటకు గారణమై యుండును. నిర్వచనోత్తర రామాయణ రచనయే తిక్కనకు పద్య రచనయందు గల యాదరణమును విశదము చేయుచున్నది:

వ. మున్ను దనతోడం బనినవార లందఱు నచ్చోటన నిలువ నిట్లు వచ్చి సుయోధనుండు నిజాననాసీనుండై యున్నం జూచి తల్లి చిత్తంబున గర్వించుచు నతనికి ధర్మంబును నీతియును జాట్టరికంబును బ్రదుకుదెరువును నిజశక్తియు సహాయంబుఁ గొలందియుఁ గులజనచిత్తప్రకారంబును బాండు

పుత్రుల బలపరాక్రమంబులుఁ దెలియునట్లుగాఁ దెలుంగుపడం జెప్పి బుజ్జగించియుం గినిసియు ననేకవిధంబుల నాడిన నమ్మాటల దెస ననాదరంబు సేసి యుద్ధతిం గ్రమ్మఱం జని యతండు కర్ణాదులం గలసి వారునుం దానును దుర్మంత్రంబునకుం జొచ్చి........... (భారతము— ఉద్యోగపర్వము.)

పోతనామాత్యుని గద్యములకు, పద్యములకు గల ప్రతిభ గనుపట్టదు. గద్యములు పద్యములవలె బదార్థప్రతిపత్తిని గలిగి యుండక పదముల పొందికకు లక్ష్యములుగ నున్నవి:

వ. అని పలికిన శుక్రకుమారకు వచనంబు లాకర్ణించి దానవేంద్రుండు దనకు దండప్రణామంబు చేసి నిలుచున్న కొడుకును దీవించి బాహుదండంబు సాచి దిగ్గనఁ దగ్గఱం దిగిచి గాఢాలింగనంబు సేసి తన తొడలమీద నిడుకొని చుంచు దువ్వి చిబుకంబు బుడికి చెక్కిలి ముద్దుగొని శిరంబు మూర్కొని ప్రేమాతిరేకసంజనితబాష్పసలిలబిందుసందోహంబుల నతని వదనారవిందంబు దడుపుచు మందమధురాలాపంబుల నిట్లనియె..........

(శ్రీమదాంధ్రభాగవతము, సప్తమస్కంధము)

మనుచరిత్ర వసుచరిత్రాది ప్రబంధములందలి గద్యములు వర్ణన ప్రాయములై ఆంధ్ర గద్యవాఙ్మయమునందు సామాన్య స్థానమును గలిగి యున్నవి. పింగళిసూరనార్యుని గద్యములు మృదుమధుర శైలిని గలిగి రసవంతములై ఆంధ్రసాహిత్యమునందు వచనరచనలకు ప్రమాణములుగ నున్నవి.

వ. అని లజ్జాశోకంబు లడర నవనతముఖి యైన కలభాషిణిం జూచి మణికంధరుం డిట్లనియె. నో యుత్తమవిలాసిని, నిన్ను నితరవారవనితల యట్లసత్యవాదినిగా దలంప నంత వింతవాడనే. నీపలికినట్ల నీకు మున్ను నాయందు గోరిక గలుగుటకు గురు తొకటి యున్నది. యది యెట్టి యంటేని, వారదుండు కడపట నిన్ను నింటికి ననుపుచు నేను విన నీతోడ.........

(కళాపూర్ణోదయము)

వ. ఇట్లు తలపడి యమ్మనుజదనుజులు వీరంబులు ఘోరంబులుగా బోరుతరి భూరమణుండు ప్రగుద్దుండై సమిద్ధరణి బద్ధపరంపర యగు నంపఱం బెంపఱం బంపరాదు నిలింపారాతిపై వితర్కించి కించిత్తును గొంచక కాంచనద్రవకంచుకితంబును దరణికరకిరణకాండచండంబును నయి యాఖండలదోర్దండసముజ్జృంభితవజ్రాయుధచకచకం బకపక నవ్వ వజ్రభేదియలుంగు వెలుంగ మత్తారులకు నుత్తలపడు నత్తలంబును, బద్మరాగమణి చూడంబగు కేడెంబునుం గొని వేడెంబునం దురంగంబు బఱపి తెఱపి గని తరటుచేసి.....

(మనుచరిత్రము)

ఆదియుగమునందును, మధ్యయుగమునందును ఆంధ్రగ్రంథములందు హృద్యములైన గద్యములు విలసిల్లిన గద్యకావ్యములు వెలువడలేదు. ఆధునిక యుగమునందు పరవస్తు చిన్నయ్యసూరిగారు రచియించిన పంచతంత్రము గద్యకావ్యములకు మాతృక యైనది. కందుకూరి వీరేశలింగము పంతులుగారు, కొక్కొండ వేంకటరత్నము పంతులుగారును చిన్నయ్యసూరిగారి మార్గము నవలంబించుచు పంచతంత్ర భాగములను రచియించిరి.

వ. తొల్లి యొక ఋబుకంబు వనమున్నం గ్రుమ్మరుచు నెక్కడ నాహారంబు చేకూరమిం గరం బుదగం బాకట నకనకంబడ డిల్లపడి వికలాంగము లయి వేలంగూలిన శతాంగంబులును ఖండితశుండాదండకాండంబు లయి కెడసి కొండలపిండు విడంబించు వేదండతండంబులును ముంగాళ్లు విఱిగి డొక్కలు

పెరిగి మాటిమాటికిని మెడలు పైచి తాటిమాటికిం జడియున్న వారువంబులును నెఱమగంటిమి మెఱయ వాతెఱం గొరుకుచుం జావు బంకెవల పింఛంబు వదలని శిరంబులును వాలు వేఱంగని కరంబులును గరంబు మెఱయ పిపి శయనంబు నొందిన యోధవారంబుం గలిగి ఘోరంబయి విచిత్రంబయిన యుక్కి పోలికలసిం గని తలిదండ్రులయుంజని యొక్క దారుణారావంబు విని గుండియ లవియ బెండువడి మూర్ఛిల్లి కొంతవడికిం దెప్పిలి కెప్పలు విచ్చి యుప్పొంగు నలువంకలు విలోకించి గాలిం గదలు ప్రేలుగొమ్మలతాకున మ్రోగు దుందుభిం గని మనంబునం దలంబగు కొందలంబు మాని దాని డాయంబోయి యద్దాని తోలు ప్రేలంగొట్టికి చొరంబడి వెడలివచ్చి దీని కలరూపు తొలుతం దెలియం జాలనయితి. ఇప్పుడు గదా దీని చొప్పు నెఱింగితి.......

( నీతిచంద్రిక— చి. సూరి. )

వ. అని మఱియు నాచిత్రపర్ణుని కొలువుకాండ్రు పెక్కండ్రు రోష భాషితులై నన్ను దివంతలు గొట్టుచు, దెప్పులు దురాలాపంబులు పలికిరి. అవి యెల్ల నమ్మంబునంబట్టి, ప్రత్యర్థి నంతకు చెంతకు బుచ్చునంతకు వెంతయు నేహదాహంబు సేయుచుండును. నే నశక్తుండ గావున, లాఘవా న్వితుండనై భంగంబు మ్రింగి, యెప్పటి యెప్పున నందరిలో నా నని తలయెత్తి తిరుగుచుంటిని. నేనొక పౌరుషశాలినే? ఈ యవమానంబు మానవంతుం డోర్చునట్టిది కాదు. అచేతనమయ్యును, సూర్యకాంతము తపను పాదములు సోకినంతనె ప్రజ్వరిల్లు నన, చేతనుం డగు నభిమానవంతు డెట్లు పరకృత తిరస్కారంబు జూచి సైచును? అయిన, నా భంగపాటు స్వామికి నివేదింపవలె నను నభిలాష పాశంబు, ప్రాణంబుల వెడలనీక బొందితో బంధించి నన్నిక్కడ కీడిచి తెచ్చెను......

( నీతిచంద్రిక—కం. వి. )

వీరేశలింగము పంతులుగా రాంధ్రవాఙ్మయమునందు గద్యకావ్య నిర్మాణమునకు జనకుడుగా బరిగణింపబడుచున్నాడు. రావు బహద్దరు వీరేశలింగము పంతులుగారి హస్తములం దాంధ్రగద్యకావ్యము రాంధ్రసాహిత్య స్వరూపమును పరిస్ఫుటము చేయుటకు వినియోగపడినవి. వీరేశలింగముగారి వచన రచనలు వాఙ్మయమునందు వచనకావ్యముల ప్రయోజనమును సువ్యక్తము చేసినవి. పండితాధీనమునందున్న సాహిత్యోపాసనమును ప్రజాధీనము చేయుటకు వీరేశలింగముగారి రచనలు వినియోగపడినవి. పండిత పామరులు, స్త్రీ పురుషులు, బాలబాలికలు వీరేశలింగముగారి వచన కావ్యములను జదివి లఘుసిరి యుగవాఙ్మయమునకు సాధకు లయిరి. ఆంధ్రవాఙ్మయమునందు పద్యకావ్యములకు వలెనే గద్యరచనలకును గల పరమప్రయోజనమును వీరేశలింగము పంతులుగారి రచనలు విశదము చేసినవి. పంతులుగారు సుమారు 130 గ్రంథములను వివిధములైన వాఙ్మయాంగములందును రచియించిరి. నాటకములు, ప్రహసనములు, చరిత్రలు, శాస్త్రములు, కథలు, విమర్శనలు నెందలగు వాఙ్మయాంగములందు రచించిన ఆ గ్రంథము లాంధ్రవాఙ్మయ పరిణామమునకు లక్ష్యములుగ నున్నవి. రాజశేఖరచరిత్ర మాంధ్రవాఙ్మయమునందు మొదటి నవలగ పరిగణింపబడుచున్నది. చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు వివిధాంగములందు రచించిన గ్రంథములును నీ లక్ష్యమునకు నిదర్శనములుగ నున్నవి.

## న వ ల లు

వాఙ్మయాంగములందు నవలాంగము వర్తమాన యుగమున విశేషమైన వ్యాప్తిని గలిగి ప్రచారణమును బడయుచున్నది. ఆంగ్లభాషయందు వెలువడుచున్న నవలలకు లెక్కలేదు. ఆంధ్ర భాషయందు నవలల రచన యిటీవలనే యారంభమైనను సత్వరముగ నభివృద్ధిని బొందుచున్నది. ఇంతవరకును అయిదారు వందల నవలలు ప్రచురింపబడినవి. ఆంధ్రవాఙ్మయాంగమునందు నవలాంగ మితర వాఙ్మయాంగములవలె భాషాంతరీకరణముతో నారంభమైనది. వంగ మహారాష్ట్రాంగ్లాది భాషలనుండియును నవల లాంధ్రీకరింపబడినవి. ఆంధ్రవాఙ్మయమునందు గొన్ని స్వతంత్రరచన లేర్పడినను నవలాంగము బాల్యదశయందున్నది. సంస్కృత వాఙ్మయము మీద నాధారపడియుండుట కవకాశములేని నవలాంగమున కాంధ్రవాఙ్మయమునందు స్వతంత్రముగ వికసించుట కవకాశములు గలవు. ప్రేమమాత్రమును, కల్పనాశక్తిని, పాత్రశీలమును, మృదుమధుర శైలిని, నవరసములను, ధర్మప్రవృత్తిని జిత్రకథారూపమున బోధించుట కవకాశములు గలిగి పండిత పామరులకు సులభగ్రాహ్యమైన నవలలు గద్యకావ్య రూపమున మహావ్యాప్తిని బొందుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునందు గొన్ని స్వతంత్రములై గంభీరములైన నవలలు వెలువడినవి. వాని విమర్శన మిక్కడ అప్రస్తుతము.

ఆంధ్రవాఙ్మయమున నారంభదశయందున్న నవలారచన మహోద్యమముతో సాగియున్నది. ప్రపంచ మంతయు పరివర్తనమయమై యున్నది. రాజ్యాంగములు మారుచున్నవి. సాంఘిక వ్యవస్థలు నవీనాకృతిని దాల్చుచున్నవి. విద్యాప్రవృత్తి మారుచున్నది. ఆర్థిక విధానములు తారుమారగుచున్నవి. దాంపత్య ధర్మము నూతన లక్ష్యమును నిరూపించుచున్నది. సంసారప్రవృత్తి నవభావమయమును, నూతననిర్మాణమును గోరుచున్నది. స్వాతంత్ర్యము సమానత్వమును, సౌభ్రాతృత్వము, సాంఘిక రాజకీయ మత వ్యవస్థలయందు సమాశ్రయించుచున్నవి. ప్రపంచ లక్ష్యము జీవయాత్రనుండి దేహయాత్రకు మరలుచున్నది. విశ్వప్రవృత్తికిని, విశ్వకల్యాణమునకును మూలమైన స్త్రీపుంస యోగమునందు ప్రపంచ లక్ష్యము లగ్నమగుచున్నది. కామ ప్రయోజనమున కభ్యస్తమైన స్త్రీపుంసయోగమును ధర్మపరము చేయుటకు విశ్వము పరితపించుచున్నది. ధర్మలక్ష్యము నిత్యమైన యాధ్యాత్మిక ధర్మమునందు లగ్నముగాక అనిత్యమైన ఆధిభౌతిక ధర్మమునందు లగ్నమగుచున్నది. మందిరాంగములు, సుందరాంబరములు, భాగ్యభోగములు ధర్మప్రవృత్తికి లక్ష్యములుగ నున్నవి. ఈ మహాసంధిసమయమునందు ధర్మప్రవృత్తిని నిర్ణయించుటకును, బోధించుటకును నాటకములు, నవలలు, కథలు మహాప్రతిపత్తిని గలిగి యున్నవి. దినపత్రికలు, వారపత్రికలు, మాసపత్రికలు, నవలలు, నాటకములు కామకళావిన్యాసమయములై విషయ వాసనల కాలవాల మగుచున్నవి. విషయ వాసన లపారముగ నభివృద్ధి జెందుచు నాత్మసంస్కరణము, సందర్శనము దుర్లభ మగుచున్నవి. ఆంధ్ర హృదయమునకు సహజమైన ప్రేమ భక్తి రసములు పరిస్ఫుట మగుటకును, మానవధర్మాభ్యుదయము సాధ్యమగుటకును నవలారూపమైన గద్య కావ్యములను కృతికర్త లుత్తమమార్గమున రచించి ఆంధ్రవాఙ్మయ ప్రయోజనమును సార్థకము చేయుదురు గాత!

ఆంధ్రమహాభారతమునందు విశ్వశ్రేయస్సునకును, చతుర్విధ పురుషార్థ సిద్ధికిని సాధన భూతముగ ప్రతిపాదితమైన వైదిక కర్మ మార్గమును, సంస్కృతసాహిత్య సంస్కారమును వర్తమాన యుగ రచనలయందు భక్తి మార్గముగను, తెలుగుసాహిత్య సంస్కారముగను బరిణమించిన విధ మాంధ్ర వాఙ్మయహృదయవికాసము విశదము చేయుచున్నది.

ఆంధ్రవాఙ్మయమునందలి గ్రంథములను రచియించిన గ్రంథకర్తలు సామాన్యముగ బ్రాహ్మణ పురుషులుగా నున్నారు. రమారమి 6000 గ్రంథకర్తలు గలరు. వారియందు సుమారు 100 మంది స్త్రీలు గలరు. స్త్రీ విరచితమైన కృతులయందు కుమ్మర మొల్ల విరచితమైన రామాయణ మాంధ్ర సాహిత్యస్వరూపమును సకల విధములను మనోహరముగ ప్రత్యక్షము చేయుచున్నది.

వైదికవిజ్ఞానసాధనమున ధర్మప్రవృత్తిని ప్రజా జీవనమునందు ప్రతిపాదించుటకు ఆంధ్రమహాభారతము వినియోగపడినది. ధర్మరాజ దుర్యోధనేతిహాసములు ధర్మాధర్మముల ప్రభావమును ప్రత్యక్షము చేసినవి. వైదికవిజ్ఞాన విలసితమైన భాగవత భక్తిని ప్రజాజీవనమునందు ప్రత్యక్షము చేయుచు శృంగారభక్తిరసానందమును గలుగ జేయుటకు ఆంధ్రభాగవతము వినియోగపడినది. వైదికేతిహాస ఫలదాయకమైన వీరరసానందము ననుభవించుటకు రామాయణ సంకీర్తనము వినియోగపడినది. ప్రజా ప్రవృత్తియందు గరుణ రసానందమును స్ఫురింప జేయుటకు శైవబౌద్ధగాథలు వినియోగపడినవి.

# శతక వాఙ్మయము

ఆంధ్రవాఙ్మయాంగములందు శతక వాఙ్మయాంగము విశేష వ్యాపకమును గలిగి పండిత పామర హృదయ రంజకముగ నున్నది. పురాణములు, శాస్త్రములు, కావ్యములు, ప్రబంధములు నాటకములు, నవలలు, కథలు, వాఙ్మయాంగములందు ప్రధానాంగములైనను శతకాంగమువలె పండిత పామర హృదయముల నాకర్షింపజాలవు. ఆంధ్రభాషయందు మహాకవులును, సామాన్య కవులును రసభరితములైన శతకములను రచియించి వాఙ్మయ వికాసమునకు దోడ్పడిన విధమును శతకములు విశదము చేయుచున్నవి. లాక్షణికులు సామాన్యముగను శతకములను కావ్య గ్రంథములుగను పరిగణింపక పోయినను శతకవాఙ్మయము వ్యాపకమును గలిగి ప్రజాదరణమును బడసినది. దేశ మాంగ్లవిద్యార్ణవమునందు మునుగక పూర్వము విద్యాభ్యాసారంభమునం దొకటిరెండు శతకములైనను నోటరాని అక్షరాస్యు లాంధ్రదేశమునం దుండెడి వారు కారు. భక్తి నీతి వైరాగ్యపరములైన దాశరథి కాళహస్తీశ్వర భాస్కర వేమన సుమతి నారాయణాది శతకములను బడులందు వల్లించుట యాచారముగ నుండెడిది. వర్తమాన విద్యావిధానము కాకి, కుక్క కథలతో నారంభమై ఆంగ్ల కావ్యములతో సంతమునొందుచు విద్యాప్రయోజనమునకు నిరుపయోగమైనది. విద్యాభిమానులీ దుర్దశనుండి మాతృభాష నుద్ధరించుటకు బాటుపడి యాత్మోపలబ్ధిని బడయుదురుగాక!

## శతక వాఙ్మయము

శతపదజన్యమైన శతకపదము సంఖ్యాబాహుళ్యమును దెలుపుచున్నది. సంస్కృత ప్రాకృత వాఙ్మయములందుగల శతపద బ్రాహ్మణము, అవదాన శతకము మున్నగునామము లధిక సంఖ్యార్థమును విశదము చేయుచున్నవి. జపమంత్ర విధానములందు సహస్రము, అష్టోత్తరశతము నియత సంఖ్యలుగ నేర్పడినవి. దైవప్రార్థనాపూజాదికములం దష్టోత్తర శతసంఖ్య బహుసంఖ్యార్థమును దెలుపుచున్నది. దేవీదేవతల యర్చనలందు సహస్రనామములను, అష్టోత్తర శతనామములను చెప్పుట సదాచారము. అక్షమాల లష్టోత్తరశతసంఖ్యగల పూసలను గలిగియున్నవి. శతకములందు సామాన్యముగను నీ సంప్రదాయ సిద్ధముగను 108 పద్యము లుండును. శివతత్త్వసారము వేమనశతకము మొదలగు శతకములు వందలకొలది పద్యములను గలిగియున్నవి. మరికొన్ని శతకములందు 100 పద్యములును గలవు. కాలాంతరమున నితరకవులు వారి స్వంత పద్యములను పంచి శతకములందు చేర్చుటయును శతకపద్యములందు సంఖ్యాభేదమునకు కారణంబై యుండును.

ఆంధ్ర వాఙ్మయమునందు 1000 శతకములైనను నుండియుండును. శ్రీయుత వంగూరి సుబ్బారావుగారు 600 శతకములను జూచినటులు శతక వాఙ్మయ చరిత్రమునందు వ్రాసియున్నారు. ఎన్నియో శతకములు నష్టమైనవియును నజ్ఞాతములైనవియును గలవు. కవిత్వధోరణిగల కవులు ప్రబంధాది కృతి నిర్మాణములకు పూర్వమునను శతకములను రచియించుట సామాన్యము. తిక్కన పోతనాది మహాకవులును శతకములను రచియించినటులు ప్రతీతి గలదు.

శతకములందు శృంగార నీతిపరములైన శతకములు కొన్ని యున్నను భక్తిశతకము లధికముగ నున్నవి. కవులు తమ యిష్టదేవతాస్తవ పరములైన శతకములను రచియించి కవితా కన్యక నీశ్వరార్పణము చేయుట సంప్రదాయ సిద్ధముగ నున్నది. శ్రీరామ శతకములు, కృష్ణశతకములు, శివపరములైన శతకములు, దేవీపరములైన శతకములు శతక వాఙ్మయమునందు విశేషముగ గలవు. వేమనశతకము, సుమతిశతకము, కుమారీ శతకము మొదలగు నీతి శతకములు గలవు. వేణుగోపాల శతకము మల్లికార్జున శతకము మొదలగు శృంగార భక్తిశతకములు గలవు. వీర శృంగార భక్తిరస సమ్మిళితములైన శతకములు గలవు. ఆంధ్ర వాఙ్మయమునందు వేలకొలది శతకములు పుట్టినను శతకము లనేకములు నష్టమైనవి.

## ఆంధ్ర శతక వాఙ్మయము

ఆంధ్ర శతక వాఙ్మయమునకు ప్రాకృత సంస్కృతశతక వాఙ్మయములు మూలాధారమైనను నీ వాఙ్మయాంగ వికాసము ప్రత్యేకము వ్యక్తిత్వమును గలిగియున్నది. ఆంధ్రశతకములకు మకుటము ప్రధానముగ నున్నది. సామాన్యముగను మకుటమే శతక నామమును దాల్చుచున్నది. దాశరథి, కాళహస్తీశ్వర, రంగశాయి, రామతారక, సుమతి, వేమవాది శతకముల మకుటము లాంధ్రశతకముల స్వరూపమును విశదము చేయుచున్నవి. భక్తి శతకములందు మకుటము లిష్టదేవతాపరములై యొప్పుచున్నవి. ధూర్జటి కాళహస్తీశ్వరుని, సోమనాథుడు వృషాధిపతిని, అన్నమయ్య సర్వేశ్వరుని, గోపన్న శ్రీభద్రాద్రిరాముని, పోతరాజు శ్రీమన్నారాయణుని దమ శతకములందు సంబోధించి మకుటరూపమైన శతక నామకరణమును జేసిరి. వేమన, సుమతి, కుమారి మొదలగు నీతిశతకముల మకుటములు భావార్థపరములుగ నున్నవి. నారాయణాది శతకములందు గల ఆదిదశకాది శతకవిభాగములును నాంధ్రశతకముల వ్యక్తిత్వమును దెలుపుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునందు శత

కాంగము ప్రముఖాంగముగ నున్నను కావ్యాంగములందు సందిగ్ధాంగముగ నున్నది.

## కావ్యాంగములు

లాక్షణికులు కావ్యాంగములందు పురాణేతిహాస ప్రబంధ నాటకాదుల కొసంగిన ప్రాముఖ్యమును శతకముల కొసంగియుండలేదు. అప్పకవి శతకములనుండి కావ్యలక్షణముల కుదాహరణము లను సంగ్రహించెను. అప్పకవి, పిన్నకోట పెద్దన్నగారలు శతకము లను క్షుద్రకావ్యములందు జేర్చిరి. అనంతామాత్యుడు శతకములను చాటుప్రబంధములందు జేర్చెను. కవిచరిత్రకారులు గురుజాడ శ్రీరామమూర్తిగారు, వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రము లందు శతకముల ప్రశంసను జేసియుండలేదు. శతకములు లక్షణ గ్రంథములందు ప్రవేశమునుగాంచకపోయినను ప్రజాహృదయమునందు స్థిరప్రవేశమును గాంచిన విధమును శతకములసంఖ్య, శతకకర్తల నామములు, శతకముల ప్రచారము విశదము చేయుచున్నవి. కావ్యాంగములను నిర్ణయించుటయందు శతకాంగమును నాంగ్లకావ్య సంప్రదాయానుసారముగను నిర్ణయించుట యాంగ్లవిద్యాశిక్షితుల కాచారమైనది. శతకకవుల చరిత్రను రచియించిన కీ. శే. వంగూరి సుబ్బారావుగారును నీమార్గము నవలంబించి శతకములు భావగీతము లను (Lyrics) కావ్యాంగమునకు జేరునటుల నిర్ణయించిరి. ఈ నిర్ణయ మాంధ్రకావ్య సంప్రదాయములకు సమన్వయముగాకను సందిగ్ధముగ నున్నది. శతకవాఙ్మయమును నాంధ్రవాఙ్మయమునకు పరిచితమైన ప్రాస్యకావ్య విభాగమునందు జేర్చుటయే భావ్యముగ నుండును. నీతిశతకములందు విషయ సమన్వయము లేకపోయినను భక్తిశృంగార శతకములందు విషయసమన్వయమును భావసమన్వయ మును గలవు. శతకవాఙ్మయము లాక్షణికుల యాదరణమును బడయక పోయినను, ప్రజాదరణమును బడసినవిధమును వాఙ్మయవ్యాసము విశదము చేయుచున్నది. భక్తిశతకములు, నీతిశతకములు, శృంగార శతకములు ప్రజాజీవనమును రసవంతము చేయగలవిధమున శతక ముల యాదరణము నాటుచున్నది. ఆరంభవిద్యా ప్రవృత్తియందు బాలికా బాలకులకు జ్ఞానోదయమునకును, భాషాపరిచయమునకును శతకములు ప్రయోజనకరములుగ నున్నవి. వేమన, సుమతి, కుమారీ, భాస్కరాది నీతిశతకములకును, దాశరథి, నారాయణ, కామలాంబాది భక్తిశతకములకును పూర్వము విద్యాప్రవృత్తియందుగల వ్యాపకము వాని ప్రయోజనమును విశదము చేయుచున్నది. బాల్యమునందు నీతి, భక్తి, ధర్మబోధకములును, మనోహరములును, శ్రావ్యములును నైన శతకములను జదువుట విద్యాప్రవృత్తికి ప్రయోజనకరముగ నుండగలదు. ఆంధ్రప్రజాహృదయమున కపరిచితులైన ఆంగ్లేయ పండితులును దేశీయపండితులును విద్యాప్రవృత్తియందు నిర్ణయించు చున్న పాఠావళి ఆంధ్రభాషకు సంప్రాప్తమైన దుర్దశను తెలుపు చున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులు విద్యాప్రవృత్తియం దీ దుర్దశను తొలగించి విద్యాప్రవృత్తిని సారవంతము చేయుదురు గాక! శతక వాఙ్మయమునందు భక్తిశతకము లాంధ్రహృదయ స్వరూపమును విశదము చేయుచున్నవి.

## భక్తి శతకములు

మానవులకు సకలార్థములందును భక్తి తరణమునకు సాధన ముగ నున్నది. పితృభక్తి, మాతృభక్తి, పతిభక్తి, గురుభక్తి, దేశభక్తి, దైవభక్తి మహత్తరమైన భక్తికి భిన్నరూపములు. భక్తులు తాము తరించి లోకమును తరింపజేయుచున్నారు. శ్రీరామచంద్రుని పితృభక్తి, సావిత్రి పతిభక్తి, ప్రహ్లాదుని దైవ భక్తి భక్తిప్రభావమునకు నిదర్శనములు. అనన్యమైన భక్తి ఇహ పరలోక సౌఖ్యములకు పరమసాధనము. దైవానుగ్రహమును బడయు టకు భక్తియోగము పరమసాధనముగ నున్నవిధమును భక్తుల చరిత్రలు తెలుపుచున్నవి. పండితులకు సాధ్యముగాని పరమపదము భక్తులకు సులభసాధ్యముగ నున్నది. వ్యాసులు జ్ఞానసాగరమైన భారతరచనానంతరము మోక్షప్రాప్తికి భక్తిసాగరమైన భాగవతరచనను చేసిన యితిహాస వృత్తము భక్తిప్రభావమును దెలుపుచున్నది. విశ్వరూప సందర్శనమున కనన్యమైన భక్తియె సాధనమని శ్రీకృష్ణ భగవానులు ప్రియభక్తుడైన యర్జునున కుపదేశించెను.

శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!

శ్లో. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ!

భాగవతభక్తి భరితమైన ఆంధ్ర హృదయబృందావనమునకు శతకములు సహజఫలములుగ నున్నవి. భక్తిరసభరితములైన శతక ములను నాంధ్రకవులు హృద్యముగ బాడి ప్రజాహృదయములందు భక్త్యుత్సాహములను ప్రజ్వరింపజేయగలిగిరి. రామదాసుగారి దాశరథి శతకము, ధూర్జటి కాళహస్తీశ్వర శతకము, పోతనా మాత్యుని నారాయణ శతకము, సుబ్బారాయుడుగారి భక్తచింతామణి శతకము మొదలగు భక్తిభరితమైన పండితకోవిద శతకము లాంధ్రభక్తహృదయమును విశదము చేయుచున్నవి. శతకములు పండిత పామరహృదయములందును, బాలవృద్ధ హృదయములందును గలుగజేయగల భక్తిరసావేశ మనుభవజ్ఞులకు విదితము. బ్రాహ్మ ముహూర్తమునను లేచి భక్తిరసపూరితమైన హృదయముతో దైవ సంకీర్తనమును జేయుటకు శతకములు పరమప్రయోజనకరములుగ నున్నవి. కొంతకాలమునకు పూర్వము శ్రావ్యమైన శతకసంకీర్తన మాంధ్రగృహములందు జరుగుచు నాంధ్రహృదయ వికాసమునకు దోడ్పడుచుండెడిది. ఇపు డాస్థితియంతయును మారినది. విద్యాలయము లందును గృహములందును శతకపఠన మపరూపమైనది. ఆరంభ విద్యాభ్యాసమునందు కాకి పిల్లికథలు ప్రబలినవి. ఆంధ్రహృదయము నందు భక్తిరస ప్రవాహము శుష్కించుచున్నది. ఆంధ్రాభిమానులు, విద్యాలయములయందును గృహములందును భక్తిజ్ఞాన నీతిబోధ

కములైన శతకముల వరనము మద్దతించి భాషాభ్యుదయమునకును వాఙ్మయ వికాసమునకును దోహదపడుదురు గాక!

[ఆంధ్రగ్రంథమాలయందు శతకసంపుటము ప్రథమ పుష్పము. ఈ శతకసంపుటమునందు గల ప్రతిశతకమునకును విపులమైన పీఠిక గలదు. ఆ పీఠికయందు కవికాలము, కవిత్వము, భావార్థము, శతకవిభాగములు, పాఠభేదములు మున్నగు విషయములు విపులముగను విమర్శింపబడినవి. ఆంధ్రమహాజను శ్రీప్రచురణము సందరి గుణములను గ్రహించి శతకావళికి స్వాగతంబు నొసంగుటకు వేడుచున్నాము. కీ. శే. శ్రీ వంగూరి సుబ్బారావుగారు శతకకవుల చరిత్రను వ్రాసి చేసిన యుపకృతిని ప్రణుతు సార్థకము చేయుదురు గాక!]

# శ్రీ వృషాధిప శతకము

శ్రీ వృషాధిప శతకమును రచియించిన పాలకురికి సోమనాథారాధ్యులు కాకతీయ రాజ్యమునందలి పాలకురికియందు జననము నొందెను. పాలకురికియందు బుట్టి పిదప యాంధ్ర కర్ణాటకదేశములందు సంచారమును చేసి కలికె మను గ్రామమునను నివాసయోగ్యమును పొందినట్లు తెలియుచున్నది. శ్రియాదేవియును విష్ణురామిదేవుడును తలిదండ్రులనియును, కట్టకూరి పోతిదేవుడు విద్యాగురువనియును, కరస్థలము విశ్వేశుడు శివదీక్షాగురువనియును బసవపురాణమునందును, బసవేశుడు తండ్రియనియును, లింగార్యుడు గురువనియును పండితారాధ్య చరిత్రమునందును సోమనాథుడు తనను గురించి వ్రాసికొనెను. పండితారాధ్య చరిత్రకు కృతిపతియైన సూరనామాత్యుడు "ఆపస్తంబసూత్రుడు, హారీతసగోత్రుడు, మద్దమాంబ, వెన్నెలకాడు" అని వ్రాసెను. సోమనాథుడు లింగధారి బ్రాహ్మణుడని వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రమునందు వ్రాసియుండిరి. బండారు తమ్మయ్యగారు దుందుభి సంవత్సరాది సంచికయందు సోమనాథుడు జంగము డని నిర్ధారణచేయు నొక వ్యాసమును వ్రాసిరి. అనుభవసారమునందు సోమనాథు డిట్లు తన కులగోత్రాదులను వర్ణించుకొనెను:—

కం. భృంగిరిటిగోత్రుఁడను గురు
లింగతనూజుండ శివకులీనుఁడ, దుర్వా
సంగ నివర్జిత చరితుఁడ
జంగమలింగ ప్రసాద సత్ప్రాణుండన్.

"వీరశైవమతస్థు లగు జంగములకును లింగాయతులకును గోత్రాధికారులు—బ్రాహ్మణులకు నారాధ్యబ్రాహ్మణులకువలె—గౌతమ భారద్వాజాది మునీశ్వరులుకాక శివుని ముఖమునుండి యుద్భవించిన—వృషనందీశ్వరభృంగి (భృంగిరిటి) వీరస్కందులు అయియున్నారు." అని వ్యాఖ్యానముచేయుచు సోమనాథుడు జంగము డని తమ్మయ్యగారు సమర్థించిరి. ఆరాధ్యబ్రాహ్మణులును ఆరాధన సమయమునందు "ఓం ఓం శ్రీనందిభృంగిరిటి వీరక వీరభద్ర చండేశ్వర ప్రమథముఖ్య మహాగణేభ్యః.........సమారాధ్యే" అని చెప్పుటవలనను భృంగిరిటిగోత్రము జంగమ కులనిర్ణయమును జేయజాలదు. అనుభవసారమందు 'వేదోక్త నిరూఢిని బురాణరహస్య వియుక్తి నీ'రచి యుంతుననియును, పండితారాధ్య చరిత్రమునందు 'చతుర్వేద పారగుడను' అనియును వ్రాసెను. సోమనాథభాష్యమునందు 'గాయత్రీ మంత్ర ప్రకరణము'ను జేర్చెను. చతుర్వేద సారసూక్తులను వ్రాసెను. సోమనాథుని గ్రంథములందుగల వేదార్థపరిచయమును సోమనాథుని సంబంధబాంధవ్యములును బ్రాహ్మణకుల సంభవమును దెలుపుచున్నవి. 'పాలకురికి సోమ పతితుడు' అను ధూర్జటి విప్రుని నిందయే బ్రాహ్మణకుల జననమును దెలుపుచున్నది. సోమనాథుడారాధ్య బ్రాహ్మణకులజాడుగ బుట్టినను కాలక్రమమునను అనుభవసారమును వ్రాసినకాలమునకు బ్రాహ్మణ కులగోత్ర మోహమును వదిలి శివభక్తుడైన బసవ కులమును బసవగోత్రమును స్వీకరించి ప్రమథగణపరమైన భృంగిరిటి గోత్రమును స్వీకరించినటు లూహింప వగియున్నది. వేమనారాధ్యుడు బ్రాహ్మణుడనుటకును ప్రబల నిదర్శనములు గలవు. జెలిదేవ వేమనారాధ్యుడు ధరాసురుడని పండితారాధ్య చరిత్రమునందు వర్ణింపబడినది. పండితులు చరిత్రాంశముల నిర్ణయమునందు కులాభిమానమును విడిచి నిర్ణయించుట సముచితము.

కాలము

సోమనాథుడు కాకతీయరాజ్యమును 1140—1196 వరకును నేలిన మొదటి ప్రతాపరుద్రుని కాలమునం దున్నటులు వీరేశలింగం పంతులుగారు నిర్ధయించిరి. బసవేశ్వరుడు 1140-68 వీరశైవమత వ్యాపనమును జేసెను. బసవేశ్వరుడును పండితారాధ్యుడును సమకాలికులు. పండితారాధ్యుడు 1130—90 వరకును నుండినటులు కొ. లక్ష్మణరావుగారు శివతత్త్వసారము పీఠికయందు నిర్ణయించిరి. సోమనాథుడు తాను వేమనారాధ్యుని మనుమని శిష్యుడనని వ్రాసికొనెను. వేమనారాధ్యుడు పండితారాధ్యులకు సమకాలికుడని పండితారాధ్య చరిత్రము తెలుపుచున్నది. బసవేశ్వరుడు 1168 లో లింగైక్యమునొందెను. పండితారాధ్యుడు బసవేశ్వరుని మరణానంతరము జీవించియుండెను. 1220 లో ఉద్భటకావ్యమను నామాంతరముగల శృంగారరసమును రచియించిన కన్నడ కవి సోమరాజు సోమనాథుని ప్రస్తుతించెను. (కర్ణాటకవి చరిత 1 వ భాగ. 270 పుట). పండితారాధ్యుడు 1190 వరకు జీవించియుండి సోమనాథుడు 1196 వ సంవత్సర ప్రాంతమునందుండినటులు నిర్ణయించిన కొంత యసందిగ్ధస్థితి గలుగుచున్నది. పండితారాధ్యునికాలము పదేండ్లు వెనుకకును సోమనాథ్యునికాలము కొంచెము ముందునకును నడుపుట యుచితముగ నున్నది. కాని ఈనిర్ణయము 1140—1196 వరకు పాలించిన మొదటి ప్రతాపరుద్రుని కాలమునకు సోమనాథుని కాలమును దూరస్థము చేయును. పండితారాధ్యుని కాలావంతరము పదివేలేండ్లలోపలనె సోమనాథుడు

నివసించి తన గ్రంథములను రచియించినటు లూహింపదగియున్నది. పండితారాధ్య చరిత్రమును, బసవపురాణమును రచియించిన సోమనాథుడు 1170—1230 వరకును నివసించియుండును. కర్ణాటక వాఙ్మయ పరిశోధనలవలనను, నితరమైన యాధారముల వలనను యథార్థమైన కాలనిర్ణయమును జేయుట కవకాశము లింకను గలవు.

## వ్యక్తిత్వము, గ్రంథములు

సోమనాథు డొక మహావ్యక్తియని వారి గ్రంథములును నితర గ్రంథకర్తల ప్రశంసలును వీరశైవుల వర్ణనలును తెలుపుచున్నవి. చతుర్వేద పారంగుడు. సంస్కృతాంధ్ర కర్ణాటాదిభాషలందు మహా పండితుడు. గానకళా ప్రవీణుడు. కవిపుంగవుడు. మహాభక్తుడు. వీరశైవశిఖామణి. సోమనాథుని ప్రతిభను వారిగ్రంథములు విశదము చేయుచున్నవి. బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, అనుభవ సారము, చతుర్వేదసారసూక్తులు, చెన్నమల్లు సీసములు, వృషాధిప శతకము తెనుగు గ్రంథములు: సోమనాథభాష్యము, బసవన పంచ గద్య, శ్రీరుద్రభాష్యము, నమస్కారగద్యము, అక్షరాంకగద్యము, పంచప్రకారగద్యము, అష్టకము, పంచకము, ఉదాహరణ యుగ్మము, సంస్కృతములు: బసవరగడ, గంగోత్పత్తిరగడ, శ్రీబస వాఢ్యరగడ, సద్గురురగడ, కర్ణాటకములు. సోమనాథున కాంధ్ర కర్ణాటక సంస్కృతభాషలందును, వేదవేదాంతశాస్త్రములందును, మతసంప్రదాయాచారములందును, కళలయందును, శాస్త్రములం దును గల యసామాన్యపాండిత్యమును ద్విపదకావ్యములైన బసవ పురాణమును పండితారాధ్య చరిత్రమును భాష్యములును తెలుపు చున్నవి. అనుభవసారము సోమనాథుని శివానందానుభవమును తేట మాటలను తెలుపుచున్నది. ద్విపదకావ్యముల పట్లగల యనాదరణ మును వీరశైవమతము పట్లగల విముఖతయును సోమనాథుని గ్రంథముల ప్రచారమునకు ప్రతిబంధకములుగ నేర్పడినవి. నన్నయ కును తిక్కనకును నడుమకాలమునందు వర్ధిల్లి తాను తెనుగున ద్విపద కావ్యములను ప్రజాసామాన్యమున కుపయోగకరముగ రచియించి దేశభాషా సంప్రదాయాచారములను పెన్నిధిగను గ్రంథములందు పేకరించిన సోమనాథుని గ్రంథముల కధికతరమైన ప్రచారమును గలుగజేయుట కాంధ్రభాషాభిమానులు ప్రయత్నించుదురు గాత!

## వృషాధిప శతకము

ఆంధ్రవాఙ్మయమునందు శతకవాఙ్మయము మిగుల రసవంతముగ నున్నది. భక్తిజ్ఞాన వైరాగ్యనీతి శృంగార హాస్యభావములు శతకములందు పల్లవించుచు శతకములు రసోదయమును గలుగ జేయుచుండును. శతకములు ఒకేవిషయమునుగాని పలువిషయము లనుగాని హృదయరంజకముగను వర్ణించుచు ఖండకావ్యస్వరూప మును దాల్చుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునం దిపుడు 600 పైన శతకములు నిలిచియున్నవి. శతకములందు భక్తిపరమైన శతకము లధికముగ నున్నవి. శతకగుచ్ఛముగనున్న శివతత్త్వసారము వృషాధిప శతకమునకు పూర్వకాలపు గ్రంథమైనను ప్రచారమునందున్న శతకములందు వృషాధిపశతకము ప్రాచీనశతకముగ నున్నది. ఈశతకము నకు బసవశతకము బసవేశ శతకమని నామాంతరములు గలవు. ఈ శతకము నిదివరకు శ్రీ భైరవ ముద్రాక్షరశాల వారు బందరు, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సువారు మద్రాసు, ముద్రిం చిరి. ప్రాచ్యలిఖిత భాండాగారమునందు వ్రాతప్రతులు గలవు. ఆ ప్రతులను పరిశోధించి పాఠభేదములనుజేర్చి ఈ ప్రతిని ముద్రిం చితిమి. సోమనాథుడు వృషాధిపశతకమును బసవపురాణానంతరము రచియించి తనకు బసవేశ్వరుని పట్లగల పరమభక్తిని దెలియజేసెను.

## శైలి

సోమనాథుని ద్విపదకావ్యముల శైలి మహాప్రవాహమువలె ప్రవ హించుచు నాంధ్రపద భూయిష్ఠమై భావగర్భితమై పండితపామరు లకు సులభగ్రాహ్యమై మనోహరముగ నున్నది. వృషాధిపశతకపు శైలి సరళమైనను సంస్కృతపద భూయిష్ఠమై కఠినముగనున్నది. అంత్యప్రాసములకును ముక్తపద ప్రాసములకును శబ్దాలంకారముల కును నీ శతకము తరువాతి కవులకు మార్గదర్శకముగ నున్నవిధము నీపద్యములు తెలుపుచున్నవి.

> "ఉద్ధత బద్ధవృద్ధ విను
> తోత్తమ సిద్ధ పరీత జంగమ
> శ్రద్ధ సదాత్మశుద్ధ గణ
> రాజిసమృద్ధ విముక్తపాశ స
> న్నద్ధ మహాప్రసిద్ధ యు గు
> ణత్రయబద్ధ శరణ్యమయ్య భా
> స్వద్ధత చిత్ప్రబుద్ధ బస
> వా! బసవా! బసవా! వృషాధిపా!"

> చ. "సురవరపూజ్య పూజ్యగుణ
> శోభిత శోభితరూప రూప వి
> స్ఫురతరశీల శీల గుణపుంగవ
> పుంగవసత్త్వ సత్త్వసం
> పర పరవాద వాద భయ
> వర్జిత పాప విచార చార యా
> శ్వరసమ నీవె దిక్కు బస
> వా! బసవా! బసవా! వృషాధిపా!"

సోమనాథుడు తన యష్టభాషా పాండిత్యమును దెలుపుట కీశతకమునందు సంస్కృతమునందును తెలుగునందును ద్రవిడ కర్ణాటక మహారాష్ట్ర భాషలందును మిశ్రమభాషలందును మణి ప్రవాళమునందును బసవస్తుతిని జేసెను. "విరచిత శుద్ధ సాళువ.... కేళివిలోల సంగమేశ్వర" యను నొక సమాసముననె పద్యమునంతను జేర్చెను. శైలియందు శబ్దాలంకారములును నంత్యప్రాసములును ముక్తపదప్రాసములు నున్నను సర్ధరసస్ఫురణము సహజముగ

గలుగుచు పద్యములు సరళగతి గలిగి భావములు సులభముగ గ్రాహ్యము లగుచున్నవి. యతిప్రాసములు విశ్రమమైత్రిని గలిగి శ్రావ్యములై సుస్వరోపేతములై ఉన్నవి. శతకమంతయును మకుటమునందు సంబోధనజేసిన బసవేశ్వరుని ప్రభావమును వ్యక్తపరచుచు బసవేశ్వర ధ్యానమునుజేయుచు శబ్దార్థములను బసవమయము చేయుచున్నది.

## కావ్యార్థము

ఈ శతకమునకు మకుటము బసవా! బసవా! బసవా! వృషాధిపా! హృదయాంతరాళము నుండి త్రిరావృత్తమై వెడలిన బసవ సంబోధనము సోమనాథుని భక్తిరసోన్మాదమును చాటుచున్నది. సోమనాథుని హృదయేశ్వరుడైన బసవేశ్వరుని గానస్తవములు పండ్రెండవ శతాబ్దియందలి యాంధ్రహృదయవేదనమును సువ్యక్తము చేయుచున్నవి. శ్రీ శంకరాచార్యులు తన ప్రజ్ఞాబలముచే జైన బౌద్ధమతముల నణగద్రొక్కి వైదికమతమును దాని ప్రాబల్యమును స్థాపించినను నపారమైన ప్రజాశక్తి తిరిగి తలయెత్తి విజృంభించినది. శంకరుడు ప్రతిపాదించిన "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" "శివోహం" అను పరమార్థతత్త్వములను నిత్యజీవనమునందు సమన్వయమును జేయుట కాంధ్రహృదయము ప్రయత్నించినది. సిద్ధాంతమునందు బ్రాహ్మణుడును చండాలుడును శివస్వరూపు లని యాచార్యస్వాములు సిద్ధాంతము చేసినను నాచరణమునందు సంఘ జీవనమునందు శివారాధనమునందు భక్తబృందావనమునందు కులగోత్ర స్వరూపములైన భేదావరణములు భేదములను బెంచి వర్తమాన కాలమునందువలెనే నిందాసూయలకు దుర్బలమునకు గారణములుగ బరిణమించినవి. ఆచార్యస్వాములవారు ప్రతిపాదించిన "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను సిద్ధాంతమున కర్థాపత్తిని గలుగజేయుటకు బసవేశ్వరుడు దలపెట్టెను. బసవేశ్వరుడు మహాభక్తుడు. బ్రాహ్మణ కులజుడు. బాల్యమునందే బ్రాహ్మణకర్మలను నిరసించి భక్తిజ్ఞాన సమ్మిళితమైన లింగధారి మతవ్యాపనమునకు బూనుకొనెను. జీవేశ్వరులకు ప్రవృత్తియందు గల యవ్యవహిత సంబంధము నిత్యానుభవ మయినపుడు పరమార్థసందర్శనము గలుగునవు డద్వైతసిద్ధి భక్తులకు గలుగుచున్నది. బసవేశ్వర సిద్ధాంతములను పండితపామర హృదయములందు వ్యాపింపజేయుటకు సోమనాథుడు తన యప్రతిమానమైన ప్రజ్ఞాపాండిత్యములను వినియోగించి కీర్తికాముడయ్యెను. గురులింగజంగముల కైక్యమును సోమనాథుడు బోధించి కులగోత్రములను వదలి బసవకులగోత్రములను స్వీకరించెను. లింగధారణము శివభక్తబృందావనమునందు గురులింగజంగము భేదావరణముల గూలద్రోసి సకలజనులకును శివస్వరూపమును గలుగజేయుచున్నది. వృషాధిపశతకమునందీపరమార్థమును తత్త్వభావమునను వర్ణరూపమునను సోమనాథుడు మనోహరముగ నుపదేశించెను. సోమనాథుడు శివసాయుజ్యమునకు శ్రీ గురుమూర్తియైన బసవేశ్వరునకు వలె జంగమస్వరూపులైన భక్తులకును భృత్యభావమును బూనిన విధమును శతకము దెలుపుచున్నది. లింగాంగులైన కిన్నరయ్య, మాచయ్య, బాచిరాజు, బంకిదేవయ్య, చౌడయ్య, బొప్పయ్య, బ్రహ్మయ్య మొదలగు భక్తులకు జంగమభక్త బృందావనమునందు కులగోత్ర స్థితిభేదములు పోయి శివభక్తుల స్థానము లభించినది. జీవేశ్వరులకు విశిష్టాద్వైత మతస్థులు గల్పించిన శాంతి దాస్య సఖ్య వాత్సల్య మధురావస్థలను సోమనాథు డీశతకమునందు పెక్కుస్థలములందు వ్యక్తము చేయుచు సకల జంగమ ప్రపంచమును సీమాత్రబద్ధముచేసి శివమయముచేసి పరమార్థమును గనుగొనిన విధము నీ క్రింది పద్యము తెలుపుచున్నది.

ఉ. నాయొడయండ నావిభుఁడ
 నాహృదయేశ్వర నామనోరమా
నాయిలువేల్పు నావరద
 నాగురులింగమ నాదుజంగమా
నాయధినాథ నావరుఁడ
 నన్ను గృపామతిఁ బ్రోవుమయ్య దే
వా యమి బృందవంద్య బస
 వా! బసవా! బసవా! వృషాధిపా!

గ్రంథవిస్తరభీతిచే నీవిషయము నింతటితో నాపి విషయార్థ స్ఫురణమున కనుభవసారమునందలి పద్యముల నుదహరించుచున్నాను.

క. ఇంద్రియపరవశు డధముం
 డింద్రియ నిగ్రహుడు భక్తియెడ మధ్యముడై
 యింద్రియజయు డుత్తముడు శి
 వేంద్రియసంధాయకుడు మహేశుడు గాడే.

క. ఈకుల మాకుల మనక ని,
 రాకులమతి వారికొరత లరయక భక్తా
 నీకము శివుడని కొలచిన
 చేకొనడే వాంఛితార్థ సిద్ధి మహాత్మా.

క. అర్థార్థము వ్యవసాయము
 అర్థము జంగమహితార్థ మదియును సద్భ
 క్త్యర్థము పద్భక్తియు ము
 క్త్యర్థం బటుగాన వలయు వ్యవసాయ మిలన్.

వృషాధిపశతకము భాషయందును భావములందును భక్తి రసోదయమునందును పెక్కుగ్రంథములకు మార్గదర్శకమై సోమనాథారాధ్యుని ప్రతిభను వెల్లడిచేయుచున్న విధము వీక్రిందిపద్యము విశదము చేయుచున్నది.

ఉ. లింగమయాంతరంగ గురు
 లింగపదాంబుజభృంగ సత్ప్రసా

వాంగ కృపాపరిస్ఫురద
　　పాంగ విముక్తభుజంగ జంగమా
త్తుంగ విదాక్షిషంగ గత
　　దుష్కృతభంగ మదీయలింగ నీ
వంగడ మేఁటికయ్య బస
　　వా! బసవా! బసవా! వృషాధిపా!

### పాఠములను సరిచూచిన వ్రాతప్రతులు

ఈ గ్రంథమును అచ్చుకూర్చుటకు ముందు పాఠభేదములను గుర్తించుటకై చెన్నపురిలోని దొరతనమువారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమువారి గ్రంథాలయమునందలి గ్రంథముల నుపయోగించుకొన్నారము. ఇందు ప్రదర్శించిన నంబరులు పై భాండాగారమువారి గ్రంథముల నంబరులని కృతజ్ఞతతో చదువరులకు తెల్పుచున్నారము.

12—9—14 ఇది తాళపత్ర గ్రంథము. సంపూర్ణముగ నున్నది. 104 పద్యము లిందుగలవు. వ్రాత తిన్ననిది. కాపీరు చేయుటలో దీనికి 'అ' అని చిహ్నముంచినాము.

13—3—15 ఇది కాగితపు ప్రతి. దీనియందు 108 పద్యములు గలవు. ఇందలి వ్రాతకూడ తిన్ననిదే. దీనికి 'ఇ' అను గుర్తుంచినాము.

13—9—18 ఇదియును తాళపత్రముల ప్రతియే. ఇందు గూడ 109 పద్యము లున్నవి. దీనికి 'ఉ'యను గుర్తుంచినారము.

14—14—22 ఇదియును తాళపత్ర గ్రంథమే. ఇది చాల ప్రాచీనము. దీనికి ఇందు 'ఊ' యను గుర్తుంచితిమి. ఈ పుస్తకము చివరను ప్రతినిలేఖకులు ఈవిధముగా ప్రతిని లిఖించిన కాలమును పేర్కొన్నారు. "క్రోధినామ సం॥ర ఆషాఢ శు 11 జయవారమునాడు వృషాధిపశతకం సంపూర్ణముగా అడ్డిగెల మల్లన వ్రాసిన ప్రతిని కాంజి వీరమల్లు వ్రాసికొనెను."

### పెక్కుభాషల పద్యముల తాత్పర్యము

(50) ఇది సంస్కృతమున రచించినస్తుతి. ప్రసిద్ధమైన కీర్తిచేత పిండింపబడిన ముల్లోకములు గలవాడా! మహాపాపముల నణంచు విభవము గల పాదపద్మములు గలవాడా? ప్రకాశించుచున్న వృషభస్వరూపుడా నమస్కారము. అని భావము.

(51) అప్తులగు శివగణములు ప్రవేశించిన ఆర్తుల నన్నింటిని హరింపజేయువాడా! సుఖము నిచ్చు చిరునవ్వుతోకూడిన కటాక్షములు గలవాడా! ప్రకాశవంతములగు గుణములు గలవాడా! దీనభావముతో నీకు నమస్కారమని ప్రణమింతునని భావము. ఇదియును సంస్కృతభాషామయమే.

(52) కల్పింపబడిన లింగజంగమ సుఖములచేత వెలుగొందువాడా! (అనగా లింగజంగములకు సుఖమును గల్పించి తత్కృపను వెలసిల్లువాడా యని భావము.) నిర్వికల్ప వికల్ప మార్గములందు ఖ్యాతినొందినవాడా! గుణులకు కల్పవృక్షములాంటివాడా! అని నీకొఱకు గౌరవలీలతో నమస్కరింతునని భావము. ఇదియును సంస్కృతమయమే.

(53) పాపములను పరిహరించినవాడా! సంసారతాపమును పోగొట్టినవాడా! భక్తిచే ఉల్లసితమైన మనస్సుగలవాడా! సుగుణము లనెడి ఉత్తమరత్నములకు పెట్టెలాంటివాడా అని నిన్ను వర్ణించెనని భావము! ఈ పద్యముగూడ సంస్కృతభాషామయము.

(54) మన్మథుని చూర్ణము చేసినవాడా! భస్మవిలేపనముచే వెలుగొందువాడా! మనోరథముల నిండించినవాడా! పూర్వజన్మార్జిత వర్తనమును విడినవాడా! వర్ణభేదమును నిరసించువాడా! శివా సహితుడా! నీకొఱకు నమస్కారమును చేయుచున్నానని భావము. ఈ పద్యము పైతము సంస్కృతభాషామయమే.

(55) భవారణ్యపర్యటనముచే నలసియున్న జనులయొక్క శ్రమలను పోగొట్టజాలి, సమస్తజగములచేతను ప్రణుతింపబడిన విభాపాదద్వంద్వమును నాహృదయకమలమునందు—"నీ వా యీశ్వరా దయానిధీ! నిరంతరము సంస్మరించుచున్నా"నని నిన్ను సంస్కృతభాషతో నుతించెదనని భావము.

(56) ఇది తమిళపద్యము. వాసైవమా, నాగ (భూషణ) ధరా! దిక్కులేనివారికి దిక్కగువాడా! పెద్దయ్యా! పవిత్రము చేయువాడా! ప్రఖ్యాతుడా! దేవా! తండ్రీ! అని లర్థము గలుగునట్లు ద్రవిడభాషతో నుతింతును. అని భావము.

(57) ఇది కర్ణాటకపద్యము. పసివాడనైన నన్ను రక్షింపవలసినది. నా అవినీతు లెందును మన్నింపవలసినది. నీ పదాబ్జముల నమస్కరింపగల నీయనుగ్రహమే యిది. నీయాత్మయే దిక్కు—అని నిన్ను కర్ణాటకభాషతో నుతింతునని భావము.

(58) ఇయ్యది మహారాష్ట్రభాషా ప్రస్తుతిగల పద్యము. దేవోత్తముడవు నీవు. గురుదేవుడవని వృషభేశ్వరుడవని నిన్ను చెప్పెదను. నీయొక్క అనుగ్రహము. నన్ను దయ జూచువాడవు నీవేగదా యని నుతింతునని భావము.

(59) ఇది సంస్కృతాంధ్ర మిశ్రితమైన భాషలతో చేసిన ప్రస్తుతి పద్యము. ప్రవాళ మనగా పవడము. పవడమునం దెట్లులు ఎఱుపు తెలుపు మున్నగు రంగులు ఒకదానితోనొకటి కలిసిమెలసి ప్రత్యేకవర్ణమువలె సముజ్జ్వలములై యుండునో అట్లే వివిధభాషలలోగల పదములు ఒక్క ఛందమునందు యెనసి పెనసి యుండుటచేత నిట్టిపద్యములకు మణిప్రవాళములు అని ప్రాచీనులు పేరునుంచిరి. భక్తులయొక్క హృదయకమలము

లందు విహరించువాడా! నిరంతరము చేతులనెత్తి దేవరవారి పాద ద్వంద్వమును నమస్కరించు చున్నాననియును, హృదయమునందు ధ్యానము చేయుచున్నాననియును, నిన్ను పూజించుచున్నాననియును మణిప్రవాళముతో నిన్ను నుతించెదననియు భావము. ఇది సంస్కృతాంధ్రభాషలు మిశ్రమము చేసిన పద్యము.

(60) ఈ పద్యమునందు ద్రావిడాంధ్ర సంస్కృతములు మిశ్రము చేయఁబడియున్నవి— అరుణగిరీశ్వరుని (తిరువణ్ణామలేశ్వరుని) యనుగ్రహమును పొందినవాడా! నీయ దివ్యవర్ణనలు వినెడి భాగ్యము నాకు లభించినది. కనుక నిన్నొక్కనినే దేవోత్తముఁడవని నుతింతును అని తాత్పర్యము.

(61) ఇందు ఆంధ్ర కన్నడ సంస్కృతముల మిశ్రస్తుతి గలదు. దేవా! నీపాదదర్శనమున ఈపాపము చేటికవలె నన్ను వదలి పరుగెత్తిపోదా! వరముడా నమస్కరించెదను. ఓ న్యాయవిశేయా! నీవే దిక్కు. నీకం బెనొరులను కృతార్థులుగువారి నెఱుంగను.

(62) వ్యాఘ్రచర్మమును నాగభూషణములును సూర్యచంద్ర నేత్రములును గరళకంఠమును గంగాధరత్వమును కపాలధారణమును గల దేవునికి నీవు సేవకుడవని నిన్ను నుతింతునని భావము. ఇది అచ్చతెలుగున నుతించిన పద్యము.

(63) ఇందు సంస్కృత ద్రవిడ కర్ణాటాంధ్ర మహారాష్ట్రాది భాషలు అనేకములు గలవు — ఓ హృదయేశ్వరా! (దేవర వారి) శ్రీపాదుకను నా మనస్సునకు తెమ్ము. నీవు పరతరుడవు. పురాణుడవు. ఏమిచేయవలయును? (అనగా ఏమిచేయవలయునో ఆజ్ఞనిమ్మని యర్థము) నన్ను రక్షించు మహావిభూ! నీవు నా తండ్రివి. నా వరదుడవు. అని నిన్ను ప్రస్తుతిచేయుదును.

(64) కన్నడ సంస్కృత భాషామిశ్రిత మగు నీ పద్యము. నేను మహారసవంతమైన (నీ) పాదద్వంద్వమును అత్యాసక్తితో పాడెదను. మిమ్ముల నర్చించెదను. సమగ్రమగు (నీ) స్తుతిని మీవిషయకము లగు సత్కార్యములను విడువను.

# శ్రీ సర్వేశ్వర శతకము

శ్రీ సర్వేశ్వర శతకమును రచియించిన యథావాక్కుల అన్నమయ్య ఆరాధ్యబ్రాహ్మణుడు. ఆత్రేయగోత్రజుడు. యజుశ్శాఖాధ్యాయి. దూదికొండ నివాసియగు సోమేశ్వరారాధ్యుని శిష్యుడు. అన్నమారాధ్యుడు గోదావరీ తీరమునందుగల పట్టిసమునందు గల వీరభద్రస్వామిని సేవించుచు నచట నివసించుచుండెను. తదనంతరము శ్రీశైలయాత్రకు బోయి తిరిగి వచ్చునపుడు పల్నాటి తాలూకాయందలి సత్రశాలయందు నివసించెను. ఆ స్థలమునందే సర్వేశ్వరశతకమును రచియించి సిద్ధిని బొందెను. అన్నమార్యుని మునిమనుమడు చిట్టెమరాజు పల్నాటిసీమను నివాసమును గైకొని

యచటను చెర్లగుడిపాడు, మిరియాల, పల్లిగుంత, పశేముల, వద్దిరేల, సీతానగరము నను గ్రామములకు కరణికమును సంపాదించెను. చిట్టెమరాజు మనుమడు సోమరాజు ప్రసిద్ధపురుషుడగుటంజేసి ఇంటిపేరు సోమరాజువారుగ మారినది. ఇప్పటికిని సోమరాజువారు పల్నాడు సీమయందు గలరు. సోమరాజు వేంకటశివుడుగారు శతసంశావళిని రచియించినట్లును శేషగిరిరావుగారీవృత్తాంతమును తమకు దెలిపినటులును జయంతి రామయ్య పంతులుగారు సాహిత్యపరిషత్తువారు ప్రచురించిన సర్వేశ్వరశతకపు పీఠికయందు వ్రాసిరి.

### కాలము

అన్నమారాధ్యుడు సర్వేశ్వర శతకమునందు కృతిని రచించిన కాలమును 130 పద్యమునందును తన కులగోత్రములను 133, 140 పద్యములందును దెలిపెను.

శా. శాకాబ్దంబులు వార్ధిషట్కపురజి
త్సంఖ్యం బ్రవర్తిల్ల సు
శ్లోకానందకరంబుగా మహిమతో
శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్యస్తవ మొప్పఁ జెప్పె శుభకృ
ద్వ్యక్త వర్షంబునన్
శ్రీకంఠాశ్రితమై వసుంధరపయిం
జెన్నొంద సర్వేశ్వరా. 130

అన్నమార్యుడు సర్వేశ్వర శతకమును 1164 శాలివాహన శకాబ్దంబైన శుభకృత్సంవత్సరమునందు (క్రీ. శ. 1242) రచియించెను. అన్నమయ్యకు శతకమును రచియించినకాలమునకు 30 ఏండ్లుండిన నీకవి 1212—1270 ప్రాంతమున నివసించి యుండును. పాలకురికి సోమనాథుఁడు 1170—1220 ప్రాంతములం దుండినటులు తెలియుచున్నది. అన్నమయ్య సోమనాథుడు జీవించియున్నప్పుడే పుట్టియుండును. సర్వేశ్వర శతకమునం దనుభవ సారమునందు సోమనాథుడు తెలిపినభావములు గలవు. సర్వేశ్వర శతకపు 64—వ పద్యమునకును అనుభవసారపు 217, 218 పద్యములకును భావములు సరిపోవుచున్నవి.

శా. లింగారాధన జంగమార్చనములో
లిన్ భక్తి కంగంబు ప్రా
ణాంగ వ్యాప్తియు నై స్ఫురించు నిది త
త్సారం బగుం గాన నా
యంగాభ్యర్చన జంగమాహితకరుం
డై చేసినం దా శివ
శృంగారం బగు నా విభక్తి మదిఁ జ
ర్చింపంగ సర్వేశ్వరా. 64

క. జంగమభక్తి లింగపరి
చర్యం బోలంగ యుత్తమంబు త
జ్జంగమలింగపూజ లవి
సామ్యము వల్కుట మధ్యమంబు మున్
జంగమలింగపూజ యెడ
సల్పక లింగము గొల్చుచున్న యా
సంగ కనిష్ఠమౌట తర
తమ్ముల వత్తియె ముఖ్యమిమ్మెయిన్. అ. పా. 217

కం. జంగమపరాఙ్ముఖుండై
లింగార్చన సేయునతని లీల దలిర్పన్
వెంగలి యై శవమునకును
శృంగారముఁ జేసినట్లు శివభక్తనిధీ. అ. పా. 219

అన్నమారాధ్యుడు సోమనారాధ్యునకు తరువాతను, 1234 – 1300 వఱకు నున్న తిక్కన సోమయాజికి ముందును, సమీపకాలమునందు వర్ధిల్లి 1242 క్రీ. శక సంవత్సర ప్రాంతమునందు సర్వేశ్వరశతకమును రచియించెను.

ఈశతకము శివభక్తిపరమైన ప్రాచీనశతకము. సోమరాజు వేంకటశివుడుగారి వంశావళియం దీశతకరచనకు సంబంధించిన యీ క్రింది గాథ గలదని తెలియుచున్నది. "అన్నమయ్య కృష్ణాతీరము నందలి సత్రశాలయందు శ్రీ మల్లికేశ్వరస్వామిని సేవించుచు సర్వేశ్వరశతకమును రచించెను. పద్యముల నొక్కొక్కదానిని తాటి యాకుమీఁద వ్రాసి కృష్ణాప్రవాహమునందు వేయుచుండెను. ఎదురీదివచ్చిన యాకును దీసి దారమునకు గ్రుచ్చుటకును నా యాకు రానపుడు గండకత్తెర వైచుకొనుటకును ప్రతిజ్ఞ చేసెను.

మ. తిరుగం బువ్వులు పిండెలై యొదవి త
త్తజ్జాతితోఁ బెం పగున్
హర! నీపాదపయోజపూజితములై
యత్యద్భుతం బవ్విరుల్
కరు లౌ నశ్వము లౌ ప్రవర్ధమగు లౌ
గర్పూర వస్తార వస్త్ర
తరుణీరత్నము లౌ నటేంతరు లౌ
దత్యంబు సర్వేశ్వరా. 87

పై పద్యము కొట్టుకొనిపోవుట చూచి గండకత్తెరను వైచికొనుట కుద్యమించెను. అవు డొకవనులకాపరి తాటియాకును దెచ్చియిచ్చెను. ఆ యాకునందు 87 —వ పద్యమునకు బదులుగ నీ క్రింది 88-వ పద్య ముండుటను జూచి దానిని దారమునకు గ్రుచ్చి నియమానుసారము శతకమును ముగించెను.

మ. ఒక పుష్పంబు భవత్పదద్వయముపై
నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బున
ర్జన్మంబు లే దన్నఁ దా
యిక కాలత్రితయోపచారముల ని
ష్పర్పించుచున్ బెద్దయై
నిష్ఠికుఁడై యుండెడివాఁడు నీ వగుట తా
జిత్రంబె సర్వేశ్వరా. 88

ఈ గాథయందలి సత్యాసత్యము లెట్లున్నను రెండు పద్యములకును భావార్థమునందు గల భేదము పరమభక్తిప్రభావమును రమ్యముగ దెలుపుచున్నది. మొదటి పద్యమునందు పుష్పార్చనమునకు ఫలము మహానందపదలుగను రెండవ పద్యమునందు నైష్ఠికుని శివార్చనమునకు ఫలము కైవల్యముగను నిర్దేశింపఁబడినది.

## శతకప్రతులు

సర్వేశ్వర శతకమును శ్రీ శైవసిద్ధాంత ముద్రాక్షరశాల వారు, మద్రాసు, శ్రీ రామలింగేశ్వర ముద్రాక్షరశాలవారు, ఓరుగల్లు, సాహిత్యపరిషత్తువారు, మద్రాసు, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సు వారు, మద్రాసు, ముద్రించిరి. ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమునందును, సాహిత్య పరిషత్తు కార్యాలయము నందును వ్రాతప్రతులు గలవు. ఈ ప్రతులను సంప్రతించి పాఠభేదములను చేర్చి దీనిని ముద్రించితిమి. ఈ కవి యితర గ్రంథములను జేసినటు లూహించుట కాధారములు లేవు.

## శైలి

సర్వేశ్వర శతకమును రచియించిన అన్నమారాధ్యుని శైలి సంస్కృత పదభూయిష్ఠమైనను నాతికఠినమై హృద్యమై సరళముగ నున్నది. కొన్ని పద్యములు భాషయందును భావములందును భాగవత పద్యములను స్ఫురింపఁజేయుచున్నవి. పద్యము లర్థాలంకారములను గలిగి భక్తిరసముతో నుప్పొంగుచున్నవి. పద్యముల నడక వరుసగతిని గలిగి శ్రావ్యముగ నున్నది. కల్పనలు భావగర్భితములై శబ్దాలంకారయుక్తములై మనోహరముగ నున్నవి. పంచేంద్రియౌద్ధత్యమైన చిత్తమునకును నీఁగకును, భవపంకనిమగ్నమైన మీనమునకును జీవికిని గల్పించిన పోలిక ప్రశస్తముగ నున్నది. సర్వేశ్వర శతకమునందు 34,127 పద్యములందు బాలురు వినోదార్థమిసుక దేవాలయములను సికతాధామములను నిర్మించి యానందించెడి విధమును కవి రమ్యముగ వర్ణించెను. రవీంద్రనాథుడు గీతాంజలియందుఁ జేసిన 60 వ గీతయందలి బాలక్రీడావర్ణనము నీ వర్ణనముల కనురూపముగ నున్నవి. సర్వేశ్వర శతకమునందలి భావము లాధ్యాత్మికములు.

పారమే లేని సంసార వారిధితటిని
వేడ్క నం ద్రాటపాటలఁ జిల్ల లెపుడు.
ఇసుకచే నిండ్లఁ గట్టుచు నెనగుచుండ్రు
వట్టి గుల్లలతో నాడి పఱచుచుండ్రు.

60 గీతాంజలి, రవీంద్రుడు.

సంసార మహార్ణవ తరణ విషయమును గురుమంత్రతారక సంధానవిషయమును 69, 70 పద్యములందు జేసిన కల్పనలు గంభీరముగ నున్నవి. విశ్వేశ్వరునకు విశ్వప్రవృత్తియందు గల వైరుద్ధ్య స్థితి ఈ పద్యమునందు రమ్యముగ దెలుపఁబడినది.

మ. సకళాధీశ్వర పట్టభద్రుఁడవు భి
క్షాగామి వత్యంతశాం
త కళాతుమ్మండవు రౌద్రమూర్తి వతిసౌం
దర్యాంబికా సంగమా
ధికలోలుఁడవు దివ్యయోగివి మదిం
దెల్లంబుగా నెట్టివా
రికిఁ దా శక్యమె నీ నిజం బరసి చ
ర్చింపంగ సర్వేశ్వరా. 106

ఇట్టి మంచి కల్పనలు సర్వేశ్వర శతకమునందుఁ బాలఁ గలవు. అన్నమార్యుఁడు స్వయముగ సర్వేశ్వర శతకము విషయమై తెలిపిన భావములు యథార్థముగ నున్నవి.

శా. ధాత్రి న్భక్తజనానురంజకముగాఁ
దత్త్వప్రకాశంబుగాఁ
జిత్రార్థాంచితశబ్దబంధురముగా
సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా శుభాంచితముగా
శోధించి సర్వేశ్వర
స్తోత్రం బన్నయ చెప్పె విజ్ఞగములో
శోభిల్ల సర్వేశ్వరా. 183

### శతకార్థము

ఈ శతకమునకు మకుటము:—సర్వేశ్వరా! సర్వేశ్వర శతకమునకు మకుటము సర్వాంతర్యామి యైన సర్వేశ్వర సంబోధనము. సర్వేశ్వర సంబోధనమును నానావిధములను జేసి తనకుఁ గలిగిన శివయోగానందమును అన్నమార్యుఁడు సర్వేశ్వర శతకమునందు సువ్యక్తము చేసెను. శతకము శివభక్తిభరితమై పండ్రెండు పదుమూడు శతాబ్దులందు దక్షిణ దిగ్భాగమునందు వ్యాపించిన శైవసిద్ధాంతములను బోధించుచున్నది. బసవేశ్వరుఁడు పండితారాధ్యుఁడు సోమనారాధ్యుఁడు మున్నగు శైవభక్తులు ప్రతిపాదించిన గురులింగ జంగమారాధన రూపమైన శివారాధనమునే అన్నమారాధ్యుఁడును సర్వేశ్వర శతకమునందు బోధించెను. సర్వేశ్వర శతకమునకు భక్తియే హృదయమైనను ముక్తికి సాధనములైన నిగమాగమ వేదాంతసాధన మార్గములను సయితమన్నమార్యుఁడు సందర్భానుసారముగ శతకమునందు వివరించెను.

శతక కవులు సామాన్యముగ భావోద్రేకము గలుగునపుడు భావార్థమును వ్యక్తము చేయుటకు పద్యములను వ్రాయుచు శతకమాలికలను గూర్చుచుందురు. శతకమాలికల యందలి భావకుసుమములు రమ్యముగ నున్నను భావానుసంధానమునందు కళానైపుణము గోచరము గాకుండును. విషయార్థ విస్ఫురణమునందు పూర్వాపర సందర్భములు కొన్ని సమయములందు తక్కువగ నుండును. ఏ పద్యమున కాపద్యమే భావార్థమును దెలుపుచుండును. ముఖ్యముగ నిది నీతిశతకములందు స్పష్టముగ గనిపించుచుండును. అన్నమయ్య సర్వేశ్వరశతకమునందు నీమార్గము నవలంబించిన విధమును పదములు దెలుపుచున్నవి. సద్భక్తి చిత్తశుద్ధి తీర్థమహిమ శివయోగానందము పంచాక్షరీ ప్రభావము మున్నగు విషయార్థములను దెలిపెడి పద్యము లొక క్రమనిర్ణయము లేకయే కలిసియున్నవి. భావార్థములను శీర్షికలుగ విడదీయుట యసాధ్యముగ నున్నవిధమును విమర్శనము దెలుపగలదు.

అన్నమార్యుఁడు ముక్తికి పరిశుద్ధమైన భక్తియోగము సాధనమనియును ముఖ్యముగ భూతసేవాపరమైన జంగమభక్తి యోగము మూలసాధన మనియును సర్వేశ్వరశతకమునందు నిరూపించెను.

మ. ధరణిం గర్మవిధాన భక్తి విభవ
ధ్యానోత్తమజ్ఞానముల్
వరుసం బేర్కొన నాల్గుయోగములు త
త్త్వం బొందు నీభక్తి వి
స్తరబాహ్యక్రియ లెల్లఁ బొల్లు లగుటం
దద్భక్తియోగంబు తాఁ
బరఁగం దక్కిన మూఁడుయోగములకుం
బ్రాణంబు సర్వేశ్వరా. 65

మ. అమరంగా ధన మిచ్చి కాతురు మహీ
యఃప్రీతిఁ బ్రాణంబుఁ బ్రా
ణము సర్వంబును నిచ్చి కాతు రభిమా
నంబు న్విశేషించి మా
నముఁ బ్రాణంబును సర్వము న్విసఁగి స
న్మానంబుగా నుత్తమో
త్తమచారిత్రులు భక్తిఁ గాతురు ప్రసా
దం బంది సర్వేశ్వరా. 66

మ. తమరంగార్చనకంటె జంగమము సౌం
దర్యంబుగాఁ గొల్చుటు
త్తమ భక్తస్థితి లింగజంగములఁ ద
న్మాన్యంబుగాఁ జేత మ
ధ్యమ భక్తస్థితి లింగపూజ నధికుం
డై జంగమోపాసనా
క్షముఁడై యుండుట భక్తియం దధికని
కృష్టంబు సర్వేశ్వరా. 129

అన్నమాచార్యుఁడు చిత్తశుద్ధిలేని "బకవేషార్చనలను" "తీర్థా రాధనములను" "తర్కములను" నిరసించిన విధము బాహ్యవేష ములు భక్తిస్థానము నాక్రమించిన విధమును విశదము చేయుచున్నది. చిత్తశుద్ధిలేని శివపూజాదులను వేమనయోగి పరిహసించినటులె నా పూజాదులు జెట్టివానివిద్య లని అన్నమయ్య సత్యార్థమును దెలిపెను.

మ. ఒనరం జిత్తము శుద్ధిలేనినరుఁ డు
 ద్యోగంబునం గోరి చే
సినపూజానిభవంబు సువ్రతములున్
 శీలంబులు న్మంత్ర సా
ధనముల్ తీర్థములుం దపంబులును వీఁ
 డం జెట్టివాఁ డభ్యసిం
చిన శస్త్రాస్త్ర కళానిభంబు లగుఁ జ
 ర్చింపంగ సర్వేశ్వరా. 120

మంత్రజపము చిత్తలయమును జేసి మోక్షమును గలుగఁ జేసెడివిధ మీ క్రిందిపద్యమునందు స్వానుభవ పూర్వకముగను కవి వర్ణించెను.

మ. క్రమసంయుక్తి మనంబు బుద్ధియు నహం
 కారంబుఁ జిత్తంబు నా
యమలాంతఃకరణంబు పక్షరచతు
 ష్కవాప్తిఁగాఁ దీర్చి పం
చమవర్ణంబుగ నాత్మఁ గూర్చి కడువాం
 ఛన్ యోగి పంచాక్షరీ
సుమహామంత్రముతోడ నైక్యపదవిన్
 శోభిల్లు సర్వేశ్వరా. 121

చిత్తశుద్ధిని గలిగి భక్తియోగాభ్యాసమును జేయుచు సద్భక్తులు నిగ్రహమును బూని కర్మక్షయమును జేసి కైవల్యపదమును జేరెడివిధమును అన్నమార్యుఁడు బాగుగ నీపద్యములందు వివరించెను.

మ. వెరవం బాఱు దశప్రభంజనములన్
 శిక్షన్ సుషుమ్నంబునం
గుదియంబట్టి చలింపకుండ శశి న
 ర్కుం గట్టి భావన్మన
స్సదవస్థానమునందు నిస్తులమి సం
 స్థావ్యంబు గాఁ జేసి తా
హ్వానయానందరసాబ్ధిఁ దేలు శివయో
 గీంద్రుండు సర్వేశ్వరా. 48

మ. కలయుం గొన్నయుగంబుఁ గూర్చి తరువం
 గాఁ బుట్టు తత్సాధనం
బుల రెంటన్ దహియించువహ్నిగతిఁ దాఁ
 బొల్పొందఁ గాయంబు సం
ధిల సత్కర్మములతో మథింపఁగ భవ
 చ్చిద్భక్తి సద్వహ్ని యు
జ్జ్వలమై కాయముఁ గర్మముం జెఱుచుఁ
 దత్త్వం బెన్న సర్వేశ్వరా. 81

మ. పరువం బైకొని వచ్చుకర్మముల ము
 న్వారించి మాయామల
జ్వరము ల్వాపి యపారఘోరతర సం
 సారాబ్ధి లంఘించి తీ
కరసూక్ష్మాంగ విచిత్రతంతుకము పేఁ
 కం బుచ్చి పోనైచి తాఁ
బరమవ్యోమము సొచ్చు నీయచలస
 ద్భక్తుండు సర్వేశ్వరా. 112

అన్నమాచార్యుఁడు సర్వేశ్వర శతకమునందు శివార్చనము నకును కైవల్య ప్రాప్తికిని విధ్యుక్తములైన నిగమాగమ మార్గము లను మంత్రతంత్రసాధనములను వ్యక్తము చేసినను సత్యదయా శౌచయుక్తమైన సద్భక్తియోగమె ముక్తిసాధన మని ప్రతి పాదించెను.

మ. భవదీయార్చన సేయుచోఁ బ్రథమపు
 ష్పం బెన్న సత్యంబు రెం
డవ పుష్పంబు దయాగుణం బతివిశి
 ష్టం బేకనిష్ఠాసమా
శ్రవసంపత్తి తృతీయపుష్ప మది భా
 స్వద్భక్తి సంయుక్తి యో
గవిధానం బవి లేనిపూజలు మహిం
 గైకోవు సర్వేశ్వరా. 92

భక్తి శతకములు సామాన్యముగను ఇష్టదేవతాస్తవమయము లై యుండును. కృతి కర్తలు తమ యిష్టదేవతలను రూపవిలాస వైభవములతోఁ జిత్రించి భక్తిరసానందము ననుభవించుచు భక్త హృదయములందు భక్తిరసోదయమును గలుగఁజేయుదురు. శివ శతకము, కృష్ణ శతకము, రామతారకశతకము, నారాయణ శతకము, కాళహస్తి శతకము మున్నగు శతకములందు కృతికర్తలు వారి యిష్టదేవతలను రూపలీలావైభవములతో స్తోత్రముచేసి భక్తిరసా వేశము ననుభవించి లోకమునకు భక్తిమార్గమును బోధించిరి. పరశివారాధన పరమైన సర్వేశ్వర శతకమునందు నామరూప లీలాతీతుఁడైన సర్వేశ్వరుని భావారాధనము విశేషముగ నున్నది. ఇష్ట దేవతాస్తవపరములైన భక్తిశతకములకును సర్వేశ్వరస్తవపరములైన

మ. అమితామోదనవప్రసూనములచే
నర్పించుచో గద్యప
ద్యము లాహించి నుతించుచో వివిధ
గీత వ్రాతము ల్పాడుచో
నమృతాహారము లిచ్చుచో నిపుణతన్
యాటాడుచో నందు నీ
త్తము సద్భక్తియె నీవు చేకొను
పదార్థం బిల్ల సర్వేశ్వరా. 78

### పాఠభేదములు

ఈ శతకమును అచ్చువేయునపుడు ఆంధ్రసాహిత్యపరిషత్తు వారి అచ్చుప్రతిలోని పాఠము చొప్పుననే మూలము కూర్పబడినది. కాని పాఠసౌష్ఠవము గల చోటుల ఇతర పుస్తకములలోని పాఠములే చేర్పబడినవి. ప్రాచ్యలిఖిత భాండాగారము వారి వ్రాతప్రతులతోను వావిళ్లవారి అచ్చుప్రతితోను సంప్రతించి పాఠభేదములు మూలముక్రింద నుదాహరింపబడినవి. వీనిలో పాఠభేదముల నుదాహరించునప్పుడు పరిషత్పాఠములకు (ప) అనియును, ప్రాచ్యలిఖితభాండాగారము పాఠములకు (ప్రా) అనియును వావిళ్లవారి పాఠములకు (వా) అనియును సంజ్ఞలు వేయబడినవి. దీనిని చదువరులు గమనింపగోరెదము.

### వ్రాతప్రతులు

ప్రాచ్యలిఖితభాండాగారమునందు ఈ గ్రంథమునకు అయిదు వ్రాతప్రతులు గలవు. అవి వరుసగా (1) 11—2—22, (2) 13—4—3, (3) 13—10—19, (4) 13—3—35, (5) 14—13—17. అను సంఖ్యల పుస్తకములు. ఇందులో 2, 4 పుస్తకములు అసమగ్రములు, కాగితపు ప్రతులు. 3, 5 గ్రంథములు సమగ్రములు, చాలవరకు పరిశుద్ధములగు గ్రంథములు. ఇవి వ్రాతనుబట్టి మిగుల ప్రాచీనము లయినవని పేర్కొనదగినవి కూడనై యున్నవి. సాహిత్యపరిషత్తు భాండాగారమునందు మూడు ప్రతులు గలవు. ఆ ప్రతుల ననుసరించియే సాహిత్యపరిషత్తువారి ప్రతిముద్రితమై పాఠభేదములను గలిగియుండుటం జేసి ఆ వ్రాతప్రతుల నిచటను ప్రత్యేకముగ బేర్కొనలేదు. మొత్తముపైన ముద్రణకాలమునందు, పైని పేర్కొనబడిన ప్రతులన్నియును గూడ మాకు చాల తోడ్పడియున్నందున ఆయా గ్రంథముల రక్షకుల యెడల చాల కృతజ్ఞతఁ జూపుచున్నాము.

## శ్రీకృష్ణశతకము

శ్రీకృష్ణశతకము దేవకీనందన శతక మని నామాంతరము గలిగి యాంధ్రదేశమునందు విశేషమైన వ్యాప్తిని గలిగియున్నది. ఇంతవరకును ముద్రించిన ప్రతులయందును వ్రాతప్రతులయందును పాఠములందును పద్యముల సంఖ్యయందును భేదములు గలవు. అడయారు ప్రతియందు 116 పద్యములు గలవు. వావిళ్లవారి యచ్చుప్రతియందు 101 పద్యములు గలవు. కాలక్రమమున మూలమునందే మార్పులు గలిగినటు లూహింపదగియున్నది. దేవకీనందన శతకము నెవరు రచియించినదియును నిర్ణయించుటకుఁ దగిన యాధారములు గనిపింపవు. మహాకవి తిక్కనసోమయాజులు దేవకీనందన శతకమును శ్రీకృష్ణాంకితముగ భారత రచనానంతరము రచియించె నను ప్రతీతి చిరకాలము నుండియును వ్యాపకమునం దున్నది.

'అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై......' యను పద్య మీ శతకమునందలి దను ప్రతీతియును గలదు. తిక్కన రచియించిన కృష్ణశతకము గనిపించుట లేదు. దేవకీనందన శతకమే కృష్ణశతక మని నిర్ణయించుటకును నాధారములు గనిపింపవు. తిక్కన భారత రచనకును దేవకీనందన శతక రచనకును భావములందును భాషయందును శైలియందును సాదృశ్యము గానబడదు. భీష్ముని ముఖమునను తిక్కన చేసిన శ్రీకృష్ణస్తవమునకును కృష్ణశతకమునందలి శ్రీకృష్ణస్తవమునకును గల భేదము సంశయనివారణమును చేయగలదు. జ్ఞానహృదయసంపన్నుఁడైన తిక్కనసోమయాజి భక్తిరసపూరితమైనను జ్ఞానహృదయము లేని శృంగారభక్తిపరమైన దేవకీనందన శతకమును రచియించుట యసంభవము. విరాటపర్వాదిని తిక్కన వ్రాసిన యీ క్రింది పద్యము తిక్కన హృదయమును దెలుపుచున్నది.

ఉ. వైదికమార్గనిష్ఠ మగు
వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదము లేని భక్తి నతి
నిర్మల వృత్తిగఁ జేయుచుండి ము
త్పాద నిరంతర స్మరణ
తత్పరభావము కల్మి నాత్మ న
వేద్యముఁ బొంది కావ్యరస
ముం గొనియాడుచు నుందు దేవరన్ 15

శాంతిపర్వమునందు భీష్ముఁడు చేసిన శ్రీకృష్ణస్తవమును తిక్కన హృదయమును విశదము చేయుచున్నది.

మ. యదువంశంబున వాసుదేవుఁ డనఁ గ్రీ
డార్థంబు జన్మించి దు
ర్మద దైత్యావలిఁ గూల్చి పార్థునకు సా
రథ్యంబు త్రైలోక్యస
మ్మద మారంగ నొనర్చి దేవముని స
మ్మానోద్ధతిం భూభరం
బు దొలంగించిన చక్రి నంబుదవినా
భుం గొల్తుఁ గృష్ణాఖ్యునిన్. 47

పరమపవిత్రమైన తిక్కన హృదయమునకును దేవకీనందన శతకకర్త హృదయమునకును సంబంధ ముండఁజాలదు. దేవకీనందన శతకమునందుఁ గల శృంగార వర్ణన లీ విషయ విచారము ననవసరము చేయుచున్నవి. తిక్కన పాండురాజును గోళకుఁడని వర్ణించియుండఁడు. తిక్కన కవిత్వము నంతయును గాలించినను గనఁబడని దోషములు — భాతములు — గల దేవకీనందన శతకమును తిక్కన కవీంద్రుఁడు రచియించి యుండఁడు.

శ్రీ వంగూరు సుబ్బారావుగారు శతక కవుల చరిత్రము నందు దేవకీనందన శతకమును వెన్నెలకంటి జన్నయ్య వ్రాసినటు లూహించి కవిచరిత్రమును విపులముగ వ్రాసిరి. పెమరాజు జక్కన తన విక్రమార్క చరిత్రమునందు 'పరమ హృద్యంబైన పద్య శతంబున దేవకీతనయు విశేయుఁ జేసె' నని వ్రాసియుండుటయే యీ యూహకుఁ గారణము. జక్కన కవి 1410—1422 ప్రాంతములందు విక్రమార్క చరిత్రను వ్రాసినటులు కవుల చరిత్ర యందుఁ దెలుపఁబడినది. జక్కయ్య విక్రమార్క చరిత్రమును దేవరాయ మంత్రియైన సిద్దన్న కంకితముగ నొసఁగెను. సిద్దన్నయు జన్నయ్యయు దేవరాయ మహారాజునకు మంత్రులుగ నున్నటులు జక్కయ తన విక్రమార్క చరిత్రమునందుఁ దెల్పెను. జన్నయ్య 1406—1422 ప్రాంతములందు నివసించి యున్నటులు కవుల చరిత్రమునందుఁ దెలుపఁబడినది.

సాహిత్య పరిషత్తు గ్రంథాలయమునందును అడయారు గ్రంథాలయమునందును గల ప్రతులందు 'కవిరక్షక్రేష్ఠుఁ డావోది యై భువిఁ గావించిన యట్టి కృష్ణశతకంబున్' అను పాదములు గల పద్యములు గలవు. దీనియందు 117 సంఖ్య గల పద్యము. ఈ పద్యములు కవిరాక్షసుఁడు దేవకీనందన శతకమును రచియించినటులు స్ఫురింపఁ జేయుచున్నవని సుబ్బారావుగారు వ్రాసిరి. ఈ కవిరాక్షసుఁ డెవఁ డైనదియును పద్యములు దేవకీనందన శతక కర్తృత్వమును నిరూపించుచున్నవనియును నిర్ణయించుట కాధారములు గనిపింపవు. ఈ పద్యములు కొన్ని ప్రతులయందు లేవు. కవిరక్షక్రేష్ఠుఁ డనుటకే కవిరక్షశ్రేష్ఠుఁడని శతకకర్త వాడియుండవచ్చును. కవిరక్షక్రేష్ఠ పదమునకు కవిరాక్షసుఁ డను నర్థమును గ్రహించుట కవసరము గనఁబడదు. రక్ష రక్షక పదములు సమానార్థములుగ నున్నవి. కవిరాక్షసుఁడు 1000—1300 నడుమ నున్నటులు కవుల చరిత్రమునందు పంతులుగారు వ్రాసిరి. కవిరాక్షసుఁడు దేవకీనందన శతకమును వ్రాసినటులు నిదర్శనములు లేవు. శతకము ప్రాచీనము దైనను కర్తృత్వమును కాలమును నిర్ణయించుటకుఁ దగిన సాధనములు గనిపింపవు. తెలియని విషయములం దూహలును కల్పనములును నిరుపయోగములు. పండితు లీ విషయమును పరిశోధింతురుగాక.

## కాలము

శతకకర్తను నిర్ణయించుట సాధ్యము గానపుడు శతకకాలమును నిర్ణయించుటయును సాధ్యముగాదు. తిక్కన 1220—1300 ప్రాంతములందు నివసించినటులు వీరేశలింగము పంతులు గారును నితరపండితులును నిర్ణయించిరి. దేవకీనందన శతకము తిక్కన తరువాతి దని శతకభావార్థము తెలుపుచున్నది. అప్పకవి తన లక్షణ గ్రంథమునందు దేవకీనందన శతకమునందలి 32 వ పద్యమును దేశనిత్య సమాసవిశ్రాంతికి లక్ష్యముగ నుదాహరించెను.

మ. చతురంభోధివరీతభూవలయరా
జాసీకకోటీరరం
జితమాణిక్య విరాజమానపదరా
జీవుండు ధర్మాత్మజుం
డతిదారుణ్యముతోడ మత్స్యపతికా
ల్వాపింపఁడే నీదు శా
శ్వతకారుణ్యము గల్గ నంతకును గృ
ష్ణా దేవకీనందనా! 32

అప్పకవి తనలక్షణగ్రంథమును (1656—ఆగస్టు 4) శా. శ. 1578—వ మన్మథనామ సంవత్సర శ్రావణ బ॥ 10 గురువారమునాఁడు వ్రాయఁబూనుకొనెను. అప్పకవి కాలమునాఁటికే ప్రచారముగల దేవకీనందశతకము పదియారవ శతాబ్దియందుఁగాని యంతకుఁ బూర్వముగాని రచియింపఁబడియుండును. వెన్నెలకంటి జన్నయ్యకృతమైనచో 1420 ప్రాంతమునను రచియింపఁబడియుండును. కాని ఈ శతకమునందలి శృంగార భక్తిరస సమ్మిళితములైన వర్ణన లీశతకకాలము పదునైదవ శతాబ్ద్యంతమునకు నడుమని తోఁచుచున్నది. నారాయణశతకమునకును దేవకీనందన శతకమునకును గల పోలికలును కాలనిర్ణయమును జేయుటకుఁ దోడ్పడవు. నారాయణశతక కర్తృత్వమును సందియములతోఁ గూడి యున్నది. ఇట్టి యసందర్భస్థితియందు కాలనిర్ణయమును జేయుటయును సాధ్యముగా కున్నది.

## శైలి

శతకశైలి సరళముగను హృద్యముగను నున్నది. శైలియందు వ్యాకరణాదిదోషములు గలవు. మూలాలనిన్, చుట్టూ, ఎట్టా, చుట్టా, కొలిచేదిన్, విహరించే మొదలగు వాడుకప్రయోగములు గలవు. సంస్కృతసమాసములను గల్పించుటయందుఁ గొన్ని వ్యాకరణ దోషములును గొన్ని యతిదోషములును గలవు. సంస్కృతాంధ్ర పదములు గలిపి శైలి సులభగ్రాహ్యముగ నున్నది. కొన్ని పద్యములందు దీర్ఘసమాసములును గలవు. "హాలాహాల శిరోధివాలి నయనోద్యద్భీమ ధూమధ్వజ జ్వాలాభీల కరాళ రూక్ష విష విశ్వ్యానోష్ణ కృష్టాంబు దంతో శిఖాస్వర కాళియస్ఫుటఫణా భోగాగ్ర మధ్యంబునన్"

అని యొక దీర్ఘసమాసమును నుపయోగించెను. సామాన్యముగ పద్యము లర్థస్ఫురణమునకుఁ దగిన పదజాలమును గలిగి శ్రావ్యముగ నున్నవి. శైలియందును రచనయందును వృషాధిపశతకమునందును సర్వేశ్వరశతకమునందును వ్యక్తమగుచున్న శబ్దార్థాలంకారములును శాస్త్రాగమపాండిత్యమును గనఁబడవు. శతకమునందు వ్యంగ్యార్థము గల శృంగారవర్ణనలు గలవు. ఈ క్రింది పద్యములు శతకశైలిని దెలుపఁగలవు.

శా. మద్దుల్గూల్చినలాగొ వేగ మనిలో
మన్నించి గాండీవికిన్
బుద్ధుల్ సెప్పినలాగొ మోదరస ము
ప్పొంగన్ యశోదమ్మకున్
ముద్దుల్గా నటియించులాగొ వరుసన్
ముప్వేళలన్ వేడుకన్
వద్దు ల్మెక్కి రహించులాగొ ధరఁ గృ
ష్ణా దేవకీనందనా! 24

మ. కాలిచేదిన్ వగలేకనే నడిగితే
కోపించు టీలేకనే
చెలువం బెప్పుట కోకనే విభవముల్
చేకూరుటల్ రూకనే
బలవంతుం డగు మూకనే సతి చెడున్
ప్రాణేశుఁ డైకోకనే
జలదశ్యామల శంఖచక్రధర కృ
ష్ణా దేవకీనందనా! 42

శా. ఏలా విద్యలు సొంపు రూపవిభవం
బేలా కులీనత్వమున్
శీలత్వంబును నేల యేటికి వయ
శ్శ్రీ యేల బాహాబలం
బేలా చాతురి వాక్యసాగరిమ వి
శ్వాసంబు లేకుండినన్
జాలిం బొందినఁ గల్గునే సిరులు కృ
ష్ణా.............. 55

## శతకార్థము

ఈ శతకమునకు మకుటము — కృష్ణా దేవకీనందనా! దేవకీనందన శతకము విష్ణుభక్తిపరము లైన శతకములందు ప్రసిద్ధమైన శతకము. భాగవతభక్తి శివ కేశవ లక్ష్మీనృసింహాది దేవతాభక్తిగను నానాదేవతాభక్తిగను బరిణమించిన విధమును భక్తిశతకముల చరిత్రము విశదము చేయుచున్నది. సంస్కృతవాఙ్మయము నందలి స్తోత్రములే యాంధ్రవాఙ్మయమునందలి శతకరూపమును దాల్చినను నాంధ్ర శతకములకుఁ గల వ్యక్తిత్వమును శతకవాఙ్మయ విమర్శనమువలన విశదమగుచున్నది. పండ్రెండు పదుమూఁడవ శతాబ్దులందు దక్షిణభాగమునందు శైవవైష్ణవమతములకు సంరంభము గలిగిన విధమును శ్రీరామానుజాచార్యుల చరిత్రము విశదము చేయుచున్నది. శివభక్తులయొక్క కాషాయాంబరములు వైరాగ్యబోధనలు భిక్షాటనములు ప్రపంచ వ్యవహార మగ్నమైన ప్రజాహృదయమునకు సహ్యము గాకుండెను. భగవల్లీలాపరములై ప్రవృత్తిపరములైన విశిష్టాద్వైత సిద్ధాంతములు ప్రజాహృదయము నాకర్షించినవి. దివ్యములైన వైష్ణవ విలాసములకు సంసార ప్రవృత్తియందు సమన్వయము గలిగినది. భక్తి లాసములందు శృంగార విలాసములకు స్థాయిభావము గలిగినది. శృంగారములు భోగములు కైంకర్యములు వైష్ణవభక్తికి లక్షణములైనవి. వైష్ణవభక్తిమార్గమునే శివభక్తియును నవలంబించినది. కాలాంతరమునందు మహమ్మదీయ క్రైస్తవమతములతో భాగవతభక్తికిఁ గలిగిన సంరంభమునందు భక్తిరసమునకును శృంగార రసమునకును వియోగము గలిగినది. ఈ వియోగము వర్తమాన భక్తిశతకముల వాఙ్మయమునందు గోచరంబగుచున్నది.

భక్తిరసమును శృంగారరసముతో మేళవించినపుడు భక్తి తరంగములందు సౌందర్య రసము ప్రసరించినది. శ్రీమద్భాగవతమునందు హృద్యముగ వర్ణింపఁబడిన భక్తిశృంగార రసలీలలు కాలాంతరమునను భౌతిక శృంగారరసముగఁ బరిణమించి విషయవాసనలు భక్తుల దృష్టిని విశేషముగ నాకర్షించినవి. పదుమూఁడవ శతాబ్దియందు వెలసిన భాగవత శృంగారరసము పదునైదవ శతాబ్దియందు కాముక శృంగారరసముగఁ బరిణమించినది. శ్రీకృష్ణశతకములు శృంగార శతకములు పుట్టి విజృంభించినవి. లీలాశుకుఁడు శ్రీకృష్ణకర్ణామృతమునందు వర్ణించిన శ్రీకృష్ణ పరమాత్ముని శృంగారలీలలు దేవకీనందన శతకమునందును శృంగారశతకములందును కాముక శృంగార లీలలుగఁ బరిణమించినవి.

దేవకీనందన శతకమునందుఁ బ్రత్యక్షముగ నున్న కాముక శృంగారవర్ణన లీ శతకము వైష్ణవభక్తి హ్రాసనమునందు రెండవ యుగమునకుఁ జెందుచున్నటుల నిర్ధారణ చేయుచున్నవి. శతక కర్త తన సంకల్పమునందు విశ్వకేళీవిలాసవిహారియైన శౌరి గోపాల కృష్ణమూర్తి నుపాసింప నెంచినను జన్మసంస్కారము మనోవృత్తిని విషయవాసనలకు మరల్చినది. సంభావనయందు దివ్య మందరలీలలును ననుభవమునందు విషయలోలతయును గోచరం బగుచున్నది. శ్రీ కృష్ణమూర్తిని కొంటెదేవరనుగ వర్ణించిన 1, 2, 13 పద్యములందును 15, 22, 114 పద్యము లందును కాముక శృంగార వాసనలు విశదమగుచున్నవి. శతకము నందు 67-వ పద్యమునందు స్త్రీల శీలనిరసనమును 70, 71 పద్యములందు రాజుల శీలనిరసనమును గలవు. శతకము సంసార

వాసనాయత్తమైన ప్రవృత్తిని సూచించుచున్నను భక్తహృదయము వెల్లడిచేయుచున్న విధమును పద్యములు దెలుపుచున్నవి.

శ్రీ శంకరాచార్యుల స్తోత్రములు కృష్ణకర్ణామృతము సర్వేశ్వరశతకము బద్దెనీతులు మొదలగు గ్రంథములు శతకకర్తకు భావసంగ్రహణమునకు దోహదపడినవి. భజగోవింద స్తవమునందుఁ జెప్పఁబడిన —

శ్లో. బాల స్తావ త్క్రీడాసక్త
స్తరుణ స్తావ త్తరుణీసక్తః।
వృద్ధస్తావ చ్చింతా సక్తః
పరే బ్రహ్మణి కోపి న సక్తః॥ భజ॥

పై శ్లోకము దేవకీనందన శతకమునందలి 83 వ పద్యము పోలియున్నది. సర్వేశ్వర శతకమునందలి

మ. సురలం బ్రార్థ్యసమంబుగా మనుజులన్
శోభిల్ల బృందారకో
త్కరముంగా మను నల్పు నల్పని ఘనుం
గాఁ బుణ్యపాపాళిచేఁ
తిరుగన్వేయుచు నీ మహామహిమ శ్రీ
తిం బద్మజాండంబునం
దరయన్ జీవుల నింద్రజాలములుగా
నాడింతు సర్వేశ్వరా! 12

పై పద్యమును నీ శతకమునందలి 46 వ పద్యము పోలియున్నది. దీనియందలి 71, 72, 73 పద్యములు బద్దెనీతి సుమతిశతకమునందలి పద్యములను బోలియున్నవి. శ్రీకృష్ణకర్ణామృతమునందలి బాలగోపాలుని లీలావర్ణనముల యనుకరణము దేవకీనందన శతకమునం దంతటను గలదు. కృష్ణకర్ణామృతమునందలి—

శ్లో. ఆన్దోళితాగ్రభుజ మాకుల నేత్రలీల
మార్ద్ర స్మితార్ద్ర వదనామ్బుజ చన్ద్రబిమ్బమ్,
శిఞ్జానభూషణశతం శిఖిపిఞ్ఛమౌళిం
శీతం విలోచనరసాయన మభ్యుపైతి. 70

శ్లో. భవనం భువనం విలాసినీ శ్రీ
స్తనయ స్తామరసాసనః స్మరశ్చ,
పరిచార పరమ్పరాః సురేన్ద్రా
స్తదపి త్వచ్చరితం విభో విచిత్రమ్. 102

శ్లో. మృదుక్వణన్నూపురమన్థరేణ
బాలేన పాదామ్బుజ పల్లవేన,
అనుక్వణన్మఞ్జులవేణుగీత
మాయాతి మే జీవిత మాత్తకేళి. 77

మున్నగు శ్లోకములందలి భావములు దేవకీనందన శతకమునందలి 4, 5, 16, 18, 25, 26 ఇత్యాది పద్యములందు ప్రతిబింబించుచున్నవి. తొంబదియవపద్యమందలి ఊనావన వర్ణన శివానందలహరిలోని భావమును స్ఫురింపఁజేయుచున్నది. కవి పూర్వగ్రంథములనుండి భావములను సంగ్రహించి విస్తరించి వ్యక్తము జేసి రచనాచాతుర్యమును విశదము చేసెను.

శ్రీకృష్ణభక్తిభరితమైన దేవకీనందన శతకమునందుఁగల విశేషము నాంధ్రమున్నమైన ఈ చాటుపద్యము విశదము చేయుచున్నది.

మ. అరయన్ శంతనుపుత్రుపై విదురుపై
నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయి
న్నందవ్రజ స్త్రీలపైఁ
బరగం గల్గు భవత్కృపారసము నా
పైఁ గొంత రానిమ్ము మీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ హరి కృ
ష్ణా దేవకీనందనా! 92

శ్రీకృష్ణుఁడు యాదవవంశమునందు జన్మించి పాండవులను యాదవులను నుద్ధరించి ధర్మసంరక్షణమును జేసెను. భక్తప్రియుఁడైన శ్రీకృష్ణభగవానుఁడు పాండవుల నాపత్సముద్రమునుండి తన కృపాగమరిచే నుద్ధరించెను. గోపీగోపకుల నానందసాగరంబున నోలలాడించి లోకప్రియుఁడుగ మెలంగెను. మహాభారతమునందును శ్రీమద్భాగవతమునందును విస్తృతమైన భాగవతభక్తిని దేవకీనందన శతకముఖమునను శతకకర్త సంబోధించెను. సంసారప్రవృత్తియందు శృంగారలీలలు దుఃఖోపశమనమును సౌఖ్యానందమును గలుగఁజేయుటకు సులభసాధనములుగ నున్నవి. జీవేశ్వర సంబంధమునందును భక్తమాహేశ్వరలీలలందును సువ్యక్తమగు పరమభక్తిస్వభావము నాయికానాయకులచేష్టలందు గోచరంబగు శృంగార భక్తిభావమునను భక్తులు సంభావించుచుందురు. విశ్వేశ్వరుఁడు విశ్వమునకు తల్లియనియును తండ్రి యనియును సంభావించునటులు నాథుఁ డనియును సంభావించుటయును భక్తిపారవశ్యమునకు సాధనము.

భక్తిభావములందు ఆధ్యాత్మికపరములైన శృంగారలీలలు మోక్షమునకును ఆధిభౌతికపరములైన శృంగారలీలలు బంధనమునకును మూలము లగుచున్నవి. శృంగారలీలలకు కరుణారసము బీజముగ నున్నది. జగన్మోహనుని కరుణారసము సంసారప్రవృత్తియందుఁ బిపీలికాదిబ్రహ్మపర్యంతమును శృంగారవిలాసములందు వ్యక్తమగుచున్నది. విశ్వప్రవృత్తియందు కరుణారసానుభవమున కనన్యమైన భక్తియె సాధనముగ నున్నది. విశిష్టమైన భగవద్భక్తియందు శృంగారకరుణారసము వ్యక్తముగాఁగలవిధమును భారత భాగవతేతిహాసములు బోధించుచున్నవి. పాండవవిజయము రాధామాధవవిహారములు గోపగోపీలీలావిలాసములు మనోహరమైన భక్తి శృంగారకరుణారసవిలసితములై పరమార్థమును బోధించుచున్నవి. భక్తవత్సలుని కరుణాస్వరూపుని శృంగారమూర్తిని దేవకీనందనుని శ్రీకృష్ణుని సంబోధించిన దేవకీనందనశతకము హృద్యమై ఆంధ్రప్రజాదరణమునకుఁ బాత్రమైనది. కవి దీనహృదయముతో భక్తితత్పరుఁడై శృంగారపరమైన భక్తిశతకమును శ్రీకృష్ణున కర్పించి శతకవాఙ్మయమునందు ప్రతిష్ఠను శ్రీకృష్ణ ప్రసాదమును బడసెను.

మ. శరణాగత్యనుకూల భక్తజనర
క్షా సత్కృపాసేవ్య స
త్కరుణాపూరసుధారసంబు గల శృం
గారంబు మీమూర్తియుం
దరణోపాయ మెఱుంగలేని కలుషా
ధారున్ ననుం దావక
స్మరణాధీనుని జేయ మ్రొక్కెదను గృ
ష్ణా! దేవకీనందనా! 94

## పాఠభేదములు

ఈ శతకమును ముద్రించుటకు ముందుగా ఈ క్రింద కనఁబఱచిన వ్రాతప్రతులతో సంప్రతించుకొన్నామని కృతజ్ఞతతో తెల్పుచున్నాము.

వ్రాతప్రతులు:— (1) (నం॥ 1679 గలది) బంటు పురుషోత్తముఁడు, అనువారిచే రుధిరోద్గారి సం॥ ఆషాఢ శు 1 సోమవారమున వ్రాయబడినది. పరిషత్తులోని ప్రతితో సరిచూడబడినది. (2) (నం॥ 1640)—రెండవకృతి. ఓరియంటల్ లైబ్రరి ప్రతి 13—4—29. ఖర సం॥ ఆషాఢ శు 5. వ. సం॥ 1707. (3) అ. ఈ. చిన్నముతో అచ్చటచ్చట నున్న పాఠభేదములు అడయారు లైబ్రరీలోనివి.

# శ్రీ రఘువీర శతకము

శ్రీ రఘువీరశతకమునకు జానకీనాయకశతక మను నామాంతరమును మకుటము సూచించుచున్నది. వ్రాతప్రతులందు జానకీనాయకశతక మనియును గలదు. అచ్చుప్రతు లన్నియును రఘువీరశతక నామమునే వాడినవి. కవి శతకమునకు రఘువీరశతక నామకరణమును చేసినటులు అరువదియైదవపద్యము తెలుపుచున్నది. పద్యాంతములందు జానకీనాయకా! యని సంబోధించుటచే జానకీనాయక నామము రూఢియైనది.

శా. తారుణ్యోదయ యొంటిమిట్ట రఘునా
థా నీకు నేఁ బద్యముల్
మీఱం జెప్పెద మూరు పేరు వెలయన్
మాత్సంబుగా నంత నా
నోరుం బావన మౌను నీకరుణఁ గాం
తున్ భక్తి నన్నందఱున్
రా రమ్మందురు గారవించి రఘువీ
రా జానకీనాయకా.

శతకమును వ్రాసినకవి శతకమునందు తన కులగోత్రములను వంశనామములను దెలుపలేదు. కృతినిర్ణయము నితరగ్రంథముల యాధారమున పండితులు చేసిరి. అయ్యలరాజ వంశజుడైన రామభద్రుడు సకలనీతిసార సంగ్రహమును శ్రీకృష్ణదేవరాయలవారి యాజ్ఞానుసారముగ రచియించినటులు గ్రంథమునందు గలదు. రామాభ్యుదయమును గొబ్బూరి నరసింహరాజున కంకితము నిచ్చెను రామాభ్యుదయమునందు ఆశ్వాసాంతగద్యములు రఘువీర శతకనామముం బేర్కొనుచున్నవి.

"ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీరశతక నిర్మాణ కర్మఠ జగదేక ఖ్యాతిధుర్యాయ్యలరాజ తిప్పయ్యమనీషి పర్వతాభిధానపౌత్రా కృ

యార్య పుత్ర పరిశీలిత సమిద్ధ రామానుజ మతసిద్ధాంతమర్మ ముమ్మిడి వరదరాజాచార్య కటాక్ష వీక్షాపాత్ర హృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్ర కవి ప్రణీతంబైన రామాభ్యుదయంబునందు—"

అయ్యలకవియు భాస్కరకవియు వ్రాసిన రట్టమతశాస్త్రమునం దీ గద్యము గలదు:—

"శ్రీరఘునాయక దయాలబ్ధ సారస్వతులును రఘువీరశతక నిర్మాణకర్మఠ రాయకవి తిప్పనార్యపాలకులు మదీయాశ్రితులును"

అయ్యలరాజు తిప్పసచి
వాగ్రణిం బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిం బ్ర
ధానవరుం డగుకొండధీమణిన్
జయ్యనఁ దిమ్మయప్రభుని
సత్కవితారచనాధ్యుఁ డైన మా
యయ్యలరాజవంశజా
వాదికవీంద్రుల సన్నుతించెదన్. (హంసవింశతి)

పై గద్యపద్యములు రఘువీరశతకకర్త అయ్యలరాజువంశజుడని తెలుపుచున్నవి. అయ్యలరాజు వంశజుడైన త్రిపురాంతకుడే రామభద్రుండని నిర్ణయించుట కీగద్యము పద్యము నుపకరింపవు. క్రీడాభిరామపీఠికయందు గల యీ క్రిందిపద్యము నందియమున దీర్చి తిప్పయ్యను నిర్దేశించుచున్నదని శ్రీ వంగూరి సుబ్బారావు గారు శతకకవుల చరిత్రమునందు వ్రాసిరి. ఈపద్యము తంజావూరు రఘువీరశతక ప్రతిలో నున్నదని కొందఱు చెప్పుచున్నారు. ఈ ప్రాంతములందు గల ప్రతులలో నీపద్యము కన్పించుట లేదు.

చ. అతులప్రౌఢిమ మీఱు రాయకవి య
య్యలరాజు సత్పుత్రుఁ డం
చితభక్తిన్ త్రిపురాంతకుండు రచియిం
చెన్ తెన్గుపద్యంబులన్
శతకం బొక్కటి దీని నీవు విని యా
చంద్రార్కమై నిల్పు స
ద్వ్రతకన్యామత యొంటిమిట్ట రఘువీ
రా జానకీనాయకా. (క్రీ. రా.)

క్రీడాభిరామ పీఠికయందును, తంజావూరి ప్రతియందునుగల పై పద్యము రఘువీర శతక కర్తృత్వమును నిర్ణయింపజాలదు. త్రిపురాంతకు డొకశతకమును రచియించెననియును నయ్యది రఘువీర శతకమనియును నిర్ధారణచేసినను ఆరఘువీరశతకమే ఈ రఘువీర శతకమని పై పద్యము నిర్ధారణచేయజాలదు. రంగరాట్ఛందాది గ్రంథములందు పుత్తేటి రామభద్రుని రఘువీరశతకమునం దిందలి పద్యము లుదాహరింపబడినపుడు రామభద్రుడు రఘువీరశతకమును రచియించినటులు తెలియుచున్నది. రామాభ్యుదయ గద్యయును రామభద్రుడు రఘువీరశతకమును రచియించినటులు నిర్ధారణ చేయుచున్నది. పరోక్షమైన సాధనములు సందిగ్ధముగ నున్నపుడు రఘువీర శతక పరిశీలనము విషయనిర్ధారణమున కెంత ప్రయోజనకరమో పరిశీలింపదగి యున్నది.

ఈశతకమునందలి రెండవపద్యమునందు కవి తా నితర కావ్యములను వ్రాసినటులు దెలిపెను. రామభద్రుడు వ్రాసిన కావ్యములు గలవు. తిప్పయ్య వ్రాసిన కావ్యములు గనుపింపవు. రామభద్రుడు కృష్ణదేవరాయల నాశ్రయించినటులును రాయలకు గృతి నిచ్చినటులును సకలకథాసారసంగ్రహము తెలుపుచున్నది. రామభద్రుడు పేదఱికము ననుభవించినటులు శతకమునందలి 18, 34 పద్యములు చాటుచున్నవి. రామభద్రుడు శ్రీవైష్ణవమతము నవలంబించినటులు రామాభ్యుదయమునందలి గద్య తెలుపుచున్నది. రఘువీర శతకమునందలి 23, 67, 46 పద్యములు శ్రీవైష్ణవ మత స్వీకారమును జాటుచున్నవి. రఘువీర శతకకర్త రఘువీర నామమును బెట్టుకొనినటుల 46—వ పద్యము తెలుపుచున్నది.

శా. నీపాదోదక మాను దం దరుముకొం
టిన్ గొంటి నాలోనికిన్
నీ పళ్లెంబు ప్రసాదముం గుడిచితిన్
నీ పేరునుం బెట్టితిన్
నీ పెన్ముద్రలు దాల్చితిన్ భుజములన్
నీ వింక న న్నేగతిన్
బ్రాపై ప్రోచెదో కాని నూని రఘువీ
రా జానకీనాయకా.

ఈ పద్యార్థము రామభద్రున కన్వయించునుగాని త్రిపురాంతకున కన్వయింపదు. రామభద్రుడు 'ఆంధ్రవాగ్భాగవత కర్త నభినుతించి' యని రామాభ్యుదయమునందు పోతనామాత్యుని సంస్మరించెను. ఈ శతకమునందు భాగవత పద్యములను నారాయణశతక పద్యములను బోలిన పద్యములు గలవు.

మ. వరహారీ కుచకుంభపాళికలపైఁ
బాదాబ్జయుగ్మంబుపై
సిరమూలంబులపైఁ గపోలతటిపైఁ
గంఠంబుపైఁ గొప్పుపైఁ
బరువుల్ వాఱెడు నా తలంపులు మిమున్
భావింపఁగాఁ జేసి స
ద్వరపాథీశ్వర సన్నుఁ బ్రోవు రఘువీ
రా! జానకీనాయకా!

మ. జడిసన్ శ్రీపతి కొప్పుపైఁ దనువుపై
సంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ
బాలిండ్లపై మాత్మను

ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీ
దై నాకరం బుంట మేల్
గాదే! రాజ్యము గీర్యమున్ సతతమే?
కాయంబు నాపాయమే.

[భాగ. స్కం. 8, ప. 592]

రఘువీరశతకమునందలి 107, 109, పద్యములకును నారాయణశతకమునందలి 12, 17, పద్యములకును పోలిక గలదు. రామభద్రుడు 1509—1575 ప్రాంతములందును రామభద్రుని తాత తిప్పయ్య 1460 ప్రాంతములందును నివసించినటుల శ్రీయుత నాళికేలము సుబ్బారావు గారును వంగూరి సుబ్బారావుగారును నిర్ధారణచేసిరి. భాగవతమును రచియించిన పోతరాజు కాలము 1450 ప్రాంతమునందు నిర్ణయింపబడుచున్నది. సమకాలికులైన తిప్పయ్యకును పోతనకును భావానుకరణము సాధ్యముగాదు. ఏబది యేండ్ల తరువాతను నివసించిన రామభద్రున కిది సాధ్యము. మహానుభావుడైన భాగవతకర్త రఘువీర శతకము ననుకరించి వ్రాసెననుట సంభావ్యముగాదు. రఘువీర శతకకర్తయే భాగవతమును నారాయణ శతకమును ననుకరించుట సంభావ్యము. మహానుభావుడైన పోతన ననుకరించుట సామాన్యుల కలవిగాదు. సామాన్యుల యనుకరణము దసోభానముగ నుండునని యనుకృతములైన భావములును పోకడయును విశదము చేయుచున్నవి. పండితులు స్వాభిమానమును వదలి గ్రంథపరిశోధనము జేసి రఘువీర శతకకర్త తిప్పయ్యయో రామభద్రుడో నిర్ణయించి సత్యమును వెల్లడి చేయుదురుగాక! కవి అయ్యలరాజ వంశజుడు. నియోగి బ్రాహ్మణుడు. ఆపస్తంబ సూత్రుడు. కాశ్యపగోత్రజుడు. రామానుజ మతస్థుడు. ఒంటిమిట్టయందు వెలసిన శ్రీరఘురామునికి భక్తుడు.

## శైలి

రఘువీరశతకపు శైలి ధారాళమైన ప్రవాహము గలిగి శ్రావ్యముగ నున్నది. శబ్దార్థాలంకారములు పొందికలు భావములు రచనలు ప్రౌఢములు గాకయును సామాన్యముగ నున్నవి. భాగవతమునందువలె నేకార్థమును దెలుపు వివిధపదజాలము వాడినను దానియందుగల మాధుర్యమును రసోదయమును నిందు గానఁబడవు. నిదమునకు కవి ప్రయోగములు నిదర్శనములు.

'హత్యాదిదోషంబులున్ వేవించున్ విదళించు ద్రుంచు దునుమున్ వెంటాడు నంటుంబడున్, రాచుం ద్రోచు వడంచు నొంచు రఘువీరా! జానకీనాయకా!' శబ్దాలంకారములు 33, 92 పద్యాదులందు జూడనగును. రచనమునందును మాటలందును కొన్ని వాడుక ప్రయోగములును సామాన్యములైన భావములును న్నను పద్యరచనయును భావసంధానమును వైష్ణవభక్తి భరిత

ములై అనుభవసిద్ధములై రఘువీరశతకము భక్తిశతకములందు ప్రశస్తిని బడసినది. ఈ కవి ఇతర కావ్యముల రచియించి నటులు 2—వ పద్యము తెలుపుచున్నది. ఆ పద్యమును సమన్వయము చేయుగలవిధము పైన జర్చింపబడినది. శైలిని జూపుటకు స్థలాంతరమునం దుదాహరింపబడిన పద్యములుగాక నీ క్రింది పద్యములును నుదాహరింపబడుచున్నవి.

మ. సకృపాలోకన! నందగోపుని తనూ
జాతుండవై గొల్లవై
సకలక్షోణుల నేలినాఁడవఁట, మిం
చం గశ్యపబ్రహ్మగ
న్న కుమారుండన మిన్నుముట్టి కుఱచై
నాఁడేల నాడేల నే
రక దానంబుగ వేఁడుకొంటి రఘువీ
రా! జానకీనాయకా!

మ. శరణంబన్నను మాటమాత్రమున వి
శ్వద్రోహితోఁబుట్టుకున్
గరుణాపూర విలోకనం బొదవ లం
కారాజ్య సింహాసన
స్థిరపట్టం బొనరించినాఁడ వఁట యే
దేవుండు నీ సాటి యు
ర్వరలోనన్ ఖరరోగదూర! రఘువీ
రా! జానకీ నాయకా!

మ. నిను నారాయణమూర్తిగాఁ దలఁచుచున్
నీదండ వాదండకా
వన వాచంయము లెల్లఁ జేరి కొలువన్
వారిం గృపం జూచుటల్
వనధిం గట్టుట రావణుం దునుముటల్
వర్ణింతు రామావతా
ర నిరూఢాకృతి నిన్ను నార రఘువీ
రా! జానకీ నాయకా!

ఈ శతకమునందలి 50—వ పద్యము సర్వేశ్వరశతకము నందలి 87, 88 పద్యములను బోలియున్నది. సర్వేశ్వరశతకము నందలి భావము గంభీరముగ నున్నది. రఘువీరశతకమునందలి 57—వ పద్యమునందును సర్వేశ్వరశతకమునందలి 46—వ పద్యమునందును దెలిపిన "భ్రమరకీటన్యాయ" భావము రెండు శతకములకును గల భేదదృష్టికి నిదర్శనము.

## భావార్థము

రఘువీరశతకమునకు మకుటము – రామా ! రాఘవ! రామభద్ర! రఘువీరా! జానకీనాయకా! శతకమకుటమునందు కవి శ్రీరాముని జానకీనాయకా! యని సంబోధించుటచే జానకీనాయక శతక మనుటకు వీలున్నను రఘువీరశతక నామకరణమునే కవి చేసెనని శతకము తెలుపుచున్నది.

శా. తారుణ్యోదయ! యెంటిమిట్టరఘునా
థా! నీకు నేఁ బద్యముల్
నూఱుం జెప్పెద నూరుఁ బేరు వెలయన్
నూత్నంబుగాఁ; నంత నా
కోరుం బావన మౌను నీకరుణఁ గాం
తున్ భక్తిన న్నందఱున్
రా రమ్మందురు గారవించి రఘువీ
రా! జానకీనాయకా!

ఈ పద్యము శతకనామమును కవిహృదయమును విశదము చేయుచున్నది. భక్తులు భగవంతుని వారి వారి సంస్కారమున కనురూపమగు సంకల్పమున కనుకూలముగ భజించుచుందురు.

శ్లో. చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినో ర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!
(గీ. అ. 7. శ్లో. 16.)

లోకమునందు పుణ్యాత్ములు 1. దుఃఖార్తులుగను 2. జిజ్ఞాసువులుగను 3. అర్థార్థులుగను 4. జ్ఞానులుగను భగవంతుని భజింతురు. భక్తులందు జ్ఞాను లుత్తము లైనను దుఃఖార్తులును నర్థకాములును నధికముగ నుందురు. రఘువీరశతకకర్త కర్ణాటకరాజుల నాశ్రయించి కృతుల నిచ్చినను గౌరవముగాని ధనముగాని పొందలేదు. వ్యస్థలాధీశ్వరుడైన శ్రీ రఘువీరస్వామికి గృతి నిచ్చి పావనుడై గౌరవమును సన్మానమును నానందమును బొందగలిగెను. రాజులకు కృతి నిచ్చుటయందు గల యనౌచిత్యమును కవి యీ క్రింది పద్యమునందు దెలియజేసెను.

మ. పసిఁడిం జూచి మహాప్రదాత యని వీ
భత్సాతి కుత్సాంగు నిన్
బ్రసవాస్త్ర ప్రతిమానరూపుఁ డనుచున్
బందం బ్రియం బంద శ
త్రుసమూహాంతకుఁ డంచు నెప్పుడు నర
స్తోత్రంబు గావించు నీ
రసుఁడన్ నిన్ను నుతింపనేర రఘువీ
రా! జానకీనాయకా!

మ. అడిగేవిద్యకు లోను చేసితివి న
న్నా దంత యా దంత లే
కడియాసల్ గొనుచుం దురాత్మకుల నే
నర్థించుచున్నాఁడ; నె
న్నఁడు రక్షించెదొ నీవు నన్నుబలె నె
న్నం బేదవా? యేల యా

అడిఁ బెట్టేవు? రమావిహార? రఘువీ
రా! జానకీనాయకా!

"నిధి చాలసుఖమా? శ్రీరాముని సన్నిధి చాలసుఖమా!" యనుకీర్తనయందు త్యాగరాజు మనోహరముగ కీర్తనము చేసిన భావమునే కవి రఘువీర శతకమునందును బాడెను. ఆత్మనిరసనము రాజనిరసనము అర్థాపేక్ష మోక్షాపేక్ష మొదలగు భావములు కవి యనుభవించిన హృదయ సంతానమును దెలుపుచున్నవి. ఆత్మేశ్వరుడైన శ్రీరామమూర్తికి కవి యాత్మార్పణమును జేసి కృతార్థుడైనను శతకమునందు తన్మయత్వమును దెలిపెడి భక్తిరసానుభవము ప్రత్యక్ష మగుటలేదు.

భక్తిశతకముల చరిత్రమునందు రఘువీరశతకము నవీన మార్గము నవలంబించినది. సర్వేశ్వర వృషాధిప కృష్ణశతకాదులందు కవులు సంకీర్తనము చేసిన యిష్టదైవములు శ్రుతిశాస్త్ర పురాణాగమ ప్రసిద్ధులై వ్యాప్తినొందిన యవతారమూర్తులు. ఆబాలగోపాలము సతతము సంస్మరించెడి శ్రీరామకృష్ణాదుల మహిమ వాత్సల్య విభవాది లీలలను కవులు సంకీర్తనముచేసి భక్తిరసావేశమును వారు బొందుచు నితరులకు భక్తిరసావేశమును గలుగజేయుచుందురు. రఘువీరశతకమునకు నాయకుడు శ్రీమద్రామాయణమునందు వాల్మీకి దివ్యముగ జిత్రించిన శ్రీరామమూర్తియే యైనను ఒంటిమిట్టయందు వెలసిన రఘురాముడు. అవతారమూర్తియైన శ్రీరామమూర్తి ఒంటిమిట్ట రఘురామమూర్తిగ వెలసెను. స్థలదేవతాపరములైన శతకము లిపుడు వందలకొలదిగ గనుపించుచున్నవి. స్థానికమగు దైవభక్తి గాఢమైన భక్త్యావేశమునకు గారణంబైనను సంకుచితమైన దైవభక్తియై పరదైవ దూషణముగ నయితము పరిణమించుటకు హేతువైనది.

రఘువీరశతకము భక్తిశతక చరిత్రమునందు మఱొక విశేషమును దెలుపుచున్నది. ప్రజలకు శివకేశవాదులవలె శ్రీరామకృష్ణులును నిష్టదైవములు. వేణుగానప్రియుఁడైన గోపాలకృష్ణునివలె సీతాలక్ష్మణసహితుడైన శ్రీరామచంద్రుడును పరదైవము. వేణుగోపాలుని రసలీలలు శ్రీరాముని రసపరిగ్రహణము రసానుభవానందమునకు లక్ష్యములు. భోగత్యాగములు భక్తిజ్ఞానములు కర్మధర్మములు రసానుభవమునందు సమత్వమును బొందుచున్నవి. యమునాతీరమునందలి బృందావనవిహారములు—కావేరీతీరమునందలి శ్రీరంగకైంకర్యములు—వైష్ణవభక్తివిలాసములు. రాధామాధవుల మాయాశృంగారలీలలు సీతారాముల మానవప్రేమలీలలు భక్తిరసాశ్రయములు. భక్తిరసాశ్రయములైన భాగవత రామాయణములు భక్తిప్రభావమును మనోహరముగ వర్ణించుచున్నవి. విశ్వమయుఁడైన గోపికావల్లభుడును, ఆత్మారాముడైన సీతాపతియును భక్తత్రాణపరాయణులు. భోగమూర్తియైన శ్రీకృష్ణుని లీలలును త్యాగమూర్తియైన శ్రీరాముని లీలలును దివ్యావతార మహిమలను బోధించుచున్నవి. ఆంధ్రహృదయము ఈయుభయవైష్ణవమూర్తుల భక్తియోగైక్యమును వెల్లడి చేయఁగలిగినది. భక్తిరసామృతభరితమైన భాగవతమును రామకథామృతభరితములైన రామాయణమును కావ్యములు శతకములు భక్తిజ్ఞానసమ్మిళితమైన యాంధ్రహృదయమును దెలుపుచున్నవి. దేశమునందలి గ్రామగ్రామమునందును నెలకొన్న శ్రీ రామాలయములు, రామభజనలు, రామోత్సవములు, రామనామ పారాయణములు, రామకోటులు శ్రీరామభక్తివ్యాపనమును తెల్పుచున్నవి. ఆ వ్యాపనమునే రఘువీర శతకము తెలుపుచున్నది. ఆంధ్రహృదయమునకు శ్రీభద్రాద్రిరాము డిష్టదైవము. మనోహరమైన శ్రీరామనామమును మధురాక్షరములతో కవులు గాయకులు పండితులు పామరులు కీర్తించి యాంధ్రహృదయ స్వరూపమును సువ్యక్తము చేసిరి. శ్రీ రఘువీర శతక మాంధ్రావనియందు శ్రీరామభక్తివ్యాపనమునందలి యొక ఘట్టమును సూచించుచున్నది.

శ్రీవైష్ణవమత సంప్రదాయ వ్యాపనమునందీ శతకము వేఱొక ఘట్టమును దెలుపుచున్నది. శ్రీరామానుజాచార్యులు పదునొకండవ శతాబ్దియందు స్థాపించిన శుద్ధవైష్ణవము పదునెనిదవ శతాబ్దికి వీరవైష్ణవముగ బరిణమించినది. వైష్ణవభక్తికి బాహ్యలక్షణములు ప్రమాణములైనవి. త్రిపుండ్రధారణము చక్రాంకితములు తీర్థప్రసాదములు తులసీమాలలు భక్తచిహ్నములై వైష్ణవభక్తిరస ప్రవాహమును శుష్కింపఁజేసినవి. మతరహస్య సంప్రదాయములు నిర్జీవకళలై సదాచారములు దురాచారములైనవి.

శా. నీ పాదోదక మఠులం దదుమఁకొం
టిం, గొంటి నాలోనికిన్,
నీ పళ్లెంబు ప్రసాదముం గుడిచితిన్,
నీ పేరునుం బెట్టితిన్,
నీ పెన్ముద్రలు దాల్చితిన్ భుజములన్,
నీ వింక న న్నేగతిన్
బ్రాపై ప్రోచెదొ కాని పూని, రఘువీ
రా! జానకీనాయకా!

విశ్వవ్యాపకుడైన భగవంతునకు రూపావరణములు స్థలావరణములు గలిగినవి. పండితపామరుల దృష్టి యాంతరంగిక లక్ష్యమునుండియును సాధనము నుండియును మఱలి బాహ్యలక్ష్యమందును సాధనములందును లగ్నమైనది.

శ్రీరామభక్త పరాయణుండైన రఘువీరశతక కర్తకును నీ వాసన సోకినది. చిత్తము శ్రీరాముని చింతనమును గోరుచున్నను భక్తిని బాహ్యవేషధారణము లాకర్షించినవి.

చిత్తము "రామా! రాఘవ! రామభద్ర! రఘువీరా! జానకీనాయకా!" యనుచు మహాక్రందనమును జేయుచున్నను హృదయగ్రంథులు వీడి శ్రీరామభక్తిరసానుభవము చేయుట దుర్లభమయినది. సర్వేశ్వర వృషాధిప నారాయణ కాళహస్తీశ్వర దాశరథీ

ప్రభృతులగు శతకములందు గల భావశుద్ధి మతావేశము భక్త్యావేశము తత్త్వ సందర్శనము రఘువీరశతకమునందు దరుదుగ గన్పట్టుచున్నది.

చిత్తవృత్తికిని సంసార ప్రవృత్తికిని భక్తిరంగమున నైక్యము గలుగలేదు. కవి దురభిమానమును వదలి ముక్తికి ప్రతిబంధకములైన మలిన మనోవృత్తులను వ్యక్తము చేసెను. ఈ చిత్తవృత్తుల నాకర్షించిన కాంతా కనకాదుల భ్రాంతిని నివృత్తి చేసి ముక్తి నొసంగుటకు శ్రీ సీతారాముని — కోదండరాముని — ఒంటిమిట్ట రఘురాముని — కవివర్యుడు — కొలిచి కొనియాడి — కీర్తి కాముడై — జన్మమును సఫలము చేసెను.

శా. మోక్షాపేక్ష జనించె నాకు నిది యే
మో కాని యీ జన్మమం
దక్షీణోదయ ముక్తి నెవ్వ డొడయం
డా పుణ్యునే జెప్పెదో
దక్షారిస్తుత నీవె కర్త వటంచే
దక్కేల నీవే నను
రక్షించేవో యోటుంగ జెప్ప రఘువీ
రా! జానకీనాయకా!



## ప్రతులు

రఘువీర శతకమును బ్రహ్మశ్రీ వావిలకొలను సుబ్బారావు గారును, వావిళ్ళ వారును, కనుపర్తి మార్కండేయశర్మ గారును ముద్రించిరి. సుబ్బారావుగారు పెద్దపీఠికను వ్రాసిరి. శ్రీ వంగూరు సుబ్బారావుగారు శతక కవుల చరిత్రమునందీ శతక విషయము లను విపులముగ విమర్శించిరి. సాహిత్యపరిషత్పుస్తకాలయమునందును ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందును వ్రాతప్రతులు గలవు. ఈ శతక ముద్రణమునందీ ప్రతు లన్నియును నుపయోగపడినవి. ఇందలి పాఠభేదములు వానినుండియే తెలుపబడినవి.

# శ్రీ నారాయణ శతకము

శ్రీ నారాయణ శతకమును పరమభాగవతోత్తముండు పోతనామాత్యుడు రచియించినటులు ప్రతీతి గలదు. ఆ ప్రతీతిని సమర్థించుటకు సరియైన యాధారము లింతవఱకును చిక్కలేదు. పోతరాజు వీరభద్ర విజయమును భోగినీదండకమును నారాయణ శతకమును శ్రీమద్భాగవతమును రచియించినటులు వాడుక గలదు. వీరభద్ర విజయమును భోగినీదండకమును పోతన రచియించినదియును లేనిదియు ఇంకను నిర్ధారణ కాలేదు. పోతన రచియింపలేదను నభిప్రాయమే బలీయముగ నున్నది. ప్రస్తుత మా విషయవాదము నారాయణశతకమున కవసరము గాదు. నారాయణ శతకమును వెల్లంకి తాతంభట్టును కస్తూరి రంగయ్యయును పేర్కొనిరి. అందువలన నిది ప్రాచీనశతక మని తెలియుచున్నది. ఆంధ్రప్రజాముఖస్థమై సుప్రసిద్ధమై గంభీరమైన నారాయణ శతకమునందలి ఈ క్రింది మత్తేభవృత్తము

మ. ధర సింహాసన మై నభంబు గొడు గై
తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్ల వందిగణ మై
బ్రహ్మాండ మాగార మై
సిరి భార్యామణి యై విరించి కొడు కై
శ్రీగంగ సత్పుత్రి యై
వరుస న్నీఘనరాజసంబు నిజ మై
వర్తిల్లు నారాయణా.

భావములందును భాషయందును శైలియందును భాగవతపు రీతులను గలిగి పోతన కర్తృత్వమును సకల విధముల స్ఫురింప జేయుచున్నది.

నారాయణశతకమునకును భాగవతమునకును పద్యముల నడకయందును భాషయందును భావములందును భాగవతభక్తి యందును శైలియందును గల సాదృశ్యము పోతనరచనమని సమర్థించుచున్నది. ఈ శతకకర్తృత్వవిషయమునను ఇతర కర్తల బాధ లేనపుడును పోతనకర్తృత్వమును సంగీకరించుట యుక్తముగ

యున్నది. నారాయణశతక కర్తృత్వమును పోతనకు నిరూపించుట మలభమైనను విషయనిర్ణయమును సహేతుకముగఁ జేయుట దుర్లభముగ నున్నది. పోతన కాలనిర్ణయము స్థలనిర్ణయము దురవగాహమై దురభిమానమునకు మూలమైనది. ఆంధ్రహృదయ ప్రియుఁడును శ్రీమద్భాగవతకర్తయును నైన పోతనామాత్యుని నివాసస్థలవిషయమునను కాలవిషయమునను నిజము తేలక భేదాభిప్రాయములు ప్రబలియున్నవి. ఓరుగల్లు ఒంటిమెట్టవాద మందఱకును దెలిసిన విషయము. ఏకశిలానగర నామమును దాల్చిన యోరుగల్లు ప్రాంతమే పోతన్నకు నివాసస్థల మనుభావము పండితాదరణమును బొందినది. పోతన యింటిపేరును నొసగూర్చిన బమ్మెర గ్రామము ఓరుగల్లునకు సమీపముననే గలదు. పండితులు బాగుగ విషయాన్వేషణమును జేసి సత్యమును వెల్లడిచేయుదురుగాక!

## కర్తృత్వము

శతకమునందు కవి తన కులగోత్రనామములను దెలుపలేదు. దేశమునందు పదిపం(దెండు ప్రతు లున్నవి. శతకాంతమునందు ముద్రింపబడిన గద్యము తాళపత్రప్రతులందు లేదు. ఇది రెండు కాగితపు ప్రతులలో మాత్రము పేలసిరాతో వ్రాసియున్నది. ప్రతులను వ్రాసినవారు పోతన భాగవతగద్యమునే శతకాంతమునందు వినికిడివలననో యూహవలననో చేర్చియుందురని యూహింపదగి యున్నది. దేశమునందు వివిధప్రాంతములందుగల ప్రతులును కాలక్రమమున నేర్పడిన యనంతమైన పాఠభేదములును శతక వ్యాపకమునకును గౌరవమునకును నిదర్శనములు. నారాయణ శతకమును పోతనామాత్యుఁడు రచియించినటులు ప్రతీతిగలదని గద్యము తెలుపుచున్నను కర్తృత్వమును నిరూపణము చేయుట కిది చాలదు. దీనియందలి 98-వ పద్యమునందు "కృపకుంబాత్రుఁడనయ్య ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా!" యని కవి నారాయణమూర్తిని సంబోధించెను. ఈ పాదమునందలి భావార్థము విషయనిర్ణయమును జేయుటకు గొంత యుపయోగించుచున్నది.

ధర్మపురి సుప్రసిద్ధమైన స్థలము. మంథెన కాళేశ్వరము ధర్మపురి నిజాము రాష్ట్రమునందలి ఓరుగల్లున కనతిదూరమున గోదావరీతీరమునందు గలవు. కాళేశ్వరము మహాకవి భవభూతికి జన్మస్థాన మని ఇటీవలి పరిశోధనలు తెలుపుచున్నవి. ప్రాచీన కాలమునందును నీప్రాంతము మహాకవులకును పండితులకును నివాసస్థానముగ నుండెను. శేషప్పకృతమైన నృసింహశతకము ధర్మపురి నృసింహస్వామిని సంబోధించుచున్నది. ఈ గ్రామము లిప్పటికిని వేదశాస్త్రప్రవీణులైన బ్రాహ్మణోత్తములకు నివాసస్థలముగ నున్నవి. ధర్మపురియందు లక్ష్మీనారాయణాలయము గలదు. శతకకర్త ధర్మపురియందు ప్రతిష్ఠింపబడిన శ్రీ లక్ష్మీనారాయణుని సహజముగ స్తోత్రము చేసియుండును. ఈ పాదార్థ మోరుగల్లు వాదమునకును పోతరాజ కర్తృత్వమునకును బలము నిచ్చుచున్నది. ఏకశిలానగరమునకు సమీపమున నున్న ధర్మపురి నారాయణశతక కర్తకు నివాసస్థలమైనపుడు భాగవతకర్తకును నారాయణశతకకర్తకును సంబంధమును గల్పించుట కవకాశములు గలవు. ఈ సంబంధము రెండు గ్రంథములను బరిశీలించినపుడు స్థిరపడుచున్నది. భాగవతమునకు హృదయమైన వైష్ణవభక్తి నారాయణశతకమునకును హృదయమై భాషయును భావములును శైలియును నేక కవి హృదయమును స్ఫురింపఁజేయుచున్నవి. ఆ దృష్టితో నారాయణ శతకమును బరిశీలించునపుడు పోతరాజునకు కర్తృత్వము నారోపించుట కవకాశములు గనిపించుచున్నవి.

నారాయణశతకమునందు వైష్ణవశతకములందు సామాన్యముగ గనఁబడెడి దశావతార వర్ణనములకుఁ దోడుగ శ్రీకృష్ణావతార వర్ణన మిరువది పద్యములందు ప్రత్యేకముగ గలదు. కృష్ణావతార వింశతియందలి భావములును భాషయును శ్రీమద్భాగవతమునందలి కృష్ణావతారఘట్టమును స్ఫురింపజేయుచుండును. పోతన శ్రీమద్భాగవత రచనారంభమునందును శ్రీమన్నారాయణ కథాభివర్ణనమును జేయఁ బూనుకొనినటులు ప్రారంభించెను. ఇదియును బోతన కర్తృత్వమున కుపపన్నముగ నున్నది.

శ్రీయుత వంగూరి సుబ్బారావుగారు "పోతరాజు నారాయణ శతకమునందు భాగవతార్థమును బీజరూపముగ వర్ణించినాఁ డని యును భాగవతమునందు బీజములను పల్లవింపజేయు నుద్దేశించి నటులు సూచించినాఁ డనియును" శతకకవులచరిత్రయందు వ్రాసిరి. నారాయణ శతకమునందలి 45, 46, 47, 48 49, 50, 51 పద్యములందును నితర పద్యములందును గల "భావింతు, వర్ణింతు, జర్చింతు, వీక్షింతు, మన్నింతు, జూతు" పదములకు వర్తమానార్థమునకు బదులు భవిష్యదర్థమును గల్పించిరి. ఈ యూహ వారి సిద్ధాంతమున కనుకూలముగ నున్నను నిశ్చితార్థమును నిర్ణయించుటకు చాలకున్నది. రెండు గ్రంథములకును మూలమైన భాగవత హృదయభావైక్యము నారాయణ శతకమును భాగవతమును రచియించిన పోతనకృతి యని యూహింపదగి యున్నది.

రెండు గ్రంథములకును గల భావైక్యమును బాంధవ్యమును జూపుటకు కొన్ని పద్యము లుదాహరింపబడుచున్నవి.

శా. ధాత్రాతము నంబుజాసనుఁడవై
   పుట్టింతు విష్ణుండవై
ప్రీతిం బ్రోతు హరుండవై చెఱుతు ని
   ర్ఘేద్యంబవై త్రైగుణో
పేతుండై పరమాత్మవై నిలుతు నీ
   పెం పెవ్వరుం గాన ర
ద్వాతోద్భూత సుజాత పూజితపదా
   బ్జ శ్రేష్ఠ నారాయణా. 24

మ. శరపొందన్ ద్రుహిణాత్మకుం డయి రమా
   ధీశుండు విశ్వంబు మ

స్థిరతన్ నిల్చి కృపాకటాక్షమున ర
క్షించున్ సమస్త ప్రజో
త్కర సంహారము సేయునప్పుడు హరాం
తర్యామి యై యంతయున్
హరియించున్ జనమండు మేఘముల మా
యం జేయు చందంబునన్.
భా. ద్వి. స. 276

మ. వటుగర్భాంతరగోళభాగమున నీ
బ్రహ్మాండభాండంబు ప్ర
కటవిద్యాద్భుతలీల దాల్చి జనితా
కల్పాంత మంభోధిపై
వటపత్రాగ్రముఁ జెంది యొప్పిన మిము
న్వర్ణింపఁగా శక్యమే
నిటలాక్షాంబురుహాసనాదులకు నో
నిర్వాణ నారాయణా. 27

మ. మును కల్పాంతమునందు కుక్షి నఖిలం
బున్ దాఁచి యేకాకివై
జనలోకోపరి లోకవాసులును యు
ష్మత్తత్త్వ మార్గంబు చిం
తనముం జేయ బయోధియందు నహిరా
ట్తల్పంబునం బవ్వళిం
చిన నీ రూపము నేఁడు చూపితివి ల
క్ష్మీనాథ దేవోత్తమా. భా. చ. స. 199

మ. దళదిందీవర నీలనీరద సము
ద్యద్భాసితాకార శ్రీ
లలనాకౌస్తుభ చారువక్ష విబుధ
శ్లాఘ్యోద్భవస్థాన కో
మలనాభీ చరణారవింద జనితా
మ్నాయాద్యగంగా లస
జ్జలజాతాయతనేత్ర నిన్ను మదిలోఁ
జర్చింతు నారాయణా. 22

మ. త్రిజగన్మోహన నీలకాంతితను వు
ద్దీపింపఁ బ్రాభాత నీ
రజ బంధుప్రభ మైన చేలము పయిన్
రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసే
వ్యంబై విజృంభింప మా
విజయుం జేరెదు వన్నెకాఁడు మదిఁ నా
వేశించు నెల్లప్పుడున్. భా. ప్ర. స. 218

మ. పరమంబై పరతత్త్వమై సకలసం
పత్సారమై భవ్యమై
సురసిద్ధోరగయక్షపక్షిమునిర
క్షోహృద్గుహాంతస్స్ఫుర
ద్వరసుజ్ఞానసుదీపమై శ్రుతిక్రియా
వ్యాపారమై సిద్ధమై
వరలేకెప్పుడు నీదునామ మమరున్
సత్యంబు నారాయణా. 34

మ. అధికాఘౌఘతమోదివాకరము నై
యద్రీంద్రజాజిహ్వకున్
సుధయై వేదవినూత్నరత్నములకున్
మాత్రాభిధానంబు నై
బుధసందోహ మనోహరాంకురము నై
భూదేవతా కోటికిన్
విధియై విబుధానామరాజి వెలయున్
వేదాత్మ నారాయణా. 35

మ. పరుఁడై యీశ్వరుఁడై మహామహుఁడై
ప్రాదుర్భవస్థాన సం
హరణ క్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై
యంతర్గత జ్యోతియై

పరమేష్ఠి ప్రముఖామరాధిపులకుం
బ్రాపింపరాకుండు దు
స్తర మార్గంబున దేజరిల్లు హరికిం
దత్త్వార్థినై మ్రొక్కెదన్. భా. ద్వి. ప. 58

మ. వర దుగ్ధాబ్ధి తరంగ డోలికలలో
వైకుంఠలోకంబులో
నెరవొప్పార నయోధ్యలో మథురలో
వ్రేపల్లెలో ద్వారకా
పురిలో నాడెడుభంగి నాడుమదిలో
భూరిప్రసన్నాననాం
బురుహం బొప్ప నటించు టొప్పును సితాం
భోజాక్ష నారాయణా. 59

మ. అల వైకుంఠపురంబులో నగరిలో
నామూల సౌధంబు దా
పల మందార వనాంతరామృత సరః
ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంక రమావినోది యగు నా
పన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహి పాహి యన గు
య్యాలించి సంరంభియై. భా. అ. ప. 95

మ. నిను వర్ణింపనివాఁడు మూఁగ మదిలో
నీ సత్కథాలాపముల్
విని మోదింపనివాఁడు చెవ్డు మరి నిన్
వేఁడన్ మనోవీథినిన్
గని పూజింపని వాఁడు నాశకరుఁడా
కర్మక్రియారంభుఁడై
తనలోఁ గానని వాఁడు నీచమతి పో
తత్త్వజ్ఞ నారాయణా. 94

మ. నిను వర్ణింపని నీచబంధమతి దా
నిర్భాగ్యుఁడై మూఢుఁడై
పెనుదైన్యంబులఁ గోరి తా మనమునం
బ్రీతిన్ సుశీలంబుగా
వనలం బాటిన భూతియందు వెలయ
న్నాజ్యాహుతుల్ పూని వే
ల్చినచందంబున వ్యర్థమై తనరు మా
చిద్రూప నారాయణా. 95

మ. నిను వర్ణింపని జిహ్వ దాఁ బడటికా ?
నీలాభ్ర దేహాంగకా
నిను వాలింపని చెవ్లు దా బదటికా ?
నీరేజ పత్రేక్షణా !
నినుఁ బూజింపనికేలు దాఁ బదటికా ?
నిర్వాహక క్ష్మాతలా !
నినుఁ జింతింపని యాత్మ దాఁ బదటికా ?
నిర్వాణ నారాయణా. 96

చ. హరి భజియించు హస్తములు
హస్తము లచ్యుతుఁ గోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ
జేరిన చిత్తము చిత్తమిందిరా
వరుఁ గను దృష్టి దృష్టి ముర
వైరి నుతించిన వాణి వాణి య
క్షరు కథ లాను కర్ణములు
కర్ణములై విలసిల్లు నో భువిన్.
భా. ద. ప. 965

శా. రాణించెం గడు నంచు నీ సహచరుల్
రాగిల్లి సోలంగ వీ
వేణుక్వాణము వీనులం బడి మహో
వీథుల్ బయల్ ముట్టఁగా
పేణాగ్రంబులు మీఁది కెత్తుకొని లాం
గూలంబు లల్లార్చి గో
శ్రేణుల్ చిందులు ద్రొక్కియాడుటలు
నేఁ జర్చింతు నారాయణా. 50

మ. నవమాధుర్యము గల్గు కృష్ణు మురళీ
నాదామృత స్యందముల్
చెవులం జొచ్చి హృదంతరాళముల భా
సిల్లన్ సవత్సంబులై
యువిదా మేపులకుం దొలంగి మృగగో
యూథంబు లుత్కంఠతో
దివికిం గంఠము లెత్తి లోవదలుఁ బో
దేహేంద్రియ వ్యాప్తులన్. భా. ద. ప. 1127

మ. మమతన్ మోములు మీఁదికెత్తుకొని రో
మంథంబు సాలించి వా
త్యమలాగ్రంబులఁ గృష్ణు నిర్చి మురళీ
గానామృత శ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేత మాని గళితా
నందాశ్రులై చిత్రితో
పమలై గోవులు సూచుచున్న వవిగో
పద్మాక్షి వీక్షించితే. భా. ద. ప. 788

శా. చన్నుల్ మీఁదికి వొంకరింప నడుముం
జవ్వాడఁ గందర్పునం
పన్నాశ్యంబు నటింపఁ జూడ్కిఁ గటకీ
భారంబు లాటాడఁగా
విన్నాణంబుల నొప్పు గోపికలు గో
బృందంబుతో వచ్చు వి
పన్నుల్ నన్నుల ముంచి గ్రోలుటలు నే
వర్ణింతు నారాయణా. 46

మ. స్తనభారంబున డస్సి క్రుస్సి యుపడై
జవ్వాడు మధ్యంబుతో
జనితస్వేదముతోఁ జలత్కబరితో
స్రస్తోత్తరీయంబుతో
వనజాక్షిన్ సూడఁ బాతి తిరిగెన్
వారించుచున్ వాకిటన్
మనబోఁగీంద్రమనంబునున్ వెనుకొనం
గా లేని లీలారతున్. భా. ద. స. 370

శతకార్థము విమర్శించెడి సందర్భమున నీ విషయము మరల విమర్శింపబడును.

పోతనామాత్యుఁ డారువేలనియోగి బ్రాహ్మణుడు. కౌండిన్యస గోత్రుఁడు. శివభక్తుడైన బమ్మెర కేసన లక్కమాంబల తనయుఁడు. ఓరుగల్లునకు సమీపమునందు గల బమ్మెర నివాసిగా యుండును.

కా ల ము

శ్రీమద్భాగవత కర్తయైన బమ్మెర పోతనామాత్యుని కాలమును నిర్ణయము చేయుటయును సులభసాధ్యము గాదు. కవుల చరిత్రమునందు పోతరాజు క్రీ. శ. 1405 ప్రాంతమునందు జననమొంది శ్రీనాథునకు సమకాలికుఁ డైనటులు వ్రాయఁబడి నది. భాగవతపీఠికయందు పోతరాజు 1378 ప్రాంతమునందు జనన మొందినటులు వ్రాయబడినది. సాహిత్య పత్రికయందు పోతరాజు 1380 ప్రాంతమునందు నివసించినటు లూహింపఁబడి నది. వంగూరి సుబ్బారావుగారు శతకకవుల చరిత్రమునందు 1480–1520 ప్రాంతమునందు పోతరాజు నివసించియుండు నని యుక్తియుక్తముగ నిర్ణయించిరి. ఈ కాలనిర్ణయముల పరిశీలన మీ శతక సందర్భమునందు దుర్లభము.

నారాయణశతకమునందు వైష్ణవమతవ్యాపనమునందు పర వైష్ణవమును వర్ణించెడి వర్ణనలు తక్కువగ నున్నవి. రామానుజ మతవ్యాపనమును సూచించెడి భావములును తక్కువగ నున్నవి. రఘువీరశతకమునందుగల వైష్ణవసంప్రదాయములు నారాయణశతకమునందు గనబడవు. పోతనామాత్యుని తలిదండ్రులు శివభక్తులని భాగవతమునందు పోతన వర్ణించెను. భాగవతరచనకాలము నందు శైవమత మోరుగల్లు ప్రాంతమునందు ప్రబలియున్న విధమును చరిత్రము విశదము చేయుచున్నది. ఈ కారణములవలనను నారాయణశతకము వైష్ణవమతవ్యాపనమునందు మొదటియుగమునకు చెందియున్నటులు నిర్ణయ మగుచున్నను తగిన యాధారములు లేక పోవుటవలనను కాలనిర్ణయము చేయుట కష్టసాధ్యము. నారాయణ శతకకర్త పోతనామాత్యుఁడు శతకమును భాగవతమునకు బూర్వమే రచియించె నని యంగీకరించినపుడు శతకము పదునాలవశతాబ్ది యందు రచియింపబడినటు లూహింపదగియున్నది.

శై లి

శతకశైలి భాగవతశైలివలె మనోహరముగ నున్నది. భాగవతమునందువలె మహాప్రవాహమును గలిగి శైలి రసవంతమై కర్ణపేయముగ నున్నది. శతకము శబ్దార్థాలంకారములతో నిండి భాగవతశైలిని సంస్మరింపజేయుచున్నది. భావములు భాగవతభక్తి పరితములై భక్తిరసావేశమును గలుగజేయుచున్నవి. భాగవతరచనము నందువలె పద్యములు సంస్కృతాంధ్రపదమిశ్రితములై పండిత పామరాదరణమును బొందుచున్నవి. పద్యములందు గల పదలాలిత్యము ధారాప్రవాహము మంజులస్వరము మహాకవిహృదయమును వ్యక్తము చేయుచున్నవి. భావములును భాషయును నన్యోన్యానుకూలతను గలిగి పండిత హృదయమును వ్యక్తము చేయుచున్నవి. శతకమునందలి 5, 61 పద్యములు కవీశ్వరునకు వేదపురాణ శాస్త్రములందు గల పరిచయమునకు నిదర్శనములు.

శతకమునందలి యనేకపద్యము లేకభావమును భిన్నభిన్న విధముల మధురముగ హృద్యముగఁ దెలుపగల ప్రజ్ఞకు నిదర్శనములై యున్నవి.

మ. ఒకర న్మక్కి క్రోధన పుణ్యములకుం
బుట్టిల్లు వైరాగ్యంబునం
దునికిస్థాన మదిష్ట భోగములకు
న్నుత్పత్తి యేప్రొద్దునున్
ఘనపాపంబుంవైరి షడ్రిపులకున్
గాలావసానంబు మీ
వినుతాంఘ్రిద్వయ పద్మసేవన గదా
విశ్వేశ నారాయణా. 36

మ. నిరతానంద వియోగులై విరసులై
నిర్భాగ్యులై హీనులై
కరుణాహీనమనస్కులై కఠినులై
కష్టాత్ములై నష్టులై
పరుషవ్యాధినిబద్ధులై పతితులై
భిన్నాంగులై గ్రుగ్గువా

ధరయుం మీ మ్రొగ్గి నాత్మదుఃఖ మిడనివా
రబ్జాక్ష నారాయణా. 79

శబ్దాలంకార ప్రయోగములు శతకమునం దంతటను గనుపట్టుచున్నవి. భావరూపకల్పనలయందు శతకశైలి శ్రీకృష్ణకర్ణామృతము సర్వేశ్వరశతకము శివానందలహరీమహిమ్నాది స్తోత్రములు భాగవతము మొదలగు గ్రంథములశైలిని బోలి గంభీరముగను మనోహరముగను నున్నవిధము నీ క్రిందిపద్యములు తెలుపుచున్నవి.

మ. లలితంబైన భవత్తనూ నవలస
ల్లావణ్య దివ్యామృతం
బలఁ గుల్కొందఁ గటాక్షకుడ్యములుగా
నందంద గోపాంగనల్
తలఁపు ల్పాదులు గట్టి కందళితనూ
త్నస్త్రీలు వాటింతు రా
వెలఁతల్ తీవెలు చైత్రవిస్ఫురణనా
సీయొప్పు నారాయణా.

మ. విదితామ్నాయనికాయఘాతములలో
విజ్ఞాన సంపత్కళా
స్పదయోగీంద్ర మనస్సరోజములలో
బ్రహ్మేంద్రదిక్పాలక
త్రిదశవ్రాతకిరీటరత్నములలో
దీపించుచున్నట్టి నీ
పదపద్మంబులు భావగేహమున నే
వరింతు నారాయణా.

శా. చేలం గోలయుఁ గూటిచిక్కము నాగిం
గీలించి నెట్టెంబుగాఁ
బీరింఛముఁ జుట్టి వెన్నడుమునం
బింఛావళిం గట్టి క
ర్ణాలంకారకదంబగుచ్ఛమధుమ
త్తాళీస్వనం బొప్పు నీ
బాలం గాచినభావ మిట్టి దని నే
వర్ణింతు నారాయణా.

నారాయణశతకకర్త కావ్యకళావిదుఁ డని శతకరచన విశదము చేయుచున్నది. శతకమును ప్రాకృతశతకముల సంప్రదాయము ననుసరించి వివిధశీర్షికల క్రిందను విభజించి విషయావగాహనమును సులభము చేసినవిధము తుది పద్యము తెలుపుచున్నది.

శతకమును 1. ఆదిదశకము 2. అవతారదశకము 3. దివ్యరూపదశకము 4. నామప్రభావదశకము 5. కృష్ణావతారవింశతి 6. జ్ఞానవింశతి 7. మోక్షవింశతి యను శీర్షికలక్రిందను విభజించి విషయపరిజ్ఞానమును సులభముచేసి కవి తన కళానైపుణ్యమును సువ్యక్తము చేసెను. ఇతర భక్తిశతకములందును భగవంతుని నామరూపమహిమాదుల వర్ణనము లున్నను నారాయణశతకమునందు వలె విషయవిభాగము స్పష్టముగఁ గనబడదు. శైలి సంస్కృతాంధ్రపదమిశ్రితమై భాగవతభావగర్భితమై శబ్దార్థాలంకారరంజితమై సరళగతిశోభితమై రసవంతముగ నున్నను పోతనామాత్యుని భాగవతశైలితో దులదూగజాలదు.

## భావార్థము

నారాయణశతకమునకు మకుటము:—నారాయణా! పురుషార్థప్రదమైన యష్టాక్షరీమంత్రము వైష్ణవమంత్రరాజము. నారాయణశతకకర్త నారాయణ మంత్రోపాసకుఁ డని శతకార్థము విశదము చేయుచున్నది.

మ. కలుషౌఘవినాశకారి యగుచుం
గైవల్యసంధాయి యై
సరి నొప్పారెడు మంత్రరాజ మగు నీ
నామంబు ప్రేమంబుతో
నరు లెన్నెన్ని వాక్కునం బొరయదే
సన్నిచు ఘోరాత్మయుం
వెలయుం భూరుహకోటరం బదియు సూ
వేదాత్మ నారాయణా.

నారాయణశతకము పరిశుద్ధమైన వైష్ణవభక్తిని బోధించుచున్నది. శ్రీకృష్ణుని శృంగారలీలలందును శ్రీమన్నారాయణుని నిర్గుణస్థితియందును పరిశుద్ధమైన వైష్ణవభక్తి వైష్ణవభక్తులకు ప్రత్యక్షమగుచున్నది. వాసుదేవు నెవ రేరీతిని గొలుచుచున్నారో వారల కారీతిని గోవిందుఁడు ప్రత్యక్షమగుచుండును.

మ. ఇల నెవ్వారిమనంబులం దెటుల దా
నెంతెంత గల్గుండు నా
కొలఁదిం జెంది వెలుంగుచుందువు నెసన్
గోవింద నీ రూపులన్
సలిల స్వంబుమితంబులై సరసిలో
నంభోరుహంబుల్ దగన్
విల నొప్పారెడు చంద మొందె దెపుడు
న్నీలాంగ నారాయణా.

భగవద్భక్తికి మూలసాధనము చిత్తసమర్పణ మనియును చిత్తశుద్ధిలేని బాహ్య వేషములు నిరర్థకములనియును నారాయణశతకము బోధించుచున్నది. ఆ బోధ శతకమునం దంతటను గోచరం బగుచున్నది.

మ. తపముల్ సత్క్రతు పంచయజ్ఞఫలముల్
దాన క్రియారంభముల్

జపము ల్పుణ్యసుతీర్థ సేవఫలముల్
సద్విప్ర విజ్ఞానముల్
ఉపవాస వ్రతధర్మశీలఫలముల్
నొప్పారు ని న్నాత్మలో
నుపమింపంగలవారికిం గలవు వే
యు న్నేల నారాయణా,

చిత్తశుద్ధిని గలిగి శ్రీమన్నారాయణుని సేవించి తరించుటకు సదాచారము ముఖ్య సాధనము. సదాచారవర్జితుని కైన జప నియమాదులు కొంగ జపములై భాగవత భక్తి కైంకర్యమునకు నిరుపయోగములుగ నుండును.

మ. సతతాచారము సూనృతంబుఁ గృపయున్
సత్యంబునున్ శీలమున్
అతిశాంతత్వము చిత్తశుద్ధికరమున్
నధ్యాత్మమున్ ధ్యానమున్
ధృతియుం ధర్మము సర్వజీవహితముం
దరారంబు గాకుఁడ స
మ్మతికిం జేరువ మీనివాససుఖమున్
మానాథ నారాయణా.

నారాయణశతకము వైష్ణవపదము సర్థించుచున్నను విశిష్టాద్వైతసిద్ధినేకాక అద్వైతసిద్ధిని సయిత మర్థించుచున్నది. జ్ఞానవింశతియందును మోక్షవింశతియందును నీభావము వ్యక్తమగుచున్నది. నారాయణశతకమునందు బీజరూపముననున్న యీభావము భాగవతమునం దన్ని ఘట్టములందును గోచరంబగుచున్నది.

మ. సరిఘోరాంధక బోధకారణ విప
త్సంసారమాలిన్యముం
బరమానంద సుయోగనిర్మల లస
ద్భస్మంబుపై నూఁది యా
నిరతజ్ఞానసుకాంతి దర్పణమున
న్నిస్సంగుఁడై తన్నుఁ దా
నరయుం గాంచినవాఁడు నిన్నుఁ గనువాఁ
డబ్జాక్ష నారాయణా.

నారాయణశతకము మోక్షప్రాప్తికి సాధనములైన కర్మమార్గమును జ్ఞానమార్గమును భక్తిమార్గమును ఉపదేశించుచున్నను శతకమునకు భక్తియే హృదయముగ నున్నది. కవి "నే నీ దాసుఁడ నీవు నాపతివి నిన్నేకాని యొండెవ్వరిన్ ధ్యానింపం బ్రణుతింపను" అని శ్రీమన్నారాయణున కాత్మసమర్పణమును జేసిన విధమును శతకము విశదము చేయుచున్నది. కవి సంబోధించిన నారాయణుడు కాలాంతరమునను వెలసిన వ్యక్తి నారాయణుడు గాక విశ్వమయుడైన యాదినారాయణుడు. ఆదినారాయణుఁ డవ్యక్తుడు దివ్యాత్ముడు వేదాత్ముడు నిత్యాత్ముడు భూతాత్ముడు దోషఘ్నుడు కర్మఘ్నుడు. ఆదినారాయణమూర్తి విశ్వలీలా విహారములందు భిన్నరూపములను ధరించి లోకము నుద్ధరించుచుండును. వామనుని భయంకరలీలలందును శ్రీ కృష్ణుని శృంగారలీలలందును నారాయణ స్వరూపము భాగవతోత్తములకు గోచరంబగుచుండును. ఈ భావమునే కవి నారాయణశతకమునందు సువ్యక్తము చేసెను. శతకమునందు శ్రీ కృష్ణుని శృంగారలీల లధికతరాదరణమును బడసినవి.

పోతరాజునకు శ్రీమన్నారాయణమూర్తి శృంగారమూర్తి, చారుకరుణామూర్తి సద్భక్తిమందారమూర్తి. భగవంతుని శృంగార విభూతులు విశ్వమును భాగవతమయముచేయుచు గారుణ్యామృతమును చరాచర ప్రపంచమునందును బ్రత్యక్షముచేయుచుండును. బాలగోపాలుని మురళీగానము గోవర్ధనమునకును గోబృందమునకును గోపాలురకును గోపాంగనలకును బ్రహ్మానందమును గలుగజేసినది. కవి నారాయణశతకమునందు త్రికరణశుద్ధిగ విశ్వమయుడైన భగవంతుని గొనియాడి పరమార్థమును బొందగలిగెను. కవి చిత్తశుద్ధిగల భాగవతశ్రేష్ఠుడనియును, లౌకికసంపదల నారాధించి విఫలమనోరథుడైన విరాగి కాఁడనియును శతకార్థము దెలుపుచున్నది. నారాయణశతకమునందు భాగవతమునందు బ్రత్యక్షముగనున్న యద్వైతసిద్ధి పరిస్ఫుటము గాకపోయినను విశుద్ధమైన భాగవత హృదయము సర్వత్ర గోచరంబగుచున్నది. నారాయణశతకమునం దాంధ్రహృదయ లక్ష్యములైన భక్తిజ్ఞానయోగములు మనోహరముగ సంయోగమును బొంది భక్తిశతకములందీశతకమునకు బ్రతిష్ఠ గలిగినది. కవి మమతాహంకారములను విసర్జించి యార్త హృదయముతో నారాయణోపాసనమును జేసి కైవల్యపదమును జేరి జన్మసాఫల్యమును గాంచిన విధమును ఈ శతకము భక్తులకు జూపుచున్నది.

మ. మమతాకార వికారసంపద మహా
మత్తాళిలో నంధకా
రనుచే ముక్తికి వేగుమార్గ మెఱుఁగన్
రా దింక నాలోనికిన్
విమలాపాంగ దయాదివాకరు వెసన్
వీక్షింపఁగాఁ జేయుమీ
కమలానంద విహారవక్షఃలలితా
కంజాక్ష నారాయణా.

## పాఠాంతరములు

ఈ శతకమును ముద్రించునప్పుడు చెన్నపురిలోని ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమునందలి వ్రాతప్రతులతో సంప్రతించి పాఠాంతరములను గైకొంటిమి. కావున సర్వదా వారి యెడల విందులకు కృతజ్ఞతఁ జూపుచున్నారము.

"సెర్లోఒకసిన్నబెడ్డేస్తే అలపుట్టి సెరువు సివరికంటా
పోతోంది-సూడుమావా- మనందరం సెర్లో నీరంటోళ్లం!
ఒక్కబొట్టుకదిలిత్తే నీరంతా కదులుద్ది!
మంచిమడిసిని కొడితే వూరందరికీ తగులుద్ది!
నిన్నుకాదని వూరుబతకలేదు. వూర్ని కాదని నువ్వుపోలేవు
ఎందూరంపోయినా సెర్లోసేపలా ఈ సెర్లోనే!
యాడకి పోయినా ఈ మడుసులతే!
మంచోళ్లూ సెడ్డోళ్లూ అని యిడిగా వుండరు మావా
మంచీ సెడ్డా కలిస్తేనే మడిసి"



తెలుగు
సినిమా
చరిత్రలో
ఇది
'సాక్షి'
నామ
సంవత్సరం

నందనా ఫిలింస్

నిర్మాతలు సురేష్ కుమార్ శేషగిరి రావు
సంగీతం కె.వి. మహదేవన్ కెమెరా పి.ఎస్. సెల్వరాజ్
రచన ముళ్లపూడి వెంకటరమణ దర్శకుడు బాపు
శ్రీ సారథీ స్టూడియోస్

NVKK

మ. దినముం జిత్తములో సువర్ణముఖరీ
తీరప్రదేశామ్రకా
ననమధ్యోపలవేదికాగ్రమున నా
నందంబునం బంకజా
సన విష్టున్నినుఁ జూడఁగన్న నదిపో
సౌఖ్యంబు లక్ష్మీవిలా
సిని మాయానటనల్ సుఖంబు లగునే
శ్రీకాళహస్తీశ్వరా. 35

మ. పవి పుష్పంబగు నగ్ని మంచగు నకూ
పారంబు భూభాగమౌ
బవు శత్రుం డతిమిత్రుఁడౌ విషము ది
వ్యాహారమౌ నెన్నఁగా
నవనీమండలిలోపలన్ శివశివే
త్యాభాషణోల్లాసికిన్
శివ! నీనామము సర్వవశ్యకరమౌ
శ్రీకాళహస్తీశ్వరా! 45

శా. పాలుం బువ్వయుఁ బెట్టెదం గుడువరా
పాపన్న రా! యన్న నే
లేలెమ్మన్న నరంటిపండ్లుఁ గొని
తేదెమ్మన్న నే నొల్ల నం
చేలాలింపరె తల్లిదండ్రు లపు డ
ట్లే తెచ్చి వాత్సల్యసం
క్తి శ్రీలాలనసంబుధిం గడపరా
శ్రీకాళహస్తీశ్వరా. 52

శా. అధివ్యాధులు దీపనాదులు కళ
త్రాపత్యముల్ చావగా
బాధల్ పెట్టఁగ నన్నదమ్ములను బో
నిప్పింతురుం దోడుగా
వేధగ్నిం బని కల్గఁజేసితివి ని
న్నేరీతిఁ జింతింతు నా
రే ధీరుల్ నినుఁ గొల్వ నుండఁగలరా
శ్రీకాళహస్తీశ్వరా. 133

## భా వా ర్థ ము

శతక మకుటము :— శ్రీకాళహస్తీశ్వరా! శ్రీకాళహస్తి మాహాత్మ్యమునం దీమకుటార్థము రమ్యముగను వర్ణింపబడినది. స్వయంభవమైన లింగమునకు సాలెపురుగును పామును ఏనుగును కన్నప్పయును జేసినయుపచారములనుబట్టి యీ పేరు గలిగినటుల పురాణగాథ గలదు. కావ్యము కవిహృదయభావావేశమును దెలుపుచున్నను మానవప్రవృత్తిని ద్యోతకముచేయుచు ఆచారణమును బడయుచున్నది. నిత్యజీవితానుభవమునందు మానవులకు గావ్యములు సుఖదుఃఖానుభవములను ప్రత్యక్షముచేయుచు పురుషార్థములను బడయుటకు సాధనంబు లగుచున్నవి. ఈ శతకకర్తకు సంసార తాపత్రయానుభవము వైరాగ్యమును గలుగజేసి మోక్షకాంక్షను బుట్టించినది. కవి ఆకాలపు కవులవలె రాజాశ్రయమును జేరియును రాజుల నేకారణముననో విశేషముగ నిరసించెను. శతకమునందుగల "రాజాధమ శ్రేణీద్వారము" "రాజామాత్యులు" "రాజకీటకములు" "నృపాలాధముల్" "లోకకంటకులు" "అధములు" "భూభృత్పుండ ఖరు" "రాజామాత్యులు వారి సేవ నరకప్రాయంబు" మొదలగు ప్రయోగములు రాజనిరసనమును సూచించుచున్నవి. దీనియందలి 14, 49, మొదలగు పద్యములు కాముక చిత్తవృత్తిని, 36, 69, 134 పద్యములు బాంధవద్వేషమును దెలుపుచున్నవి. కవికి యౌవనమునందు సమ్మోహనమునకు గారణంబులైన కామినీ కనకంబులు కాలాంతరమునందు వైరాగ్యమునకు సాధనంబులైనవి. భోగములు యోగమునకు సాధనంబులైనవి. కవి యౌవన దశయందు కామపరతంత్రుడైనను కాలక్రమమునను కర్మపరిపాకమున మోక్షార్థియైనటులు శతకార్థము విశదము చేయుచున్నది. తప్పులనుజేయుట మానవ స్వభావము. త్రికరణశుద్ధిగను పశ్చాత్తాపమును బొంది చిత్తమును శివార్పణము చేయుట ముక్తికి మార్గము. కాళహస్తీశ్వర శతకమునందీ భావార్థములను నీ క్రింది పద్యములు విస్పష్టము చేయుచున్నవి.

శా. సంతోషించితిఁ జాలుఁజాలు రతిరా
జద్వార సౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ జాలుఁజాలు బహురా
జద్వార సౌఖ్యంబులన్
శాంతిం బొందెదఁ జూపు బ్రహ్మపదరా
జద్వారసౌఖ్యంబు ని
శ్చింత స్వాంతుండ నౌదు నీకరుణచే
శ్రీకాళహస్తీశ్వరా! 62

రతిరాజద్వార సౌఖ్యంబులు రాజద్వార సౌఖ్యంబులు బ్రహ్మజ్ఞానమునకు సాధనంబు లైనవిధమును పై పద్యము తెలుపుచున్నది.

మ. ఉయుపాసై వరియింపవచ్చుఁ దనపా
దాంభోజతీర్థంబులన్
దయతో నొమ్మనవచ్చు సేవకుని వ
ర్థప్రాణదేహాదులం
న్నియు నాసొమ్మనవచ్చుఁ గాని పిదుల
న్నిందించి నిన్నాత్మ ని
ష్క్రియతం గానఁగరాదు పండితులకున్
శ్రీకాళహస్తీశ్వరా! 73

శ్రీరంగనీతులలో నెన్నింటినైనను జెప్పవచ్చును నిష్కామ చిత్తముతో నీశ్వరుని గొల్చుట దుర్లభము.

మ. వెనుకం జేసిన ఘోరదుర్దశలు భా
వింపంగ రోఁతయ్యెడున్
వెనుకన్ముందర వచ్చు దుర్మరణము
ల్వీక్షింప భీతయ్యెడు
న్ననుఁ నేఁ జూచియు నా విధు ల్దలఁచియు
న్నాకే భయంబయ్యెడుం
జెనకుం జీఁకటి నాయెఁ గాలమునకున్
శ్రీకాళహస్తీశ్వరా! 76

కవి తన పాప కార్యములకు పశ్చాత్తాపమును బొందిన విధమున కీ పద్యము నిదర్శనము.

శా. లేవో కానల కందమూలఫలముల్
లేవో గుహల్ తోయముల్
లేవో యేఱులఁ బల్లవాస్తరణము
ల్లేవో సదా యాత్మలో
లేవో నీవు విరక్తుల న్మనుప జా
లిం బొంది భూపాలురన్



సేవ ల్సేయఁగఁబోదు రేలొకొ జనుల్
శ్రీ కాళహస్తీశ్వరా! 46

రాజసేవానిరసనమును వైరాగ్యానందమును పై పద్యమునందు పరిస్ఫుటము చేయబడినది.

శా. రోసీరోయదు కామినీజనుల తా
రుణ్యోరుసౌఖ్యంబులన్
పాసీపాయదు పుత్రమిత్రజన సం
పద్భ్రాంతి, వాంఛాలతల్
కోసీకోయదు నా మనం బకట! నీ
కుం బ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీని త్రుళ్లణఁపవే
శ్రీకాళహస్తీశ్వరా! 32

తృష్ణావేగమును సంహరించి చిత్తశాంతిని ప్రసాదింపుట కీశ్వరుని వేడుచున్నాడు.

శా. జాతుల్సెప్పుట సేవసేయుట మృషల్
పండించు టన్యాయవి
ఖ్యాతిం బొందుట కొండెకాఁడగుట హిం
సారంభకుం డౌట మి
థ్యాతాత్పర్యము లాడు టన్నియుఁ బర
ద్రవ్యంబు నాశించి యా
శ్రీ తా నెన్నియుగంబు లుండఁ గలదో
శ్రీ కాళహస్తీశ్వరా! 100

మ. మది నిన్నేమఱకుండు వారలకు గా
మక్రోధముల్ ముక్తిసం
పద లీపోవుట తెల్లమయ్యె నవినా
భావైక విజ్ఞానసం
పదలై పం జిలుకాడ పీవనుచు స
న్మార్గంబునం భిక్షరా
జి దివారాత్రులు చెప్పఁగా విని మదిన్
శ్రీకాళహస్తీశ్వరా! 122

మ. కడుపే పట్టఁగలేక లోకముల కా
కంబట్ల మారూరివెం
బడి నింటింటఁ గడుంగడుం గృపణతం
బైత్యం బపేక్షించి వేఁ
డెడి విష్కారణ దుఃఖవృత్తిఁ బడుచుం
డెందంబునం నిన్ను దలఁ
చెదు నన్నుం గరుణింపరాదగదె! యో
శ్రీకాళహస్తీశ్వరా! 141

మానవులు భగవంతుని సేవించుచు గామితార్థములను బడయుచురని శ్రీకృష్ణభగవానులు గీతయందు వివరించిన భావములకు శతకములు ప్రమాణములుగ నున్నవి.

శ్లో. చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!

భగవద్భక్తులందు మోక్షకాములైన జ్ఞానులుత్తములు. మోక్షకాములైన శతకకర్త శ్రీ కాళహస్తీశ్వరుని త్రికరణశుద్ధిగను స్తోత్రముచేసి భక్తిరసానందమును భక్తులకు సాక్షాత్కారము చేసి శివసాయుజ్యమును బడయగలిగెను.

మ. అడుగన్ బద్మజకల్పముల్ ప్రదుకఁ బ
ద్మాధీశ్వరత్వంబు వి
న్నడుగన్ నాసవవైభవం బడుగ లో
కైకాధిపత్యంబు నే
నడుగన్ నీచరణాంబుజాతయుగళ
ధ్యానంబు నా కిమ్ము నే
చెడుపంతల్ దిగద్రావివైతు నిదిగో
శ్రీ కాళహస్తీశ్వరా. 138

పాఠభేదములు

ఈ ప్రతిని సిద్ధముచేయుటయందు ఈ క్రింది యైదు ప్రతులు సంప్రతింపబడినవి. అందు మొదటి మూడును చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తకభాండారమునందలి 10—3—21, 11—2—25, 11—2—27 నంబరులు గలవి. నాలవది వావిళ్లవారిచే 1911 సంవత్సరమున ముద్రిత మయినది. ఐదవది మంజువాణివారిచే ముద్రితమయినది. వీనికి వరుసగా 'ఆ. ఆ. ఇ. వా. మం.' అను సంకేతాక్షరము లుపయోగింపబడినవి. శతకమునందు నం 141 పద్యముల సంఖ్య ప్రక్షిప్తత్వమును సూచించుచున్నది. పద్యములు 46, 92 సమానార్థమును దెలుపుచున్నవి. ఇట్టి పద్యములు మఱికొన్ని గలవు. కాలక్రమమున ననుకరణ పద్యములు క్రొత్తవి గ్రంథమునందు ప్రవేశమును బొందినవిధమును గ్రంథపరిశీలనము విశదీకరించుచున్నది.

# దాశరథి శతకము

శ్రీ రామభక్తి పరములైన శతకములందు దాశరథిశతక మాంధ్రహృదయ రంజకమైన శతకరత్నము. ఆంధ్రభాషామాధుర్యమును రామదాసభక్తి మాధుర్యమును భద్రగిరి శ్రీరామభక్తి మాధుర్యమును దాశరథీశతకమునందు సమ్మేళనము నొంది శతక మఖండమైన భక్తిరసానందమును శ్రీరామభక్తులకుఁ బ్రత్యక్షము కావించుచున్నది. దాశరథీ శతకవ్యాపన మీశతక మాంధ్రహృదయాదరమును బడసినవిధమును విశదము చేయుచున్నది. ఒకటి రెండు తరములకుఁ బూర్వమువఱకు దాశరథీశతకమును రుక్మిణీకల్యాణమును బడులందు జదివించుట యాచారముగ నుండెడిది. అక్షరాస్యులైనను గాకపోయినను "శ్రీ రఘురామ చారుతులసీదళదామ" యని తమనోటిని పావనముచేయుట విద్యాభ్యాసమునకు లక్ష్యముగ నుండెడిది. ఆంగ్లవిద్యాప్రభావ మాంధ్రహృదయమును వ్యత్యస్తము చేసినది. యేట్సువర్గము కటాక్షమువలన బడులు విరళములైన "కాకి కుక్క" కథలను పాటలను గఱపుచున్నవి. సరసమైన "పరమదయానిధే పతితపావననామ హరే యటంచు"ను మధురాక్షరములను గఱపెడి బడులు మచ్చునకైనను గనఁబడకున్నవి. ఇంతటితో నీ యుపాఖ్యానమును జాలించి ప్రస్తుతాంశమును గూర్చి చర్చించుట కర్తవ్యము.

కర్తృత్వము

ఈ శతకమునందు గ్రంథకర్త తన కులగోత్ర నామాదులను 102, 103 పద్యములందుఁ దెలియఁజేసెను:—

ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ
డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం
చెర్లకులోద్భవుం డనఁ బ్ర
సిద్ధుఁడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచి
యించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను
దాశరథీ కరుణాపయోనిధీ.

కంచర్ల గోపన్న ప్రథమశాఖాబ్రాహ్మణుఁడు. ఆత్రేయసగోత్రజుఁడు. లింగన్న కామాంబల తనయుఁడు. రామానుజమతస్థుఁడు. భట్టరాచార్యశిష్యుఁడు. నిజామురాష్ట్రమునందుగల నెలకొండపల్లెయందుఁ బుట్టినవాఁడు. అక్కన్న మాదన్నలకు మేనల్లుఁడను ప్రతీతియును గలదు.

రామదాసు నామమునఁ బ్రఖ్యాతుఁడైన గోపన్నచరిత్రము రామదాసుచరిత్రమునందు సవిస్తరముగఁ గలదు. గోపన్న బాల్యము నుండియు శ్రీరాముని గొలుచుచుండెను. కబీరదాసువలనఁ దారకమంత్రము నుపదేశము నొందెను. శ్రీరామకైంకర్యమునకుఁ దన పొత్తంతయు వినియోగించెను. బంధుమిత్రుల బలవంతమువలన అక్కన మాదన్నలను జేరి భద్రాచలసమునకుఁ దహసీలుదారు పదవిని బడసెను. తాలూకాసిస్తు దస్తులను శ్రీ భద్రాద్రిరాముని కైంకర్యమునకు వినియోగించి పండ్రెండు సంవత్సరముల కారాగృహవాస దండనము ననుభవించెను. ఆ కాలమునందు రామదాసుచేసిన శ్రీరామసంకీర్తనము రామదాసు కీర్తనలుగ దేశమునం దంతటను వెలసినవి. శ్రీరాముఁడు తానీషాకు సొమ్మునుఁ జెల్లించి రామదాసును విడిపించెను. రామదాసు భద్రాచలరాముని సేవించుచుఁ బరమపదము నొందెను.

## కాలము

గోపన్న కాలనిర్ణయమును జేయుటకుఁ దగిన యాధారములు గనిపించవు. తానీషాయుదంతమును అక్కన్న మాదన్నల బంధుత్వ మును నమ్మినయెడల నితఁడు 1630 – 1680 ప్రాంతములందు నివసించియుండును. అక్కడి శాసనములును రామదాసు 1630 ప్రాంతములందు నివసించినటులు నిరూపించుచున్న వని మద్దాల గురుబ్రహ్మశర్మగారు శ్రీ వంగూరి సుబ్బారావుగారికి వ్రాసియుండిరి. పరిశోధకులు విషయాన్వేషణమును జేసి కాలనిర్ణయమును జేయవలసి యుందురు.

## శైలి

శైలి ధారాళమై మధురముగ నున్నది. భాష సంస్కృతాంధ్ర పదసంకలితమై సులభగ్రాహ్యముగ నున్నది. అంత్య ప్రాసములు ముక్తపదప్రాసములు శబ్దాలంకారములు గలవు. సర్వేశ్వర, వృషాధిప శతకములందుఁ గల నిగమాగమశాస్త్ర వైదుష్య మీశతకము నందుఁ గనబడదు. రామతారకశతకమునందుఁ గల వేదాంతభావ ములును గనిపించవు. భక్తిరసప్రవాహము శతకమునం దంతటను గలదు. వాడుక ప్రయోగము అచ్చటచ్చట గన్పట్టుచున్నను బద్య ములు రసవంతములై సలక్షణముగ నున్నవి. మూఁడవ పద్యము నందు "దుర్వ్యసనముఁ జెంది కావ్యసుదుదాత్తుల కిచ్చితి నోనసమయ్యెను" యని వ్రాయుటవలన నితరకావ్యములను వ్రాసిన ట్లూహింపఁదగియున్నను నా కావ్యములు గనిపించుటలేదు. శతకమును సంప్రదాయానుసారముగ దశకవిభాగముఁ జేసినటులు వర్ణనలు విభాగములు సూచించుచున్నను శతకమంతయుఁ గలిసి మిశ్రితమై యుండుటవలన కవిహృదయానురూపమైన విభజనము దుస్తరముగ నున్నది. ఇందలి 39, 64, 84 పద్యములు శివానందలహరిలోని 14, 27, 7 శ్లోకములను, 100, 101 పద్యములు సర్వేశ్వర శతకమునందలి పద్యములను బోలియున్నవి. ఇతర స్తవములను శతకములను బోలిన పద్యము లనేకములు గలవు. శైలిని దెలుపుటకు కొన్ని పద్యము లుదాహరింపఁబడుచున్నవి:—

ఉ. రంగదరాతిభంగ ఖగ
　　రాజతురంగ విపత్పరంపరో
తుంగతమఃపతంగ పరి
　　తోషితరంగ దయాంతరంగ స
త్సంగ ధరాత్మజాహృదయ
　　సారసభృంగ నిశాచరాబ్జమా
తంగ శుభాంగ భద్రగిరి
　　దాశరథీ కరుణాపయోనిధీ.

చ. 'పరమదయానిధే పతిత
　　పావననామ హరే' యటంచు సు
స్థిరమతులై సదా భజన
　　సేయు మహాత్మల పాదధూళి నా
శిరమునఁ దాల్తు మీ కరుణఁ
　　జేరకుఁ డంచు యముండు కింకరో
త్కరముల కానఁ బెట్టునట
　　దాశరథీ కరుణాపయోనిధీ.

ఉ. చిక్కనిపాలపై మిసిమిఁ
　　జెందిన మీఁగడ పంచదారతోఁ
మెక్కినభంగి నీ విమల
　　మేచకరూపసుధారసంబు నా
మక్కువ పళ్లెరంబున స
　　మాహితదాస్య మనేటి దోయిటన్
దక్కె నటంచు జుర్రెదను
　　దాశరథీ కరుణాపయోనిధీ.

చ. పసరరి చిక్కె మైనసకు
　　వాచవికిం జెడిపోయె మీను తా
వినికికిఁ జిక్కెఁ జిల్వ కను
　　వేదుఱుఁ జెందెను లేళ్లు తావిలో
మనికి నశించె నాకుఁ దర
　　మా యిరుమూఁటిని గెల్వ నైదు పా
ధనసులు నీవె కావఁ దగు
　　దాశరథీ కరుణాపయోనిధీ.

ఉ. భూపకులప్రదీప మణి
　　భూషణ కాంతికలాప ఖండనో
ద్దీపితదివ్యచాప జగ
　　దీడ్యదురాప మహాప్రతాప సం
తాపితవైరిభూప విగ
　　తప్రకటాఖిలపాప పుణ్యసం
స్థాపనరూప భద్రగిరి
　　దాశరథీ కరుణాపయోనిధీ.

## భావార్థము

ఈ శతకమునకు మకుటము:—భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. భద్రాచలము సుప్రసిద్ధమైన శ్రీరామక్షేత్రము. శ్రీ సీతారామలక్ష్మణులు వనవాసమును భద్రగిరిప్రాంతములందే చేసి యుందు రనియును నాసికప్రాంతములందుఁ జేసియుండరనియును కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు నిర్ణయించిరి. ఈ నిర్ణయము వలన భద్రగిరి ప్రాచీనమైన క్షేత్రమని విశద మగుచున్నది. ఆంధ్ర దేశమునందలి శివక్షేత్రములందు శ్రీగిరియును శ్రీరామక్షేత్రము లందు భద్రగిరియును దుర్గమము లైన సుప్రసిద్ధక్షేత్రములు. శ్రీగిరి భద్రగిరి క్షేత్రములు దుర్గమము లైన పర్వతారణ్యా

వ్యాతవములై కృష్ణాగోదావరీతీరముల నలంకరించిన పుణ్యక్షేత్రములు. ఈ క్షేత్రయాత్రలు దురారాధ్యములైనను మనోహరములై భక్తుల నాకర్షించుచున్నవి. శివరాత్రికి శ్రీశైలమునకును శ్రీరామనవమికి భద్రాద్రికిని వేనవేలు భక్తులు గుంపులు గుంపులుగ భగవన్నామస్మరణమును జేయుచు దుర్గమారణ్యములందుఁ బయనము చేయుట మనోహరముగ నుండును. యాత్రికులు గుంపులుగుంపులుగఁ బయనముచేయుచు మఠములందు వనభోజనములను జేయుచు గిరికాంతారముల నడుమను భజనలను జేయుచు శివరామకీర్తనలను బాడుచు యాత్రనుజేయుట మనోహరముగ నుండును.

భక్తవత్సలుడైన భద్రగిరీశ్వరుని ప్రభావము దాశరథీ శతకమునకు హృదయము. రామదాసు శ్రీరాముని త్రికరణశుద్ధిగను సేవించి దుఃఖమును జయించి సుఖమును బడసెను. గోపరాజు రామదాసైన విధమును దాశరథీశతకము హృద్యముగను విశదము చేయుచున్నది. శ్రీరామభక్తి దుఃఖనివృత్తిని జేసి సుఖప్రాప్తిని గలుగజేయఁగలవిధమును రామదాసు చరిత్రము వ్యక్తము చేయుచున్నది. రామదాసనామము భాగవతభక్తులకుఁ బర్యాయపదముగను బరిణతి పొందినది.

శ్రీరామభక్తి వైష్ణవభక్తివికాసమునందు బాహ్యలక్షణ చిహ్నముల కధికమైన ప్రాముఖ్యము నొసంగక ధ్యానమార్గమున కధికమైన ప్రాముఖ్యము నొసంగుచున్నది. శ్రీరామానుజ యామునాచార్యు లుపదేశించిన శుద్ధవైష్ణవము పదునేడవ శతాబ్దియందు వీరవైష్ణవముగను బరిణమించినది. ఆంతరంగికభక్తి మాటుపడి బాహ్యలక్షణములు ప్రబలినవి. పంగనామములు తులసిపూసలు ప్రబలినవి. పదుమూఁడవ శతాబ్దియం దుదయించిన భక్తియుగము పదునేడవ శతాబ్దిని బాహ్యచిహ్నములందు లీనమై నిజస్వరూపమును గోల్పోయినది. దాశరథీశతకమునందలి గోపన్నకృతమైన స్వీయవర్ణనమే ఈ విషయమును రుజువు చేయుచున్నది.

ఉ. పట్టితి భట్టరార్యగురు
పాదము లిమ్మెయి నూర్ధ్వపుండ్రముం
బెట్టితి మంత్రరాజ మొడఁ
బెట్టితి నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ నీచరణ
కంజములందుఁ దలంపుపెట్టి పోఁ
దిట్టితిఁ బాపపుంజముల
దాశరథీ! కరుణాపయోనిధీ.

ప్రజాదృష్టి బాహ్యలక్షణములందు లగ్నమై యున్నను గోపన్నదృష్టి శుద్ధమైన రామభక్తియందు లగ్నమైన విధమును దాశరథీ శతకము విశదము చేయుచున్నది. ఆంధ్రదేశమునందు ద్రవిడదేశమునందు లేని యొక విశేషము గనుపించుచున్నది. శ్రీరామభక్తి దేశమునందు మూలమూలలను వ్యాపించియున్నది. శ్రీరామభజనలు రామమందిరములు గ్రామములకు జీవకళలుగ నున్నవి. ప్రజలు కులవివక్షలేకను బ్రాహ్మణబ్రాహ్మణేతరులు కలిపి దీపారాధనముచేసి రామభజనను జేయుచు గ్రామసంకీర్తనమును జేయుట పరిపాటిగ నున్నది. ముఖ్యముగను గ్రామోపద్రవసమయములందుఁ బ్రజలు రామభక్తిపరవశులై భజనలను జేయునపుడు చూచిన వారల కాంధ్రదేశమునందు శ్రీరామభక్తి వ్యాప్తిని గాంచిన విధము విశదము గాగలదు.

ముప్పదేండ్లకుఁ బూర్వము రామదండు మహాప్రవాహమువలె వెలి దేశమును భక్తిరసమునందు ముంచినది. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు శ్రీరామకైంకర్యమునకును దేశకైంకర్యమునకును రామదండును స్థాపించుటకుఁ బ్రయత్నములను జేయుచున్నారు. రామభజనలందుఁ బాడెడి కీర్తనలు విశేషముగను రామదాసుకీర్తనలుగ నుండును.

రాగము—నాథనామక్రియ, ఏకతాళము

కోదండరామ కోదండరామ
కోదండరామ కోదండరామ॥
నీదండ నాకు నీవెందుఁ బోకు
వాదేల నీకు వదలుమరాకు ॥కో॥
శ్రీరామ మమ్ముఁ జేపట్టుకొమ్మ
ఆదుకో రమ్మ ఆరోగ్య మిమ్మ ॥కో॥
జయరఘువీర జగదేకశూర
భయదనివార భక్తమందార ॥కో॥
మణిమయభూష మంజులభాష
రణవిజయఘోష రమణీయవేష ॥కో॥
ఏల రావయ్య యేమంటినయ్య
పాలింపవయ్య ప్రాణ మిదయ్య ॥కో॥
తల్లివి నీవె తండ్రివి నీవె
జాతయు నీవె దైవము నీవె ॥కో॥..........

రాగము—నాథనామక్రియ, ఆదితాళము.

ఏమిరా రామా నావల్లనేర
మేమిరా రామా॥
ఏమిరామ యీలాగుకష్టము
నీమహిమో నా ప్రారబ్ధమో ॥ఏ॥
కుండలిశయన వేదండరక్షకా
ఖండతేజ నా యండనుండవే ॥ఏ॥
పంకజలోచన శంకరనుత నా
సంకట మార్పవె పొంకముతోను ॥ఏ॥
మందరధర నీ సుందరపదముల
విందిరేశ కనుఁగొందుఁ జూపవే ॥ఏ॥

దిన మొకయేడుగ ఘనముగా గడపెడి
తనయుని మీఁదను దయతో దయఁజూడ ||ఏ||
సదయహృదయ నీ మృదుపదములు నా
హృదయ కమలమున వదలక నిల్పర ||ఏ||
రామరామ భద్రాచల సీతా
రామదాసుని ప్రేమతో నేలవె ||ఏమి||

రాగము కళ్యాణి, ఆదితాళము

ననుఁ బ్రోవు మని చెప్పవే సీతమ్మ
ననుఁ బ్రోవు మని చెప్పవే||
ననుఁ బ్రోవుమని చెప్పు నారీశిరోమణీ
జనకుని కూఁతుర జనని జానకమ్మ ||నను||
ప్రక్కను జేరుక చెక్కిలి నొక్కుచుఁ
జక్కఁగ మరుకేళి జొక్కియుండెడి వేళ ||నను||
లోకాంతరంగుఁడు శ్రీకాంత నినుఁ గూడి
యేకాంతమున నేకశయ్యనున్న వేళ ||నను||
అద్రిజావినుతుఁడు భద్రగిరీశుఁడు
నిద్రమేల్కొనువేళ నెలతరో బోధించి ||నను||

రాగము శంకరాభరణము, చాపుతాళము

కంటి నేఁడు-మా రాములఁ
గనుఁగొంటి నేఁడు||
కంటి నేఁడు భక్తగణములపాలి మా
యింట భద్రగిరి నంటియున్న వాని ||కంటి||
చెలువొప్పుచున్నట్టి సీతాసమేతుని
కొలువుదీరిన మన కోదండరాముని ||కంటి||
కస్తూరితిలకము ఘననీలగాత్రము
కరుణారసము గురియు కందోయి గలవాని ||కంటి||

ఈ భద్రాద్రి రామకీర్తనలు భక్తిజ్ఞాన సమ్మిళితమైన యాంధ్ర హృదయ జిజ్ఞాసకు నిదర్శనములుగ నున్నవి. శ్రీరామభక్తి పరిపూర్ణతమైన శ్రీ త్యాగరాజ కీర్తనలును ఆంధ్రహృదయేశ్వరుఁడైన శ్రీరామచంద్రు సంకీర్తనమును మనోహరముగఁ జేయుచు రామభక్తి వ్యాసంగమును నిరతము చేయుచున్నవి.

రాగము సారంగ, ఆదితాళము

ప. ఏమి దోప బల్కుమా ఇకను నే
నెందు పోదు శ్రీరామ ||ఏమి||
అ. రామదాసువలె నైతే సీతా
భామ మందలించును నీతో తన ||ఏమి||

వరస సరస్సరోజ ఘన
పారస పార సుకీర్తిమండలా
ధరణుఁడు రంగశాయి మన
పాలగలండు విచార మేటికిన్. 91

ఉ. నల్లని మేనిచాయయును
నల్లనికంఠము గల్గు నల్లుఁడున్
వల్లని కల్వరేకులను నవ్వు
కనుంగవజాచు భార్యయున్
నల్లని చేందేవరఘు
నంబుగఁ దోడయియున్న దైత్యహృ
ద్భల్లుఁడు రంగశాయి మన
పాలఁగలండు విచార మేటికిన్ 58

చ. హరినివహంబుభాతి
విశదాండజమండలి శీల దేవతా
కరిగతి నుగ్రశైలముల
కైవడి పన్నగరాజుచండ ము
ద్దరతర తారకాపతి వి
ధంబునఁ గీర్తిఁ జెలంగు సర్వభూ
ధరణుఁడు రంగశాయి మన
పాలఁగలండు విచారమేటికిన్. 89

కని చేసినవర్ణనలనే తిరిగితిరిగి చేసినవిధమును లావణ్యాకార వర్ణనలు విశదము చేయుచున్నవి.

ఉ. హోళిని దాటకం దునిమి
యాగము గాచి యహల్యఁ బ్రోచి సీ
తాలలన వ్వరించి రణ
దర్పిత రావణ కుంభకర్ణ దై
త్యాళిని ద్రుంచి రాజ్యము
నయంబుగ నేలిన రామచంద్ర భూ
పాలుఁడు రంగశాయి మన
పాలఁగలండు విచార మేటికిన్. 28

పై పద్యములోని భావములనె 64, 87 పద్యములు తిరిగి వర్ణించుచున్నవి. శైలి కొంతవరకు శబ్దాలంకారభూయిష్ఠమై క్లిష్టముగనున్నను రసవంతమై ధారాళమై సరళముగ నున్నది. మకుటమునందు యతిస్థానమున పా వర్ణముండుటవలన, వాల్గవ పాదారంభమునం దా పవర్ణ సవర్ణమయిన హల్లును నంతస్థమైన స్వరమును జేర్చుటయందుగల క్లేశమును పద్యపాదములు విశదము చేయుచున్నవి.

## భా వా ర్థ ము

రంగశాయి శతకమునకు మకుటము:—"......రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్.''

శ్రీరంగక్షేత్రాధీశుడు శ్రీరంగనాయకుడు భక్తరక్షణభారమును వహించుచుండగను భయములేదని మకుటమునందు కవి తనకును భక్తులకును నభయమును చాటుచున్నాడు.

శ్రీరామానుజాచార్యులవారి నివాసమును వారి శిష్యుల నివాసమును శ్రీరంగక్షేత్రమునకు దక్షిణదేశమునందలి క్షేత్రములందు ప్రఖ్యాతిని గలుగజేసినవి. శైవులైన చోళరాజులు వైష్ణవమతమును స్వీకరించి శ్రీరంగాదిక్షేత్రములను మహావైభవ సమన్వితము చేసి వైష్ణవభక్తుల నాశీర్వించిన విధనును దివ్యమైన దేవాలయ ప్రాకారములును నిత్యకైంకర్యములును కల్యాణమహోత్సవములును నేటికిని విశదము చేయుచున్నవి. శ్రీమద్రామానుజకృతమైన శ్రీరంగాష్టకము శ్రీరంగమాహాత్మ్యమును దెలుపుచున్నది :

శ్లో. సప్తప్రాకారమధ్యే సరసిజముకుళో
ద్భాసమానే విమానే
కావేర్యోర్మధ్యదేశే ఫణిపతిశయనే
శేషపర్యంక భాగే,
నిద్రాముద్రాభిరామం కటినికటశిరః
పార్శ్వవిన్యస్తహస్తం
పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణం
రంగనాథం భజేఽహమ్.

వటపత్రశాయియై యవ్యక్తముగనున్న నారాయణుడు శ్రీరంగశాయియై వ్యక్తమై భక్తుల మనోభీష్టములను సఫలము చేయుచున్నాడు. శ్రీరంగేశుడు పూలరంగడును కస్తూరిరంగడునునై భక్తులను రక్షించినవిధమును శ్రీరంగక్షేత్రమాహాత్మ్యము విశదము చేయుచున్నది. శ్రీరంగక్షేత్రము కావేరి కొలరూనుల నడుమను వెలయుచున్న పుణ్యక్షేత్రము. శ్రీ వైకుంఠఏకాదశికి నానాప్రాంతములనుండియును లక్షలకొలది యాత్రికులు శ్రీరంగేశుని సేవించుట కేతెంచి స్వామిని సందర్శించి కైంకర్యమును జేయుచుందురు. శ్రీరంగనాయకులు భక్తుల యభీష్టముల నొసంగెడి విధమును కవి యిందు వర్ణించెను.

ఉ. రంగనికేతనాంతర వి
రంతరశేషసుఖోపవిష్టుఁడై
యంగనతో సిరంగపుర
మం దొగి నిల్వఁగఁ గోరి స్వర్ణ క
ల్పాంగద ముఖ్యభూషణము
లార్యులకున్ గృపసేయు భృత్య భీ

పొంగుడు రంగశాయి మన
పాలఁగలండు విచార మేటికిన్. 52

ఉ. అంగభవాది దేవతల
కన్నను జక్కనివాఁడు సర్వదా
మ్రుంగిటి పెన్నిధానము స
మోయని మ్రొక్కెడువారిఁ గాచు శ్రీ
రంగపురీశ్వరుండు రవి
రాజవిలోచనుఁ డుల్లసత్కృపా
పొంగుడు రంగశాయి మన
పాలఁగలండు విచార మేటికిన్. 7

శ్రీరంగేశుడు నిజభక్తులను బ్రోచిన పురాణగాథ లనేకములు గలవు. ఆగాథలం దొకటి 86 వ పద్యమునందు వర్ణింపబడినది.

చ. వలపులఁజిక్కి లోనయిన
వాఁడొక వారవధూటి కోరఁ గో
వెలఁ గల పైఁడిగిన్నెఁ గొని
వేడుక నిచ్చిన వారి నిద్దఱన్
దలవరు లాఁగిపట్టుకొన
ధర్మసభన్ దగ నేఁగి సాక్షిగాఁ
బలికిన రంగశాయి మన
పాలఁ గలండు విచారమేటికిన్.

శ్రీ మహావిష్ణువు భిన్నావతారములందు భక్తులను సంరక్షించిన విధమునను శ్రీరంగస్వామియును తనను రక్షించుటకు ధనపాలగిరివి కవి భక్తిభరితమైన చిత్తప్రవృత్తితో శతకమును రచియించిన విధమును పద్యములు పరిస్ఫుటము చేయుచున్నవి. శతకమునందు దశావతారాదివర్ణనలు నారాయణశతకమునందువలె నున్నను నారాయణ శతకమునందువలె విభాగములు విస్పష్టముగను గనుపడవు. శ్రీ రంగశాయి శతకమునందు సర్వేశ్వరాది శతకములందువలె తత్త్వవిచారముగాని నీతిధర్మనిర్ణయములుగాని కనుపడవు. శతకమునందు జ్ఞానమార్గముకంటెను భక్తిమార్గమునకు ప్రముఖత గలదు. ఈ మార్గావలంబనము విశిష్టాద్వైత సిద్ధాంతమున కనురూపముగ నున్నది.

శతకకర్త శ్రీరామానుజాచార్యులు ప్రతిపాదించిన విశిష్టాద్వైత సిద్ధాంతమునే శతకమునందు సువ్యక్తము చేసెను. భాగవతోత్తములు భగవత్ప్రసాదముననె తరింపగలరను సిద్ధాంతమును పురాణేతిహాసములందలి సుప్రసిద్ధ గాథల సాధనముగను కవి హృదయరంజకముగను వర్ణించి భక్తిశతకములందు శ్రీరంగశాయి శతకమునకు స్థిరప్రతిష్ఠను గల్పించిన విధమును శతకప్రచారము చాటుచున్నది. కవి శ్రీమన్నారాయణుని భక్తిపూర్వకముగను భజించి ధన్యుడైన విధమునను శ్రీరంగేశుడు పాతకులను ధన్యులను జేయుటకు దొడ్డదుగాత!

చ. తనువు చరంబు పుత్ర ...
దార ధనాదులఁ నమ్మరాదు నె
మ్మనమున నంతకుండు
దయమాలిన వాఁ డిదె మేలెఱింగి భూ
జనవరులార మీ హృదయ
సారసమధ్యమునందు నిల్పుఁడీ
వనివడి రంగశాయి మన
పాలఁగలండు విచారమేటికిన్. 84

చ. క్షితిని ననేకకమార్గములఁ
జెందక మర్త్యుఁ డెఱింగి నీవె నా
గతియని పాదపంకజయు
గంబును జిత్తములోన నిల్పి సం
తతమును నాశ్రయింప నతి
ధన్యునిగా నొనరించు వా రమా
పతియగు రంగశాయి మన
పాలఁగలండు విచారమేటికిన్. 15

## శ్రీ రామతారక శతకము

శ్రీరామతారకశతక మాంధ్రహృదయేశ్వరుడైన శ్రీరామమూర్తిని సంకీర్తనము చేసెడి శతకములందు మనోహరమైన శతకము. శతకకర్తయొక్క కులగోత్రనామాదులను నిర్ణయించుటకు దగిన యాధారములు గనుపట్టవు. శతకమునందలి 23-వ పద్యమునందు "యెవ్వాన్యవశమున నీజన్మమెత్తితో విప్రదేహం బిప్డు విమలచరిత" యనియును, 82-వ పద్యమునందు "మంత్రి కార్యానులోచన నాచరించు" ననియు నుండుటంజేసి కవి నియోగి బ్రాహ్మణు డని యూహింప దగియున్నది. కవి కొంతపాండిత్యము గలిగి లౌకికవ్యవహారలంపటుడై వార్ధక్యమువఱకును జీవించినటులును వార్ధక్యమునందు భక్తినిరతుడైనటులును పద్యములు తెలియజేయుచున్నవి. కవి లోకానుభవముగల శ్రీరామభక్తు డని పద్యములందలి జాతీయములును లోకోక్తులును విశదము చేయుచున్నవి. భాషను బట్టి కవి యుత్తరాంధ్రభాగమునందు నివసించునటు లూహింపదగి యున్నది. భావములు, భాష త్యాగరాజకీర్తనలను సంస్మరింపజేయుచుండును. కవి శతకమును వార్ధక్యమున భక్తిపరిపక్వదశయందు రచియించినటులు పద్యములు తెలుపుచున్నవి.

### కాలము

శతకమునం దంతటను త్యాగరాజకీర్తనలందలి భావములు భాష గనుపట్టుచున్నవి. 'మధు శర్కరా క్షీర దధి ఘృతంబులకంటె

రామనామామృతరసము లేపి' 'కౌసల్యసుతరామ' మొదలగు పద్యము లందలి భావములు త్యాగరాజానంతరము శతకకర్త శతకమును రచించినటు లూహింపదగియున్నది. త్యాగరాజస్వామి క్రీ. శ. 1687 సంవత్సరమున జన్మించి క్రీ. శ. 1767 ప్రాంతమునందు శ్రీరామసాన్నిధ్యమును జేరెను. శతకము 1800 ప్రాంతమునందు రచింపబడియుండును.

## శైలి

శైలి తేటతెలుగుమాటలతో నిండి సులభముగను శ్రావ్యముగను నున్నది. వ్యాకరణబద్ధమైన వాడుక భాష సామాన్యముగ వాడబడినది. వాడుక ప్రయోగములు చాల గలవు. "చదువువారికి ఇంపుగా నుండు" నని కవియె వ్రాసియున్నాడు. పద్యములు తెలుగు బాసకు సహజమైన మృదుమధుర మంజుల ధ్వనులతో నడచుచు, వీనులకు విందును గొలుపుచు, చిత్తమున కానందమును గలుగ జేయుచున్నవి. మధురమైన రామతారకమూర్తిని త్రికరణశుద్ధిగ నాశ్రయించిన భక్తునకు వాగాడంబరము సాధ్యము గాదు. క్లిష్టమైన ప్రాసనియమములు పదజాలములు దీర్ఘసమాసములు భక్తిరస ప్రసరణమునకు ప్రతిబంధకములు. బరువైన సీసములు రసబిందువులవలె గంతులువైచుచు పరువిడుచున్నవి. అప్రయత్నముగ బాసయు భావయును అయుస్పేడబుచు హృదయానందమును గలుగ జేయుచున్నవి.

శతకమునందలి లోకోక్తులు శైలి కలంకారములుగ నున్నవి. "కోటివిద్యలు నవియెల్ల కూటికొఱకు", "కోన భేదించి యెలుకను గానబడెనె", "పాషిష్టవిద్యలు చదివిచెప్పగవచ్చు", "కోటికి పడగెత్తి గొల్లపుచ్చగవచ్చు", "భయముతోనైనను భక్తినైన", "సిరు గెట్టినమాట విరిచినట్లు", "గొడ్డుగోవుల పాలు కొసరినట్లు", "అంధునిచేతికి నద్దంబు నిచ్చిన", "కుంటివాని కక్క గుజ్జంబు నిచ్చిన", "కుక్క నక్కల కూడి కూయ వింత", "దీసుం కల్పాం దిక్కు వింత"; శతకమునందు గల యిట్టి లోకోక్తులు పద్యములను రసవంతములుగ చేయుచున్నవి. శైలి తెలుగుపదములతో నిండి సామాన్యులకు సయితము శతకార్థము సులభగ్రాహ్యముగ చేయుచున్నది. శైలికి పరమార్థమైన రసోదయము శతకమునందంతటను ప్రత్యక్ష మగుచు శతకము శ్రీరామభక్తిరసావేశమును గలుగజేయుచున్నది. శైలిని దెలుపుటకు కొన్ని పద్యము లుదాహరింపబడు చున్నవి.

సీ. పాపాత్ముడైనను నా మనంబున నిన్నుఁ
  దలఁచి సేవించెదఁ దండ్రివనుచు
నా పాలధన మని నమ్మి యుప్పొంగుచు
  దండ మర్పించెద దాత వనుచు
నా లోను నీవని నవ్వుచుఁ గేరుచు
  రంజిల్లుచుండెద రాజ వనుచు
నా కును గురుఁడవై నాతప్పు లెన్నక
  కాచి రక్షింపఁగఁ గర్త వనుచు
పెంచి పోషించి కాపాడ పెద్దవనుచు
పుత్రవాత్సల్య తండ్రికి పుట్టినట్లు
కృపకుఁ బాత్రునిగాఁ జేసికొనుము దేవ
రామతారక దశరథ రాజతనయ. 19

సీ. శ్రీరాఘవా యని యొకసారి దలఁచిన
  దుఃఖదోషము లన్ని తొలఁగిపోవు
మఱి రెండవసారి యోరాఘవా యన్న
  బహుభోగభాగ్య సంపదలు గల్గు
వెలఁగ మూఁడవసారి శ్రీ రాఘవా యన్న
  ముక్తుఁడై వైకుంఠమున వసించు
రమణ నాల్గవసారి రామచంద్రా యన్న
  నతనిఋణస్థుఁడ వయ్య నీవు
అల్పనంతోవ సులభుఁడ వగుదువయ్య
యెంచి యాజీవపర్యంత మరయు మిమ్ముఁ
దలఁచువారికి నాపద లొలఁగుచుండు
రామతారక దశరథ రాజతనయ. 41

సీ. చిన్నిముద్దులయన్న చిన్నారిపొన్నారి
సురభూజమా రామ సుందరాంగ
నన్నుఁగన్నయ్య నీ కెన్న నన్యుఁడఁగాను
నవ్వులుసేయకు నాగశయన
దిక్కుమాలినవన్ను దేవర ప్రోవుమీ
చక్కనివాపాలి చక్రపాణి
అక్కఱతో నన్ను నాదరింపుము వేగ
నిక్కంబు నీవాఁడ నీలవర్ణ
యనుచు వేఁడితి రక్షింపు మరసి నన్ను
వెంచలేదని నీమది నెంచవలదు
కరుణఁజూడుము నామీఁద కామజనక
రామతారక దశరథ రాజతనయ.

సీ. తెలిసితెలియఁగలేఁ దెలివినే యెల్లరో
మాయలఁబడి లోకమమతతోడ
రామభూపాలుని రమ్యాక్షరంబులు
నేవేళనైనను నెవ్వఁడైన
పనిసేయువేళైన పనిలేనివేళైనఁ
జనువేళనైనను జదువునైన
భయమునొందైనను భ్రమతోడనైనను
గలుగక యుండుల కలిమినైన
పరమకల్యాణ పరిపూర్ణ భద్రమూర్తి
నెన్నదొంగను గోపాల విభుని ఘనుని
బుద్ధిఁ దలఁచిన ఘనులకుఁ బుణ్యపదవి
రామతారక దశరథ రాజతనయ.

సీ. అంధునిచేతికి నద్దంబు నిచ్చినఁ
జూచునా తనమోముసుందరంబు
కుంటివానికి నెక్క గుఱ్ఱంబు నిచ్చిన
నెక్కునా తనశక్తి నెన్నఁడైన
షండుకు యౌవన సతి గర్గనేనియుఁ
గామంబు దీర్చునా కాంక్ష దీర
అల్పున కొకవేళ నర్థంబు గలిగినఁ
దెలివితో నిచ్చునా తెగువతోడ
తన్ను దెలిసికొనక తనశక్తి యెఱుఁగక
ధరణిసంపద లన్నియు తనవటన్న
లేదు లాభంబు తన కొక లేశమైన
రామతారక దశరథ రాజతనయ.

సీ. మూఢుఁడు మూర్ఖుఁడు ముచ్చటాడఁగ వింత
దీనుల కల్పుల దిక్కు వింత
కోతి కోఁణంగులు గూడియుండఁగ వింత
కుక్క నక్కలఁ గూడి కూయ వింత
కోపితోఁ గుటిలుండు కూరిమిజేయుట వింత
కపటఘాతకు లెపుడు కలయ వింత
మంత్రులతో మంత్రి మచ్చరించుట వింత
కీడు మే లెఱుఁగని కీర్తి వింత
యెంతవారికి లబ్ధంబు లంతగాక
అన్న కావఁగ నేర్తురె యధము లెల్ల
కల్గ సుజ్ఞానిసంగతి ఘనత యశము
రామతారక దశరథ రాజతనయ. 87

## భావార్థము

53 శ్రీరామతారకశతకమునకు మకుటము: రామతారక దశరథ రాజతనయ! ఆంధ్రభాషయందలి భక్తిశతకములయందు శ్రీరామ భక్తిపరములైన శతకములు అధికముగ గలవు. భక్తిజ్ఞానవైరాగ్యభావములు సమరసభావమును బొందిన ఆంధ్రహృదయమునకు సీతావల్లభుడు ప్రియదేవత. ఆంధ్రహృదయేశ్వరుడైన శ్రీరామచంద్రుని రామతారక శతకమునందు కవి సంకీర్తనముచేసి కృతార్థతను గాంచెను. మానవులను సంసారపాశములనుండి రక్షించి విముక్తులను జేయుటకు రామతారక మంత్రము పరమసాధనముగ నున్నది. తారకమంత్రములందు వాల్మీకి రామదాసాదులను తరింపజేసిన శ్రీరామతారకమంత్రము తెలుగుదేశమునందు ప్రజాసామాన్యమునందు విశేషవ్యాపనమును గాంచిన మంత్రరాజము. శతకకర్త ముక్తిప్రదాయకుడైన శ్రీరాముని త్రికరణశుద్ధిగను గొలిచి కృతార్థుడైన విధమును శతకము విశదము చేయుచున్నది. "అపరాధి 66 నపరాధి నని మ్రొక్కి యాశ్రయించితి మిమ్ము నవ్వ మేయ", "పాతకుడ నన్ను రక్షించు పరమపురుష", "ఇంత కాలంబునను నిన్ను నెఱుగలేక వృద్ధిబొందితి...విశదముగను", "దిక్కుమాలిన నన్ను దేవర ప్రోవమి", "ద్రోహి శరణంటె నను గావు దొడ్డఘనత", "అగణితంబైన కలుషంబు లణగజేసి నిర్మలాత్మునిగా జేయు నిగమవేద్య" ఇత్యాది భావములు కవి హృదయమునందు గలిగిన గాఢమైన భక్తిని దెలుపుచున్నవి. కవి సామాన్యమానవులవలె జీవితమును విషయవాసనలతో గడపి వార్ధక్యదశయందు శ్రీరామభక్తి పరిపక్వమైనపుడు భక్తిపరుడై శతకమును రచియించినట్లు శతకార్థము విశదము చేయుచున్నది. కవికి జీవయాత్రకు ఫలమైన భక్తిజ్ఞాన వైరాగ్యములును మోక్షకాంక్షయును గలిగి శ్రీరాము నాశ్రయించి తరించిన విధమును శతకము విశదము చేయుచున్నది.

రామతారకశతకమునకు భక్తి హృదయమైనను జ్ఞానవైరాగ్య బోధలు సందర్భానుసారముగ శతకమునందు జేర్పబడినవి. కవికిగల 70 జ్ఞానప్రతిపత్తి నీ క్రింది పద్యములు విశదము చేయుచున్నవి.

సీ. హరి రామ నీవు నా యంతరంగమునందు
సాక్షివై యుండుట సత్యమైన

పావనం బాయెను పెంచభౌతిక మెల్ల
కాయంబు జలముల గడుగనేల
మపకార ముడిగిన మామను కర్మముల్
వేధించి వేల్పుల వేడనేల
విత్తక్షీణం బైన వీడును గర్వంబు
మోహంబు లుడిగిన మోక్ష మిదియె
నిన్ను యీరీతి నిజముగా నిలుపవలయు
మనసు దృఢమైన జాలదా మాయ గెల్వ
భ్రాంతు లుడిగిన బ్రహ్మంబు బట్టబయలు
రామతారక దశరథ రాజతనయ. 7

సీ. దేహంబు విడిచెడు దినము తా నెఱుగడు
కర్మంబు వచ్చుట గానలేడు
మూఁడవస్థలలోన మునిఁగి తేలఁగలేడు
అరిషడ్వర్గ శత్రుల నణచలేడు
మగువలురములందు మమత మానఁగలేడు
వాదు పేఁ డనువల్కు వదలలేడు
అభిమాన రహితుఁడై యాశ లుడుగలేడు
యుంచుక హరిమాయ యెఱుఁగలేడు
కన్నులందును బ్రహ్మంబుఁ గనఁగలేక
బుద్ధిహీనులకడ కేగి పొందుచేసి
యుదరభరణంబు గానక యుర్విలోన
రామతారక దశరథ రాజతనయ. 26

భక్తిసాక్షాత్కారమునకు మనోనిగ్రహము ముఖ్యమని కవి తెలిపిన భావములు భక్తు లాదరణీయములు.

సీ. సిరి యెఱుంగవు నిందకు నోడవు
చంచలం బెప్పుడు చెడ్డగుణము
వాయువేగముకంటె వడిగలవాఁడవై
పాఱెద వెప్పుడు పడుచుతనము
పేరు వేతొక్కటి పిలుచుట యొక్కటి
చేరువకర్మంబు చెప్పలేవు
పుత్రమిత్రాదులే పుణ్యలోకం బని
సద్గతి యెఱుఁగవు జడుఁడ వగుచు
మనసు ఈరీతి వర్తించు మందమతిని
పడచి నరకంబు కేగుట నయమె నీకు
ముందు తెలియక విహరించి మోసపోక
రామతారక దశరథ రాజతనయ. 27

సీ. పంకజాక్షునిపూజ పలుమాఱు చేయక
పరదైవములపూజ పాడి యగునె
విష్ణుసంకీర్తన శ్రీనుతి విడకయే
పరుల మెచ్చుట నీకు బ్రాంతి యగునె
శేషశయనుని జాఁ జేరఁగి కీర్తించక
పరులఁగీర్తించుట భవ్య మగునె
నారాయణస్మరణ నమ్మకయుండక
పరదైవములస్మరణ పాటి యగు
మనస! నీకొంత బుద్ధియు మతియు లేదు
తలఁపవే రామమంత్రంబు తలఁపులోన
తలఁచితే మోక్ష మిచ్చును తథ్యమరయ
రామతారక దశరథ రాజతనయ. 78

కవి విశిష్టాద్వైతమతాచార్యులు ప్రతిపాదించెడి శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములను శ్రీరామమూర్తిని భావించి సేవించిన విధమును పద్యములు విశదము చేయుచున్నవి.

సీ. నా ముద్దులయ్యను నా దేవదేవుని
నా చిన్నయన్నను నా మురారి
నా రత్నమును పట్టి నా బంగరయ్యను
నా విధానము రామ నాదివిష్ణు
నా కార్తికేశోరిని నా బ్రహ్మతంత్రిని
నా రఘురాముని నాదుహరుని
నా మనోనాథుని నానోముఫల మైన
నా జానకీధవు నా మహాత్ము
వెదకి కీర్తించి ప్రార్థించి వేఁడుకొనిన
సకలసంపద లిప్పుడు సమరినట్లు
తప్పుత్రోవఁ బోయిన దమ్మఁ డగునె
రామతారక దశరథ రాజతనయ. 50

శ్రీ త్యాగరాజకృతులవలె రామతారకశతకమును రామనామ ప్రభావమును ప్రాచుర్యముచేసి శ్రీరామభక్తులను తరింపజేయుటకు మనోహరముగ నున్నది. ఆంధ్రదేశమునందు చాటువులుగ వ్యాపకము నందున్న పద్యములు ప్రజలకు శతకమువట్ల గల యాదరమును విశదము చేయుచున్నవి.

సీ. ఓపి పాపకుఁడైన యొక్కసారైనను
వెఱచి వెఱపకయైన వేడ్క నైన
హా రామ హా కృష్ణ హా యచ్యుతా యని
భయముతోనైనను భక్తి నైన
ప్రేమతోఁ బుత్రుల పేరుపెట్టుకయైన
వనతటాకము లుంచి వాంఛ నైన
భువిలోనఁ గీర్తికిఁ బురము గట్టినను
చిలుకను పెంచైనఁ జెలిమి నైన

నీదునామంబుఁ బలుకుచు నిఖిలసుఖము
గలిగి వర్ధిల్లుపురుషుఁడు ఘనత మెఱయు
జన్మకర్మంబు లతనికేఁ జెప్పనేల
రామతారక దశరథ రాజతనయ. 5

సీ. ఆవేళ యమునిచే నాయాసపడలేక
వెలుచి యప్పుడె మిమ్ము వేదఁకొంటి
అపరాధి నపరాధి నపరాధి నని మ్రొక్కి
యాశ్రయించితి మిమ్ము నప్రమేయ
శరణన్నమాత్రాన శంక లన్నియు మాని
భయనివారణ మాయె భజనచేత
వింతసులభుఁడ వని యెంచఁగిన నిన్నాళ్లు
యేమఱియుందువా యెఱుఁగనైతి
తెలిపె మీకృప నాకును తేటపడను
మర్మమెఱిఁగితి నీకీర్తి మహిమ వింటి
గట్టు దాఁటితి నీవు నా గతి యటంటి
రామతారక దశరథ రాజతనయ. 1

పాఠభేదములు

ఈ శతకము నైదుప్రతులతో పరిమాచి పాఠభేదములను జేర్చితిమి. అందు 'అ. ఆ. ఇ.' అను సంకేతములుగల ప్రతులు చెన్నపురియందలి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున వరుసగా 13—8—19, 10—11—22, 13—8—20 నెంబరులు గలవి. 'వా' అను ప్రతి వావిళ్లవారిచే ముద్రితమైనది. తక్కినవి ఇతర ముద్రిత ప్రతులు. 'అ' ప్రతిలో 11 పద్యములు, 'ఇ' ప్రతిలో 3 పద్యములు క్రొత్తవి దొరికినవి. వానిని గ్రంథాంతమున జేర్చితిమి.

# శ్రీ రామచంద్ర శతకము

శ్రీరామచంద్ర శతకము భక్తిశతకములందు ప్రౌఢమైన శతకము. భావములు, భాష, నిర్మాణవిధానము, కావ్యరచనా విధానములుబోలి కవీశ్వరుని నిర్మాణదక్షతను విశదము చేయుచున్నది. సుకవిస్తోత్రము, కుకవినిరసనము, కులవంశాది వివరణము, శతక విభాగము, రచనావిధానము కావ్యనిర్మాణపరిణతిని ద్యోతకము చేయుచున్నవి. రామచంద్ర శతకకర్త పైడిపాటి వేంకటనృసింహము. ఆరువేల నియోగిబ్రాహ్మణుడు. లక్ష్మీపతికవికిని వేంకమాంబకును జ్యేష్ఠ పుత్రుడు. శఠమర్షణ గోత్రజుడు. యజుర్వేదశాఖీయుడు. నెల్లూరుమండలమునందలి పైడిపాడు కరణముల వంశీకుడు. కవి రచియించిన నృసింహవిలాసమునందును, మన్నారు కృష్ణశతకమునందును, రామచంద్ర శతకమునందును కులగోత్ర వంశాదులను వివరముగను దెలియజేసెను.

మ. సుగుణాఢ్యుం డయి పైఁడిపాటి కులజుండై మంత్రిపోతన్నవా
డు గురుండై శఠమర్షణాఖ్యమునిగోత్రుండై యజుర్వేదినాఁ
దగు లక్ష్మీపతి సత్కవీంద్రునకుఁ బుత్రుండైనవాఁడన్ నావరం
బగున ట్లన్నిటి నిన్ను వేంకటనృసింహాఖ్యుండ నీవాఁడ భ
ద్రగిరీంద్రస్థిత, నన్నుఁ గైకొను మహేంద్రా, రామచంద్రా, హరీ!

కాలము

వేంకట నృసింహకవి మేనల్లుడు అయ్యలరాజు నారాయణకవి 1800 ప్రాంతమందు నివసించినటులు కవుల చరిత్రమునందు గలదు. కావున ఈ నృసింహకవికాలము 1750 ప్రాంతమై యుండును.

శైలి

శైలి ధారాళమైనను ప్రబంధశైలినిబోలి నారికేళపాకమున నున్నది. కవి "మాణిక్యప్రతతులంగూర్చిన హారపంక్తి గతి గీర్వాణాంధ్ర శబ్దంబులన్ శతకగ్రంథ మొసర్చి నీ కొసఁగెదన్" అని వ్రాసినను గీర్వాణశబ్దము లధికముగను గలదు. కావ్యోన్నతి దశకమునందు కవి తన కావ్యప్రశంసను బాగుగ జేసినవిధము నీపద్యములు తెలుపుచున్నవి.

మ. సకల శ్రీకలితంబనేరథమునన్ కార్యాంలమత్తేభనా
మకవిక్రీడిత వాజులం బెనఁచి నవ్యాకల్పవృత్తాంధ్రోక్తి కా
ర్ముక బాణంబుల వర్ణమాతు సుమమారుక్మ ధ్వజంబున్ సము
త్సుకతం బూన్చితి దాని నెక్కి యట మత్పాపోత్కరోత్కృంత కం
టకులం ద్రుంపుము నన్నుఁ గైకొను మహేంద్రా, రామచంద్రా, హరీ!

శా. దివ్యశ్లాఘ్యము వర్షపుష్పఫలవంక్తిం జొప్పిన టొన్నస ఖి
వ్య వ్యాహార రసోపమాన పదశయ్యాబద్ధి సిద్ధించు త
త్కావ్యం బెవ్వరు విన్న నౌనని శిరఃకంపంబు గావింపరే

శ్రవ్యాదాంతక, నన్నేఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

రామచంద్రశతకము భద్రాద్రి రామతారక శతకము వలెను, రామతారక శతకమువలెను భక్తిరసావేశమును వ్యక్తముచేయక పాండిత్యమును వ్యక్తము చేయుచున్నది. శతకములను లాక్షణికులు కావ్యములుగ పరిగణింపక పోయినను ఈ శతకమును కావ్యముగ నిర్మించిన విధము శతకమునందు గల కావ్యోన్నతి దశకము విశదము చేయుచున్నది. కవి శతకరచనయందును విభజనయందును నిర్మాణ కౌశలమును విశదము చేసెను.

మ. స్తుతి, కావ్యోన్నతి, దాససంగతి, మనో
దుర్వృత్తి, సంసార స
ద్గతి, మాయాకృతి, తత్త్వసంతతి, యభే
దఖ్యాతి, దీనావన
స్థితి, సర్వేశదశావతారనుతి, కిం
చిన్నీతి, నానావ్యవ
ద్భుతరీతిం గృతి రుద్రసంఖ్య దశకం
బుల్ సన్నుతిం దానివా
యత కారుణ్యత నన్నేఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

శైలి శబ్దాలంకారములను నర్థాలంకారములను నార్యోక్తులను గల్గి పండితహృదయమును దెలుపుచున్నది. సందర్భానుసారముగను కవి ప్రయోగించిన "మర్కటకిశోరన్యాయము, మార్జాలకిశోరన్యాయము, గర్భగతముక్తాశుక్తిచందము" మొదలగు ప్రయోగములు పాండిత్యమును లోకానుభవమును విశదము చేయుచున్నవి. శైలి క్లిష్టమైనను భావశుద్ధిగలిగి పాఠకుల చిత్తము నాకర్షించుచు విషయావబోధన కనుకూలముగ నున్నది. దీనత్రాణ దశకమునం దుపమాలంకారమును, అవతారదశకమునందు ఉత్ప్రేక్షాలంకారమును, నీతిదశకమునం దంత్యప్రాసమును వాడినవిధము కవిపాండిత్యమును విశదము చేయుచున్నది. శైలి కఠినమైనను ధారాశుద్ధమై యలంకారశోభితమై శ్రీరామభక్తిని వ్యక్తముచేయుట కనుకూలముగ నున్నది.

భావార్థము

మకుటము: నన్నేఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ! శ్రీ భద్రాచలవాసియైన శ్రీ రామచంద్రుని ఈ భక్తి జ్ఞాన వైరాగ్యభావములతో నారాధించి పురుషార్థమును బడసినవిధమును శతకము విశదము చేయుచున్నది. దాసవృత్తి దశకారంభమునందు కవి తన సంగతి నిటులు శ్రీరామచంద్రునకు విన్నవించుచున్నాడు:

శా. శ్రీ విశ్వేశ్వర, యాత్మవార్తలు ధరి
త్రీ భర్తకున్ సంది లా
గె వారం బొనరించి తెల్పుగతి లో
కస్వామివౌ నీ కికన్
నా వృత్తాంతము విన్నవింతుఁ జెవిగిం
డం జిత్తగింపం దగున్
దైవగ్రామణి, నన్నేఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

మానవులు ధర్మార్థకామరూపంబులైన పురుషార్థత్రితయంబె కోరి చేసెడి దుష్కార్యము నీదశకమునందు బాగుగ వర్ణింపఁబడినవి. మానవులు ధనార్థులై చేసెడి యవినయకార్యము ~ మునందు వర్ణింపబడినవి.

మ. పతిపీథిన్ శునకంబునై ఖరిఁ ప్రతి
గ్రామంబుఁ గాకాకృతిం
బ్రతిగేహంబు బిడాలముంబలె నిది
ర్పం జొచ్చి వర్తింపుచున్
బ్రతిమర్త్యధమునిం బిశాచముఁబలెన్
బాధింప నిత్యార్థ మ
ప్రతిదుష్కర్ముని నన్నేఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

కవి తన ఐహికాముష్మిక దాసవృత్తిని నిక్రిందిపద్యమున వర్ణించుచున్నాడు.

శా. శాంతస్వాంతము గల్గి యింగిత మతిన్
సత్సంగతిం గోరి యే
కాంతగ్రంథముఁ జూడనోపక నిహ
వ్యాపార విద్యాపరి
భ్రాంతిన్ మూఢుఁడనైతి మర్కటకిశో
ర న్యాయతన్ నిన్ జగ
త్కాంతు న్విడని నన్నేఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

మనోవృత్తి దశకమునందు సంసారబంధకారణమునకు మూలమైన సంకల్పప్రభావమును బాగుగ వర్ణించెను.

శా. శ్రీనాథా, సకలేంద్రియంబులు మనో
వృత్తిం బ్రబోధంబులై
దానిం గూడనినాఁ డబోధము లగున్
ధారాధరంబుల్ జగ
త్ప్రాణాధీనము లైనరీతి నది లా
ల్తన్ సర్వసంకల్పమూ
లానుష్ఠానము నన్నేఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

సంసారదశకమునందు సంసారమహార్ణవమును దాటఁగల సాధనములను బాగుగ వర్ణించి మోక్షసాధనమును విశదము చేసెను.

శా. సారాంభోనిధిఁ బోల్ప నీడగునె సం
సారం బసారం బనా
ధారం బైనను దుస్తరత్వము నసా
రత్వంబు వాటించి ము
న్నారోపించిరొ పీని కాద్యు లుపమే
యత్వోపమానత్వముల్
ధారాళం బని నమ్మఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

మాయావాదశకమునందును, తత్త్వదశకమునందును, వేదాంత సిద్ధాంతములను, యోగమార్గములను సంక్షేపముగను వర్ణించి మోక్షమార్గమును విస్పష్టము చేసెను.

మ. విమలాత్ముండగు రాజయోగివరుఁ డ
న్వేషించు భ్రూమధ్యభా
గమునన్ లోన మనస్సముద్రను జిదా
కాశంబునం దైక్యమొం
ద మనస్తత్త్వముఁ జేర్చి వెన్నెలబయల్
దర్శించు నద్వైతుఁడై
యమనస్కం బిది నమ్మఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

తత్త్వదశకమునందు మోక్షసాధనములైన తారకయోగము, హఠయోగము, సాంఖ్యయోగము, రాజయోగము, కర్మయోగము, జ్ఞానయోగము మొదలగు యోగలక్షణములను సంక్షేపముగను వివరించి కవి తన మోక్షాభిలాషను విశదము చేసెను. అభేదదశమునం దద్వైతసిద్ధి సాధనమును కైవల్యాకాంక్షను విశదము చేసెను.

శా. బ్రహ్మైవాహ మటంచుఁ దెల్పు నిగమ
గ్రంథాంత వాక్యంబులన్
బ్రహ్మజ్ఞాన్మది విశ్వసించి శమమొ
ప్పం దామె పీవంచుఁ జి
ద్బ్రహ్మానందముఁ బొందుచుండుదు జగ
దత్యప్రసిద్ధంబుగా
బ్రహ్మేంద్రార్చిత, నమ్మఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

దీనత్రాణదశకమునందును, అవతారదశకమునందును, నీతిదశకమునందును సాధుసంపన్నులను శ్రీమన్నారాయణుఁడు రక్షించెడి విధమును నీతిప్రవర్తన విధానమును బాగుగ వర్ణించి శ్రీరామభక్తులకు సంతరణ సాధనమును విశదము చేసెను. ఈ మూఁడు దశకములును అభేదదశకమునకు పూర్వముంచిన నిర్మాణ విధానము బాగుండియుండును. శ్రీరామచంద్ర శతకకర్త వేంకటనృసింహకవి, శతకమునందు మానవ జీవితమునకు పరమావధియైన మోక్షమును సాధించుటకు మానవులకు గల సాధన సంపత్తిని వ్యక్తముచేసి విద్యాప్రయోజనమును సఫలము చేసెను. కవి మానవులు సహజమైన సంసారయాతన ననుభవించినను విన్రమహృదయముతో మానవ స్వత్వమైన బ్రహ్మత్వమును బడయుటకు బొందిన హృదయవేదనను శతకము విశదము చేయుచున్నది.

మ. ప్రతివీథిన్ శునకంబు వైఖరిఁ బ్రతి
గ్రామంబుఁ గాకాకృతిం
బ్రతిగేహంబు బిడాలముంబలె విధి
త్వం బొప్పి వర్తింపుచున్
బ్రతిమర్త్యోధమునిం బిశాచములలోన్
బాధింతు విత్తార్థమ
ప్రతిదుష్కర్ముని నమ్మఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

శా. దేహప్రావరణంబుచేత సదస
ద్భేదంబుచే జీవసం
దోహంబున్ నిను వేఱుగాఁ దలఁతు రెం
దున్ భేదవాదప్రియుల్
వ్యాహారార్థము లర్థభేదములఁ జే
యన్ శక్యమే ముక్తుఁడా
సోఽహంబన్నను నమ్మఁ గైకొను ముపేం
ద్రా, రామచంద్రా, హరీ!

రామచంద్రశతకమునందు వేంకటనరసింహకవి విశదముచేసిన భావార్థమును పాఠకులు గ్రహించి కావ్యప్రయోజనమును సార్థకము చేసి కృతార్థులగుదురు గాక!

[శతకమంజరి, భక్తిసంపుటము పీఠికలు - 1926]

# శ్రీ వంగూరి సుబ్బారావుగారి సేవ

శ్రీయుత వంగూరి సుబ్బారావుగా రాంధ్రవాఙ్మయమునకు జేసిన సేవకు గృతజ్ఞతను దెలుపుట కీ గ్రంథ పీఠికను వ్రాయబూనితిని. గతసంవత్సరమునం దాంధ్రవాఙ్మయ సేవాపరాయణులైన శ్రీయుతులు కొమర్రాజు లక్ష్మణరావుగారు, లచ్చారావుగారు, సుబ్బారావుగారు పరమపదించుట యాంధ్రలోకమునకు గలిగిన దురదృష్టము. సుబ్బారావుగారు ప్రభాతము, వేమన, ఆంధ్ర క్షత్రియులు, వసంతలేఖలు, ఆంధ్రవాఙ్మయచరిత్రను, శతకకవుల

చరిత్రము, మొదలగు గ్రంథములను వ్రాసి యాంధ్రవాఙ్మయమునందు స్థిర ప్రతిష్ఠను బడసిరి. సుబ్బారావుగారి మిత్రులకును ఆంధ్రభాషాభిమానులకును వారి యకాలమరణము విచారము గలుగజేసినది. ఆంధ్రభాష నిజసేవాపరాయణులు లేకను తన ప్రతిభను గోల్పోవుచున్న సమయమునందు సేవాపరాయణుల నిర్యాణము భాషాభిమానులకు విచారకారణం బగుచున్నది. సుబ్బారావుగారి గుణములందు మాతృభాషాభిమానమును ఆత్మగౌరవాభిమానమును గణనీయములు. ఆంధ్ర నామస్మరణము సుబ్బారావుగారి కావేశమును గలుగజేయుచుండెడిది. ఏ ప్రాంతీయులకు బోయినను సుబ్బారావుగారాంధ్రుల ప్రతిష్ఠను సమర్థించుట కధికోత్సాహమును గనుపరచుచుండిరి. పూనహో, కలకత్తానగరములందు జరిగిన పరిశోధక మహాసభలయం దాంధ్రుల వ్యక్తిత్వమును బ్రతిపాదించుటకు జేసిన ప్రయత్నములు వారి యాంధ్రత్వాభిమానమును విశదము చేయుచున్నవి. అధికారప్రాపకములుగల ద్రవిడ ప్రముఖుల పన్నుగడలను బ్రతిఘటించి యాంధ్రశాఖలను స్థాపించి యాంధ్రవ్యక్తిత్వమును వ్యక్తము చేసిరి. ఈ యాంధ్రత్వాభిమానము వారి గ్రంథములందును జీవితవిధానమునందును బ్రత్యక్షమగుచున్నది. ఈ యభిమానము వలన సుబ్బారావుగారికి ప్రతికూలానుకూలపక్షము లేర్పడినవి. సుబ్బారావుగారి యాత్మగౌరవాభిమానము వారి జీవితమునందలి వ్యత్యస్తమునకు గారణమైనది.

ఆంధ్రదేశమునందు సారస్వతజీవనము దురారాధ్యముగ నున్నది. సరస్వతీ ప్రసన్నులకు లక్ష్మీప్రసన్న మపురూపముగ నున్నది. సరస్వతీదేవి నుపాసించుటయే గుణముగను గట్టుకొనినవారలకు లక్ష్మీకటాక్షము దుర్లభముగ నున్నది. శ్రీమంతులను, రాజులను, మహారాజులను నాశ్రయించినను సరస్వతీదేవి నుపాసించుట కవకాశములు లేవు. పూర్వయుగములం దట్టి సేవ కవకాశము లుండినను ఖాళీ కాడంబరమయమైన కలియుగమునందు బొత్తిగా నవకాశములు లేవు. ఈ కారణము వలననే సుబ్బారావుగారివంటి భాషాసేవకులకు సారస్వతజీవనము దుర్లభమై అకాలమృత్యువు సంప్రాప్తమైనది. సుబ్బారావుగారు పిఠాపురమునందును చెన్నపురియందును జీవయాత్రను గడుపుచున్నపుడు వారికి గలిగిన యసంతృప్తి వారి యకాలమరణమునకు మూలము. పిఠాపురమునందు బ్రతిభావంతులైన శ్రీయుత పానుగంటి లక్ష్మీనరసింహరావుపంతులుగారికి బ్రియశిష్యులై రచనాకౌశలమును బడసిరి. శ్రీయుత చెలికాని లచ్చారావుగారి యాదరణపోషణముల క్రింద నాంధ్రపరిశోధక మహామండలిని స్థాపించి దాని నిర్వహణమునం దపారమైన శక్తిని గనుపరచిరి. ఆంధ్రపరిశోధక మండలియందు లభించిన యనుభవము వేమన, యాంధ్రవాఙ్మయ చరిత్రము, శతకకవుల చరిత్రము మొదలగు రచనలకు దోడ్పడినది.

సుబ్బారావుగారి మేధాశక్తులందు సంభావనాశక్తి విశేషము. పరిశోధనలం దొక విశేషము గనుపడినపుడు పరమోత్సాహభరితులై కావ్యసిద్ధాంత నిర్మాణముల కుపక్రమించుచుండిరి. ఈ యూహాశక్తియే సుబ్బారావుగారి వ్యక్తిత్వమును స్థాపించి ఖండనమండనములకును దూషణభూషణములకును గారణంబైనది. ఆంధ్రక్షత్రియులు, వేమన, ఆంధ్రవాఙ్మయచరిత్రము, శతకకవుల చరిత్రము, వసంతలేఖలు మొదలగు గ్రంథములు సుబ్బారావుగారి యూహాశక్తిని విశదము చేయుచున్నవి. వీరు సామాన్యవిషయాధారమున మహానిర్మాణములను జేసి పండితుల ఖండనమండనములకు బాలగుచుండిరి. ఆంధ్రవాఙ్మయచరిత్ర పీఠికయందు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు వ్రాసిన భావము లీవిషయమును స్పష్టము చేయుచున్నవి.

"వాఙ్మయ చరిత్ర సంఘశాస్త్రసంబంధిగా వ్రాయబడియుండుట శ్లాఘనీయమైన విశేషము. అనేకస్థలముల సుబ్బారావుగారు నూతనయోజనముల బ్రయోగించి క్లిష్టార్థములకు నవ్యయము సద్యుక్తభంగి కల్పించియున్నారు. ఇవి మొత్తముమీఁద వెఱ్ఱియూహలకుఁ జేరినవిగాక విమర్శనాపద్ధతి ననుసరించిన దృష్టసత్యములుగా నున్నవి." రామలింగారెడ్డిగారు వాఙ్మయచరిత్ర పీఠికయందు వ్రాసిన భావములు శతకకవుల చరిత్రమునకును నన్వయించుచున్నవిధము శతకకవులచరిత్ర పఠనము విశదము చేయుచున్నది.

బ్రహ్మశ్రీ వేదము వెంకటరాయశాస్త్రిగారి గ్రంథమునకు పీఠికను వ్రాయుట కనుగ్రహించిరి; కాని, కారణాంతరములవలన నా పని సంఘటనముగాలేదు. గ్రంథము ముద్రితమై పది మాసములైనను, పీఠికకై ప్రచురణము నిలిచినది. సుబ్బారావుగారు ముద్రితమైన కాగితములను నాతావున కంపి పీఠికనువ్రాసి ప్రచురింపుమని కోరుచుండిరి. కాని, నే నట్టిసాహసమునకు బూనుకొనలేదు. సుబ్బారావుగారి ప్రోద్బలముననే నేను శతకములను బ్రత్యేకముగ కవుల చరిత్రములుగల పీఠికలతో బ్రచురించుటకు బూనుకొంటిని. వృషాధిప, సర్వేశ్వర, నారాయణ, రఘువీర, కాళహస్తీశ్వర, దాశరథీ శతకములు మొదలగు పదిశతకములను పీఠికలతో బ్రచురించితిని. సుబ్బారావుగారు జీవించియున్నప్పుడు నేను పీఠికను వ్రాయుటకు నిరాకరించియును వారి మరణానంతరము గ్రంథపరిచయమునకు పీఠికవ్రాయుట యవసరంబై పూనుకొనినందులకు పండితులు మన్నింతురుగాక!

సుబ్బారావుగారి ప్రయత్నఫలమును, నా కృతజ్ఞతను వెల్లడిచేయుటకే పీఠికను వ్రాయుటకు బూనితిని. సుబ్బారావుగారు గ్రంథమునకు 44 పుటల ప్రవేశవ్యాసమును వ్రాసి శతకవాఙ్మయ చరిత్రము నాంధ్రలోకమునకు బరిచయము చేసిరి. గ్రంథము 540 పుటలను గలిగి భావగర్భితముగ నున్నది.

ఆంధ్రవాఙ్మయమునందు పురాణములు, కావ్యములు, ప్రబంధములు, శతకములు, నవలలు, నాటకములు మొదలగు వ్యక్తిత్వము

# భరణీ పిక్చర్స్

మద్రాసు. 26

## గత రెండు దశాబ్దములుగా

రత్నమాల
విప్రనారాయణ
లైలామజ్నూ
చింతామణి
ప్రేమ
వరుడు కావాలి
చండీరాణి
బాటసారి
చక్రపాణి
వివాహబంధం
గృహలక్ష్మి

ముద్దమైన అత్యున్నత తెలుగు చలనచిత్రములను నిర్మించి, అశేష ఆంధ్ర ప్రజానీకానికి సమర్పించి, వారి ఆదరాభిమానములను చూరగొనిన మేము "క.శే. శ్రీ. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు" గారి శతాబ్ది కారణముగా, ప్రత్యేక సంచికను వెలువరచి, ఆంధ్రప్రజానీకమునకు సమర్పించు "ఆంధ్రపత్రిక" వారికి మాహృదయపూర్వక అభివందనములను సమర్పించుచున్నాము.

గల విభాగములు గలవు. ఆ విభాగము లన్నియును ప్రత్యేక పరిశ్రమ నపేక్షించుచున్నవి. ఆ విభాగములందు శతక వాఙ్మయ మొకముఖ్యముగ నున్నది. ఆంధ్రశతకములు ప్రాకృత సంస్కృత గ్రంథముల పరిణామములైనను ప్రత్యేక వ్యక్తిత్వమును గలిగి యాంధ్రలోకాదరణమును బడసినవి. శతకవాఙ్మయము పండిత పామరులకు ప్రియతరమైనను, లాక్షణికుల యాదరణమునకు విశేషముగ బాత్రము గాలేదు. లక్షణగ్రంథములను వ్రాసిన యప్పకవి యనంతామాత్యాదులును, కవుల చరిత్రను వ్రాసిన వీరేశలింగము పంతులుగారును శతక వాఙ్మయము నాదరించియుండలేదు. ఆ లోపమును దీర్చుటకు సుబ్బారావుగా రీ గ్రంథమును రచించి పటులు వారి పీఠిక విశదము చేయుచున్నది.

శతకవాఙ్మయ మాంధ్రభాషయం దపారముగ నున్నది. సుబ్బారావుగారు 600 శతకములను జూచినటులు వ్రాసియున్నారు. ఇంకను బరిశోధన చేయవలసిన శతకము లనేకములు గలవు. ప్రస్తుతము గనుపడుచున్న శతకములందు పాల్కురికి సోమనాథ విరచితమైన వృషాధిపశతకము ప్రాచీన శతకము. ఇది పండ్రెండవ శతాబ్దికి జెందినది. అప్పటినుండి నేటివరకును శతకరచన లవిచ్ఛిన్నముగ గనుపడుచున్నవి. ఆంధ్రభారతకాలమునుండియు నవిచ్ఛిన్న జీవితముగల శతకవాఙ్మయ మాంధ్రవాఙ్మయ పరిశోధకులకును భాషాభిమానులకును నాదరణీయముగ నున్నది. ఆంధ్రవాఙ్మయమునందు శతకవాఙ్మయ స్థానమును ప్రయోజనమును నిర్ణయించుటయె శతకకవుల చరిత్రమునకు బ్రయోజనము. కావ్యప్రయోజనము నిర్ణయించుటయందు పండిత ప్రయోజనములను గ్రంథబాహుళ్యమును రసాత్మకమును బట్టి నిర్ణయించుట యాచారమైనను కేవలము రసపోషణ మూలముననే యాదరణమును బడసిన కావ్యములు గలవు. మేఘసందేశము చిన్నదైనను కావ్యముగ బరిగణింపబడుచున్నది. "రసాత్మకమైన వాక్యము" కావ్యమనియును; "రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము" కావ్యమనియును,

"శ్లో. నిర్దోషలక్షణవతీ సరీతి ర్గుణభూషితా,
సాలంకార రసానేక వృత్తి ర్వా క్కావ్యనామభాక్."

కావ్య మనియును, లాక్షణికులు వ్రాసియున్నారు. ఆంధ్ర లాక్షణిక గ్రంథకర్తలు శతకములను జాటుప్రబంధములందు జేర్చిరి. చిన్నకోట పెద్దన్నగారు శతకములను క్షుద్రకావ్యములందు జేర్చిరి. శతకముల కావ్యవిభాగమును నిర్ణయించుటకు గావ్యప్రయోజనమును నిర్ణయించుట సమంజసము. మమ్మటాచార్యుడు నిర్ణయించిన కావ్యప్రయోజన మాదరణమును బడసినది:—

శ్లో. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితత యోపదేశయుజే.

కావ్యప్రయోజనము రసౌచిత్యమూలమున స్థాయిభావమును గలుగజేయుట యైనను నయ్యది పురుషార్థసిద్ధికి సాధనము గావలయును. పద్యభేదమును సంఖ్యనుబట్టి కావ్యస్వరూపమును నిర్ణయించుట ప్రయోజనకరముగాదు. భావానుసంధానము లేని పద్యముల సముదాయము కావ్యముగ బరిగణింపబడదు. భావానుసంధానముగల మేఘదూతము చిన్నదైనను కావ్యముగ బరిగణింపబడుచున్నది. రసౌచిత్యముగల భావగీతములును గావ్యవిభాగములుగ బరిగణింపబడుచున్నవి.

సుబ్బారావుగారు శతకములు భావగీతములను బోలి యా వాఙ్మయశాఖకు జెందినవని నిర్ణయించిరి. ఆంగ్లవాఙ్మయరీతుల లక్ష్యముతో శతకవాఙ్మయరీతిని బరిశీలించినపు డీ నిర్ణయము యుక్తముగ దోచినను నీ పోలికయును నిర్ణయమును నసంగతములు. భావగీతములకును శతకములకును బోలిక యుండదు. భావగీతములందు గవి ప్రకృతిస్వరూపముల గుణసౌందర్యములనుగాని మనోభావములనుగాని మనోహరముగ వర్ణించుచు భావవికాసమును గలుగజేయును. భావగీతములు గలుగజేయు భావవికాసము మానసికానందమును గలుగజేసినను నాత్మానందమును గలుగజేసి పురుషార్థమునకు బ్రయోజనకరము గాదు. శతకములు భావగీతముల కతీతమైన యాత్మానందమును గలుగజేయుచు పురుషార్థమును బడయుటకు సాధనములుగ నున్నవి. శతకములు సామాన్యముగను భక్తిశతకములుగ నున్నవి. పురుషార్థమునకు బరమావధియైన మోక్షప్రాప్తి శతకమునకు బ్రయోజనము. కవులు ధనకనకవస్తువాహనముల నర్థించుచు ప్రబంధాదులను వ్రాసినను మోక్షకాములై శతకములను వ్రాయుచుండిరి. కవులు చిన్నతనమునందు శతకములను, బెద్దతనమునందు కావ్యాదులను రచియించి రనుట యనుభవమునకు విరుద్ధముగ నున్నది. ధూర్జటి ధనార్థియై శ్రీ కాళహస్తి మాహాత్మ్యమును, మోక్షార్థియై శ్రీ కాళహస్తీశ్వరశతకమును రచియించిన విధమును గ్రంథములే తెలుపుచున్నవి. శతకముల రచనావిభాగములును నీ యర్థమును బరిస్ఫుటము చేయుచున్నవి. నారాయణశతకమునందుగల శతకవిభాగము శతకప్రయోజనమును దెలుపుచున్నది.

"రమణీయంబుగ నాదిమంబు నవతా
రము క్రమ్మ భవద్ద్వయా
నము నామామృతమున్ దలంప దశక
ప్రాప్తయ్యె కృష్ణాంశతా
లము మజ్ఞానము మోక్షమున్ ద్వివిధ సం,
ప్రాప్తిన్ శతాంధ్రాఖ్య కా

స్వము నర్పించితి మీ పదాబ్జములకున్
వైకుంఠ నారాయణా!

(నా. శ. ప. 101) శతకకవుల చరిత్ర పుట: 125

శతకము 1. ఆదిదశకము 2. అవతారదశకము 3. దివ్య రూపదశకము 4. నామదశకము 5. కృష్ణావతారదశకము 6. జ్ఞానవింశతి 7. మోక్షవింశతి యని యేడుభాగములుగను విభజింపబడినది. శతకము భగవదవతార వర్ణనములతో నారంభమై మోక్షాపేక్షతో నంతము నొందుచున్నది. శతకములందు గామ మాత్రాత్మకమైన కథలు వర్ణనాదులు లేకపోయినను భాగవతాత్మకమైన కథలు వర్ణనలు గలవు. భాగవతపరములైన పద్యములందు గల పరమేశ్వర లీలా విలాసముల వర్ణనలు భావగీతభావవర్ణనముల కతీతమై వ్యక్తిత్వమును భక్తిరసావేశమును గలుగజేయుచున్నవి. భావగీతములు భౌతికానందమును, శతకము లాధ్యాత్మికానందమును గలుగజేయుచున్నవి. ప్రాచ్యసంస్కారపరములైన శతకములకును, పాశ్చాత్యసంస్కారపరములైన భావగీతములకును సామ్యత్వము దుర్లభము. భక్తి జ్ఞాన వైరాగ్య బోధకములైన శతకము లాంధ్రభాషా భూషణములై పండితపామరజనులకును బాలబాలికలకును బఠనార్హములుగ నున్నవి.

రసానుభవము కావ్యమునకు ప్రయోజనము. నవరసములందును శృంగార కరుణరసములు ప్రధానములు. శృంగార కరుణ రసములు కామపరములైనపుడు బంధనమునకును, దైవపరములైనపుడు మోక్షమునకును మూలము లగుచున్నవి. శృంగారకరుణా మూర్తియైన భగవంతుని శృంగారకరుణా లీలావిలాసము లనంతములు. అనంతమైన శృంగారకరుణా విలాసముల యానందానుభవమున కనన్యమైనభక్తి సాధనముగ నున్నది. అనన్యమైన భక్తిపారవశ్యానందమును వర్ణించుటకు శతకములు యోగ్యముగ నున్నవి. కవు లిష్టదేవతాప్రార్థనమును బలువిధములను జేసి తరించుటకు శతకము లుత్కృష్టసాధనములు. సర్వేశ్వర శతకము, కృష్ణశతకము, నారాయణశతకము, రామతారకశతకము, దాశరథీశతకము, కాళహస్తీశ్వరశతకము మొదలగు శతకములందలి ఈశ్వరస్తవములు భక్తిరసానందమును గలుగజేయుచు ముక్తిమార్గమును గలుపుచున్నవి. కవులు తమతమ గ్రామములందు వెలసిన పరమేశ్వరావతారములను శతకరూపమున ప్రార్థనచేయుచు గవిత్వమును సార్థకము చేయుచున్నారు. భక్తహృదయావేశమును దెలిపెడి శతకము లనేకము లాంధ్ర భాషయందు గలవు. శతకముల పరిశీలనమాంధ్రహృదయ వికాసమును భాషావికాసమును విశదము:చేయగల విధమును సుబ్బారావుగారు గ్రంథమునందు విశదముచేసిరి. గ్రంథము శతకవాఙ్మయము వృద్ధినొందిన విధమును జక్కగ వివరించినది. శతకములందు భక్తిశతకములే కాకను నీతి హాస్య శృంగారశతకములును గలవు. పండ్రెండవ శతాబ్దియందు భక్తిభావముతో నారంభమైన శతకవాఙ్మయము పదునేడవ శతాబ్దియందు శృంగారరూపమును దాల్చినది. శతకకవుల చరిత్రము మతసిద్ధాంతములందును సంప్రదాయములందును సాంఘిక వ్యవస్థలందును గలిగిన మార్పులను విశదముచేయుచు నాంధ్రహృదయ పరిణామమును నిరూపించుచున్నది.

గ్రంథము నాలుగు భాగములు గలిగి 200 శతకకవుల చరిత్రను గలిగియున్నది. ప్రథమభాగమునందు 1150–1500, ద్వితీయ భాగమునందు 1500—1700, తృతీయ భాగమునందు 1700—1800, చతుర్థభాగమునందు 1800—1900 వరకును జీవించిన శతకకవుల చరిత్రములు గలవు. శతకకవుల జీవితములందలి సుబ్బారావుగారి మాతవాన్వేషణములు వారి పరిశోధనసామర్థ్యమును విశదముచేయుచున్నను గ్రంథబాహుళ్య మనవసరముగ గలిగినది. సుబ్బారావుగారి గ్రంథరచనాసక్తివలన బునరుక్తిదోషమును నిర్నిమిత్తమైన బాహుళ్యమును గలుగుచున్నవి.

శతకకవుల చరిత్రమును ఆంధ్రవాఙ్మయ చరిత్రమువలె నాంధ్రవాఙ్మయమునకు సుబ్బారావుగారు సమర్పించిన మాతిదాలంకారము. గ్రంథము సుబ్బారావుగారి రచనాసామర్థ్యమును బరిశీలనా కౌశలమును విశదముచేయుచు నవవిధానమును సూచించుచున్నది. ఆయిదారు వందల శతకములను నితరగ్రంథములను బరిశీలించి విషయమును సమన్వయముచేసి వ్రాయుటయందు గల పరిశ్రమను బండితులు గ్రహింపనోపుదురు. మాతన రచనయందును గల్పనయందును లోపములు సహజముగ గనుపడుచుండును. భావికాలమునందు శతకకావ్యాభిమాను లీ లోపములను సవరింపనోపుదురు. ఆంధ్ర విద్యావంతులకు జిరపరిచితమైన సుబ్బారావుగారి శైలి, రచనాసామర్థ్యము, నితర గుణములును జర్చించి వర్ణించుట యనవసరము. ఆంధ్రవాఙ్మయసేవకై జీవితమును సమర్పించిన శ్రీయుత వంగూరి సుబ్బారావుగారి కృతికి చిరంజీవిత్వమును వారి యాత్మ కానందమును విశ్వకళ్యాణమూర్తి విశ్వేశ్వరు డనుగ్రహించుగాత!

[శతకకవుల చరిత్రము పీఠిక—1924]

# నీ తి ని ధి

శ్రీ నీతినిధి ఆంధ్రగ్రంథమాలయం దాఱవ కుసుమము. గ్రంథ మాంగ్లగ్రంథమున కనువాదము. సుప్రసిద్ధ గ్రంథకర్తలు బ్రహ్మజ్ఞానసంపన్నులు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రులుగా రనువాదకులు. గ్రంథోదంతము మూలగ్రంథమునందున్న విధమున నిందుఁ బొందుపఱుపఁబడినది. నీతినిధికిఁ బీఠికను వ్రాయఁబూనుట భాస్కరునిఁ గరదీపికలతోఁ జూపఁబూనునటు లుండును. అయినను నియతమైన బాధ్యతయే యీ ప్రయత్నమునకుఁ గారణము. అంతయును బంగారమైయున్నపు డేరి కోరి మెఱుఁగులను నిరూపించుటసాధ్యము గదా!

పూర్వకాలమునుండియు భరతఖండము బ్రహ్మజిజ్ఞాసువులకు నిలయము. బ్రాహ్మణ క్షత్త్రియాదులు తపోనిష్ఠాగరిష్ఠులై బ్రహ్మజ్ఞానమే జీవయాత్రకు ఫలమని గ్రహించుచుండిరి. ఆ బ్రహ్మజ్ఞులం దొక రీగ్రంథమును సంస్కృతభాషయందు రచియించిరి. "సంస్కృతగ్రంథము త్రివిష్టపమును జేరి త్రివిష్టపభాషారూపమును దాల్చినది. త్రివిష్టపభాషనుండి చీనాభాషానువాదమును బడసినది. చీనాభాషనుండి యాంగ్లభాషాంతరీకరణమును బొందినది." ఇయ్యది చప్పరుఫీలు ప్రభువునకు చీనానుండి గ్రంథకర్త వ్రాసిన యుదంతము. ఇందుఁ గొంత సత్యమున్నను, గ్రంథరచనయందు గ్రంథకర్తభావములు విశేషముగఁ జేరియున్న విధమును గ్రంథపరిశీలనము విశదముచేయుచున్నది. క్రైస్తవమతసంప్రదాయములు, పలస్తీను ఈజిప్టు అరాబియాభిదర్శనములు, సముద్రోపమానములు భారతీయ బ్రహ్మజ్ఞానసంప్రదాయములకుఁ బ్రతికూలముగను, క్రైస్తవమతసంప్రదాయముల కనుకూలముగను నున్నవి. క్రైస్తవమతాభినివేశము, పాశ్చాత్యసంస్కారము గ్రంథమునందలి భావసాంకర్యమునకుఁ గారణమైయుండనోపును. గ్రంథము ప్రాచ్యవిజ్ఞానసంజాతమైనను, పాశ్చాత్యవిజ్ఞానసంజాతమైనను లేక యుభయవిజ్ఞానసమ్మిళితమైనను గ్రంథరాజమై యాంధ్రభాషయోష కొక యలంకారముగ నుండఁగలదు.

జీవయాత్రకు నీతి సాధనము; పురుషార్థము ఫలము. నరుఁడు నీతిసాధనమునఁ జతుర్విధపురుషార్థముల నారాధించుచు నారాయణపదము నధిష్ఠించుచున్నాఁడు. మానవులకు ధర్మార్థకామమోక్షములు కరతలామలకము లయ్యును దురారాధ్యములుగ నున్నవి. వేదములు, ప్రస్థానత్రయము, దర్శనములు, శాస్త్రములు, పురాణేతిహాసములు, సద్గ్రంథములు, కావ్యములు, నాటకములు, నవలలు, [illegible], పద్యములు పురుషార్థసిద్ధికిసాధనముల ననంతరూపముల నుపదేశించుచున్నవి. ఆ సత్యోపదేశములను నిత్యజీవనమునందు సమన్వయముచేసి పురుషార్థమును బడయఁగలవిధమును నీతులు తెలుపుచున్నవి.

వివిధమతములకును మోక్షవిషయమునందు భేదాభిప్రాయము లున్నను నీతివిషయమునందు భేదాభిప్రాయములు లేవు. సత్యము, శౌచము, శమము, దమము, దయ, వైరాగ్యము, త్యాగము మున్నగు సద్గుణముల నన్నిమతములును శ్లాఘించుచున్నవి. అహంకారము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము మున్నగు దుర్గుణముల నన్నిమతములును నిరసించుచున్నవి. దుశ్చింతలను, దుర్భాషలను, దుర్గుణములను, దుష్కార్యములను బాపి సచ్చింతలను, సద్భాషలను, సద్గుణములను, సత్కార్యములను బొందఁగల విధమును నీతినిధి సులభముగఁ దెలుపుచున్నది. జీవయాత్రను స్వర్గయాత్రను జేయఁగల నీతిధర్మములను నీతినిధి విశదముచేయుచున్నది. సుఖప్రాప్తికిని దుఃఖనివృత్తికిని మూలాంకురములైన నీతిధర్మములను నీతినిధి సుగమము చేయుచున్నది.

నీతినిధియందు రెండు భాగములు గలవు. ప్రథమభాగమునం దేడును ద్వితీయభాగమునం దైదును అధ్యాయములు గలవు. ప్రతి అధ్యాయమునందును మానవులకు భిన్నావస్థలం దవసరమైన నీతులు వివరింపబడియున్నవి. సంసారప్రవృత్తియందు, భిన్నావస్థలందు మానవుల కనుష్ఠానయోగ్యములైన నీతిధర్మము లీ చిన్నిపొత్తమునందుఁ జక్కఁగ సమర్పఁబడియున్నవి. సంఘజీవనమునందుఁ బతులకు, సతులకు, తల్లులకు, బిడ్డలకు, చుట్టములకు, రాజులకు, ప్రజలకు వలయు నీతిధర్మము లిందు వివరింపఁబడియున్నవి. మానవులు సకలావస్థలందును స్వధర్మనిర్వహణమును జేసి తరించుటకు నీతిమార్గము శరణ్యము. నీతిధర్మపరాయణులు సుఖదుఃఖములను, లాభనష్టములను, జయాపజయములను, కీర్త్యపకీర్తులను బాటింపక స్వధర్మనిర్వహణమును జేసి కృతకృత్యు లగుచున్నారు. స్వధర్మనిర్వహణమునకు సకలధర్మములందును నాత్మధర్మము ప్రధానము. జీవయాత్రయందు మానవధర్మమును సార్థకము చేయుటకు నిత్యమైన యాత్మధర్మమువలెను అనిత్యములైన దేహేంద్రియమనోధర్మములు ప్రయోజనకరములు గావు.

నిత్యమైన యాత్మధర్మారాధనమును జేయుటకు సాధనములైన నీతిధర్మములను ఆత్మానుభవముగల మహానుభావులు వివరింప సమర్థులు. నిత్యమైన పరతత్త్వము సర్వత్ర వెలుఁగుచున్నను నప్రత్యక్షముగ నున్నది. ఇంద్రియగ్రామ మనిత్యమైన విషయవాసనలందు లగ్నమై పండితులనుగూడఁ బరవశులను జేయుచున్నది. అహంకార చతుష్టయము, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు విషయవాసనలనుండి మరలుటకును బరమాత్మలయందు లయమును బొందుటకును నీతిమార్గము సాధనముగ నున్నది. మానవధర్మనిర్వహణమునకును, పురుషార్థసిద్ధికిని సాధనభూతములైన నీతిధర్మములతో నిండియున్న నీతినిధి సకలజనులకును—పండితపామరులకు, స్త్రీపురుషులకు, బాలవృద్ధులకు—పారాయణయోగ్యముగ నున్నది. నీతినిధి బడులందును గృహములందును అనుదినమును జదువఁదగిన పుస్తకమైయున్నది. నీతినిధి ప్రతిమనుజునకును వెంటనుండఁదగిన ధర్మమిత్రము. ఆంధ్రమహాజనులు నీతినిధిని జదివి యందలి పరమార్థమును గ్రహించి శ్రీయుత ప్రభాకరశాస్త్రిగారి సంకల్పమును సార్థకము చేయుదురుగాక!

[నీతినిధి పీఠిక—1926]

# బ్రహ్మదేశము - ఆంధ్రదేశము

అస్మద్దేశీయ సోదరులు నా పట్లను గల వాత్సల్యమును గనుపఱచుట కేదో ప్రమేయమును గల్పించుకొని నన్నీ దివ్యమైన బ్రహ్మదేశమున కాహ్వానించి సన్మానము చేసినందుల కనేక వందనములను సమర్పించుచున్నాను. కాని ఈ గౌరవసన్మానములు వ్యక్తిపరమైన గౌరవసన్మానములు గావనియును, ఆంధ్రమాతకు జేసిన గౌరవమనియును, స్వజాతీయ గౌరవమనియును ఆత్మవిశ్వాసగౌరవమనియును నేను నమ్ముచున్నాను. ఆత్మవిశ్వాసము, ఆత్మగౌరవము పరులవిశ్వాసగౌరవములందు ప్రత్యక్ష మగుచున్నవి. మాతృదేశము నుద్ధరించుట కుదయించిన ప్రబోధము వివిధప్రాంతములకును సహజముగను వ్యాపించి అన్యోన్యాశ్రయము వలనను సాహచర్యము వలనను స్వజాతీయాభ్యుదయము సాధ్యమగుచున్నది. నేను మీ యాహ్వానమునకు విఘ్నములను గలుగజేసి మీ యుత్సాహమునకు భంగము గలుగజేసినందులకు మన్నింపగోరెదను. ఒక యుగమునందు సాహసధైర్యవిజ్ఞానములకు ప్రసిద్ధిని బడసిన ఆంధ్ర హృదయము వర్తమానకాలమునందు సంకుచితమై నిర్వీర్యమై స్వీయ ప్రయోజనములకును పరప్రయోజనములకును నిరర్థకమైనది. ద్వీపాంతరములందు సంచారమును జేసిన యాంధ్రులకు సముద్రయానము ధర్మవిరుద్ధమై భయభ్రాంతులకు కారణంబగు ఆంధ్రజాతీయ జీవయాత్రయందు విచిత్రాధ్యాయము గదా! నాయాగమనమునకును ఈ సంకుచిత స్వభావము కొంత ప్రతిబంధకమై యుండును. ప్రయాణసౌకర్యములు లేకను మృత్యువు సన్నిహితముగ నుండెడి యుగమునం దాంధ్రహృదయమున కుండిన పాటవము సకల సౌకర్యములు గల వర్తమానకాలమునందు లేకుండుట కాలప్రభావము గదా! మానవహృదయ మున్నత పదప్రాప్తికి జేయగల త్యాగమును స్వల్ప ప్రయోజనములకు జేయు ప్రపంచావృతమైన సందిగ్ధస్థితియం దాంధ్రులును స్వధర్మనిర్వహణమును జేయుటకు శక్తిసామర్థ్యములను గలిగియుండుటకు మహాసంకల్పమును జేసి ఆత్మసంస్మరణమును జేయుట కార్యసిద్ధికి పరమసాధనంబుగ నుండగలదు.

ఆంధ్రదేశము మానవకల్యాణమునకు సాధనభూతములైన ప్రకృతిసంపదలతో దనరారుచు ప్రజాదరణమునకును పోషణమునకును పాత్రముగ నున్నది. దేశవైశాల్యము, దేశస్థితి, సహజసంపదలు, ప్రకృతివిలాసములు పురుషార్థముల బడయుట కనుకూలముగ నున్నవి. గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రాది జీవనదులు గలవు. శ్రీగిరి, భద్రగిరి, సింహాద్రి, శేషాద్రి, వేదాద్రి మొదలగు పుణ్యగిరులు గలవు. వ్యాపారవాణిజ్యముల కనుకూలమైన సముద్రతీరము సాగరనదీ సంగమములు గలవు. సారవంతమైన భూమి గలదు. ప్రజాపోషణమున కనుకూలమైన పరిశ్రమలు పాడిపంటలు గలవు. ప్రజల కాత్మోన్నతికి సాధనములైన సాహసధైర్యములు, త్యాగపరాక్రమములు, వివేకవిజ్ఞానములు గలవు. ఆంధ్రులలోని మాంధ్రత్వము నకును విశ్వశ్రేయస్సునకు వినియోగపడిన విధము నాంధ్రుల గతించిన ప్రాభవము విశదము చేయుచున్నది. నిత్యమును మననము చేయుచుండెడి పరిమిత సంకల్పమును మఱచి విశాలమైన సంకల్పము చేసి కామితార్థములను బడయుటకు తరుణ మాసన్నమైనది.

ఆంధ్రులజాతి ఆదిమవాస స్థలము వివాదగ్రస్తమైన విషయములు. వేదయుగమునాటికి కృష్ణాగోదావరుల నడుమను ఆంధ్రులు నివాసస్థలములను గల్పించుకొని నలుదిశలను నాంధ్రత్వ వ్యాపనమునకు బూనుకొనిరి. ఆంధ్రు లాదికాలమునుండియును విదేశయాత్రలను జేయుచు విదేశ స్వదేశ సౌభాగ్యముల నభివృద్ధి చేసిన విధమును ప్రాచీననౌకాచరిత్రము విశదము చేయుచున్నది. ఆంధ్రదేశమునకును బర్మాదేశమునకును నాదికాలమునుండియును గల సంబంధము నీ విషయమును స్పష్టము చేయుచున్నది. ఆదియుగమునందు ఆంధ్రబ్రాహ్మణులు సహజసంపచ్ఛోభితమైన యీ దేశమునకు బ్రహ్మదేశనామకరణమును జేసియుందురు. చీనులును ఇతరులును గ్రామనామకరణమును జేసినను బ్రహ్మదేశనామమె స్థిరమైనది.

ఆంధ్రరాజులు క్రీస్తుశకమునకుపూర్వము 200 ఏండ్లును, క్రీస్తుశకము తరువాతను 200 ఏండ్లును భరతఖండమునందు విశేషభాగము నప్రతిమానమైన వైభవముతో బాలించిరి. పాటలీపుత్రమునుండి కాంచీపురమువరకును, నాసికనుండి ధాన్యకటకమువరకును ఆంధ్ర సామ్రాజ్యము వ్యాపించి ప్రపంచేతిహాసములం దొక్క మనోహరంబైన సాహిత్యాధ్యాయమును నిర్మించుటకు దోడ్పడిరి. శ్రీముఖ శాతకర్ణుడు శాలివాహనవంశ స్థాపకుడై ఆంధ్ర సామ్రాజ్య వ్యాపనముతోను ఆంధ్రసాహిత్య వ్యాపనమును సాధ్యము చేసెను. ఆంధ్ర రాజులు వైదికమత పరిణామములయిన బ్రాహ్మణమతమునకువలెనే బౌద్ధమతమునకును, సంస్కృత భాషకు వలె ప్రాకృత భాషకును, కృషికివలెను వాణిజ్యమునకును, విజ్ఞానమునకు వలెను శిల్పమునకును పోషణయు నొసంగి సువిశాలమైన యాంధ్రాభ్యుదయమునకు సాధకులైరి.

అద్భుతములైన అమరావతి సాంచిస్తూపములు, ధరణికోట, ఉజ్జయిని విద్యాపీఠములు, బృహత్కథా శాలివాహన సప్తశతులు, మొయిసిల పట్టణము, కూడూరు ధరణికోట మొదలగు రేవులు, ఆంధ్ర రాజుల నాణెములు, శాసనములు, శాలివాహన శకము సర్వతోముఖమైన ఆంధ్రాభ్యుదయమును సంస్మరింపజేయుచున్నవి. ఆంధ్ర రాజుల కాలమునందువలెనే పల్లవ చాళుక్య గజపతి విజయనగర రాజ్యముల కాలములందును ఆంధ్ర వీరులును పండితులును స్వదేశ,

విదేశములందు స్వీయప్రతిభను మానవధర్మాభ్యుదయమునకై వినియోగించి జీవయాత్రను సఫలము చేసిరి. ఆంధ్రాభ్యుదయమునకు దేశపరిమితియందును విజ్ఞానోపార్జనమునందును, వ్యాపారపరిశ్రమలందును, ప్రజావికాసమునందును భిన్నకాలములందు హెచ్చుతగ్గులేర్పడినను ఆంధ్రప్రవృత్తి అవిచ్ఛిన్నముగను నేటికిని వెలయుచున్నది. ఆంధ్రరాజుల కాలమునందు పాటలీపురమునుండి కాంచీపురమువరకును పడమటి కనుమలనుండి తూర్పుతీరమువరకును ఆంధ్రావని వ్యాపించినది. పల్లవ చాళుక్య కాకతీయులకాలమునందాంధ్రావని సంకుచితమైనను వీర్యవంతమై వర్ధిల్లినది. శ్రీకృష్ణదేవరాయల కాలమునందాంధ్రావని కటకమునుండి మధురవరకును కల్లికోటనుండి శ్రీకాకుళమువరకును వ్యాపించి ఆంధ్రాభ్యుదయమునకు సకలవిధములను వినియోగపడినది. మహమ్మదీయ విజృంభణముతో నాంధ్రప్రతిభ స్తంభించుట కుపక్రమించినది. బ్రిటీషు సామ్రాజ్య విజృంభణము నాటలయందు ఆంధ్రాభ్యుదయమును గోరుచున్నను సంకల్పమును క్రియాశక్తిని స్తంభింపజేసినవి. స్వదేశమునందు ప్రతిపత్తియును సాధనసంపత్తియును లేని ఆంధ్రులు విదేశములందు గష్టముల ననుభవించుచున్న తమ సోదరుల యుద్ధరణమునకు దోడ్పడజాలరు. స్వయముగను తరింపజాలనివారితరులను తరింపజేయుట సాధ్యముగాదు. సాధనసంపన్నులైనను ఆంధ్రమహాజనులు దేశాంతరులైన సోదరులపట్లను నిర్లక్ష్యభావమును నిరాదరణ స్వభావమును బూని స్వధర్మనిర్వహణమును జేయకుండుట పరమవిషాదమును గలుగజేయుచున్నది. ఆత్మావలంబనము లేకను పరావలంబనులైన ప్రజలకు విషాదస్థితి సహజస్థితిగనున్నది. విషాదయోగపరవశమైన యాంధ్రలోకమును స్వధర్మనిర్వహణ పరాయణము జేయుట సకలాంధ్రులకును అవశ్యకమణీయమైన ధర్మమైయున్నది. ఇట్టి స్వధర్మస్వరూప స్వభావములను నిరూపించుటకును నిర్ణయించుటకును ఆంధ్రోద్యమ మారంభమై ఆంధ్రులకు ప్రత్యభిజ్ఞానమును గలుగజేయుటకు వినియోగపడుచున్నది.

ఆసేతుహిమాచలము వ్యాప్తమైన భరతఖండమునందాంధ్రులు వ్యాపించియున్నారు. భరతఖండమునందు గల 33 కోట్ల ప్రజలందును ఆంధ్రులు 2,35,43,000 కలరు. భారతభూమియందు వ్యాప్తములైన భాషలందు హిందీభాషను 9.7 కోట్లు, బెంగాలిని 4.9 కోట్లు, తెలుగును 2,36,01,000 మంది, అరవమును 1.8 కోట్లు మంది మాటలాడుచున్నారు. తెలుగు మాటలాడెడివారి సంఖ్య 1911—1921 పది సంవత్సరములలో 100 కి 2 వంతునను అరవము మాటలాడెడివారి సంఖ్య 100 కి 4 వంతునను పెరిగినది. హిందూదేశమునందలి ప్రధానస్థానములందు గల యాంధ్ర జనసంఖ్య ని క్రిందిపట్టిక తెలుపుచున్నది.

భారతదేశములో నాంధ్ర భాషను మాటలాడువారు

| | | మొత్తము |
|---|---|---|
| అండమానులు, నికోబార్ | ... | 385 |
| అస్సాము | ... | 29,733 |
| బెంగాల్ | ... | 24,513 |
| బీహార్, ఒరిస్సా | ... | 14,211 |
| బొంబాయి | ... | 138,771 |
| బర్మా | ... | 155,519 |
| మధ్య రాష్ట్రములు, బీరార్ | ... | 1,02,095 |
| కూర్గు | ... | 1,082 |
| మదరాసు | ... | 16,101,728 |
| పాంచాలము | ... | 260 |
| సంయుక్త పరగణాలు | ... | 500 |
| బరోడా సంస్థానము | ... | 168 |
| బెంగాలు సంస్థానములు | ... | 539 |
| బొంబాయి సంస్థానములు | ... | 13,974 |
| బీహారు, ఒరిస్సా సంస్థానములు | ... | 5,836 |
| మధ్య ఇండియా ఏజెన్సి | ... | 1,140 |
| మధ్య పరగణాల సంస్థానములు | ... | 13,691 |
| గ్వాలియరు సంస్థానము | ... | 200 |
| హైదరాబాదు సంస్థానము | ... | 6,017,341 |
| మదరాసు సంస్థానములు | ... | 57,480 |
| మైసూరు సంస్థానము | ... | 921,468 |
| పశ్చిమోత్తర పరగణా | ... | 667 |
| | మొత్తము | 23,601,301 |

అన్ని ప్రాంతములందును ఆంధ్రులు వ్యాప్తమును గాంచుచున్నారు. బర్మాయందు 1921 జనాభా లెక్కల ప్రకారము 152,508 ఆంధ్రులు గలరు. ఈ సంఖ్య ఇపుడింకను హెచ్చినదని యూహింపవచ్చును. చెన్నరాష్ట్రమునందు గల 4,2,7,94,155 జనులందును 1,61,43,796 ఆంధ్రభాషను మాటలాడువారు గలరు. తెలుగు మాటలాడెడివారి సంఖ్య యభివృద్ధిని జెందుచున్న విధము ఈ లెక్కలు తెలుపుచున్నవి. ఆంధ్ర దేశమునం దారంభమైన ఆంధ్రోద్యమము వివిధ ప్రాంతములందును జీవయాత్రను చేయుచున్న యాంధ్రులయందు స్వభాషాభిమానమును, స్వజాతీయాభిమానమును, స్వదేశాభిమానమును గలుగజేయుటకు వినియోగపడుచున్న విధమును స్వల్పకాలమునందును పరిస్థితులననుసరించి పరమోత్సాహముతో నిర్వహింపబడుచున్న యాంధ్రమహాసభలు విశదము చేయుచున్నవి. ఈ సుందర

మైన రంగూనునందును నమావేశమైన ఆంధ్ర మహాసభ యును స్వర్ణలక్ష్మునందును బర్మాయందును వాంధ్రహృదయమునం దుద్దీపింపఁబడుచున్న ప్రత్యభిజ్ఞానమునకు నిదర్శనముగ నున్నది.

## బర్మా దేశము — ఆంధ్రులు

బర్మాదేశమునకును ఆంధ్రదేశమునకును గల సంబంధ మతిప్రాచీనమని యుభయదేశ చరిత్రలు విశదము చేయుచున్నవి. బర్మా నామధేయము భారతీయ సంబంధమైన బ్రహ్మ పదజన్యమని కొందరును కంగోలియా సంబంధమైన బాన పద జన్యమని కొందరును తలంచుచున్నారు. బర్మాయందు హిందూమతము వ్యాప్తి గాంచకపోయినందున బర్మాపదము బ్రహ్మపదజన్యము గాదనుటకు గారణము గాజాలదు. బ్రాహ్మణు లాదియుగమునందే బర్మాదేశమునకు బోయినటులు నిదర్శనములు గలవు. బంగాళాఖాత మునకు రెండు ప్రక్కల నున్న ఆంధ్ర బర్మా దేశములకు సంబంధ సాహచర్యములు సహజముగను గలుగుచుండును. ఆంధ్ర రాజుల కాలమునందును పాండ్యరాజుల కాలమునందును బర్మా సింహళము జావా మొదలగు ప్రాంతములు కాంధ్రుల వర్తక వ్యాపారమునకును బౌద్ధమత వ్యాపనమునకును వెడలినటులు అమరావతి సాంచిస్తూపములందలి చిత్రములు తెలుపుచున్నవి. బర్మా దేశమునకు బౌద్ధమతము మగధదేశమునుండియే విశేషముగను వ్యాపించినదని యూహింపదగియున్నది. ఆంధ్రదేశమునందు క్రీస్తు శకారంభమునందు బౌద్ధమతము స్థిరప్రతిష్ఠను బడసినది. బౌద్ధ మత ప్రచారకుల మతాభిమానమును ఆంధ్రుల నౌకాయాత్రలును బర్మాయం దాంధ్రుల ప్రవేశనివాసములకు వినియోగపడినవి. సోనుడు ఉత్తముడు అను బౌద్ధసన్యాసులు సువర్ణభూమియందలి గోలనగరమునందు క్రీ. పూ. నాల్గవ శతాబ్దమునందు దిగినటులు శాసనములు తెలుపుచున్నవి. వేంగిలిపియందుగల తెలుంగు శాసన ములు క్రీస్తు తర్వాత నాల్గవ శతాబ్దమునకు జెందినవి గలవు. ఆ శాసనములు దక్షిణ హిందూస్థానమునందు బౌద్ధమత వ్యాపక మును తూర్పుతీర వ్యాపారమును తెలుపుచున్నవి. ఆ శాసనములందు గల బౌద్ధ గురుపరంపరలందు కాంచీపురమునకు సమీపమున అశోకచక్రవర్తి కట్టించిన భద్రతీర్థ మఠమునందు ధమ్మపాలుడు నివసించినటుల దెలుపబడినది. బుద్ధఘోషుని బౌద్ధ గ్రంథము లకు విశుద్ధమగ్గటీకను వ్రాసిన ధమ్మపాలుడు వాని యనంతరము జీవించియుండును. బుద్ధఘోషుడు తాటనుకు వ్యాఖ్యాన పిటకము లను, ధర్మశాస్త్ర గ్రంథములను తీసికొనివచ్చినటులు శాసనములు తెలుపుచున్నవి. దక్షిణభాగమునందుగల పెగూయందును తెలింగులు రాజ్యస్థాపనమును జేసినటులు శాసనములు దెలుపుచున్నవి. పురాతన వస్తుశాస్త్రపరిశోధకుడు డొయిసెలుగారు 1927 వ సంవత్స రమునందు ప్రాచీనప్రోముప్రాగను శిథిలములందు గనుగొనిన శాస నము ఈ విషయమును సమర్థించుచున్నవి.

ప్రోము, శ్రీక్షేత్ర మను నామాంతరము గలిగి టిబెటు—బర్మా ప్రజల సంయోగము వలన గలిగిన ప్యూయూ జాతికి చిర కాలము రాజధానిగ నుండెను. ఇచ్చటను 6 వ శతాబ్దమునకు సంబంధించి బౌద్ధస్తూప గర్భమునం దమూల్యమయిన వస్తుసము దాయము బయల్పడినది. స్తూప గర్భమునందు అశ్వత్థ వృక్ష విరాజితమైన వెండి పెట్టె గలదు. స్తూపోపరిభాగ పార్శ్వము లందు శాసనములు గలవు. ఆ శాసనములు ప్యూయు పాలి భాష లందు వేంగి లిపిని బోలిన లిపియందు గలవు. అందలి చిత్రముల రూప విలాసములును దక్షిణ హిందూస్థానము నందలి ప్రజలను బోలియున్నవి. స్తూపాంతర్భాగమునందు 20 బంగారు రేకుల పుస్తకము గనుపడినది. ఆ రేకులందు అభిధమ్మమునుండియును వినయపిటకమునుండియును ప్రవచనములు పాలిభాషయందు వ్రాయబడినవి. శాసనముల లిపి ఏడవ శతాబ్దమునందలి వేంగి లిపిని బోలియున్నది. ప్రాచీనమైన ప్రోము రాజ్యమునకు గూడ విజ్ఞాన సంస్కారములు ఆంధ్ర తీరముల నుండియే సంప్రాప్తమైనటులు శాసనముల స్వరూప స్వభావములు వేంగి లిపి రాజుల నామములు విశదము చేయుచున్నవి.

ఈ స్థితియంతయును 11-వ శతాబ్దమునందు సంపూర్ణ ముగ మారినది. మాతృదేశమునందు పోషణ సహాయములు లేక తెలుంగుల బలము క్షీణించినది. బర్మా ప్రజల కితర జాతు లను తమ జాతియందు లీనము చేసుకొనగల శక్తియును తెలుం గుల విలయమునకు వినియోగపడినది. అన్రవతుడు 11—వ శతాబ్దము నడుమను తెలింగుల నోడించి బర్మా రాజ్యమును ప్రతి ష్ఠించెను. పదునెనిమిదవ శతాబ్దము నడుమను తెలింగ రాజులు ఆవామ తగులబెట్టి స్వతంత్రులైనను, అలంగుపయా రాజా తెలం గులను తిరిగి నిర్జించి బర్మా రాజ్య స్థాపనమును జేసెను. కాల క్రమమునను బర్మా రాజ్యము భారతీయ రాజ్యములవలెను బ్రిటిషు సామ్రాజ్యాంతర్భాగమై స్వాతంత్ర్యమును బడయుటకు పరిత పించుచున్నది.

నేనీ పురాణశ్రవణమును బర్మా దేశమునకును ఆంధ్రదేశ మునకును చిరకాలాగతంబైన సంబంధ సాహచర్యములను సంస్మ రించుటకు జేసినను ఈ యితిహాస మొక పరమార్థమును బోధిం చుచున్నది. దూరదేశాగతులైన పాలక జాతులు వారెంత బలవంత స్నులైనను బహుజనుల నడుమను వారి వ్యక్తిత్వమును సంరక్షించు కొనజాలకను స్వదేశీయులతో గలసిపోవుట సంభవించుచున్నది. బాహుబల స్థాపితమైన రాజ్యధ్వజము కాలప్రవాహమునందు బడి పోయినను ఆత్మబలాపాదితమైన ధర్మధ్వజము జితజేతల సంయోగ సాహచర్యములకు మూలాధారమై స్థిరముగను జేయుచున్నది.

## వర్తమాన బర్మాదేశము — విదేశీయులు

బర్మాదేశము 2,33,707 చదరపు మైళ్ల విస్తీర్ణమును 1,32,12,192 ప్రజలను గలిగి సహజసంపదలలో విశాలవు.

మున్నది. చదరపు మైలునకు 57 ప్రజలు గలరు. ప్రజలకు ప్రధాన వృత్తి వ్యవసాయము. వ్యాపార పరిశ్రమ లతివేగముగను వ్యాపించి పనివాండ్ర యవసర మేర్పడినది. వడ్లమరలు, మట్టినూనెగనులు, కలపమరలు, గనులు, పరిపంటలు, గమనాగమనయానములు, పొగ యోడలు, రైలుబండ్లు మొదలగు పరిశ్రమలకు శిక్షితులైన పనివాండ్రును శిక్షితులుకాని పనివాండ్రును కావలసియున్నారు. ఈ పరిశ్రమల యుపయోగార్థము ప్రతియేటను భారతీయులు బర్మా దేశమునకు వలసపోవుచున్నారు. 1919—24 సంవత్సరములలో బర్మాలో ప్రవేశించిన వారిసంఖ్య 20,88,848; బర్మానుండి తిరిగివెళ్లిన వారిసంఖ్య 16,92,362. ఆరేండ్లలో 3,96,486 మంది బర్మాయందు నిలిచిపోయిరి. బర్మాయందు జీవనోపాధిని గడించుటకు వచ్చెడివారియందు చాలమంది తిరిగివెళ్లవలయుననెడి సంకల్పముతో వచ్చుచుందురు. అక్టోబరు, నవంబరు, డిశంబరు మాసములందు బర్మాకు వెడలుటయును మార్చి, ఏప్రిలు, మేయి మాసములందు తిరిగి స్వదేశమునకు బోవుటయును సామాన్య విషయము. వచ్చెడివారిలో కొలదిమంది నిలిచిపోవుటయును సంభవించుచున్నది. ఇటులు నిలిచిపోవుటకు గారణములు భిన్నములై యుండును. ఏకొలదిమందియో అదృష్టవంతులై స్థిరమైన వృత్తిని సంపాదించి సంసారులై యుండవచ్చును. కొందరు నిస్సహాయులై భారతీయులకు సహజమైన కర్మసిద్ధాంతమును నమ్మియుండవచ్చును. వ్యయప్రయాసములతో గూడిన సముద్రప్రయాణము కొందరికి ప్రతిబంధకము గావచ్చును. ఏది కారణమైనను కొంతమంది పనివాండ్రు బర్మాయందు నిలిచిపోవుట సహజము. కృష్ణాగోదావరి జిల్లాలకు రైలుబండ్లనిండా ఊదుపు కోతల కాలములందు మెట్టప్రదేశములనుండి పనివాండ్రు నలుపు రాకపోకలీ విషయమును విస్పష్టము చేయుచున్నవి. రాకపోకలు సుకరమైన స్థలములందు లాభమున్నను లేకున్నను స్వస్థలములకు జేరుట సహజము. ముఖ్యముగా నీ స్వభావమాంధ్రులయందు జీర్ణించినది. స్వస్థానవేషభాషాప్రియులైన ఆంధ్రు లింతదూరదేశమునకు వచ్చుటకు గారణము పొట్టకూటికి గాని మడిమాన్యములను సంపాదించుటకు గాదని దేశపరిస్థితులు తెల్లముచేయుచున్నవి. ప్రతి అర్ధాన్నముతో నైనను స్వస్థలము నందుండ గోరువారలు పరస్థలములకు వెడలగోరరు. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' యను ధర్మము శ్రీమంతులకన్నను నిరుపేదల కధికతరముగను వర్తించుచున్నది. శ్రీమంతులు స్వదేశమునందు పొగయోడలయందును విదేశములందును సకలసౌఖ్యముల ననుభవింపగలరు. నిరుపేదల కన్నిచోట్లను పుట్టుగతులు లేవు. అన్నాతురులై స్వస్థలమును విడిచి పరదేశములకు వలసపోయెడి దీనుల నాదరించి రక్షించుటకు బదులు వారిని నిందించుటయును పరిహసించుటయును హేయముగ జూచుటయును నాచారమైనది. ఈ యధర్మాచారమును మార్చుటకు ప్రపంచ మనుభవింపనున్న మహాదుఃఖవేదనకు చిహ్నములు ప్రపంచమునందంతటను పొడకట్టుచున్నవి. ఈ స్వల్ప చిహ్నములు ప్రళయాకారమును దాల్పకపూర్వమే యుపశమింపజేయుట యధికారులకును, సంపన్నులకును, విద్యావంతులకును పరమధర్మమై యున్నది.

## బర్మా అభ్యుదయము

బర్మా అభ్యుదయము బర్మాజాతివారికి వలెను నితరులకును నవసరమైన విషయమై యున్నది. ప్రపంచమునందు దేశ వికాసమును ప్రజావికాసమును పరస్పరాశ్రయములై వెలయుచున్నవి. సకలదేశములందు సంపదలను వికసింపజేయుటకు ప్రజాసంపద సాధనంబై యున్నది. మానవసౌభాగ్యమునకు సాధనములైన వ్యవసాయాభ్యుదయమునకును పరిశ్రమాభ్యుదయమునకును నవసరమైన ప్రజాసంపద బర్మాయందు కొరతపడియున్న విధమును బర్మా పరిస్థితులు విశదము చేయుచున్నవి. బర్మాయందు గల జనసంపద బర్మా ప్రజలకు ప్రియమైన వ్యవసాయ పరిశ్రమను వికసింపజేయుటకే చాలకున్నది. సారవంతమైన విశాలమైన దేశము ఫలవంత మగుటకు మానవవ్యవసాయము నపేక్షించుచున్నది. వర్తమాన పరిమితపరిస్థితులందును వ్యవసాయ నిర్వాహణమునకు విదేశీయుల సహాయ మవసరం బగుచున్నది. పరిశ్రమా భ్యుదయమునకు విదేశీయుల సహాయ మత్యంతావసరమైన విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి.

బర్మాయందలి ప్రధాన పరిశ్రమలో

| | | |
|---|---|---|
| వడ్లమరలందు | 37,553 | పనివాండ్రు |
| కొయ్యమరలందు | 10,450 | ,, |
| పెట్రోలియం పరిశ్రమయందు | 10,912 | ,, |
| రైలు పరిశ్రమయందు | 4,405 | ,, |

పనిజేయుచున్నటులు 1924 సంవత్సరము ఫ్యాక్టరి రిపోర్టు తెలుపుచున్నది. ఈ పనివాండ్రయందు

| | బర్మాజాతి, | హైందవులు, | చైనీలు | |
|---|---|---|---|---|
| సామాన్యులు | 69,977 | 13,423 | 56,339 | 2842 |
| శిక్షితులు | 17,222 | 5924 | 9545 | 1,055 |

పనిజేయుచున్నను బర్మావారి సంఖ్య తక్కువగా నున్నది. 100 కి 19 వంతున సామాన్యులగు పనివాండ్రయందును 100 కి 24వంతున శిక్షితులైనవారియందును బర్మా ప్రజలు గలరు. బర్మాయందు పరదేశాగతులైన పనివాండ్రయందు భిన్నజాతుల వివరము:

| | సామాన్యులు | శిక్షితులు |
|---|---|---|
| హిందుస్థాని మహమ్మదీయులు | 874 | 235 |
| హిందుస్థానులు | 7202 | 1498. |
| బెంగాలులు; చిటగాంగుమహమ్మదీయులు | 8912 | 3885 |
| ఉత్కళులు | 10701 | 897 |
| ఆంధ్రులు | 21959 | 1874 |

| | | |
|---|---|---|
| తమిళులు | 630 | 462 |
| చీనులు | 2842 | 1055 |
| ఇతరులు | 718 | 391 |

ఆంధ్రుల సంఖ్య సామాన్యవలసవాండ్రయం దధికముగానున్నను శిక్షితులైన వారియందు తక్కువగా నున్నది. ఇటీవల చీనావారి సంఖ్య విపరీతముగను వృద్ధిని పొందుచున్న విధమును గతించిన 18 ఏండ్ల లెక్కలు విశదము చేయుచున్నవి. బర్మా ప్రజలకు నగరవాసమునందును యంత్రాలయములందును నభిరుచి లేనపుడు విదేశీయుల మూలమునను దేశవికాసమును జేయించుట ధర్మము గాని విదేశీయాక్రమణ భయముచేతను దేశవికాసమును స్వీయ వికాసమును స్తంభనము చేయుట వివేకముగాదు. స్వల్పసంఖ్యాకులైన విదేశీయ కార్మికులు విశేషసంఖ్యగల బర్మాజాతిని మ్రింగివేయజాలరు. వచ్చినవారిలో చాలమంది స్వదేశమునకు మరలి పోవుచున్నారు. శేషించినవారు బర్మాజాతితో నైక్యమును బొందుచున్నారు. రెండు విధములను బర్మా దేశాభ్యుదయమునకును జాతీయాభ్యుదయమునకును లాభము గలుగుననియును నష్టము గలుగదనియును సద్మార్గము జెప్పుగారును గ్రంథముగారును చేసిన హితోపదేశమును బర్మా జాతీయవాదులు గ్రహించుదురు గాక! బర్మా చరిత్ర మిందులకు నిదర్శనముగ నున్నది.

## కార్మికుల స్థితి

బర్మాయందు పరదేశాగంతుకులైన కార్మికుల స్థితిగతులు దుర్భరముగ నున్నవిధమును భిన్నపక్షములవారును సంగీకరించుచున్నారు. ఈ దుర్భరస్థితికి గారణములను నిరూపించుటయందును నివారణోపాయములను గల్పించుటయందును, భేదాభిప్రాయములు విమర్శకుల సంస్కారానురూపముగను బయలుదేరుచున్నవి. అవివేకులు వరులమాయమాటలను నమ్మి బర్మాయందు బంగారము పడియున్నదని భ్రమపడి దూరస్థమైన బర్మాయాత్రకు బూనుకొనుచున్నారు. పొగయోడయందు కాలుపెట్టినతోడనే కష్టము లారంభమగుచున్నవి. సంకుచితమైన స్థలము, గుంపులు, సముద్రవ్యాధి, దుర్గంధ నివాసము, సంకుచితాహార విహారములు చిత్తోద్వేగమునకు స్వాస్థ్యలోపమునకును గారణంబులగుచున్నవి. రంగూనునందు దోడ నుండి దిగినతోడనే దుర్గమారణ్యము నందువలెను నగరారణ్యమునందు భయభ్రాంతులు గలుగుచున్నవి. పనివాండ్రు కాంట్రాక్టు పద్ధతిమీద పోయినను స్వతంత్రించి పోయినను పారిశ్రామిక జీవయాత్రకును నగరవాసమునకును సహజమైన కష్టములన్నియును ప్రత్యక్షమగుచుండును. నగరమునందలి నాలుగంతస్తుల సౌధము కన్నను పల్లెటూరియందు పూరిగుడిసె నివాసయోగ్యముగనుండును. పనివానికి లభించెడి రూ 20 ల వేతనములో ఖర్చులు. కమీషను అద్దె అన్నము పోను మిగులునది అల్పమైయున్నది. మిదుమిక్కిలి సంపాదనిగ్రహములేని పనివాండ్రు దురభ్యాసములకును దుష్కార్యములకును లోనై దుర్బలులును దుర్మార్గులును నగుచున్నారు. 'రంగూను పోయి రోగములను సంపాదించినాడ'ను సామెత సార్థకమగుచున్నది. ఈ దురవస్థకు కారకులు బర్మా ప్రభుత్వమైనను, యంత్రాలయ యజమానులైనను మేస్త్రీలైనను అవివేకులైన పనివాండ్రైనను దుస్థితిని బాపవలసిన బాధ్యత యందరిమీదను గలదు. తప్పులను దిద్దుట ప్రయోజనకరముగాని తప్పులనెన్నుట ప్రయోజనకరము గాదు. బర్మా యభ్యుదయమునకు ప్రస్తుత పరిస్థితులకు విదేశీయ కార్మికుల సహయోగసాహచర్యము అత్యంతావసరములని గతకాలానుభవము విశదముచేసినది. బర్మాయందు నివాసములను గల్పించుకొనిన విదేశీయులు గలరు. ప్రతియేటను విదేశీయులు ముఖ్యముగను ఆంధ్రులు కొన్ని ఋతువులందు ప్రవేశించుచు తిరిగి పోవుచున్నారు. ఆగంతుకులు తమకును వలసదేశక్షేమమునకును వినియోగపడగల విధమును దేశహితైకపరాయణులు నిర్ణయింపవలసి యుందురు. ఆ నిర్ణయములకు స్వదేశాభిమానమును స్వజాతీయాభిమానమును ప్రతిబంధకము గాక సాధకముగ నుండగలదు.

## పరాక్రాంత జాతీయాభిమానము

పాశ్చాత్యరాజ్యములు వ్యాపింపజేసిన పరాక్రాంతమైన జాతీయాభిమానము ప్రపంచమునందు మహాక్షోభమును గలుగజేయుచున్న విధమును ఐరోపా మహాసంగ్రామము విశదము చేసినది. ప్రకోపితమైన జాతీయాభిమానము "మాయింటికి వస్తే నాకేమి తెస్తావు, మీ యింటికి వస్తే నాకేమి యిస్తావు" అనెడి సామెతను పోలియున్నది. స్వార్థాపేక్షతో కూడిన జాతీయాభిమానము సంకుచితమై స్వజాతీయ ప్రయోజనములకును విజాతీయ ప్రయోజనములకును ప్రయోజనకరము గాదు. వ్యక్తులందువలె జాతులందును పరహితము ప్రపంచకల్యాణమున కుత్తమ ధర్మమైయున్నది. ఆ ధర్మావలంబనమునకు బ్రహ్మదేశము సకల విధములను దగియున్నది. ప్రజలయానందౌదార్య స్వభావములు జాతీయధర్మమును విశాలతరము చేయుటకు వినియోగపడుచున్నవి. జాతీయధర్మమును మతావరణము నతిక్రమించి విశాలమైనది. బర్మాదేశసంప్రదాయముల నారాధించెడి భిన్నమతములవారును జాతులవారును బర్మాజాతియం దైక్యమును బొందుచున్నారు. భిన్నజాతీయులైన షైయులు, తైలంగులు, మంగోలియనులు మొదలగువారు బర్మాజాతియందు గలసిపోయిరి. ఆ మార్గము వర్తమానకాలమునందును నవలంబింపబడుచున్నది. బౌద్ధమతము సంకుచితమైన కులావరణము నంతరింపజేసి విశాలమైన జాతీయావరణమును గల్పించుచు మానవ ధర్మావరణమునకు

సాధనంబగుచున్నది. స్త్రీల స్వాతంత్ర్యము ప్రజాప్రియత్వము, వ్యవ
సాయపరాయణత్వము జీవయాత్రను రసవంతము చేయుచు ప్రజా
స్వామ్యత్వధర్మమును సఫలము చేయుచున్నది. ప్రజలకు వ్యవసాయ
వృత్తియందుగల యభిమానాదరణములు బర్మాజాతి కపూర్వమైన
ప్రతిపత్తిని గలుగజేయుచున్నది. ఉత్తమమైన జాతీయధర్మప్రతిష్ఠా
పనము జేయుట కవకాశము లుండియును సంకుచితమైన జా
తీయలక్ష్యమును ప్రయోజనమును నారాధింపగోరుట కాలప్రభావమై
యున్నది. పరాధీనమై సేవకవృత్తియే ప్రధానమైన దేశములం
దిట్టి భయోత్పాతములు సహజముగను గలుగుచుండును. బర్మా
జాతీయవాదులకు విదేశీయుల పోటీభయము ఉద్యోగములందు గలుగ
వచ్చునుగాని ప్రజలకు ప్రధానవృత్తియైన వ్యవసాయమునందును
యూరపియనుల వశమునందున్న పరిశ్రమలయందును గలుగజాలదు.
భరతవర్షమునకును బర్మాకును వియోగమున కన్నను సంయోగ
మునకు గారణము లధికముగ నున్నవి. స్వపరిపాలనముగల భారతీయ
సంయుక్త సామ్రాజ్యమునందు స్వతంత్రరాజ్యముల సంయోగ
సాహచర్యలు పరస్పరక్షేమమునకు సామ్రాజ్యక్షేమమునకు సాధన
భూతములు గాగలవు. ముఖ్యముగాను భారతీయ సంప్రదాయాచార
ములను, భారతీయ విజ్ఞానమును, బౌద్ధమత ధర్మమును, త్రైలింగ
సంస్కారమును పూర్వవిధమునను మేళవించిన బర్మాజాతి స్వప్రయో
జనములకును, భారత జాతీయ ప్రయోజనములకును, ప్రపంచ
ప్రయోజనములకును కలిపియుండుట భగవత్సంకల్పము. బర్మా
జాతీయవాదు లనవసరమగు నీ భయమును బాపి బర్మాస్థితికి మూలా
ధారమైన మహాసంస్కారమునకు తిలోదకములను సమర్పింపకుం
దురు గాక!

బుద్ధభగవానుడు బోధించిన త్రివిధ ధర్మములకును విశా
లార్థమును గల్పించుటకు తరుణము ప్రపంచ చరిత్రమునందు
సమకూడుచున్నది. మానవులు వ్యక్తిరూపముననను, సంఘరూపము
నను జాతిరూపముననను తాము తరించుటకును నితరులను తరింప
జేయుటకును ధర్మమును, సంఘమును, బుద్ధదేవుని, శరణు పొంద
వలయును. శరణ్యమార్గమును సార్థకము చేయుటకు బర్మాదేశ
మును జాతియును బ్రహ్మసంపదలతో దగియున్నది.

## ఆంధ్రోద్యమము

ఆంధ్రులకును బర్మా ప్రజలకును క్రీస్తుశకము పూర్వము
నుండియును సంబంధ మవిచ్ఛిన్నముగా వచ్చుచున్నది. ఆంధ్ర
రాజులు నావికులు బౌద్ధసన్యాసులు త్రైలింగరాజులు తెలుగు కర్ష
కులు బర్మా దేశాభ్యుదయమునకును తెలుగు దేశాభ్యుదయమున
కును పాటుపడినవిధము నుభయదేశచరిత్రలును విశదము చేయు
చున్నవి. పూర్వము విజ్ఞానభాగ్యములను ప్రసాదించిన యాంధ్రదేశ
మిపుడు కర్మకారులను సమకూర్చుట కాలప్రభావము గదా! బర్మా
యందు 1,60,000 ఆంధ్రులు నివసించుచున్నటులు 1921
జనాభాలెక్కలు తెలుపుచున్నవి. వీరందరును సామాన్యముగను కూలి
పనులను జేయుటకై వెడలియుండిరి. ఒక రంగూను నగరమునందే
60,000 మంది కలరు. రంగూనునందలి ప్రధాన పరిశ్రమలు
తెలుగువారిమీద నాధారపడియున్నవి. వడ్లమరలందు కోకుమర
లందును, ఓడల యెగుమతి దిగుమతులందును, రిక్షాలయందును
తెలుగువారే పనిజేయుచున్నారు. నిజముగా రంగూనుయొక్క అభ్యు
దయము ఈ పనివాండ్రమీద నాధారపడియున్నను వీరి యోగ
క్షేమములకు తగిన యేర్పాటులను యజమానులును, అధికారు
లును జేసియుండలేదు. భిన్నప్రాంతములనుండి తాత్కాలికముగను
కాలయాపన జేయుటకు వచ్చెడి పనివాండ్రయందు సంయోగసాహ
చర్యములు లేవు. ఎవరి దోవను వారు పోవుచున్నారు. వీరికి తగిన
నివాసములను కల్పించుట మొదటి పనియైయున్నది. ఒక చిన్న
గదియందు 20, 30 మంది నివసించుటవలనను అనారోగ్యమునకు
అవినీతికిని గారణంబగుచున్నది. క్రొత్తనగరమునందు వారి ప్రవర్త
నను జూచెడివారు లేనందునను దురభ్యాసములు గలుగుచున్నవి,

వీరియందు విద్యావివేకములను పెంపొందించుట కాంధ్రసేవాసంఘము చేయుచున్న సేవ ప్రశంసనీయము. రంగూనునందలి పనివాండ్రకును వారి పిల్లలకును రాత్రి దివ పాఠశాలలను స్థాపించి విద్యావివేకములను వ్యాపింపజేయుచున్న సేవాసంఘమున కాంధ్రులు కృతజ్ఞులుగ నుండవలయును. కాని చాలినంత ద్రవ్యమును, సాహచర్య సహకారము లేకను సేవాసంఘము పూనిన కార్యక్రమము బాగుగ జరుగకుండుట సంతాపకరము. రంగూనుపురమునందుగల యాంధ్రమహాజనులును, మాతృస్థానమునందుగల మహాజనులును వీరి ప్రయత్నములకు సకలవిధములను దోడ్పడి స్వధర్మ నిర్వహణమును జేయుదురు గాత!

నా మిత్రులు ఆవటపల్లి నారాయణరావుగారు "కార్మిక పత్రిక"ను ప్రకటించియును, "బర్మాయందలి హైందవ కార్మికులు" అను చిన్ని పుస్తకమును ప్రకటించియును, నితర విధములను సేవ జేయుచు కార్మికులయందు సంచలనమును గలుగజేయుచున్నందులకు వారు వందనీయులు. ఇతర మహాజనులును వారి శక్తిసంస్కారముల కనురూపముగను జేయుచున్న సేవ కాంధ్ర మహాజనుల కృతజ్ఞతకు పాత్రులు. కాని చేయుచున్న పనిని చేయవలసిన పనితో పోల్చునపుడు భయభ్రాంతులు గలుగుచున్నవి. సాహసహృదయసంపన్నులైన ఆంధ్ర యువకులు తరుచు రంగూను నగరమునందును నితర ప్రాంతములందును గలరు. వారి యుత్సాహమును, సంయోగమును, కార్యదీక్షయును సాధింపజాలని కార్యము లేదు. జీవయాత్రను గడపుటకు నానాప్రాంతములనుండి వచ్చిన, భిన్నవృత్తుల నవలంబించుచున్న, భిన్నాదర్శములుగల, భిన్నసంస్కారములుగల ప్రజలయందు భేదాభిప్రాయము లుండుట సహజము. ఆ భేదాభిప్రాయములను, సమరసభావముతోను, సాహచర్య ప్రవృత్తితోను, సానుభూతితోను సమన్వయముచేసి కార్యదీక్షను వహించుట మానవధర్మము. సంయోగమువలనను గలుగగల శక్తికి మితిమేరలు లేవు. ఆత్మశక్తిని మరచి స్వదేశమునందును, విదేశములందును కష్టపరంపరల ననుభవించుచున్న యాంధ్రమహాజనులను రెండుకోట్ల యాంధ్రుల శక్తిసామర్థ్యములను సంస్మరించి ఆత్మోద్ధరణమునకును మానవకల్యాణమునకును దీక్షను బూన వేడుచున్నాను. ఆపత్సమయమునం దన్ని భేదములును సహజముగ సంతరించుచున్నవి. ఒక యాంధ్రునికి గలిగిన యాపద ఆంధ్రులందరకును గలిగినదని భావింపవలయును. యజమానులైనను, పనివారైనను, విద్యార్థులైనను, విద్యావిహీనులైనను, శ్రీమంతులైనను, నిరుపేదలైనను, బ్రాహ్మణులైనను, ఆదిమాంధ్రులైనను, ఆంధ్రులనియును, మానవులనియును సంభావించుటయును, కార్యదీక్షను బూనుటయును మన యంతర్గతమైన శక్తివికాసమునకు సాధనంబుగ నున్నది. ఒక యుగమునందు తైలింగులు బర్మాకు ప్రసాదించిన సాహసపరాక్రమములను, విజ్ఞానమును, మతధర్మములను, అక్షరామ్నాయమును వర్తమాన యుగమునందు నవీనరూపములు దాల్చుచున్నవి. ప్రపంచమునం దంతటను కర్మకారుల యభ్యుదయ మతివేగమునను వ్యాపించుచున్నది. ఇంగ్లాండునందు కార్మికపక్షము పాలించుచున్నది. సోవియటు రుష్యాయందు కార్మికుల సమాజస్వత్వములు సంపూర్ణవిజయమును బొందినవి. రంగూను పురమునందును కార్మికులబలము విజయధ్వజమును సహజముగ స్థాపింపగలదు. మనుష్య నిర్మితములైన సకల యంత్రతంత్రములకును మానవశక్తియె మూలాధారముగ నున్నది. ఆ శక్తిని సమీకరించి నిరూపించి యుపయోగింపవలసిన భార మాంధ్రమహాజనులమీదను గలదు. ముఖ్యముగ నుత్సాహపూరితులును విశాల హృదయులును, సేవాపరాయణులును నైన యువజనులే భారమును వహింపవలసి యున్నారు. ఆంధ్రయువకులు చూపిన సేవాపరాయణత్వము, శాంతము, శిక్షణ విధానము విజయచిహ్నములుగ నున్నవి.

ఆంధ్రోద్యమ నిర్వాహకులు విదేశములందు కష్టముల ననుభవించుచు నాంధ్రధ్వజమును పోషించి ప్రకటించుచున్న దేశీయ సోదరుల కభయము నొసంగి స్వధర్మనిర్వహణమును జేయుటకు వేడుచున్నాను. సోదరులారా! తాము నాయెడల చూపిన భక్తికిని ప్రేమకును వందనము లర్పించుచు నయ్యవి వ్యక్తిగతములు కావని యాను ఆంధ్రత్వమున కనియును గ్రహించుచు, పరమేశ్వరుని తమకు యోగక్షేమములను ప్రసాదించుటకు వేడుచున్నాను.

[ప్రథమ రంగూను ఆంధ్రమహాసభ
అధ్యక్షోపన్యాసము--1929]

# గ్రంథాలయోద్యమము

నన్ను అధ్యక్షులుగ ఎన్నుకొనినందులకు కృతజ్ఞుడను. పద్యములు, శ్లోకములు చదివినవారికి కూడ కృతజ్ఞుడను. కాని అందుగల అతిశయోక్తులను నే నంగీకరించను. భవన నిర్మాణమును గూర్చి నా మిత్రులు సూచించినారు. భవననిర్మాణము భగవదాయత్తము. ఈశ్వరసంకల్పానుసారముగ సర్వకార్యములు సానుకూలమగును. రామమోహన గ్రంథాలయమును నామిత్రులు సూరి వెంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వెంకట రమణయ్యగారలు స్థాపించినదాదిగ నాకుకూడ వారితోపాటు గ్రంథాలయోద్యమమునందు సంబంధము గలదు. గ్రంథాలయోద్యమము కొంత ఉపకారము చేసినది. విజ్ఞానము ప్రబోధము యీ యుద్యమమువలన లభించినవి. విజ్ఞానమునంతను ఒకచోట చేర్చుట గ్రంథాలయోద్యమము దృక్పథమునం దుంచుకొనినది. గ్రంథాలయముయొక్క ఉపయోగమును గ్రహించగల అధికారినికూడ యీ యుద్యమము తయారు చేయవలె. అందులకు తగిన గ్రంథాలయ పాలకు లుండవలయును. ప్రజల విజ్ఞానాభివృద్ధి మన కవసరము. అందులకు గ్రంథాలయము లత్యవసరములు.

అసహాయోద్యమము వచ్చినపిమ్మట మనము రాజకీయరంగమున ప్రవేశించినాము. ఇచట ప్రవేశించుటవలన గ్రంథాలయోద్యమము వెనుకబడినను మంచిదని నా అభిప్రాయము. మనము 400 యేండ్ల క్రింద మన సంప్రదాయమును వదలినాము. మఱచిపోయినవానిని మరల కావలయు ననుచున్నాము. 400 ఏండ్లు సంఘర్షణ జరిగిన పిమ్మట వెంటనే సాహచర్యము లభించుట దుస్తరము. అందులకు సరిపూర్ణ స్వాతంత్ర్యము మనకు లభించవలయును. మన ప్రజ్ఞ బయలుపడుటకు స్వతంత్ర ముండితీరవలయును. మన మనసు సంపూర్ణముగ బానిసత్వమునం దున్నవి.

గాంధీమహాత్ముడు స్థితప్రజ్ఞుడు. ఆయన చూపిన అసహాయ మార్గము మనము అవలంబించి స్వతంత్రులము కావలయును. స్వతంత్రతలేనిది యేకార్యమును సాధింపజాలము. పోతన కైవల్యప్రాప్తికి భంగము వచ్చునని ఎవరికిని కృతినీయలేదు. స్వతంత్రబుద్ధి మనకు లభించనిది, మనము స్వతంత్రులము కాజాలము. ఈ ఉద్దేశ్యముతో ప్రాజ్ఞులెల్లరు యీ యుద్యమమున చేరినారు. దానిలో గ్రంథాలయోద్యమమునకు దెబ్బతగిలినది. అసహాయోద్యమమునకు సంపూర్ణవిజయము చేకూరలేదు. కాని అందువలన మనము నిరుత్సాహము చెందనక్కరలేదు. క్రమేణ వచ్చిన వికాసమే సరియైన వికాసము. అట్లగుటంచేసి అసహాయోద్యమ ఫలితముకూడ స్థిరముగ నుండగలదని నమ్ముచున్నాము. స్వరాజ్యము వచ్చునరికి మనము దాని [illegible]ల అధికారము పొందవలసియున్నది. వర్తమాన ప్రయత్నములకు పూర్వప్రయత్నములకు సాహచర్యము కుదుర్చవలయును. భిన్నత్వమున ఏకత్వము సిద్ధించవలయును. పూర్వపు విజ్ఞానము పునరుద్ధరించబడవలయును. ఇట్టి ఆశయములతో ఈ గ్రంథాలయము స్థాపించబడి పనిచేయుచున్నది. ప్రయోజనము స్థాపించిన వారి ఆశయములనుబట్టి యేర్పడును. సంపూర్ణ పరిజ్ఞానము గలవారు గ్రంథాలయ పాలకుడుగనుండు టవసరము.

మనము ఆంధ్ర వాఙ్మయ చరిత్రను పరిశీలించితిమేని యే యుగమునందైనను మతము వేదాంతము మనల నాకర్షించినట్లు విదితమగుచున్నది. ఐదేండ్లనుండి ఆంధ్ర వాఙ్మయ చరిత్రను తయారుచేయుచున్నాను. 12000 అచ్చు అయినట్టివి, 15000 అముద్రితములయినట్టియు గ్రంథములు గలవు. ఈ వాఙ్మయమును బట్టి చూచితిమేని ధర్మముమీద, మతమువీద ఆంధ్రులకు అభిలాష మెండుగనున్నట్లు స్పష్టపడుచున్నది. పెద్దన మనుచరిత్రయందు ధర్మజ్ఞానముల సమన్వయమును కుదిర్చినాడు. భక్తిజ్ఞానముల సమ్మేళన మొనర్చినాడు. నవీనులైన ప్రజలలో భాషయందు మార్పు జరిగి తీరును. అయితే పూర్వాపరసందర్భముల ననుసరించి మార్పు అవసరము. భావసంశుద్ధిగల వాఙ్మయ నిర్మాతలు భాషను సంస్కరించగల అధికారులైయున్నారు. అంతయేగాని ఏకొద్దిగనో తెలుగును చదివి భాష సంస్కరించగలుగుదు మనుట సరియైన పనికాదు. ఏది ఎట్లున్నను సంపూర్ణ స్వరాజ్యము సిద్ధించినగాని సంపూర్ణ నిర్మాణశక్తి మనకలవడదు. మన ప్రబంధకర్తలు 300 ఏండ్లనుండి గుడ్డిగ ప్రాతమార్గముల ననుసరించుచున్నారు. అస్వతంత్రతయే యిందులకు కారణము. మనము స్వతంత్రులమైనచో పూర్వాచారము వదలి నూతన వికాసమును సృష్టించ గలుగుదుము.

గ్రంథాలయమును గూర్చి యొక్కమాట చెప్పుచున్నాను. గ్రంథాలయమును సోషల్ క్లబ్బుగా మార్చకూడదు. రెంటి ఆశయములు వేర్వేరు. గ్రంథాలయమునందు పత్రికాపఠనము గ్రంథపరిశీలన, సంఘసేవ, దేశసేవ ప్రధానకార్యములు. కృష్ణా వరదల సందర్భమున రామమోహన గ్రంథాలయ మొనర్చిన సేవ ప్రశంసనీయము. ఈ భవనము పూర్తికాలేదని కొందరు చెప్పిరి. త్రివిక్రమరావుగారు పాశ్చాత్యదేశమునందలి గ్రంథాలయములకు గల మహాసౌధములను వర్ణించిరి. పదిమందిచేరి యీ పనినిచేయుదమనే స్థిరసంకల్పమున్నచో పూరిగుడిసెయైనను సరిపోవును. సత్సంకల్పము అవసరముగాని మహాసౌధము కాదు. వర్తమాన కాలమున దేశము, సంఘము, వాఙ్మయములకు సేవచేయుట మన విధియైయున్నది.

[విజయవాడ రామమోహన గ్రంథాలయం 18-వ
వార్షికోత్సవం అధ్యక్షోపన్యాసం—1929]

# తంజాపురాంధ్రనాయకరాజులు

అనంతమైన కాలమహాప్రవాహమునందు కల్పములు, మన్వంతరములు, యుగములు, ద్వీపములు, ఖండములు, సామ్రాజ్యములు దృశ్యాదృశ్యములగుచు నిత్యమైన ధర్మాభ్యుదయమునకు వినియోగి పడుచున్న విధమును ప్రపంచేతిహాసము అనంతముఖములను బోధించుచున్నవి. చరిత్రమునకు నామరూపవిలసితములైన దేశకాలపాత్రములు విషయములైనను దేశకాలపాత్రముల కాధారభూతమైన ధర్మము హృదయముగ నున్నది. జీవరహితమైన దేహమువలెను ధర్మరహితమైన చరిత్రాంశములు విశ్వశ్రేయస్సునకు నిరర్థకములు. ప్రపంచ చరిత్రను మానవ ధర్మలక్ష్యముతో నవలోకింపవలసిన విధమును హెచ్. జి. వెల్సుగారు విశదీకరించిరి:—

"చరిత్రకారులు సామాన్యముగను గొప్పపండితులు: వారు సాధారణముగను అసంగతవిషయములవట్లకన్నను స్వల్ప ప్రమాదములపట్లను పట్టుదలను జూపుచుందురు: వారు అనుపపన్న ప్రయోజన నిర్ణయముకన్నను, అసత్యతిథి నిర్ణయము గలుగజేసెడి పరిహాసఖండనమునకు భయపడుదురు. చరిత్రకారుని లక్ష్యము కాలనిర్ణయమునందు లగ్నమగుట సహజమైనను సామాన్యపాఠకుల కిట్టి విషయములం దభిరుచి గలుగజాలదు.........విశాలమైన రాజకీయార్థిక మత సాంఘిక విషయములందు పాఠకుల చిత్తవృత్తిని లగ్నముచేయుట చరిత్రకు ప్రయోజనము...... నెపోలియను మహత్త్వ మర్థరహితము నాసురమునైన మూఢవిశ్వాసము.........విశ్వశ్రేయస్సునకు సాధనములైన 'శాంతం, శివం, సుందరం' ధర్మముల యభ్యుదయావతరణములు చరిత్రకు పరమార్థములు. ప్రపంచమునందు లక్షలమంది రాజులు, మహారాజులు, రారాజులు, చక్రవర్తులు పుట్టి గిట్టిరి............ వారియందు ధర్మదీక్షాపరాయణుండైన అశోకచక్రవర్తి పరంజ్యోతివలెను ప్రకాశించుచున్నాడు."

ధర్మాభ్యుదయావతరణములేని రాజచరిత్రములు జీర్ణసామ్రాజ్యముల చరిత్రములవలెను కాలప్రవాహమునందు జీర్ణములైనవి. బలపరాక్రమముల లక్ష్యములకు నిలయములైన రాజచరిత్రములును ధర్మలక్ష్యమునకు సాధనభూతమైన విధమును విశదము చేయుట చరిత్రకు పరమార్థము. ఈ పరమార్థమును చరిత్రవిషయములందు ప్రతిబింబింపజేయుట శాస్త్రులకు ప్రయోజనము.

శ్రీ కురుగంటి సీతారామయ్య (ఎమ్. ఏ.) గారు తంజావూరు సరస్వతీ మహాలు పుస్తకాలయమునందు ఉపద్రష్టలుగ నున్నారు. ఆ పదవియందు వారుచేసిన పరిశ్రమ ఈ 'తంజావురాంధ్రనాయక రాజ చరిత్రము' రూపమునను ఆంధ్రగ్రంథమాలయందు పదునేడవ కుసుమముగను ప్రకటింపబడినది. సీతారామయ్యగారు మొదటను ఆంధ్రవిశ్వవిద్యాలయపక్షమున నిందలి విషయములను ఉపన్యాసరూపమునను వ్యక్తముచేసిరి. స్వదేశాభిమానము, స్వభాషాభిమానము, స్వజాత్యభిమానము ప్రబలముగను ప్రవర్ధమానంబగుచున్న వర్తమానసమయమునం దాంధ్రనామ సంస్మరణ సంకీర్తనము లాంధ్రుల కత్యంతోత్సాహదాయకములుగ నుండుట సహజము. ఆంధ్రుల దక్షిణదేశ దండయాత్ర లాంధ్రాభ్యుదయమునకును, భారతీయ సంస్కార సంరక్షణమునకును నుపకరించిన విధము నీ గ్రంథము విశదము చేయుచున్నది.

అంతర్ముఖపత్రమునందు గ్రంథకర్త నిర్దేశించిన
'య దద్యతే యువ్యతే య ప్రచ్యోవ్యతే
శతతమి సా తనూ ర్మే బభూవ'

అను వేదవాక్యము వెల్సుగారు ప్రతిపాదించిన పరమార్థమునే ప్రతిపాదించుచున్నది. విశ్వశ్రేయస్సునకు నామరూప విలసితమైన ప్రపంచము నిరంతరము పునరావృత్తమగుచు ధర్మాభ్యుదయము గలుగుచున్నది. కాలగర్భమునందు సామ్రాజ్యము లస్తమించినను, సార్వభౌము లదృశ్యులైనను కాలాత్మపరమైన ధర్మ మవిచ్ఛిన్నముగను విశ్వశ్రేయస్సునకు వినియోగపడుచున్నది.

భరతవర్షమునందు దక్షిణోత్తరభాగములకు సంఘర్షము చిరకాలానుగతము. వింధ్యాద్రికి దక్షిణముననున్న పీఠభూమి మానవులకు ప్రాచీన వాసస్థలము. దక్షిణాపథమునం దుదీచ్యాగతులకును, దాక్షిణాత్యులకును సంప్రాప్తములైన సాహచర్య సంఘర్షణములు భారతీయ విజ్ఞానధర్మాభ్యుదయములకు వినియోగపడిన విధము భారతీయేతిహాసములం దజ్ఞాతాధ్యాయముగ నున్నది. ఈ యజ్ఞాతాధ్యాయమునందు విశేషభాగ మాంధ్రులకు సంబంధమును గలిగియున్నది. దండకారణ్య ప్రాంతవాసులైన యాంధ్రు లీభారమును వహించుచుండిరి.

ఆంధ్రరాజ్య మాదియుగమునందు శకయవనాదుల విజృంభణము నరికట్టిన విధమునను మధ్యయుగమునందు విజయనగర సామ్రాజ్యము మహమ్మదీయ విజృంభణము నరికట్టినది. దక్షిణభాగమునందు భారతీయ సంస్కార సంరక్షణమునకును, ఆంధ్రాభ్యుదయమునకును విజయనగర సామ్రాజ్యమును, సామ్రాజ్యాంతర్భాగములును వహించిన భారము పండితులకు పరిశోధనార్హముగ నున్నది.

విజయనగర సామ్రాజ్య విధ్వంసానంతరము దక్షిణాపథము, ముఖ్యముగ నాంధ్రావని, యనుభవించిన దుఃఖవేదనకు జీర్ణవిజయనగరము ప్రత్యక్షప్రమాణము. మహమ్మదీయ విజృంభణము, మహారాష్ట్ర విజృంభణము, పాశ్చాత్య విజృంభణము దక్షిణదేశమును 1565 సంవత్సరానంతరము సంక్షోభక్షేత్రముగను పరిణమింపజేసిన విధమును దేశచరిత్రము వేయిముఖములను ప్రత్యక్షము చేయుచున్నది. ఆ సంక్షోభ మహాక్షేత్రమునందు తంజపురాంధ్రనాయకరాజ్యము సుక్షేత్రమై కొంతకాలము సంక్షోభమును ప్రతిఘటించుచు స్వదేశవిజ్ఞానసంస్కారములను సంరక్షించిన విధము నీ గ్రంథము సందర్భానుకూలముగను తెలుపుచున్నది.

చోళపాండ్య రాజ్యములు దక్షిణదేశమునందలి ప్రాచీన రాజ్యములు. ఈ రాజ్యములు పదునాల్గవ శతాబ్దాంతమునందు విజయనగర సామ్రాజ్యాంతర్భాగములైనవి. చోళపాండ్యరాజులు ప్రాచీన కాలమునుండియును కావ్యకళాశిల్పపోషకులు. విజయనగర ప్రతినిధులైన నాయకరాజులును చోళపాండ్యరాజుల మార్గము నవలంబించి తంజనగర మధురానగరముల గౌరవప్రతిష్ఠలను వృద్ధిచేసిరి. తంజాపురరాజులు సామ్రాజ్యపాశబద్ధులై సామ్రాజ్యాధికారమును గౌరవించుచుండిరి. భారతీయ దౌర్భాగ్యమునకు మూలబీజమైన పరస్పర కలహములు, తంజాపుర మధురరాజ్యములకు సహజావస్థలు. కేంద్రాధికారము ప్రబలముగ నున్నపు డంతఃకలహములను దీర్చుట కేంద్ర ప్రభుత్వమునకు సాధ్యమైనను నయ్యది శిథిలమైనపుడు దేశమంతః కలహములకు నిలయమై దుఃఖభూయిష్ఠము గాగల విధమును జీర్ణసామ్రాజ్యముల చరిత్రములు సహస్రముఖములను ప్రత్యక్షము చేయుచున్నవి. జీర్ణవిజయనగర సామ్రాజ్యచరిత్ర నీ పరమార్థమును బోధించుచున్నను వర్తమాన రాజ్యాంగ నిర్మాణ సమస్యకును కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాధికార నిర్ణయము క్లిష్టమై దేశ ధర్మారాధనము దురారాధ్యముగ నున్నది.

తంజాపురాంధ్రనాయకరాజ చరిత్రమును సూక్ష్మరూపమున నీపరమార్థమును ప్రదర్శించుచున్నది. నాగమనాయకుడు 1528 ప్రాంతమునందు శ్రీకృష్ణదేవరాయల యాజ్ఞానుసారముగను పాండ్యరాజునకు సహాయమును చేయుటకు బోయి చోళరాజును జయించి పాండ్యునకు రాజ్యము నిచ్చుటకు బదులు తానే పాండ్యరాజ్యమున కాధిపత్యమును వహించెను. నాగమనాయని సుతుడు విశ్వనాథనాయకుడు రాయలవారి యాజ్ఞానుసారముగను తండ్రి నోడించి పాండ్యరాజ్యమును చంద్రశేఖరపాండ్యున కిచ్చెను. చంద్రశేఖరుని యనంతరము విశ్వనాథనాయకుడును ఆయన వంశమువారైన తిరుమల నాయకాదులును మధురరాజ్యము నేలుచు స్వాతంత్ర్యమును బూనుచుండిరి. విశ్వనాథనాయకుడే తంజాపుర రాజ్యమున కధిపతి యైనటులు కొంద రభిప్రాయపడుచున్నారు. సీతారామయ్యగారీ యభిప్రాయమును ఖండించుచు తంజాపురాంధ్రరాజచరిత్రము నిటులు నిర్ణయించుచున్నారు.

అచ్యుతదేవరాయలు క్రీస్తుశకము 1535 ప్రాంతములందు తనతోడి యల్లుడగు చినచెవ్వప్పనాయకుని తంజాపురము రాజధానిగ గల చోళరాజ్యమున కభిషిక్తుని చేసినటులును, చెవ్వప్పనాయకుని పుత్రుడు అచ్యుతనాయకుడు 1561—1614 వరకును, పౌత్రుడు రఘునాథనాయకుడు 1614–1633 వరకును నీ చోళరాజ్యమును పాలించినటులును సహేతుకముగా మిషనరీల లేఖలు, శాసనములు, గ్రంథములు మొదలగు నాధారములతో గ్రంథకర్త నిర్ణయించుచున్నారు. రఘునాథనాయకుని శౌర్యప్రతాపములను 1616 సంవత్సరమునందు జరిగిన తోపూరుయుద్ధము విశదము చేయుచున్నది. తోపూరు విజయము దక్షిణదేశ సంక్షోభమును 40 ఏండ్లకు కట్టినను చిరకాలసంవర్తితంబులైన విలయబీజముల ఫలము కాలక్రమమున పరిపక్వమై ఫలించినది. విజయరాఘవనాయకుడును, నాతని సంతతివారును నీ ప్రళయ ఫలము ననుభవించిరి.

గ్రంథమునందు మధుర తంజాపుర రాజ్యముల ఉద్భవనిర్గమనములకును, వంశావళులకును, పరస్పర కలహములకును, కేంద్రాధికారమునకుగల సంబంధములు సందర్భానుసారముగను జర్చింపబడినవి. ఈ రాజ్యములందు సహజముగను ప్రతిష్ఠితమైన ప్రళయబీజములకు మహమ్మదీయ విజృంభణము, మహారాష్ట్రవిజృంభణము, పాశ్చాత్త్యవిజృంభణము దోహదంబు నొసంగి సర్వసంహారమునకు వినియోగపడినవిధమును దక్షిణదేశ చరిత్రము విశదము చేయుచున్నది. దక్షిణదేశరాజ్యముల చరిత్రము 17, 18 శతాబ్దములందు దుఃఖభూయిష్ఠమై అంధకారబంధురముగ నున్నది.

తంజాపురాంధ్ర రాజచరిత్ర మాంధ్రచరిత్రమునందే కాక, దక్షిణహిందూరాజ్య చరిత్రమునందును మధ్యయుగమునందు చరమాధ్యాయము. ఈ చరమాధ్యాయమునందు రఘునాథనాయకుని పరిపాలనమును, గోవిందదీక్షితుని మంత్రిత్వమును సకల విధములను శ్రీకృష్ణదేవరాయల చరిత్రను స్మరింపజేయుచున్న విధము నిటులు గ్రంథమునందు దెలుపబడినది:—

"ఈ చరిత్రమునకు రఘునాథుడు నాయకమణి. ఈయనను కృష్ణరాయలతో నన్ని విషయములలో బోల్పవచ్చును. లక్ష్మీసరస్వతు లిర్వురును తంజనగరము తమకు రాజధానిగా చేసికొని నిరంతర నృత్యము గావించిరి. ఆంధ్రభాషామతల్లికి ముద్దుకుమారుడై, యాంధ్ర కవితావధూటికి ప్రేమాస్పదుడైన నాయకుడై యీయన వరలెను. విద్యానగరమున కృష్ణరాయభోజుని కాలమున నాంధ్ర


తలనొప్పి
ఎక్కువగా ఉన్నా
తలకేగా!

కవితావధూటి యెట్లు పల్లకిలో నూరేగింపబడెనో యట్లే రఘునాథుని కాలమున శారద ధ్వజాధిరాజచిహ్నములతో వరలెను.''

చోళనాయక మహారాష్ట్ర మహమ్మదీయ బ్రిటిషు ప్రభుత్వముల సమరములకును, ద్వైతాద్వైత విశిష్టాద్వైత సంవాదములకును, హిందూమహమ్మదీయ క్రైస్తవమత సంస్కార పరివర్తనములకును రంగస్థలముగను పరిణమించిన తంజాపురము వర్తమానకాలమునందును విజ్ఞానస్థానముగను వెలయుచున్నది — చిరకాలాగతమైన రాజకీయమతసాంఘికార్థికాది సంస్కారములు వర్తమానయుగమునందును రాజకీయములందును, సారస్వతమునందును, కళలయందును, శిల్పమునందును, ప్రజాశీలమునందును గోచరంబగుచు ధర్మప్రతిష్ఠకు సాధనం బగుచున్నవి. తంజాపురమునందు స్థాపితమైన సరస్వతీ మహాలు గ్రంథాలయము తంజాపుర ప్రాచీనవైభవదైన్యములను ప్రత్యక్షముచేయుచు సకల కర్మలకును నాధారభూతమైన విజ్ఞానవిజయమును సువ్యక్తము చేయుచున్నది. నామరూపవిశిష్టములైన రాజ్యములు, కోటలు, గుళ్లు, గోపురములు, మిద్దెలు, మేడలు, మసీదులు, చర్చులు జీర్ణము లగుచున్నను నామరూపాతీతమైన విజ్ఞాన మప్రతిహతముగను, సజీవమైన కావేరీప్రవాహమువలెను, ప్రవహింపగల విధమును జీర్ణమందిరస్థములైన జీర్ణగ్రంథములు స్ఫుటము చేయుచున్నవి.

నాయకరాజచంద్రుడు రఘునాథనాయకుడు కాలధర్మమును బొందినను రఘునాథాభ్యుదయాది కావ్యనాటకములును, గ్రంథాలయమును సజీవముగ నున్నవి. అప్పయదీక్షితులు, గోవిందదీక్షితులు గతించినను వారి గ్రంథములు విలసిల్లుచున్నవి. గ్రంథాలయమునందు గల సంస్కృతాంధ్ర తమిళ కర్ణాట మహారాష్ట్రాది గ్రంథములును, చిత్రపటములును, రాజులను, రాజ్యములను సంతరించినను వానికి ప్రయోజనమైన విజ్ఞానవిజయమును విశదము చేయుచున్నవి.

శ్రీ సీతారామయ్యగారి గ్రంథాలయాధారమున తంజాపురాంధ్రనాయక చరిత్రమును రచించి సరస్వతీ మహాలు గ్రంథాలయ ప్రయోజనము నాంధ్రలోకమునకును, పండితబృందమునకును వ్యక్తముచేసి వారి ధన్యవాదములకు పాత్రులగుచున్నారు. తంజాపురాంధ్రనాయకచరిత్ర రచనయందు గ్రంథకర్తలక్ష్యము సంప్రదాయసిద్ధమైన మార్గము నవలంబించుచున్నది. వెల్సుగారు తెలిపినట్లు వంశావళులు, విజయములు, కాలనిర్ణయములు చరిత్రపరిజ్ఞానమున కవసరములైనను మానవాభ్యుదయమునకు విశేషప్రయోజనకరములు గావు.

గ్రంథాలయమున కుపద్రష్టయైన సీతారామయ్యగారు తమ లక్ష్యము నాంధ్రరాజ్యవ్యాపన చరిత్రలక్ష్యమునకువలెనే యాంధ్రసాహిత్య చరిత్ర రచనకు మరల్చి ఆంధ్రసాహిత్య చరిత్రయం దీ యజ్ఞాతాధ్యాయమును సువ్యక్తము చేయుదురుగాక.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునందు పెద్దనాదుల హస్తములందు వర్ధిల్లిన ఆంధ్రసాహిత్య ప్రవాహము తంజాపురాంధ్ర రాజ్యమునందును ప్రవహించి నాయక రాజ్యమును సారవంతము చేసినది. స్త్రీలు, పురుషులు సంగీత సాహిత్యములందు ప్రావీణ్యమును గడించి రాజసమ్మానము బడసిన విధమును పరిణయములు, విలాసములు, రత్నాకరములు, కావ్యములు, చరిత్రములు గ్రంథములు విశదము చేయుచున్నవి. చోళపాండ్య రాజ్యములం దాంధ్రనాయక రాజ్యవ్యాపన మాంధ్రప్రజా సంస్కారముల వ్యాపనమునకు నెట్లు దోహదపడిన విధమును శిల్పకళాసాహిత్యములు విశదము చేయుచున్నవి. శ్రీరామభక్తి భరితములైన సంగీత సాహిత్యనిధులైన త్యాగరాజ కృతులు తంజాపురాంధ్రరాజ్యవ్యాపనమున కమూల్య ఫలముగ నాచంద్రార్కము వెలయుచున్నవి.

గ్రంథము సప్రమాణముగ నుండుటకుగాను మూలగ్రంథమునందును, అనుబంధములయందును ముద్రితములైన దీర్ఘప్రమాణములు గ్రంథబాహుళ్యమునకు కారణములు.

ఆంధ్రవిశ్వవిద్యాలయ నిర్వాహకులు విస్మృతమును, వివాదగ్రస్తమును నైన తంజాపురాంధ్రరాజ్య చరిత్రము నుపన్యాసములను చేయుటకు సీతారామయ్య గారికిని, తమ్మూలమున నాంధ్రాభ్యుదయమునకును అవకాశములను గల్పించినందుల కభివంద్యులు. ఆంధ్రగ్రంథమాలయం దీగ్రంథమును ముద్రించి గ్రంథమాలాప్రయోజనమును విస్తరింపజేయుటకు సహాయభూతులైన శ్రీయుత సీతారామయ్యగారి కభివందనములు.

[తంజాపురాంధ్రనాయకరాజ చరిత్రము తొలిపలుకు—1932]

# సాహిత్యతత్త్వము

సాహిత్యతత్త్వ విచారణ మహితము, అనాహతము, అగాధము.

సాహిత్య మవ్యక్తమునకు సువ్యక్తమైన పురుషార్థము. సాహిత్యము నిత్యమైన సచ్చిదానందానుభవమునకు, దేశకాలపాత్ర విలాసకల్పితమైన రసానందానుభవమునకు సాధనము. సాహిత్యరసానందము విశ్వధర్మము, విశ్వాధారము, విశ్వేశ్వర విలాసము. పిపీలికాది బ్రహ్మపర్యంతముగల జీవజాలము లాత్మానందానుభవమున కనవరతము విశ్వసాహిత్యోపాసనము జేయుచున్నవి. సాహిత్యోపాసనమునకు సాధక సాధనములు వేరైనను సాధ్యము సమానము. సాహిత్యోపాసనమునందు భాషలు, భావములు, దేశములు, కాలములు, పాత్రలు, రసములు భిన్నములైనను ప్రయోజనము మాత్రము విశ్వాధారమైన రసానందము సమానము. సాహిత్యోపాసనమునకు సాధనములైన కర్మ కళాయోగ శాస్త్రాద్యంగములందు సారస్వతము ప్రధానాంగము. అవ్యక్తమునకు ప్రథమవ్యక్తస్వరూపమైన శబ్దము సాహిత్యాంగములందు సారస్వతాంగమునకు ప్రధానస్థానమును గల్పించుచున్నది. అనంతమైన సాహిత్యతత్త్వవిచారము నొక చిన్న పుస్తకమునందు సంగ్రహించుటకు శ్రీయుత జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు చేసిన ప్రయత్నము సకల జనాదరణమునకు పాత్రముగ నున్నది.

భారతీయ సాహిత్యము వైదికయుగమునందువలెను వర్తమాన కాలమునందును శాఖోపశాఖలుగను పరిణామమును పొందుచున్న విధము సాహిత్యతత్త్వజ్ఞుల విచారాదరణములకు దగియున్నది. వైదిక లౌకిక సారస్వతములు భిన్నసాహిత్యరూపములను పురుషార్థమునకు వినియోగపడగల విధమును ప్రాచ్య పాశ్చాత్యసాహిత్య పరిశోధనలును ప్రాచీనాధునాతన సాహిత్యపరిశోధనలును బోధించుచున్నవి. జగన్మోహనమునకు ప్రకృతి పురుషుల సమాశ్రయము బీజము. పరమాణు పరబ్రహ్మముల లీలావిలాసముల నాత్మానందమునకు సాధనములను సరసముగను కల్పించుటకు సాహిత్యాచార్యులు సమర్థులు. సాహిత్యాచార్యులకు సంభావనాకల్పనలు ప్రతీచీ సంస్కార సంజాతమైన ప్రవృత్తిపరమైనను, ప్రాచ్యసంస్కార సంభవమైన నివృత్తిపరమైనను పరమార్థ మాత్మానందానుభవము. అనిత్యములైన దేశకాల పాత్రావరణములందు నిత్యమైన సచ్చిదానందానుభవమును సాహిత్యము సాధ్యముచేయుచున్నది. యవన రోమక బ్రిటిష భరతవర్షములు, వంగాంధ్ర రాష్ట్రములు, త్రేతాద్వాపర కలియుగములు, సీతా సావిత్రి డెస్డిమోనాదులు, సీతారాములు, రాధామాధవులు, ఉమామహేశ్వరులు కాలమహాప్రవంతియందు రసతరంగములు. ప్రకృతి సంభవములైన దేశములు, యుగములు, భాషలు, భావములు, పాత్రలు, సంప్రదాయాచారశీలములు సాహిత్యోపాసకుల హస్తములందు రసానందమును గలుగజేయుటకు పురుషార్థమునకు సాధనము లగుచున్నవి.

### సాహితీగోష్ఠి, ౭౦:

సాహితీగోష్ఠి బ్రహ్మసంకల్పమువలెను బ్రహ్మాండవ్యాప్తము. మహాకవులు బ్రహ్మసంపన్నులు. బ్రహ్మసంపన్నులు సర్వత్ర కావ్యకళావిలాసములను సందర్శించుచు బ్రహ్మానందమును గలుగజేయగల విధమును కావ్యములు కవిత్వతత్త్వము వ్యక్తము చేయుచున్నవి. మానవ సంకల్పమునకు బ్రహ్మత్వమువలెను సాహితీగోష్ఠికిని బ్రహ్మత్వము సాధ్యము. బ్రహ్మమయమైన ప్రకృతి రంగములందు సకల సాహిత్యకళా విలాసములందును బ్రహ్మానందము బ్రహ్మజ్ఞులకు సాధ్యము. బ్రహ్మానందమునకువలెను భావానందమునకును రసావరణ నిరయ మసాధ్యము. మహాకావ్యములవలెను భావకావ్యములును రసానందానుభవమునకు నియత సాధనములు. రసానందానుభవమునకు ప్రతిబంధకము సంకల్పముకాని భావముకాదు. దేశావృతమైన విషాదమయ్యెడు కావ్యాభ్యుదయమునకు భావార్థ నిర్ణయము నిరర్థకము. భావార్థపరిణామమునందు శైలియును సహజ పరిణామమును పొందుచున్నది. ఆంధ్రసాహిత్య పరిణామమునందు భావశైలీ పరిణామవిమర్శనము సాహిత్యోపాసకుల యాదరణపాత్రము గావలసిన విధమును శ్రీ సత్యనారాయణమూర్తిగారి యీ భావములు విశదము చేయుచున్నవి.

"భావప్రకాశమునకు సముచితమైన భాష సాధనము కదా. భాష గమనికకు వ్యాకరణ సూత్రము లవసరములే. కవి కట్టు త్రాళ్లుకాక, పటు దారములట్లు మృదులములై, అనురాగ సూత్రములట్లు అదృశ్యములై యుండవలెను. తెలుగక్షరములు ముత్తెములవంటివి. ముత్తెపుసరములోని దారము వెలుపలికి తోచనట్లు తెలుగులోని లక్షణసూత్రములు బట్టబయలు కానప్పుడే తెలుగుశైలి చక్కనిదై యుండును. పగ్గములను, ఉరిత్రాళ్లను తెలుగమ్మకంఠమునుండి పండితులు తొలగించుట పాడి. ఆంధ్రభాష ప్రపంచమున ద్వంద్వయుద్ధమునకు తొడచరచియున్న ఇరుపక్షములవారును తమదోసములను గుర్తించి ఉత్తమసారస్వతోద్దేశములకు తోడ్పడుసూత్రములను శాసించునట్లు ఇరువురు చేతులు కలుపుకొని, విశ్వవిద్యాలయముల సాహాయ్య మందవలెను. ఇట్లొనరించిరేని, ఎన్నెని బాధలు తొలగిపోవును. వాదుకమాట సంగీత

తింపని విశ్వవిద్యాలయములును, వాడుక మాటలనే అంగీకరించు గ్రంథాలయములును, విఱుగుడు మాటలను త్రుంపుడుమాటలను కాంక్షించు భాషాసమితులును, వాడుకమాటలని చెప్పి వంకరమాట లను దెచ్చి సింహాసనముపై గూర్చుండఁబెట్టి చుట్టును రామ భజనముచేయు అపూర్వ భాషాభక్తులును పెడమొగములను బెట్టు కొనక, ఒకరి మొగము లనొకరు పరికించుకొని, వెక్కిరింతలకును పండ్లపటపటలకును, కారుమాటలకును, కన్నెఱ్ఱలకును స్వస్తి చెప్పి, సామ్రసిల్లియున్న భాషాసతికి శాంతియు, నానందమును బ్రసాదించిరేని, దారి తెన్నులేక అల్లాడు పాఠకులును, విద్యార్థు లును ధన్యులగుదురు."

## భావనావేశము

సాహిత్యమునకు భావనాశక్తి కీలకము, హృదయము. పరమాణువునుండి పరబ్రహ్మము వరకును వ్యాప్తమైన విశ్వమునందు సాహిత్యోపాసకులకు దివ్యవిభూతులు సర్వకాలసర్వా వస్థలయందును బ్రసన్నము లగుచున్నవి. శాంతశివసుందరవిలాస విలసితములైన విశ్వమునందు సాహిత్యోపాసకులకు స్వీయభావనాను రూపముగను దివ్యభూతులు గోచరంబగుచున్నవి. భావనాశక్తి ప్రకృతి విలాసములకు షోడశ కళాన్యాసమును ప్రాణప్రతిష్ఠను కల్పించి విశ్వసాహిత్య స్వరూపమునను, ధర్మార్థ కామమోక్షముల ననుగ్రహించుచున్నది. దైవాసురయుద్ధము, క్షీరసాగరమథనము, హాలాహలామృతోద్భవములు, లక్ష్మీసుదర్శన ప్రభవములు, మోహినీ విలాసములు భావనాశక్తి ఫలములైన సాహిత్యపరిణామములు. గౌరీ శంకర కైలాస విహారములు, రాధామాధవ బృందావన విహారములు, గోపాలకృష్ణలీలలు గోపాలవిలాసములు, ఏసు, బుద్ధ త్యాగవిలాస ములు పరమార్థప్రదములైన సాహిత్యేతిహాసముల పరిణామములు. సచ్చిదానందాత్మకమైన సాహిత్య పరిణామమున కాత్మపరిణామము ప్రమాణము. ఆత్మభావనాశక్తి విశ్వమునం దంతటను సత్యజ్ఞానా నందమయమైన ఆత్మసందర్శనమును జేయుచు రసానందాత్మకము లైన సాహిత్య కావ్యకళారూపమునను పురుషార్థ పరిణామమును పొందుచున్నది. సాపేక్షమైన సాహిత్యరసానందానుభవము నిరపేక్ష మైన ఆత్మానందానుభవమునం దైక్యమును పొందుచున్నది. సాహిత్య తత్త్వవిచార మీపరమార్థమును దృష్టాంత సిద్ధాంతరూపమునను విశదము చేయుచున్నది. సత్యనారాయణమూర్తిగారు 'భావనావేశము' 'భావనాపరిశీలనము' శీర్షికల క్రిందనుజేసిన సాహిత్యతత్త్వమీమాంస విశాలమై సాహిత్యోపాసకులకు సమాదరణీయముగ నున్నది. గ్రంథము నందలి యుదారాశయముల నీక్రింది వాక్యములు తెలుపుచున్నవి:—

“కన్నున్నగాని శిల్పము నెరవేరదు, జీవమున్నగాని శిల్పము సార్థకముగాదు. ఈ జీవమును ఆ కన్నును భావనాపరిశీలనముల మేలుగీములు. అద్భుత సృష్టికిని, కళాసృష్టికిని, భావ్యదాశయ తుష్టికిని సుధామయ, ఆనందమయ, ఆలోకమయ అనంత జీవనమునకు తలిదండ్రులైన భావనాపరిశీలనముల ప్రసన్నత చేకూరుట ఎటివారికి?”

### మాతృభాష

సాహిత్యమునకు సారస్వతము మకుటము. సాహిత్యాంగములైన లలితకళలు నృత్యగీత వాద్యాదులు సాహిత్య నిర్మాణవిధానములకు సాధనములైనను భావప్రకాశమునకు మూలాధారమైన భాష సాహిత్య తత్త్వమునకును, తత్త్వవిచారమునకును సాధనము. అవ్యక్తమైన ప్రణవనాదములతో నారంభమైన సాహిత్యము భావార్థకళాసంక్రమణమునను సువ్యక్తమగుచున్నది. అవ్యక్తమైన బ్రహ్మమునకు శబ్దము సువ్యక్తస్వరూపము. సాహిత్యమునకు కీలకమైన భావమునకు శబ్దమక్షరసుందర స్వరూపము. భావశబ్దార్థ కళల యోగానుభవము సాహిత్యము. సారస్వతాభ్యుదయమునకు సహజమైన భావములవలెను సహజమైన భాషయును మూలాధారము. ప్రపంచమునం దెచ్చటను సారస్వత తత్త్వవిచారమునందు హిందూస్థానమునందువలెను మాతృభాషాభిమానాక్రందనమును చేయవలసిన దురదృష్టము కలుగదు. పారతంత్ర్యము ననుభవించెడి ప్రజలకు పరావలంబనము నందుగల యభిమానాదరణములు స్వావలంబన స్వయంసహాయము లందు దుర్లభములు. శ్రీ సత్యనారాయణమూర్తిగారీవిషయమై చేసిన విమర్శనము నాంధ్రభాషాభిమానులందరును గమనించుట విశేషము:

“బంగీయుల హృదయశక్తిని, ద్రవిడుల మేధాశక్తిని మనయందిముడ్చుకొనియుండియు, మనలను మనము గుర్తించుకొనక స్వీయసముద్ధరణమును కాంక్షింపక, సాహిత్యవృద్ధినుండియే జాతీయవృద్ధి గోచరించునని ఎఱుఁగక ఆత్మవిస్మృతులమై పడియుంటిమి. మన భాషయో? ప్రాచ్య ఇటాలియన్ అని ప్రసిద్ధి నందిన భాష యయినది. అనేక శతాబ్దములకు మున్నే విజయనిశానముల నంబరవీధి నెగడియుండిన భాష మనయది! సౌందర్య మాధుర్యములకు సన్నిధానము కాఁజాలుదునని నిరూపించిన భాష మనయది! నేఁడు మూలఁబడియున్న భాషయు మనయదియే! ఏల? వగ్గములు చేతఁ బట్టుకొని, మూటలు బిగించుకొని, భాషవలని నిశితనిఘంటు పండిత ప్రకాండులే యుత్తర నిర్ణాయకులు. కాఁగా సారమైన గమనికను గాని భాషను గురించి దక్షిణయించిన వాక్కు ఎల్లెడల వర్తిల్లుట సిద్ధాంతమేకద! రాతిసగలందు వెలిబిడిన తెలుఁగు సర్వాంగములందరియై ఎట్లు చూపట్టును? ఎట్లాంధ్రభాషయానము ముందుకు జరుగును? ఆంధ్రహృదయమందలి సహజశక్తి విజృంభింపవలెనన్నను, ఆంధ్రసాహిత్యము పునరుద్ధరణము నందవలెనన్నను ఆంధ్రభాష స్వాతంత్ర్య మందితీరవలెను. వంగసీమ యందువలెనే మనసీమయందును భాషావిప్లవము తలసూపవలెను. శతాబ్దములకు ముందు శిలాగ్రంథములందు చెక్కఁబడిన లక్షణసూత్రములును, వ్యాకరణ నియమములును నేఁటి కాగితములందు పునర్ముద్రణమందినంతనే తమ రాతిరూపము, తమ కటికమనము మార్పు చేసుకొనునా? భాషాస్రోతమునకు అనకట్టయగుటకై వ్యాకరణము నిర్మింపఁబడదు. అట్లది నిలిపినేని, దీనిని దెగఁగొట్టుటకు కాలవిలంబనము కారాదు.”

మాతృభాష, వాడుకభాష, గ్రాంథికభాషల విషయములను సాహిత్యగోష్ఠి, భావనావేశము, నాటక లలిత కళల విషయములను సత్యనారాయణమూర్తిగారు చేసిన విమర్శనలు సాహిత్య భాషా కళాభిమానుల యాదరణపాత్రములు. ఆంధ్ర వాఙ్మయాభ్యుదయాభిమానులందరును శ్రీ సత్యనారాయణమూర్తిగారు వారి సాహిత్యోపాసనానుభవపూర్వకముగను రచించిన సాహిత్యతత్త్వ విచారము నాదరించి సాహిత్యోపాసనమును జేయుదురుగాక!

శ్రీ సత్యనారాయణమూర్తిగారాంగ్లాంధ్రవంగ సారస్వతము లందు పరిశ్రమచేసిన విద్యావంతులు, సాహిత్యోపాసకులు. పురాతన నాధునాతన సారస్వతములును, ప్రాచ్యపాశ్చాత్య సారస్వతములును, సంస్కృతాంగ్లాంధ్ర సాహిత్యములును, ఆధ్యాత్మికాధిభౌతిక సాహిత్యములును ప్రకృతివిలసితములైన సత్య శివ సుందర విలాసములను మహాకవులు సంకల్పించి, సందర్శించి, నిర్మించి రసానందమును గలుగఁజేయుగల విధమును పరిస్ఫుటము చేయుచున్నవి. వ్యాస వాల్మీకి కాళిదాసాది మహాకవుల కావ్యములవలెను, మిల్టన్, షేక్స్పియర్, హోమర్, డాంటె, గతె, బైరన్ మొదలగు మహాకవుల కావ్యములును, శాంత కావ్యములవలెను దుఃఖాంతకావ్యములును, మహాకావ్యములవలెను సామాన్యభావగీతములును, రసోత్పాదనమునకు వినియోగపడిన వినియోగపడుచున్న విధమును శ్రీ సత్యనారాయణమూర్తిగారు ఈ గ్రంథమునందు బాగుగ విమర్శించిరి. భారతీయ సాహిత్యమునకు చతుర్విధ పురుషార్థములందును ఎక్కువైన మోక్షము పరమార్థమైన విధమును, విశ్వసాహిత్యమునకును విశ్వమైన ఆత్మజ్ఞానానందము పరమార్థమైన విధమును నిరూపణము చేయుటయు శ్రీ సత్యనారాయణమూర్తిగారు చేసిన ప్రయత్నము సాహిత్య మీమాంసకులకు విచారయోగ్యముగను నున్నది.

[సాహిత్య తత్త్వవిచారము పీఠిక—1937]

# కావ్యాత్మ

ఆత్మానందము సకలపదార్థములకును పరమార్థము. ఆనందమునకు జ్ఞానమాధారము. జ్ఞానమునకు సత్యము శక్తి. సత్యమున కాత్మ కింకరము. సచ్చిదానందాత్మకమైన పరమార్థానందానుభవమునకు విశ్వహృదయ సౌందర్య విలాసములు నిత్యసాధనములు. పిపీలికాది బ్రహ్మపర్యంతమును గల జీవజాలములు విశ్వవ్యాప్తములైన కళాసాహిత్యముల యాధారమునను నాత్మరసానందము ననుభవించుచున్నవి. సాహిత్యకళోపాసకు లాత్మసంకల్ప సంస్కారానుభవరూపముగ ననంతములైన కావ్యకళలను సంకల్పించి, ధ్యానించి, సందర్శించి, నిర్మించి, ఆత్మరసానందానుభవమున కధికారు లగుచున్నారు.

ప్రకృతి పురుషలీలావిలాస సంభవమైన విశ్వరసానందానుభవమునకు కావ్యము లుత్తమసాధనములు. కావ్యములు కవుల సంకల్పసంస్కారానురూపములు. మహాకవులు రసోపాసకులు; రససిద్ధులు; రసానుభవజ్ఞులు. కావ్యార్ణవసంభవములైన యనంత కావ్యములు కవుల సంకల్ప జ్ఞాన క్రియాశక్తుల కనురూపములగను ఆత్మరసానందానుభవమునకు సాధనము లగుచున్నవి. అనంతమైన కావ్యపరిణామ పరిజ్ఞానమునకు కావ్యతత్త్వ మీమాంసయును, కావ్యాత్మ నిర్ణయమును సాధనములు. చిరకాలరసానుభవ సంవర్తితములైన కావ్యసంప్రదాయ సంకేతములును, భాషాలంకార విశేషములును, రసవిభేదములును కావ్యాత్మ పరిజ్ఞానమును దుర్ఘటము చేయుచున్నవి. అవ్యక్తమైన బ్రహ్మానందమును కావ్యములు భావ భాషాలంకార రసానందానుభవపరమైన ఆత్మానందానుభవప్రమాణమునను సువ్యక్తము చేయుచున్నవి. కావ్యాత్మ స్వరూపస్వభావములను నిర్ణయించుటకును, గ్రహించుటకును బెజవాడ వాస్తవ్యులు శ్రీ శేట్లూరి వేంకటరాఘవయ్యంగారు రచియించిన 'కావ్యాత్మ' వినియోగపడుచున్నది.

అతిప్రాచీనమైన సంస్కృత సాహిత్యమునందు కావ్యాలంకార శాస్త్రములు వికాసమును పొందిన విధము నపారమైన శాస్త్ర గ్రంథములు విశదము చేయుచున్నవి. ప్రాచీనమైన దేశమునకువలెను సాహిత్యకళాశాస్త్రములకును భరతనామము సార్థకముగ నున్నది. భరతముని ప్రారంభించిన కావ్యమీమాంస క్రమపరిణామమును పొంది కావ్యాత్మ జిజ్ఞాస కవకాశములను గలుగజేయుచున్నది. అనంతమైన కావ్యాలంకారశాస్త్ర పఠనాభ్యాసము సామాన్యులకు దుర్ఘటము. భావభాషాలంకార రసయోగానందాత్మకమైన కావ్యాత్మ విశ్వసాహిత్యమునందు సర్వత్ర మహాకవులకు, కళాభిజ్ఞులకు, పండితులకు ప్రత్యక్షమగుచున్నది. పరమాణువు మహామేరువులందును, పిపీలిక పరబ్రహ్మలందును కవులు రసానందానుభవమును కల్పించి, సందర్శించి, ప్రత్యక్షము చేయుటకు సమర్థులు. కావ్యాచార్యులు కావ్యములను పరిశీలించి వ్రాసిన శాస్త్రగ్రంథముల సారాంశమును 'కావ్యాత్మ' సుబోధకముగను విశదము చేయుచున్నది.

భరతుడు, భామహుడు, మమ్మటుడు, విశ్వనాథుడు, దండి, హేమచంద్రుడు, దీక్షితుడు, వామనుడు, జగన్నాథుడు మొదలగు కావ్యాలంకారశాస్త్రజ్ఞులు వ్రాసిన కావ్యమీమాంస శ్రీగ్రంథమునందు వివిధాధ్యాయములందు సుబోధములుగ వివరింపబడినవి. కావ్యము లనంతములైన శబ్దార్థాలంకార శోభితములు, గుణరీతిబద్ధములు, ధ్వని సాధనములు, రసాత్మకములు. కావ్యపరిణామమునందు కావ్యాత్మ రసపరిణామమును పొందిన విధమును గ్రంథము పరిస్ఫుటము చేయుచున్నది. గ్రంథమునందలి యీ క్రింది వాక్యములు కావ్యాత్మ సంకల్పమునకు మనోహర నిదర్శనములు:—

"కావ్యసౌందర్యము కేవలబాహ్యము, అస్థిరమునైన దానిపై గాక అంతరంగికము, ఆనందదాయకమునైన ఆత్మతత్త్వముపై నాధారపడి యుండును. అందువలన 'డెందమున కనువైన రసము లొలుకు భావమే కావ్య' మని భరతుడును, 'సువర్ణమయాలంకార విశేష భూషితమైన వాక్యమే కావ్య' మని భామహుడును, 'శబ్దార్థముల జంటయే కావ్య' మని రుద్రటుడును, 'ఇచ్చవచ్చిన తలపుల మొలక లెత్తజేయజాలు నీటుగులుకు మాటలకూరుపే కావ్య' మని దండియు, 'మంచి గొనముల నెనగు మేలిపదముల పొందికయే కావ్య' మని వామనుడును, 'ఇంపుసొంపుల ముంపుచు క్రొత్త వింతకోరికల నన లెత్తగా పలువు పలుకు నుడికారముం గల పలువు తలపే కావ్య' మని ఆనందవర్ధనుడును, 'నెరజాణతనపు మురిపెముల గురియు ముద్దుముద్దుల మాటయే కావ్య' మని కుంతకుడును, 'రసమైన వాక్యమే కావ్య' మని విశ్వనాథుడును, 'అందముం జిందు భావముం బొందుపరచుటచే నెరయు మెరయు పదమే కావ్య' మని జగన్నాథుడును వచించిరి."

సాహిత్యపరిణామమునకు శాంతసుందరశివాత్మకములైన భావార్థాలంకారములు, పదార్థాలంకారములు, ధ్వని గుణాలంకారములు నియతసాధనములైనను రసాత్మయే కావ్యాత్మ యని కావ్యమీమాంస సువ్యక్తము చేయుచున్న విషయమును పండితపామరులు గ్రహించుట కావ్యోపాసనకు పరమార్థము.

ఆంధ్రగ్రంథమాలయందు కావ్యాత్మను 26 వ ప్రచురణముగను సమకూర్చి గౌరవించినందులకు శ్రీయుత శేట్లూరి వేంకటరాఘవయ్యంగారికి నిర్వాహకులు కృతజ్ఞులు. 'కావ్యాత్మ' ఆంధ్ర లోకాదరణ పోషణములను, ముఖ్యముగను విద్యార్థిపండితాదరణమును గలిగి వర్ధిల్లుటకు భగవంతు డనుగ్రహించుగాక!

[కావ్యాత్మ పరిచయవాక్యములు—1935]

# అనుభవసారము

పాల్కురికి సోమనారాధ్యుడు అనుభవసార కృతికర్త:
గోడగి త్రిపురారి కృతిపతి: 234 పద్యములుగల పద్య కావ్యము. సోమనాథుడు కాకతీయ రాజ్యమునందలి పాలకురికి యందు జననమునొంది కర్ణాటకదేశమునందలి కలికె యను గ్రామమున సిద్ధిని బొందినటులు నిర్ణయింపబడుచున్నది. పాలకురికి యందు సోమనాథ లింగమును, దేవాలయము నేటికిని కలవు. సమాధులపైని లింగప్రతిష్ఠాపనము చేసి, యారాధించెడి ఆచారము నేటికిని హిందూమతము నందే కాక ఇతర మతములందును గలదు. సోమనాథు డారాధ్యబ్రాహ్మణుడు. అతనితల్లి శ్రియాదేవి, తండ్రి విష్ణు కామదేవుడు, విద్యాగురువు కట్టకూరి పోతదేవుడు, కవితాగురువు కరస్థలి విశ్వేశుడు అని బసవపురాణము నందును, తండ్రి బసవేశుడు, గురువు లింగార్యుడు అని పండితారాధ్య చరిత్రయందును, సోమనాథుడు వ్రాసెను. అనుభవ సారమునందు ఇట్లు గలదు:—

> "క. భృంగిరిటిగోత్రుడను గురు
> లింగతనూజుండ శివకులీనుడ దూర్వా
> సంగవివర్జితచరితుడ
> జంగమ లింగ ప్రసాద సత్పాత్రుండన్."

దీనివలన కొందరు సోమనాథుడు జంగమకులజు డని నిర్ణయించిరి. కాని, అనుభవసారమందు 'వేదోక్త నిరూఢిని పురాణ రహస్య నియుక్తిని' అనియును, పండితా రాధ్యచరిత్రయందు 'చతుర్వేదపారగురుడను' అనియును వ్రాయుటయును, సోమనాథభాష్యమందు గాయత్రీమంత్ర ప్రకరణమును చేర్చుటయును, చతుర్వేదసారసూక్తులను వ్రాయుటయును, సంబంధబాంధవ్యములును బ్రాహ్మణ కులసంభవమును సూచించుచున్నవి. 'పాలకురికి పతితుడు' అను ధూర్తవిప్రనిందయే బ్రాహ్మణకులజననమునకు నిద ర్శనము. సోమనాథు డారాధ్యబ్రాహ్మణకులమున పుట్టినను కాలక్రమమున బసవేశ్వర భక్తుడై కులగోత్రాభిమాన మును వదిలి, బసవకులమును బసవగోత్రమును స్వీకరించి ప్రమథగణపరమైన భృంగిరిటి గోత్రమును స్వీకరించి యుండును. సోమనాథుడు 1160 నుండి 1230 వర కును జీవించియుండును.

సోమనాథ విరచితములైన కృతు లనేకములు గలవు. బసవ పురాణము, పండితారాధ్యచరిత్రము, అనుభవసారము, చతుర్వేదసారసూక్తులు, చెన్నమల్లు సీసములు, వృషాధిప శతకము తెలుగు గ్రంథములు: సోమనాథభాష్యము, బసవపంచగద్య, శ్రీరుద్రభాష్యము, నమస్కారగద్యము, అక్షరాంకగద్యము, ప్రపంచక్రమకార గద్యము, అష్టకము, ఉదాహరణయుగ్మము సంస్కృత గ్రంథములు: బసవరగడ, గంగోత్పత్తిరగడ, శ్రీ బసవాఖ్య రగడ, శ్రీ సద్గురురగడ కన్నడ గ్రంథములు.

సోమనాథుడు సంస్కృతాంధ్రకర్ణాటక భాషలందును వేదవేదాంగములందును మతసంప్రదాయాచారములందును మహాపండితుడు. ఆంధ్రభాష్యరచనయందును ప్రజాసామాన్య మునకు మతరహస్యములను వెల్లడిచేయుటయందును గల యుత్సాహమును బసవేశ్వర పండితారాధ్య చరిత్రలును అనుభవసారమును వెల్లడి చేయుచున్నవి. సోమనాథుని కవిత్వము జానుతెనుగున ద్విపదపద్యములందు విరచితమై జనసామాన్యమున కుపయోగపడగలవిధమును బసవపురా ణము, పండితారాధ్యచరిత్రము, అనుభవసారము మొదలగు నవి తెలుపుచున్నవి. నన్నయకును, తిక్కనకును నడుమ కాలమందు వర్ధిల్లిన సోమనాథు డాంధ్రవాఙ్మయమునకును, విజ్ఞానమునకును, మతసాంఘికాచార సంస్కరణ సంరక్షణ ములకును చేసిన మహోపకారము నతని గ్రంథములు విశదము చేయుచున్నవి.

శ్రీ శంకరాచార్య విరచితమైన అపరోక్షానుభూతి ఆచార్య స్వాములవారి అద్వైతానుభవమును వివరించు చున్నట్లు, సోమనాథ విరచితమైన అనుభవసారము వీర శైవమతసారమును వివరించుచున్నది. శ్రీ శంకరాచార్యులు జైన బౌద్ధమతములను ఖండించి వైదికమతోద్ధరణ మొనర్చినను ప్రజాసామాన్యమునందు వర్ణాశ్రమధర్మకర్మ పరమైన వైదికమతవ్యాపనము దుస్తరమైనది. బసవేశ్వ రుడు ప్రజాసామాన్యమునందు మానవధర్మపరమైన దైవ భక్తిని వ్యాపింప జేయుటకై శైవదీక్షాపరమైన వీర శైవమత వ్యాపనమునకు పూనుకొనెను; వైదికమతాను ష్ఠానమునకు దురారాధ్యమైన కర్మమార్గమునకు బదులు

మాలభమైన భక్తిమార్గము నవలంబించెను. బసవేశ్వరుడు స్వయముగ బ్రాహ్మణకర్మములను విడిచి శివదీక్షను స్వీకరించెను. బసవేశ్వరు డవలంబించిన మార్గమును సోమనాథుడు విస్తరింపజేసినవిధమును అతనిగ్రంథములు విశదము చేయుచున్నవి. అనుభవసారమందలి యీ పద్యములు అతని సంకల్పమును తెలుపుచున్నవి.

క. అనుభవసారం బనగా
మనసిజహరు శుద్ధభక్తిమార్గము వేదో
క్తనిరూఢి బురాణరహ
స్యనియుక్తిని విన్నవింతు నది యె ట్లనినన్.

క. అర్థార్థము వ్యవసాయము
అర్థము జంగమహితార్థ మదియును సద్భ
క్త్యర్థము సద్భక్తియు ము
క్త్యర్థం బటు గాన వలయు వ్యవసాయ మిలన్.

క. చేయువెడ భక్తిపరులకు
న్యాయార్జిత మైనయట్టి యరకానికి న
న్యాయార్జిత మగు మాడలు
వేయును సరిగావు భక్తివిధిఁ ద్రిపురారీ.

క. అనమ గురు లింగ జంగము
ప్రసాదభక్తస్థలముల బరిపూర్ణంబై
యొసఁగు లసత్కావ్యము నీ
కసలార నభీష్టదాయి యగుఁ ద్రిపురారీ.

జైనబౌద్ధమతములు శిథిలముచేసిన వైదిక మతాచారములను శ్రీ శంకరస్వాము లుద్ధరించినను ప్రజాహృదయమునందు వైదిక కర్మానుష్ఠానము వ్యాపకమును గాంచుట దుర్లభమైనది. వైదికమతపరిణామమైన దైవభక్తిని జనసామాన్యమునం దుద్ధరింప జేయుటకు భక్తిమార్గము శరణమైనది. బసవేశ్వరుడు, రామానుజులు శైవవైష్ణవ మతముల మూలమున భక్తిమార్గమును వ్యాపింపజేసి హిందూ మతమును పదకొండు పన్నెండు శతాబ్దములందు దక్షిణదేశమునం దుద్ధరించిరి. అనుభవసారమునందు బసవేశ్వరభక్తుడైన సోమనాథుడు వీరశైవ సిద్ధాంతములను సుగమము చేసెను. అనుభవ మనగా శివానుభవము.

ఆదియుగమునందు కర్మపరమైన వైదికమతము తదనంతరము జ్ఞానపరమును భక్తిపరమునై పరివర్తనమును పొందినది. భక్తిపరమైన వైదికమతపరిణామమునకు శైవమతపరిణామము లక్ష్యముగ నున్నది.

## శైవము

వైదికమంత్రోపస్థితుడైన రుద్రుడు వేదాంతమునందు శివస్వరూపపరిణామమును బొందుచు సర్వవ్యాపకుడై 'శివోఽహం' తత్త్వమును వ్యక్తము చేయుచున్నాడు. శివుడు యజ్ఞపురుషుడు. శివుడు సగుణనిర్గుణ పరబ్రహ్మము. శివుడు హిమాచలమునందు గౌరీశంకరుడు, రామేశ్వరమునందు రామలింగేశ్వరుడు, కాశ్మీరమునందు మహాదేవుడు, మధురయందు సుందరేశ్వరుడు, చిదంబరమునందు నటరాజేశ్వరుడు, సౌరాష్ట్రమునందు సోమనాథుడు, శ్రీశైలమందు మల్లికార్జునుడు, కాశియందు విశ్వేశ్వరుడు. దేశావృతములైన శివాలయములు శైవమతవ్యాపనమును తెలుపుచున్నవి. శైవులు లింగరూపమున శివలింగమును పూజించుచు శివోత్కర్షను జేయుచున్నారు. అథర్వశిఖయందలి 'ఈశ్వర శ్శివ ఏవచ...శివ ఏకో ధ్యేయః శివ ఙ్కరః', స్కందోపనిషత్తునందలి 'జీవ శ్శివ శ్శివోజీవ స్సజీవః కేవల శ్శివః' మొదలగు వాక్యములు శివోత్కర్షను దెలుపుచున్నవి. శైవులు శివాలయములందును, పీఠములందును స్వయాంగములందును లింగములను ప్రతిష్ఠించి పూజింతురు. అద్వైతమతస్థాపకులు శ్రీ శంకరస్వాములు పీఠమునందు లింగార్చనను చేయుట సుప్రకటించిరి.

## శివలింగము

అవ్యక్తము నిర్గుణము, నిరాకారము, నిరహంకారము, నిరవద్యము. అవ్యక్తమును అనంతము లైన నామరూపభావములను విశ్వమంతయును సంభావించుచు ప్రపంచించుచు వ్యక్తముచేయుచున్నది. ఆకాశలింగము, వాయులింగము, తేజోలింగము, అప్లింగము, పృథ్వీలింగము, అవ్యక్తమునకు వ్యక్తస్వరూపములు. వ్యక్తమైన లింగస్వరూపములందు పార్థివలింగము, సగుణనిర్గుణరూపము లను గలిగి పూజాపాత్రమైనది. లింగము మహత్తునకు బీజచిహ్నము. శైవాగమములు షడక్షరీ మంత్ర రూపపరముగ నిరూపించుచున్న లింగ మాకాశాది పంచభూతములందును గోచరం బగుచున్నది.

## లింగధారణము

శివలింగమును వర్ణ వివక్ష లేక సకలవర్ణములవారును పూజించుచున్నారు. బ్రాహ్మణులు దేవతార్చనలందును, సకల వర్ణముల వారును దేవాలయములందును శివలింగమును బూజించుచున్నారు. లింగధారులు లింగమును స్వయాంగ

ములందు ధరించుచు లింగధారి బ్రాహ్మణులు జంగములు వీరశైవులు మొదలగువా రగుచున్నారు. లింగధారణము బాహ్యార్థమును గలిగి వీరశైవమున కపూర్వమైన ప్రతిష్ఠను గలుగజేసినది.

సీ. లింగార్చనక్రియాసంగతి శృంగార
 రసమును నద్భుతరసము దోప
వినయంబు జంగమార్చనజేయుచో శాంత
 రసము భయానకరసము దోప
సంసారసంపదల్ చర్చించుచో హాస్య
 రసమును భీభత్సరసము దోప
దుష్టేంద్రియంబులఁ దూలించుచో రౌద్ర
 రసమును నతివీరరసము దోప
సెల్లజీవరాశియెడలను గారుణ్య
రసము దోప భక్తిరమణఁ బరఁగు
నవరసైకరసికుఁ డవివేకదూరుండు
భక్తుఁ డొక్కరుండె ప్రస్తుతింప.

## వీ ర శై వ ము

వీరశైవము కర్మపరమైన వైదికమతమును, జైనబౌద్ధములను ప్రతిఘటించుట కేర్పడిన వైదిక మతము. వీరశైవమునకు ప్రధానదీక్ష లింగధారణము. లింగధారణమునకు గర్భము, కరము, ఫాలము, కంఠము, శిరస్సు, వక్షస్స్థలము ముఖ్యస్థానములు. లింగధారు లందఱును జాతిమత కులభేదములు లేని శివభక్తులు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, పంచములు మొదలగు నన్ని వర్ణములవారును వీరశైవులై కులభేదములను నిరసించినవిధమును వీరశైవమత చరిత్రమును, సిద్ధాంతములును విశదముచేయుచున్నవి. కర్మమార్గమును నిరసించుచున్న విధమును వీరశైవ సిద్ధాంతములు విశదము చేయుచున్నవి. అనుభవసార మీ విషయమునే సంగ్రహముగ దెలుపుచున్నది.

చ. అవిరళ లింగపూజయు ని
 రంతర సద్గురు భక్తియుక్తియున్
సవినయ జంగమార్చనయు
 సత్యము శౌచము సచ్చరిత్రముయున్
దవిలి ప్రసాదసేవయును
 దానొడఁగూర్పక వట్టిమాటలం
దవునె యుదాత్తభక్తి సుగు
 ణాకర శ్రీకర దోషభీకరా.

క. భూతియు రుద్రాక్షలు నె
 త్యాచిత బహువేషరచన లవి తొడవులె నం
 ప్రీతిగ భక్తునకును ప్ర
 ఖ్యాతిగ సద్భక్తి తొడవుగాక మహాత్మా.

వీరశైవమునకు బాహ్యమునందువలెను అంతరంగము నందును లింగధారణము బీజముగ నున్నది. వైదికమతము నందలి దేవతార్చనము, వేదాంతమునందలి తత్త్వార్థము జైన బౌద్ధమతములందలి సంఘారాధనము, వివిధమతము లందలి కర్మారాధనము వీరశైవభక్తియందు సంయోగమును బొందినవి. వీరశైవులు జాతి కులగోత్రభేదములు లేక జంగమ లింగములకు శరణాగతు లగుదురు.

క. ఈకుల మాకుల మనక ని
 రాకులమతి వాలకొరత లరయక భక్తా
 నీకము శివుఁ డని కొలిచినఁ
 జేకొనడే వాంఛితార్థ సిద్ధి మహాత్మా.

క. శివగర్భులు శివజన్ములు
 శివగోత్రులు శివకులజులు శివపజ్ఞానుల్
 శివశాసనధరులౌ యొం
 దు వేఱె కులములను వెదుకుదురె త్రిపురారీ.

లింగస్వరూపుడైన సాధకుడు శివలింగ స్వరూపులైన జంగమ భక్తుల తీర్థప్రసాదములను గైకొని శ్రీ గురుకటాక్షమునకు బాత్రుడై ప్రకృతి మమకారాహంకారకల్పితములైన భేదావరణములను విడిచి గురులింగైక్యమును బొందుచున్నాడు. సకలమతములకును లక్ష్యము జంగమసేవ. జంగములైన ప్రాణులకు సుఖమును గలుగజేయుటయే ఈశ్వర పూజాఫలమని మతములన్నియును బోధించుచున్నవి. లింగధారులైన జంగమభక్తులను జాతిమత భేదములను విసర్జించి పూజించు మానవ సోదరత్వమును స్థాపింపగల విధమును అనుభవసారము బోధించుచున్నది.

సీ. సహజసజ్ఞానశివాచారనిర్మలని
 యుక్తి జంగమభక్తి భక్తిపథము
అంగగుణేతరలింగైకనిష్ఠాప
 రత్వంబు మాహేశ్వరస్థలంబు
సతతబాహ్యాంతరార్పితలింగవికచనా
 స్వాదనసుఖము ప్రసాది వేళవు
స్వప్రాణలింగ లింగప్రాణమధన (?)
 శివాంతరమ్ము ప్రాణలింగిలిం

అనుభలింగ పరవశానన్యగర్భవి
స్ఫురణనిత్య సత్య శరణపదము
తా ననంగలేని తత్త్వంబు లింగైక్య
మివియ షట్స్థలంబు లీశ్వరాంశ.

ఉ. జంగమభక్తి లింగపరి
చర్యల మీరుట యుత్తమంబు
తజ్జంగమలింగపూజ లవి
సామ్యము సల్పుట మధ్యమంబు మున్
జంగమలింగపూజ యెడ సల్పక
లింగము గొల్చుచున్కి యె
న్నంగఁ గనిష్ఠ మౌట శర
ణ్యప్రణిపత్తియె ముఖ్య మెమ్మెయున్.

## జీ వ యా త్ర

జీవక్షేత్రమందు వ్యక్తావ్యక్తములకు ధర్మప్రతిష్ఠ సమకూర్చుటకు భగవద్భక్తి పరమ సాధనముగా నున్నది. జీవయాత్రను దేవయాత్రగ జేయఁగలవిధమును వైదిక మతధర్మము లనంతముఖముల నిర్దేశించుచున్నవి. దేహధారుల కవ్యక్తమును గ్రహించుట దుర్లభము. అవ్యక్తము వ్యక్తముద్వారా గ్రాహ్యమగుచున్నది. జీవయాత్రను విషయాత్రగా జేయక శివయాత్రగ జేయుటకు జ్ఞానేంద్రియకర్మేంద్రియములు మనోబుద్ధిచిత్తాహంకారములు గురులింగజంగమార్చనలందు భక్తిపరవశములు కావలయును. జీవయాత్రను దేహయాత్రార్థముగాక శివయాత్రార్థము చేయువలసిన విధమును అనుభవసారము తెలుపుచున్నది. జీవయాత్రను కైవల్యయాత్రను జేయుటకు బాహ్యలింగధారణమును, అంతర్లింగధారణమును ఉపయోగపడఁ గలవిధమును వీరశైవాగమములు బోధించుచున్నవి. ఈ పరమార్థము అనుభవసారమునందు సోమనాథుడు విశదము చేసెను.

సీ. పుట్టియుఁ బుట్టక పుట్టు మహత్వంబు
కలిగియుఁ గలుగక కలుగు గుణము
పాసియుఁ బాయక పాయు వివేకంబు
చేసియుఁ జేయక చేయు బెడఁగు
ముట్టియు ముట్టక ముట్టించు జతురత
పొందియుఁ బొందక పొందు సుఖము
తలచియుఁ దలచక తలఁచెడు తత్త్వంబు
మఱచియు మఱవక మఱచు బదము
అడ్డులేనినీడ అలలేనిశబ్దంబు
రెండులేని మొదలు నిండియున్న
అరయు బొరయులేని యానందనీరధి
తఱుచు శరణు నెఱవు తరమె పొగడ.

క. తెలియుటయె యెఱుక కోర్కులు
పొలియుటయే సుఖము సుకృతబుద్ధియె గతి దా
వలచుటయె పరముఁ బాయక
తలఁచుటయె సమాధి పరమతత్త్వం బనఘా.

క. నిర్దయులకు నిష్క్రియులకు
దౌర్భాగ్యద్వైతులకు వృథావాదులకున్
దుర్భావకులకు దాసవు
సర్వవ సుఖరాశి గలదె నారయపుత్రా.

## సా ధ న సా ధ్య ము

జీవుడు జీవయాత్రయందు శివమును బొందుటయే జీవయాత్రా ప్రయోజనము. "అహంబ్రహ్మాస్మి", "తత్త్వమసి", "శివోఽహమ్", "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది మహావాక్యార్థములను వీరశైవము జీవయాత్రయందు సార్థకము చేయుచున్నది. లింగధారణము జంగములందు ద్వైతభావమును పోగొట్టి అద్వైతభావమును వ్యక్తము చేయుచున్నది. విశ్వ మంతయును శివుడు జీవము ప్రకృతి, ఆత్మ జీవము దేహము, గురువు లింగము జంగము, భావలింగము ప్రాణలింగము ఇష్టలింగము, లింగశరీరము సూక్ష్మశరీరము స్థూలశరీరము, నాదము బిందువు కళ మొదలగు త్రిపుటీరూపమున గోచరమగుచున్నది. సాధకుడు చిన్మయదీక్షితుడై లింగధారణను బొంది పంచభూతములను దశేంద్రియములను అంతఃకరణచతుష్టయమును వేధించి సాధ్యమును జేరుటకు వీరశైవ ప్రతిపాదితములైన సాధనములను అనుభవసారము విశదముచేయుచున్నది. వీరశైవము షడక్షరి 'నమ శ్శివాయ ఓమ్' మూలమునను మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞాచక్రస్థానములందు భక్త మాహేశ్వర ప్రసాది ప్రాణ శరణ ఐక్యస్థలములందు ఆచార గురు శివ చర సత్య ప్రసాద మహాలింగములను సాక్షాత్కారము చేసి సదాశివైక్యమయ మయిన సాయుజ్యమును గలుగ జేయుగల విధమును విశదము చేయుచున్నది. ఆ సాధనమును సోమనాథు డనుభవసారమునందు సంక్షేపముగ విశదము చేసిన విధమును గ్రంథావలోకనము వెల్లడి చేయుచున్నది.

[ఆంధ్రవిజ్ఞానసర్వస్వము, ద్వితీయసంపుటము-1934]

# ఏకభాష: ఏకలిపి

దేశభాషా వ్యవహారములందు ఉత్తరభాగమునకును దక్షిణదేశమునకును భేదమున్నను అనాదిసిద్ధమైన భారతసంస్కారము భారతదేశమును బలవంతమైన భౌతికపాశములచేతనుగాక ధర్మయుక్తమైన జ్ఞానపాశములచేతను బంధించుచున్నది. విశాలదృష్టిగల మహర్షులు విజ్ఞానపాశముచేతను భారతవిషయాంగములను బంధించి విశాలమైన భరతఖండమునందు భావైక్యమును గల్పించిరి. సంస్కృతభాష వేదశాస్త్రములు పురాణాగమములు మతాచారములు సమానప్రయోజనములు నానాప్రాంతమునందుగల భారత హృదయములను బంధించుచున్నవి. భాషలు వేరైనను భావములు సమానమైనపుడన్యోన్య విశ్వాసము సులభము. వంగ మహారాష్ట్ర ఘూర్జర కర్ణాట కాంధ్రాదిభాషలు వేరైనను సామాన్య సంస్కారము భేదభావము నంతరింపజేయుచు సహజబాంధవ్యమును పోషించుచున్నది. సామాన్య సంస్కారముగల ప్రజలకు సామాన్యభాషా ప్రయోగము సుకరముగనున్నది. సామాన్య సంస్కారములేని ప్రజలకు సామాన్య భాషా ప్రయోగము దుష్కరముగ నుండును. సామాన్య సంస్కారముగల భారత ప్రజలకు స్వదేశీయమైన హిందుస్థానిభాషను నేర్చుకొనుటయందుగల సౌకర్యములు విదేశీయమైన యాంగ్లభాష నభ్యసించుటయందు గలుగవు. సామాన్య సంస్కారమునకు తోడుగ భాషాబాంధవ్యమును హిందూస్థాని భాష భరతఖండమునకు సామాన్య భాషగ జేయుటకు దగియున్నది.

ఈ యనుకూల పరిస్థితులను వినియోగించి హిందీ సాహిత్య ప్రచారమును హిందీభాషాప్రచారమును జేయుటకు 1910వ సంవత్సరమునందు పండితమదనమోహన మాలవీయగారి యధ్యక్షత క్రిందను కాశీనగరమునందు గూడిన హిందీ సాహిత్య సమ్మేళనసభ నేడాంధ్రదేశమునందు గూడుట విచిత్రముగ దోచును. ఈ విచిత్రమునకు నితర విచిత్రములకువలె గాంధిమహాత్ముడు కారణభూతుడు. హిందీసాహిత్యసమ్మేళన ముపక్రమించిన కార్యమునకు గాంధి మహాత్ముడు సహజపరిణామమును బోధించెను.

హిందుస్థానిభాష భారతభూమికి సహజముగ సామాన్యభాషయై యున్నది. ఈ భాష సులభముగను దేశమునందంతటను తెలియుచున్నది. 7 కోట్ల మహమ్మదీయులును 10 కోట్ల హిందూస్థానులును 8 కోట్ల యితరులును......కోట్ల ప్రజలు దీనిని గ్రహింపగలరు. ముప్పదిమూడుకోట్ల ప్రజలయందును 25 కోట్ల ప్రజలకు సామాన్యముగ తెలిసిన హిందుస్థానిభాషను భారతరాష్ట్ర భాషనుగ భగవానుడే చేసెను. బ్రిటిషు ప్రభుత్వము కోట్లకొలది రూప్యములను వ్యయముచేసి150 ఏండ్లు పాటుపడియును 100 కి 9మంది మాత్రమే ఆంగ్లభాషను నేర్చినవారు గలరు. వీరైనను నాభాషను విజ్ఞానలాభమునకు గాకను ఉద్యోగ లాభమునకు నేర్చుకొనుచున్నారు. నిరంతరము స్వదేశప్రయాణమున కాంగ్లేయులు సంసిద్ధముగ నున్నపుడు ఆంగ్లభాషకును విజ్ఞానమునకును వ్యాపకము గలుగదు. ముప్పదిమూడు కోట్ల భారతీయులందు 25 కోట్ల ప్రజలకు హిందుస్థానిభాష సహజముగ నర్థమగుచున్నది. నాలుగువందలేండ్లు భరతఖండమును బాలించిన మహమ్మదీయ సోదరులకీభాష మాతృభాషవలె నున్నది. ఇంకను 1000 ఏండ్లు గడచినను ఆంగ్లభాష ఎన్నటికిని రాష్ట్రభాష గాజాలదు. ఆంగ్లేయులు భారతభూమిని భాగ్యభోగములకేర్పడిన పాడియావునుగ జూచుచున్నారుగాని ధర్మారాధనమునకేర్పడిన ధర్మక్షేత్రముగ జూచుటలేదు. సంచులనుగట్టి యాంగ్లభాషను రాష్ట్రభాషను జేయుటకు జేసెడి ప్రయత్నములన్నియును నిరర్థకములై భారతబంధనమునకు దోడ్పడుచున్నది. పాశ్చాత్యసంసర్గము భారతజీవనప్రవాహమును సంకుచితము చేసినది. భాషయందును భావములందును విజ్ఞానమునందును స్థితిగతులందును పరాధీనస్థితి యేర్పడినది. మన లక్ష్యమంతయును మనకు దెలియని విదేశీయభాషవిూదను విదేశీయ సంస్కారమునందును నిలిచి మన బ్రతుకే దుర్భరమైనది. మిల్టను బైరనాదులవిూదను గల యభిమానము మహానుభావులైన పోతన తులసీదాసాదులవిూదను లేదు. ఇల్లు ఒళ్ళు గుల్లయై యిరువదేండ్లు శ్రమపడి సాధించిన భాషయును విజ్ఞానమును నాత్మోద్ధరణమునకు గాకను ఆత్మబంధనమునకు దోడ్పడుచున్నది.

పరాధీనస్థితిని ప్రతిక్షణమును సంస్మరింపజేయుచు దురారాధ్యములైన భాషాసంస్కారములాత్మోద్ధరణమునకు దోడ్పడుట దుర్లభము. దేశోద్ధరణమున కాత్మసమర్పణము చేసిన లోకమాన్య తిలకును లోకమాన్యుని గాంధిమహాత్ముని మహాపరాధులనుగ నిర్ణయించిన సంస్కార మాత్మోద్ధరణమునకు నిరుపయోగము. ఈ సత్యమును బాగుగా గ్రహించిన గాంధిమహాత్ముడు హిందీభాషను రాష్ట్రభాషనుగ జేయుటయందుగల యవసరమును గ్రహించి కార్యాచరణమునకు బూనుకొనెను. కాంగ్రెసు వ్యవహారములందు నిరాటంకముగ వేలుచున్న యాంగ్లభాషను దిగద్రోచి హిందీభాషను

సింహాసనము నెక్కించి దాని కర్తృస్థానము నొసంగి భారత జాతీయ జీవనమునందు నూతన శకమును నిర్మించెను. జాతీయ జీవనిర్మాణము స్వల్పసంఖ్యాకులైన యాంగ్లవిద్యాసంపన్నులనుండి బహుసంఖ్యాకులైన ప్రజాముఖమును జేరినది. దేశమునం దంతటను హిందీభాషాభ్యాసముమీద నభిలాష గలిగినది. హిందీ సాహిత్య వ్యాసంగమునకై కంకణమును గట్టుకొనిన సాహిత్య సమ్మేళన నిర్వాహకులు చెన్నపురియందు కేంద్ర కార్యాలయమును స్థాపించి దక్షిణ ప్రాంతమునందు హిందీ ప్రచారమునకు తోడ్పడిన విధమును నాంధ్ర దేశమందలి హిందీప్రచారము విశదము చేయుచున్నది. హిందీప్రచారమున నాంధ్రదేశమునందు ప్రభుత్వావలంబనముగాని ప్రజాదరణముగాని విశేషముగ లేకపోయినను యువజనోత్సాహము వలనను ప్రచారకుల యుత్సాహమువలనను ముఖ్యముగ శ్రీయుతులు హరిహరశర్మ హృషీకేశశర్మగారుల పూనికవలనను హిందీప్రచార మతిత్వరితగతిని వ్యాపించినది. ఆంధ్రదేశమునందు వ్యాపించిన విధమువను ద్రవిడ కర్ణాటక దేశములందు వ్యాపింపలేదు. హిందీ సాహిత్య సమ్మేళనమువారు చెన్నపురియందలి కేంద్రస్థానముద్వారా చేసినసహాయ మాంధ్రదేశమునందు హిందీప్రచార వ్యాప్తమునకు గొంత దోడ్పడినది. అందుల కాంధ్రులమక్షయమైన కృతజ్ఞతను దెలుపుచున్నాము. ముందును హిందీ సాహిత్య సమ్మేళనమువా రాంధ్ర హిందీ కార్యాలయమునకు పూర్వమువలెనే సహాయము జేయుదురని నమ్ముచున్నాను. ఆంధ్రదేశమునందు హిందీ ప్రచారము స్వయంసహాయముమీదనే యాధారపడియున్నది. ప్రజల విరాళములే ఈ యుద్యమము నింత వరకును పోషించినవి. ముందును నీ యుద్యమము నధికతరోత్సాహముతో నాంధ్రులు పోషింపవలసి యుందురు.

ఆంధ్రయువజనములందు హిందీ ప్రచారమునెడ్ల గల యభిమానమే ఈ విశేషాధివేశనమునకు కారణము. భరతఖండమునందలి సహజమైన భాషాప్రయుక్త రాష్ట్ర విభాగములను బ్రిటీషు ప్రభుత్వ మధ్యాహ్నముచేసి దేశభాషలను శుష్కింపజేసినది. మూడు నాలుగు దేశభాషలు కలిసియున్న రాష్ట్రమునందు దేశభాషకును పోషణము లేక అన్ని భాషలును క్షీణించినవి. రాజకీయపరిజ్ఞానము గల కాంగ్రెసు దేశమునందలి సహజమైన భాషాప్రయుక్త భాషావిభాగములను నవలంబించి ప్రజాజీవనమున కుత్తేజము గలుగజేసినది. ప్రజలు మాతృభాషాముఖమున వ్యవహారక్రమమును నడుపగల విధము బోధ్యమైనది. అన్ని వ్యవహారములకును నాంగ్లభాషయే సాధనమను వెఱ్ఱిభావ మంతరించినది. ఆంధ్రదేశమును వేఱ కాంగ్రెసు ప్రాంతముగను నంగీకరించుటవలననే ఆంధ్రదేశము నందు కాకినాడయందు కాంగ్రెసు గూడుటయును హిందీ సాహిత్య సమ్మేళనము గూడుటయును సాధ్యమైనవి. ప్రత్యేక స్థితియును రాజకీయ వ్యవహారములందు కలిగిన ప్రయోజనములను సఫలము చేయుటకుగాను హిందీ ప్రచారమునకు ప్రాంతిక కార్యాలయమును స్థాపింపవలయునను సంకల్పము గలిగినది. ఆంధ్రదేశమునందు ప్రాంతిక కార్యాలయమును స్థాపించుటవలనను హిందీప్రచార మధికవేగముగ జరుగుట నిశ్చయము. ప్రత్యేక వ్యక్తిత్వము గలిగి స్వయంపోషణమున కర్హమైన ప్రాంతములందు ప్రత్యేక కార్యాలయములను నేర్పఱచుటయును వ్యవహారధర్మము. ఆ సంబద్ధ కార్యాలయమును పోషించుటకు హిందీ సాహిత్యసమ్మేళనము కొంత సహాయమును జేసినను భారమంతయును నాంధ్రులమీదనే యుండునని యాంధ్రులు గ్రహించి పాటుపడవలసియుందురు

హిందీప్రచారమును జేయుటయందు సాహిత్యసమ్మేళనము విషయమున కొన్ని సంశయములు గలుగుచున్నవి. హిందీ సాహిత్య వ్యాసంగమునకును హిందీ వ్యాసంగమునకును సన్నిహిత సంబంధమున్నను రెండు విధములైన వికాసములును నుత్తరప్రాంతము లందువలె—దక్షిణప్రాంతములందు సాధ్యము గాదు. ఆంధ్రదేశమునందు హిందీ ప్రచారము వ్యవహారార్థ మవసర మగుచున్నదిగాని సాహిత్య వ్యాసంగార్థ మవసరమగుటలేదు. సాహిత్యము మాతృభాషయైన ఆంధ్రభాషాముఖముననే జరుగవలసియున్నది. ఈ లక్ష్యము దిగ్భ్రమయగుటవలనను గలిగిన యనర్థపరంపరలను ఆంగ్లభాషాప్రచారము విశదము చేసినది. ప్రజలయందు సహజశక్తిని విజ్ఞానవ్యాసనము దుర్లభమైనది. ఆయనర్థజాలములందు తిరిగి చిక్కువడకుండుటకై ఆంధ్రదేశమునందలి హిందీప్రచార కార్యాలయము శ్రద్ధను వహింపవలయును.

హిందూ మహమ్మదీయ సమ్మేళనమునకును భారత జాతియైక్యమునకు, స్వధర్మనిర్వాహమునకును స్వాతంత్ర్యప్రాప్తికిని సాధనమైన హిందీప్రచార విషయమై మహాసభయందు విషయాన్వేషణము చేయబడి సాధనలు నిర్ణయింపబడును. గాంధిమహాత్ముడు జాతీయైక్యకు రాజము, హిందీ మూలాధారములని చెప్పియుండెను. మహాత్ముని నిర్బంధకాలమునను వారి యుపదేశముల నాదరించుచు మన ధర్మము నిర్వహించి దేశమోక్షమునకు పాటుపడుట మనవిధిగ నున్నది. దేశభక్తుడును త్యాగమూర్తియును విద్యాసంపన్నుడును నైన శ్రీయుత సేట్ జమనాలాలు బజాజుగారి యాధిపత్యముక్రిందను హిందీ సాహిత్య సమ్మేళన సమావేశము జయప్రదముగ జరుగుటకు భగవంతుని వేడుచు ఆంధ్రదేశపక్షమునను మా స్వాగతంబును గైకొని లోపములున్నను భక్తియుక్తమైన యాతిథ్యమును స్వీకరించి మమ్ము కృతార్థులను చేయుటకును మిమ్ములను వేడుచున్నాను.

భారతవర్షమున నేకజాతీయత యేర్పడవలెనన్న నేకభాషయును ఏకలిపియును గూడ ముఖ్యావసరము. ఏ లిపిలో అన్నిశబ్దములును సరిగా వ్రాయువీలగునో ఆ లిపియే ఏకలిపిగా నంగీకరింపదగినది. అట్టి లిపి నాగరిలిపి యొక్కటియే యని నా అభిప్రాయము. హిందువులు సంస్కృతముతోపాటు ఉరుదుభాషను, మహమ్మదీయులు ఉరుదు భాషతోపాటు సంస్కృతమును (నాగరిని) అభ్యసించి భాషాప్రచార మొనరించి హిందీ ఉరుదుభాషల పరివృద్ధినొందింపవలెనని గాంధి మహాత్ము డాదేశించెను. దక్షిణాపథమున నివసించుచున్న మనము హిందీ సంస్కృత భాషల నభ్యసించుటకు నాగరిలిపిని గూడ నభ్యసించి మేలును బడయవలెను. ఇష్టమున్నవారు ఉరుదుభాషను గూడ నభ్యసింపవచ్చును.

[అఖిలభారత హిందీసాహిత్య సమ్మేళనము (కాకినాడ)
ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము—1924]

# అపరోక్షానుభూతి

అపరోక్షానుభూతి శ్రీ శంకరాచార్య విరచితమైన 144 శ్లోకముల వేదాంత గ్రంథము. శంకరుల జన్మస్థానము కేరళమునందుఁగల కాలటి. శంకరుఁడు నంబూద్రిబ్రాహ్మణ వంశజుడు. తండ్రి శివగురువు; తల్లి ఆర్యాంబ. శంకరుని కాలనిర్ణయమునందు క్రీ. పూ. 509 నుండి క్రీ. శ. 786 వరకును నున్నటులు ప్రాచ్య, పాశ్చాత్య పండితులందు భేదాభిప్రాయములు గలవు. బౌద్ధమత విధ్వంసకుడును, షణ్మతోద్ధారకుడును నైన శంకరుడు బౌద్ధ మతవ్యాపకులైన అశోక, బుద్ధఘోష, నాగార్జునాదుల కనంతరమునందు నివసించినటులు విశ్వసింపదగియున్నది. క్రీస్తుశకానంతరము కొన్నిశతాబ్దముల యనంతరము నివసించియుండును. శంకరులు 32 ఏండ్లు మాత్రము జీవించినటులు ప్రతీతి గలదు.

అద్వైతమతస్థాపనాచార్యులైన శంకరాచార్యుల నపరశంకరులుగను స్మార్త హిందూ బ్రాహ్మణులు పూజించుదురు. శంకరస్వాములు హిందూమతోద్ధరణము చేసిన మహానుభావుడు. ప్రపంచమునం దవతరించిన మతాచార్యులలో, బుద్ధివైభవమునందును, పాండిత్యమునందును, హేతువాదమునందును శంకరాచార్యుల ప్రతిభ నిరుపమానము. ప్రస్థానత్రయమునకు వ్రాసిన భాష్యములు, వేదవేదాంగశాస్త్ర పురాణేతిహాసములందు, శంకరుల పాండిత్యమును విశదము చేయుచున్నవి.

ఈశాది దశోపనిషద్భాష్యములు, శ్వేతాశ్వతరోపనిషద్భాష్యము, నృసింహపూర్వోత్తరతాపిన్యుపనిషద్భాష్యము, బ్రహ్మసూత్ర శారీరకమీమాంసాభాష్యము, భగవద్గీతా భాష్యము, సనత్సుజాతీయభాష్యము, లలితా త్రిశతి భాష్యము, ఆపస్తంబీయాధ్యాత్మ పటలభాష్యము, విష్ణుసహస్రనామభాష్యము, వివేకచూడామణి, సర్వవేదాంత సిద్ధాంత సారసంగ్రహము, ఉపదేశసాహస్రి, దక్షిణామూర్తిస్తోత్రము, పంచీకరణము, మనీషాపంచకము, భజగోవిందము, స్వాత్మనిరూపణము, ఆనందలహరి, సౌందర్యలహరి, శివానందలహరి, శివ భుజంగస్తోత్రము, అపరోక్షానుభూతి, ప్రపంచసారము, మహావాక్యదర్పణము, శతశ్లోకి, ప్రబోధసుధాకరము, వేదాంతసారము, వేదాంత డిండిమము, కావ్యవృత్తి, ఆత్మబోధము, ఆత్మానాత్మ వివేకము, హరిమీడేస్తుతి, విజ్ఞాననౌక, జీవన్ముక్తానందలహరి, ప్రశ్నోత్తరరత్నమాల, పంచీకరణము, పంచదశీవ్యాఖ్యానము (బ్రహ్మ విద్యావిలాసము), సిద్ధాంత బిందువు (దశశ్లోకి), గాయత్రీభాష్యము, అద్వైతానుభూతి, కౌపీనపంచకము, సాధనపంచకము, నిర్గుణమానస పూజ, భగవన్మానసపూజ, శివాపరాధ క్షమాపణస్తోత్రము, త్రిపుర సుందరీ స్తోత్రము, ఆత్మపూజ, ఆర్తత్రాణ నారాయణాష్టాదశక స్తోత్రము మొదలయిన శంకరాచార్యకృత గ్రంథము లించుమించుగా పెద్దవి,చిన్నవి నూట యేబది వరకును గలవు. భజగోవింద శివానందలహరి మనీషాపంచకాది శ్లోకము లాచార్యస్వాముల ప్రతిభకును అద్వైతసిద్ధికిని నిదర్శనములు.

శ్రీ శంకరాచార్యులు కాంచీపురమునందు "ఓమ్ తత్సత్" నిర్దేశమైన ఇంద్ర సరస్వత్యాచార్య నామమున యోగలింగమును, కామకోటిపీఠమును, శృంగేరియందు "అహం బ్రహ్మాస్మి" నిర్దేశమైన భారతీ మాంతాచార్య నామమున భోగలింగమును, శారదాపీఠమును, బదరికాశ్రమమునందు "అయ మాత్మా బ్రహ్మ" నిర్దేశమైన గిరిస్వామి నామమున ముక్తిలింగమును, పూర్ణగిరిపీఠమును, ద్వారకయందు "తత్త్వమసి" నిర్దేశమైన ఆశ్రమిస్వామి నామమునను కలికపీఠమును, జగన్నాథమునందు "ప్రజ్ఞానం బ్రహ్మ" నిర్దేశమైన అరణ్యస్వామినామమున విమల పీఠమును స్థాపించి మహావాక్యార్థములను నామరూపములను సువ్యక్తము చేసినటులు ప్రతీతి కలదు. శంకరాచార్యులు దేశవ్యాప్తమైన నిగమాగమోక్తాచారపరమైన

పూర్వమీమాంసను ఉత్తర మీమాంసా రూపమునను జ్ఞానపరముచేసి వేదాంతమున కపూర్వమైన పురుషార్థ మును సమకూర్చిన విధమును శంకరాచార్యుల సిద్ధాంత ములు బోధించుచున్నవి.

అపరోక్షానుభూతియందు శంకరప్రతిపాదితమైన అభ్యాససాధ్యమైన వేదాంతసారము గలదు. పరమార్థ పరిజ్ఞానమునకు జిజ్ఞాస పరమసాధనముగ నున్నది. నే నెవడను? ప్రపంచ మెటులు కలిగినది? దాని కర్త యెవరు? ఉపాదానకారణ మేది? అను ప్రశ్నలు విచార మునబడును.

కోఽహం కథ మిదం జాతం
కో వా కర్తాఽస్య విద్యతే,
ఉపాదానం కి మస్తీహ
విచారః సోఽయ మీదృశః.

'అహం' దేహేంద్రియాదులు, భూతాదులు కావను బుద్ధి జ్ఞానమువలన గలుగుచున్నది. తదనంతరము 'అహం' నిత్యమైన యాత్మయని నిశ్చయింపబడుచున్నది.

'నేను' ఏకమును, సూక్ష్మమును, జ్ఞాతమును, సాక్షియును సత్తయును, అవ్యయమునునైన ఆత్మకాని దేహము కాదు.

అహ మేకోఽపి సూక్ష్మం చ
జ్ఞాతా సాక్షీ సదావ్యయః,
త దహం నాత్ర సన్దేహో
విచారః సోఽయ మీదృశః.

ఈ యభ్యాసమువలనను 'అహం' నిత్యమైన బ్రహ్మ పదార్థముగ నేర్పడుచున్నది.

"నేను" శమమును, శాంతమును, సచ్చిదానంద లక్షణమును గలది. నేను నిర్మలుడను, నిశ్చలుడను, అనంతుడను, శుద్ధుడను, అజరుడను, అమరుడనునైన బ్రహ్మమను. అసద్రూపమైన దేహము నేను కాదు. బుధులు దీనినే జ్ఞాన మందురు.

బ్రహ్మైవాహం శమ శ్శాన్తః
సచ్చిదానన్దలక్షణః,

నాహం దేహో హ్యసద్రూపో
జ్ఞాన మిత్యుచ్యతే బుధైః.
నిర్మలో నిశ్చలో ఽనన్తః
శుద్ధో ఽహ మజరో ఽమరః,
నాహం దేహో హ్యసద్రూపో
జ్ఞాన మిత్యుచ్యతే బుధైః.

స్థావరజంగమాత్మకమైన ప్రపంచమున కంతకును ఆత్మధ్యాస గలిగినపుడు దేహధ్యాస పోయి బ్రహ్మధ్యాస గలుగుచున్నది.

స్వర్ణవికారములైన వస్తువులందు నామరూపము లనిత్యములును స్వర్ణత్వము నిత్యమును నైనటులు, బ్రహ్మత్వమునుండి కలిగినవాటికి బ్రహ్మత్వము నిత్యము.

సువర్ణా జ్జాయమానస్య
సువర్ణత్వం చ శాశ్వతమ్,
బ్రహ్మణో జాయమానస్య
బ్రహ్మత్వం చ తథా భవేత్.

బాహ్యసాధనములయిన సకలవృత్తులను విడిచి బ్రహ్మత్వమును పొందుటకు పూర్ణయోగాభ్యాస మవసరము.

భావవృత్తి భావములను, అభావవృత్తి అభావములను కలుగ జేయునటులు బ్రహ్మవృత్తి పూర్ణయోగపరమైన బ్రహ్మత్వమునకు సాధనము.

భావవృత్త్యా హి భావత్వం
శూన్యవృత్త్యా హి శూన్యతా,
బ్రహ్మవృత్త్యా హి పూర్ణత్వం
తథా పూర్ణత్వ మభ్యసేత్.

నిద్రనుండి మేలుకొనిన తరువాతను కలలు లేనటులు, బ్రహ్మజ్ఞానము కలిగిన తరువాత నీ దేహేంద్రియాదు లసత్తగుటవలన ప్రారబ్ధము లేదు.

తత్త్వజ్ఞానోదయా దూర్ధ్వం
ప్రారబ్ధం నైవ, విద్యతే,
దేహాదీనా మసత్త్వా త్తు
యథా స్వప్నో విబోధతః.

దీనియందు 91 నుండి 142 శ్లోకములందు 1. యమము, 2. నియమము, 3. త్యాగము, 4. మౌనము, 5. దేశము, 6. కాలము, 7. ఆసనము, 8. మూలబంధము, 9. దేహసమత్వము, 10. దృష్టిస్థితి, 11. ప్రాణాయామము, 12. ప్రత్యాహారము, 13. ధారణము, 14. ఆత్మధ్యానము, 15. సమాధి అని 15 యోగాంగములును బాహ్యాంగములు గాక అభ్యంతరసాధనములు గావలసిన విధము వ్యక్తము చేయబడినది. త్యాగ లక్షణము పరమార్థమును తెలుపుచున్నది.

త్యాగః ప్రపఞ్చ రూపస్య
చిదాత్మత్వావలోకనాత్,
త్యాగో హి మహతాం పూజ్యః
సద్యో మోక్షమయో యతః.

ప్రపంచ రూపమును విడిచి ఆత్మావలోకనము త్యాగము. అనుసంధానకాలమునందే మోక్షమయ మగుటచే త్యాగము మోక్షమున కుత్తమసాధనము.

ఈ యంగములతో గూడిన రాజయోగము పూర్ణయోగము, మోక్షసాధనము. కర్మపరమును బాహ్యసాధనమునైన హఠయోగాభ్యాసము ప్రారబ్ధమునకు మూలము.

ఏభి రఙ్గైః సమాయుక్తో
రాజయోగ ఉదాహృతః,
కిఞ్చిత్పక్వకషాయాణాం
హఠయోగేన సంయుతం.

బౌద్ధమతవ్యాపనము సంకుచితమైన కర్మకాండను శిథిలము చేసినది. విశ్వవ్యాప్తమైన కర్మము ధర్మస్వరూపమును దాల్చినది. కర్మము, ధర్మము బుద్ధియోగమునందు శరణు పొందినవి. పరిమితమును సాపేక్షమునునైన బుద్ధియోగము, బుద్ధధర్మమును నిరపేక్షమైన ఆత్మధర్మాభ్యుదయమునకు నిరర్థకము చేసినది. మతములు, సంఘారామములు, విహారములు, ధర్మమును బాహ్యసాధనములందు లగ్నము చేసినవి. శంకరాచార్యులు సాపేక్షములైన కర్మయోగమును, సన్న్యాసయోగమును, బుద్ధియోగమును నిరపేక్షమైన ఆత్మయోగమునందు వేదాంత రూపమున సమన్వయము చేసి సనాతనమైన వైదికమతము నుద్ధరించి ఆచార్యపదము నధిష్ఠించెను.

అపరోక్షానుభూతి శంకర ప్రతిపాదితమైన అద్వైత వేదాంతసారము నధ్యాససాధనమునను, తర్క వితర్కములతోను నిమిత్తము లేకుండ సుగమము చేయుచున్నది.

[ఆంధ్రవిజ్ఞానసర్వస్వము, ద్వితీయసంపుటము—1984]

# స్త్రీలు - రంగస్థలము

వర్తమానకాలమున నాటక ప్రపంచమున అలజడి జనించినది. అది స్త్రీలు—రంగస్థలిని గూర్చిన విషయము. ఈ విషయమున ధైర్యముతో శ్రీయుత బళ్ళారి రాఘవాచార్యులుగారు ముందంజవేసిరి. ఇది ధర్మమా, అధర్మమా యని మనవారు తర్జనభర్జన జేయుచున్నారు. స్త్రీలు స్త్రీవేషధారణ జేయవలెనని భరతాచార్యులే జెప్పియున్నారు. శ్రుతిస్మృతులకు ఎవరిష్టము వచ్చిన వారు నర్థముల జెప్పుచున్నారు. నాటక రచన, అభినయము తెలిసిన వెనుకగదా అవి ఎవ రభినయింప వలయునది దెలుపవలసినది! చిత్రకారు డత్యుత్తమమైన చిత్రమును వ్రాయును. శాస్త్రజ్ఞాన మతని కుండనిది ఆ చిత్తరువు శోభాయమానముగా నుండదు. కళలోని కళాభినివేశము దేశమునందు వ్యాపింపవలెను. కళాభివృద్ధి గానిది దేశ మభివృద్ధి గాదు. మనుష్యు డతీతుడు కావలెననిన సుందరకళల నభ్యసించవలెను. ఏదయిన పని గావలెనంటే సుశిక్ష పొందవలెను. దానికి తగిన సామర్థ్య మతని యొద్ద నుండవలెను. లేకపోయిన అతడు ఆధునిక విద్యాభ్యాసమువలె చెడును. వర్తమానకాలమున మనము చేయవలసిన దేమన ఆంధ్రుల కన్నిటియందును అభినివేశముండవలెను. మనకు తగినటుల యింకా కళ అభివృద్ధి కాలేదు. నాటక కళకు పూర్వము గౌరవ ముండెడిదికాదు. ఇప్పుడిప్పుడే కొంచెము గౌరవవంత మగుచున్నది. నా చిన్నతనమున నాటకము జూడబోయినను మా తండ్రిగారు నన్ను దండించెడివారు. మనము మన సంప్రదాయాచారమున కలితముగా నడుచుచున్నారము. రాజమహేంద్రవరములోని చిత్రకళాశాలవారు నూతన ఫక్కి త్రొక్కుచున్నారు. మనము పురాణ నాటకముల నాడుచున్నాము. కొన్ని సమయములందు మనము మన ఆదర్శముల భిన్నము జేయుచున్నాము. మనకు ఆంధ్రత్వము కావలెనంటే స్వకమమైన నాటకరచన గావలె. మన మభివృద్ధి గావలెనంటే నవీన సృష్టికి మనము యిష్టపడవలెను. నవీన భావములు సృష్టించవలసిన యవసరము గలదు. భావవికాసము లేనిది నిత్యజీవనము సుఖప్రదముగ నుండదు. ఆతీరున నాటకరంగములు, కళాభివృద్ధియు గావలెను. స్త్రీలు ఏ తీరున పాల్గొనవలెనో పురుషు లేతీరున మెలంగవలెనో మనము దెలిసికొనవలెను. మన మన్ని విషయములలోను పరాధీనులముగానే యున్నాము. ఈ విషయమున గూడ మనము పూర్వాచారపరాయణులమై యుండుట సమంజసముగాదు. స్త్రీల యాందోళన పూర్తిగా సాగుచున్నది. ఇరువది సంవత్సరములనుండి స్త్రీలు సఫ్రజిస్టు ఆందోళనజేసి విజయులైరి. అట్టి యాందోళనయే మన దేశములో స్త్రీలకు రాజకీయముగా లాభించినది. స్త్రీలోక మీ తీరున నభివృద్ధి నొందుచున్నది. ఒక చోట స్త్రీలు జేసిన యాందోళన యితరచోటులందున్న స్త్రీలకు సహాయభూతమయ్యెను. వారి సహాయము కళాభ్యుదయమున కెటుల సహాయమయ్యెనో గమనింపవలసియున్నది.

నాటకవేషము అస్వాభావికముజేయుట సమంజసము గాదు. స్వాభావికముగా స్త్రీయందు రాజసము, సాత్త్వికము గాన్పించును. పురుషులందు స్వాభావికముగా వేరుగుణము లుండును. అవయవాభివృద్ధిలో తప్ప స్త్రీలు పురుషుని కేగుణమునందును తీసిపోరు. ఈ కళయందు తారీమిస్సాహి ప్రతిభ గాంచిరి. వారికి యెంతో గౌరవము గలదు. వారి గౌరవము మన ప్రవర్తనములో నున్నది. పూర్వమునుండి సంగీతాభినయములకు ఒక సంఘముండెను. ఇప్పుడది విడిచిపెట్టబడి క్రమక్రమముగా వేశ్యలు దేవదాసీలు వారి వృత్తుల విసర్జించుచున్నారు.

రసోదయముజేయు కళను వృద్ధిజేయవలెను. భావాభివృద్ధి కావలెనంటె మన యుపయోగమునకై ఎవరెవరి కే కళయం దభినివేశముగలదో ఆ కళయందు వారిని ప్రవేశపెట్టవలెను. సులోచన మున్నగు విఖ్యాతనటులు నృత్యమునం దనయన విస్ఫురణము గలదని చెప్పిరి. సంగీత సాహిత్యములు దేవత్వ మొసగును. స్త్రీలు నాటకరంగముపై కిప్పుడిప్పుడే వచ్చుచున్నారు. వారిని మనము నిరుత్సాహులజేయుట మంచిదిగాదు.

జ్ఞానేంద్రియముల ద్వారా రసగ్రహణము చేయవలెను. ప్రపంచములో శుద్ధసత్త్వము గాని, శుద్ధచెడు గాని లేదు. దాని మిశ్రమమును మనము జూతుము. ప్రపంచమే మిశ్రమము. శ్రేయస్సు కవి సంకల్పములో నున్నది. స్త్రీలు నాటకరంగస్థలముపై నుండుట కనువగు విధమున నతడు నాటక విరచనకు కడంగవలెను. శ్రేయస్సు చూచువారలలో లేదు. రంగస్థలిపైకి వచ్చిన స్త్రీలు చెడుదు రందురు. అది లాభము లేదు. వారికి స్వేచ్ఛ నొసగి మన మా విషయమును జూడవలెను. ప్రపంచములో నిన్ని నాటకము లెందుకు వ్రాయబడవలె నందురు ? నాటకము లెన్నియైనను వ్రాయబడవచ్చును. ఎవరో కొందరే యెందుకు వ్రాయవలెను ? ఎట్టివిగా నుండినను భయము లేదు. మంచిదే నిలుచును గాని చెడు నిలువదు.

[ఆంధ్ర నాటక కళాపరిషత్తు తృతీయ దిన సమావేశాధ్యక్షోపన్యాసము—1929]

# శ్రీ వేంకటశాస్త్రిగారు

ధన్యమయినది. ఆంధ్రదేశము ధన్యమయినది. జీర్ణప్రాయముగ నుండిన యాంధ్ర కవితా సామ్రాజ్యము నుద్ధరించి దేశము నందు నలుకెలంకుల విజయపతాకలను ప్రతిష్ఠించి, యాంధ్రకవితకు శకపురుషు లనమించిన నిక్కంపు కవిసార్వభౌమునకు, సంకల్పించిన షష్టిపూర్తి మహోత్సవాభ్యర్చనను సర్వలక్షణ సంపన్నముగ, మహా వైభవముతో నిర్వహించి సకలాంధ్రప్రపంచము కృతకృత్యమైనది. శతావధాను లొసరించిన మహోపకృతికిని, వారియందుగల అనూన గురుభక్తికిని ఆంధ్రుల ఈయర్హణ ప్రత్యర్థమై వెలసినది. ఆంధ్ర ప్రపంచ మీతెఱఁగున తన కర్తవ్యమును నిర్వహించి ధన్యత గన్నందుకు విశ్వభారతి సంతసించినది. కామితఫలప్రదాయిని, దేవి, కామేశ్వరి యీ మహనీయునకు ఇతోధికాయురారోగ్యముల నొసంగి, తెలుగు కవితకు మఱింత సొంపుసెంపులను గూర్చునట్లు అను గ్రహించుగాత మని యాశంసనము.

ఈ షష్టిపూర్తి మహోత్సవముతో బాటుగనే, శ్రీ వేంకట శాస్త్రిగారి--కాదు కాదు, తిరుపతి వేంకటకవుల, మాయానేత్రము లకు వీ రొక్కరే సాక్షాత్కరించుచున్నారు — శాశ్వతస్మృతిచిహ్నముగ వీరి రచనల నన్నింటిని సంపుటములుగ ప్రచురించుటకును, ఆంధ్ర విశ్వకళాపరిషత్తున బహుమతి పతకము నేర్పాటు చేయుటకును నిర యింపబడినది. ఇవి రెండును అచిరకాలములోనే వారి శిష్యులు ప్రశిష్యులు, తత్పరంపరలోనివారు, అభిమానులు--ఈ వరుసకు రానివారు నున్న—అందరి యాదరమున రూపుగొని తిరుపతి వేంకట కవుల శాశ్వతస్మృతిచిహ్నమయి వెలయగలదు. ఆంధ్రభారతికి ఈడురాని సేవ సల్పి శాస్త్రిగారు ధన్యులయినారు. అట్టి మహ నీయునకు ఉచిత భక్తిగ పూజగావించి తెలుగు మాగాణము ధన్య మయినది.

ఆంధ్రహృదయమునందును దేశావృతమైన ప్రత్యభిజ్ఞాన ముదయించినది. దేశము నందంతటను దివ్యజ్ఞానము లుత్పన్న ములై ఆత్మసంస్మరణము గలిగినది. జిడ్డు కృష్ణమూర్తిగారి యవతార మాంధ్రుల ప్రత్యభిజ్ఞానమునకు నిదర్శనము. ఆచారావరణ పాశబద్ధమైన హృదయమునందు జ్ఞానకాంతులు ప్రసరించినవి. వసంతమ్మగారిగురుత్వము వసంతోదయము గలుగజేసినది. దేశమునందు సాహిత్యోపాసకులు, కళోపాసకులు, కర్మోపాసకులు, ధర్మోపాసకులు, సంస్కర్తలు, సత్యాగ్రహులు బయలుదేరి ఆంధ్రహృదయావరణ మును వికాసవంతము చేసిరి. ఆంధ్రహృదయాంతరాళమునందు స్తంభితమైన సంభావనాశక్తి, రసగ్రహణశక్తి, ఉత్సాహశీలము బహిర్గతము గుట కుపక్రమించినది. గతకాలోదంత మీ పరిణామమును విశదము చేయుచున్నది. సాహిత్యవికాసమునకు శ్రీ తిరుపతి వేంక టేశ్వర కవులు చేసిన మహోపకారము దేశావృతమైన కావ్యనిర్మాణ ములు విశదము చేయుచున్నవి. గతవారమునందు బందరునందు శ్రీ వేంకట శాస్త్రిగారి షష్టిపూర్తి ఉత్సవసందర్భమునం దాంధ్ర లోకము చూపిన యుత్సాహానందములు వారి యాత్మసంస్మరణము నకు నిదర్శనములు. దేశమునం దుత్పన్నములైన కావ్యములు, కళలు, సంస్కరణమార్గములు, జాతీయసంస్థాపనలు ప్రజాహృదయమునం దుదయించిన ప్రత్యభిజ్ఞానమును వెల్లడిచేయుచున్నవి. ఆత్మవిశ్వాస మునకు సాధనమైన నిర్మాణకార్యవిధానమునం దాంధ్రులు చూపిన శక్త్యుత్సాహములు నిందాస్తోత్రములకు పాలైనను ప్రజాసంకల్ప మునకు నిదర్శనములు. వేంకటశాస్త్రిగా రుపక్రమించిన భావకావ్య ములు పల్లవించి ఫలించి ఆంధ్ర స్వాతంత్ర్య హృదయమునందు ప్రతిబింబించుచున్నవి. సత్యాగ్రహోద్యమ మాంధ్రహృదయమునకు సహజమైన ఆత్మవిశ్వాసమును వికసింపజేసినది. ప్రపంచ పరిణా మమునందు ధర్మప్రతిష్ఠ అదృష్టరూపమునను సకలార్థములను నిర్ణయించి నిరూపించుచున్నది. వర్తమాన సందిగ్ధసమయమునందు ధర్మప్రతిష్ఠ ధర్మరాజమైన అహింసాధారమునను ప్రతిష్ఠితము గావలసియున్నది. శ్రీమతి వసంతమ్మ సంస్మరణము, గాంధిమహాత్ముని వర్ధంత్యుత్సవము, వేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి ఉత్సవము, దేశా వృతమైన ప్రబోధము, ప్రజల యాత్మవిశ్వాసమును సువ్యక్తము చేయుచున్నవి. గాంధిమహాత్ము డుపక్రమించిన త్యాగప్రస్థానము ప్రపంచమునం దపూర్వమైన ధర్మసంచలనమునకు వినియోగపడు చున్నది. ఆంధ్రులును ఈధర్మమహోదయ సమయమునం దాత్మ విశ్వాసమును గలిగి, ఆత్మశక్తి నారాధించి ధర్మనిర్వహణమును జేయుటకు భగవదనుగ్రహము గలుగుగాత!

[భారతి, సాభిప్రాయ విశేషములు - అక్టోబరు, 1933]

# శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు

బ్రహ్మజ్ఞానసమాజము లౌకికవిభూతివ్యామోహబద్ధమైన వర్తమానయుగమునందు ముఖ్యముగాను హిందూస్థానమునం దాంగ్లవిద్యావంతుల లక్ష్యమును హిందూమతోన్ముఖము చేయుటకు వినియోగపడినది. ప్రభుత్వోద్యోగులైన విద్యావంతుల లక్ష్యము హిందూమతమునకు మరలినది. పాశ్చాత్య సంస్కారముగల గురువుల లక్ష్యమును సహజముగను లౌకికవిభూతు లాకర్షించినట్లు ఆధ్యాత్మిక ప్రయోజనము లాకర్షించలేదు. కర్నలు ఆల్కాటు బ్లావెట్స్కీగార లుపక్రమించిన గురుసంప్రదాయపరంపరలు లెడుబీటరు వసంతమ్మగారలకు సంక్రమించినవి. వీరి గురుత్వమునందు బ్రహ్మజ్ఞానమును దివ్యవిభూతులును, మహత్తులును నావరించినవి. సమాజబృందమునందు ప్రసాదస్వీకారము మహత్తులు ప్రబలినవి. అంతరంగిక బృందమునకును సామాన్య సమాజమునకును గురుశిష్యభావములును సమాన సంస్కార లక్ష్యములును దుర్లభములైనవి. పీఠాధిపతులైన గురువులకును, జిజ్ఞాసువులైన శిష్యులకును భావభేదము లుదయించినవి. ప్రాచ్య తారక సంఘమునకు గురువైన కృష్ణమూర్తిగారికి మహత్తులు, పూజాపురస్కారములు, రహస్యములు దుస్సహములైనవి. కృష్ణమూర్తిగారు తారక పీఠాధిపత్యమును పరిత్యజించి గురుపీఠాధిపత్యమును నిరాకరణ చేసిరి. ప్రాచ్యబ్రాహ్మణ సంస్కారము, పాశ్చాత్య విద్యా సంస్కారము కృష్ణమూర్తిగారియందు నవీనరూపమును దాల్చినవి. శ్వేతగురువులకు శిష్యులైన వృద్ధహిందువుల కాత్మవిశ్వాసము లేకను మహిమలు, మంత్రములు, రహస్యదీక్షలు శరణ్యములైనవి.

జ్ఞాన భాస్కరుని సమక్షమున నజ్ఞానమూలమైన రహస్యాచారముల కవకాశములు గలుగజాలవు. కృష్ణమూర్తిగారి జ్ఞానసందేశ మాచారాభిమానాధికారబద్ధమైన వర్తమాన హిందూహృదయమునకు భయభ్రాంతులను గలుగజేసినను, తత్త్వజ్ఞుల కాదరణీయముగ నున్నది. కృష్ణమూర్తిగారు నారిబోధలందు శిష్యుల సంతాపహరణమును జేయుటకు సెమకట్టినను అజ్ఞానాభిమానపరాయణులైన సనాతన ధర్మసంస్కారుల కభిరుచి గలుగకున్నది. శ్రీకృష్ణుడు గీతాశాస్త్రమునందు బోధించిన "ఉద్ధరే దాత్మనాత్మానం" అని ఆత్మోద్ధరణ భావమునే కృష్ణమూర్తిగారు కరమరలను విడిచి బోధించినను ఆదరణమును బడయకున్నది. పూర్ణయోగానందము ననుభవించుటకు గ్రంథములు, తంత్రములు, గురువులు, ఆచారములు, విశ్వాసములు, రహస్యములు సాధనములు గావనియును, ఆత్మోపలబ్ధియే సాధనమనియును కృష్ణమూర్తిగా రాత్మశంఖారావమును పూరించి విశ్వశ్రుతిని మేళగించి చేయుచున్న దివ్యబోధలు జిజ్ఞాసువుల కాదరణయోగ్యములు గాకున్నను విచారయోగ్యములుగనైన నున్నవి.

తత్త్వజ్ఞులను, శాంతిప్రియులను జేసెడి సత్యధర్మ హితోపదేశములు సనాతనాధునాతనాచారాభిమానులకు జిజ్ఞాసకు బదులు కోపావేశములకు మూలము లగుచున్నవి. నిజము తిరస్కారములకు మూలము. స్వభావము, స్వధర్మము, స్వార్థము నిత్యసత్యాశ్రయములు గాక అనిత్యములైన దేశకాల పాత్రాశ్రయములై ప్రజ్ఞావాదపరమైన స్వాభిమానాశ్రయము లగుచున్నవి. స్వాభిమానాశ్రయము నిత్యమైన శాంతిమయమగు జీవనమునకు నభిమానావరణములను గల్పించుచు విశ్వజీవనశక్తుల నవరోధించుచున్నది. అభిమాన మజ్ఞానాస్పదమై జ్ఞానమయమైన పూర్ణజీవనమునకు ప్రతిబంధకముగ నున్నవి. జ్ఞానసందేశము లభిమానావరణములను జ్ఞానాగ్ని మూలమునను దగ్ధముచేయుటకై వెడలి ప్రయత్నములను పండితులును, పామరులును ధర్మవ్యాజమునను ప్రతిఘటించుట యాచారమైనది. అధికారులు ప్రజలను, అగ్రజులు అంత్యజులను, గురువులు శిష్యులను, ధనవంతులు నిర్ధనులను, పండితులు పామరులను, బలవంతులు దుర్బలులను, వృద్ధులు యువకులను స్వార్థమునకై వినియోగించుట ధర్మమైనది. ఈ యాచారధర్మ ప్రతిఘటనము విచిత్రాభిప్రాయములకు మూలమగుచున్న విధమునను జిడ్డు కృష్ణమూర్తిగారు, గాంధిమహాత్ముడు, సోవియటు నాయకులు, కార్మికులు, అవర్ణులు పొందుచున్న నిందాస్తోత్రములు పరమప్రమాణములు.

[భారతి, సాభిప్రాయ విశేషములు—జనవరి, 1933]

# శ్రీ దామెర్ల రామారావుగారు

దైవనిర్ణయములు మానవులకు దుర్గ్రాహ్యములు. అనంతములైన మనోరథములు క్షణకాలమునందు భగ్నము లగుచుండును. ఆశలు నిరాశలగును. భావిపరిస్థితు లంధకారబంధురముగ గనుపడును. కాని జగన్నాటక సూత్రధారుని యాదేశానుసారముగను ప్రపంచప్రవృత్తి యథాప్రకారము సాగుచుండును. వ్యక్తిస్వరూపము లంతర్హితమైనను సంకల్పితభావము భిన్న రూపములను దాల్చి వృద్ధిని బొందుచుండును. సంచితమైన విజ్ఞానమవిచ్ఛిన్నముగను లోకహితార్థము వినియోగపడుచుండును. లోకహితార్థ మవతరించెడి భావపరంపరల వికాసమునం దంతర్హితమైన వ్యక్తిస్వరూప మమరత్వమును బడసి విరాజిల్లుచుండును. జననమరణములు స్వరూపములందు భేదభావమును వ్యక్తముచేసినను స్థిరమైన భావపరంపరలు వ్యక్తిస్వరూపమును స్ఫురింపజేయుచుండును. మానవకల్యాణమున కొక తృణమునైనను సమర్పించిన వ్యక్తు లల్పాయుష్కులైనను కృతార్థులు. ప్రతిభాశాలురైన వ్యక్తులు మృతినొందినను వారి ప్రతిభయందె చిరంజీవత్వమును గలిగియుండి జన్మసాఫల్యమును విశదము చేయుదురు. జగన్నాటక సూత్రధారుని లీలావిలాసములు విషాదపూరితములై సామాన్యదృష్టి కగ్రాహ్యములైనను భగవన్నిర్ణీతమైన లోకకల్యాణమునకు వినియోగపడుచున్నవి.

మాఘమాసపు భారతియందు దామెర్ల రామారావుగారి ఛాయాపటమును ప్రచురించునపుడు పుష్యమాసపు భారతియందు రామారావుగారి మరణసంకీర్తనమును జేయవలసిన యవసర మచింత్యముగ నుండెను. మాఘ శుద్ధ త్రయోదశినాడు (6—2—25) రామారావు స్వర్గస్థులై బంధుమిత్రాదులను కళాభిజ్ఞ బృందమును విచారసాగరమునందు ముంచిరి. అల్పవయస్సునందే రామారావుగారు సువ్యక్తము చేసిన చిత్రకళాప్రావీణ్యము, వారిసౌజన్యము, వారికళారాధన తత్పరత్వము, వారి యకాలమరణము వలనను విచారమును గలుగజేసినవి. పత్రికలయందు వారి యకాలమరణమును దెలుపుచు వ్యాసములు పద్యగీతములు ప్రచురింపబడినవి. వారి నివాసస్థానమైన రాజమహేంద్రవరమునందు స్మరణ చిహ్నమును నెలకొల్పుటకు మహాసభ గావింపబడినది. అల్పవయస్సునందె యన్వర్థముగను కీర్తిశేషులై కళాకోవిదుల మన్ననలకు బాత్రులైన రామారావుగా రాంధ్ర కళాప్రపంచమునకు చిరసంస్మరణీయులుగ నుండగలరు. రాజమహేంద్రవరమునం దేర్పడిన యుపసంఘ ముచితమైన స్మారక చిహ్నము నేర్పరచుటకు దయామయుడైన పరమేశ్వరు డనుగ్రహించుగాత!

రామారావుగారు బొంబయి కలకత్తానగరములందు చిత్రకళాభ్యాసమును జేసినను వారి చిత్రములం దనిర్వచనీయమైన రససౌందర్యము గోచరం బగుచున్నది. పరమేశ్వర స్వరూపము "శివం శాంతం సుందరం" స్వభావములందును స్వరూపములందును ప్రత్యక్షమగుచు మానవులకు దమయం దప్రత్యక్షముగనున్న దైవవిభూతిని ప్రత్యక్షముచేయుచు దుఃఖనివృత్తికిని సుఖప్రాప్తికిని సాధనంబగుచున్నది. పరమేశ్వరుని సచ్చిదానంద స్వభావమును విశ్వరూపములందు కవులు సందర్శించుచు వర్ణించియును, గాయకులు వినుచు పాడియును, చిత్రకారులు చూచుచు చిత్రించియును, తత్త్వజ్ఞులు గనుగొనుచు బోధించియును దుఃఖనివృత్తికిని సుఖప్రాప్తికిని దోడ్పడుచున్నారు. భగవంతుని సౌందర్యవిభూతిని ప్రత్యక్షముచేయుచు నానందరస పరవశత్వమును గలుగచేయుట కాత్మానంద దాయకమైన రూపప్రపంచమును చిత్రకళాభిజ్ఞులు దివ్యరచనలను చిత్రించుచు విశ్వకల్యాణమును జేయుచున్నారు. ప్రాచీ ప్రతీచుల సంసర్గము భారతసంస్కారమున కితరరంగములందువలె చిత్రకళారంగమునందును ప్రతిబంధకముగను బరిణమించినది. ప్రభుత్వాదరణమునకు బాత్రమైన రూపారాధనము వికసించి భారతసంస్కారమునకు సహజమైన భావారాధన మస్తమించినది. చిత్రకళయందు సర్వాంగసౌష్ఠవమునకు ప్రతిభ ప్రబలి భావసౌష్ఠవమునకు ప్రతిభ క్షీణించినది. పాశ్చాత్యపండితులు పాశ్చాత్యదృష్టికి పరిపాటియైన యంగపోషణమును చిత్రకళయం దధికతరముగను వ్యాపింపజేసిరి. సౌందర్యమున కాధారభూతమైన లావణ్యవిన్యాసము క్షీణించి పుష్టివిన్యాసభావము ప్రబలినది. ప్రబోధ సమయమునందు వంగరచనయందు ప్రతిఘటన ముదయించినది. చిత్రకళాభిజ్ఞులు నందలాలు బోసు, అవనీంద్రనాథ ఠాకూరు ప్రభృతులు పుష్టివిన్యాసమునకు పదచ్యుతిని గలుగజేసి లావణ్యవిన్యాసము నధిష్ఠింపజేసిరి. వంగచిత్రవైఖరియందు భావవిన్యాసము ప్రబలినను లావణ్యసౌష్ఠవసంయోగమునందు విచిత్రవైఖరి యేర్పడినది. ఈ వైఖరియందలి గుణదోషముల విషయమునను ఖండనమండనము లెట్లున్నను భారత చిత్రవిన్యాసమునకు ప్రాణకళయైన భావారాధన ముద్ధృతిని బడసినది. రామారావుగారు భారతసంస్కారమునకు పరిపాటియైన భావారాధన విన్యాసము నవలంబించియును రూపవిన్యాసమునందు నియత ముద్ద

రణమార్గము నవలంబించి చిత్రకళా విన్యాసమునందు భారతసంస్కారమునకు సహజమైన యాధ్యాత్మిక స్వభావమును పరిస్ఫుటము చేయుటకు ప్రయత్నించిన విధమును రామారావుగారి చిత్తరువులు విశదము చేయుచున్నవి. రామారావుగారు చిత్రపటములను ప్రత్యక్ష ప్రమాణములను జూచి యారంభమునందు చిత్రించినను కాలక్రమమున నా మార్గమును వదిలి సంకల్పనిర్మాణ విధానము నవలంబించుచుండిరి. రామారావుగా రజంతా చిత్రవిన్యాసమును లక్ష్యమునంగైకొని వారి చిత్రములందలి రూపరేఖాలంకార విధానములం దజంతా విధానము నవలంబించిరి. రామారావుగారి చిత్రము లవయవవిస్ఫురణమును ప్రకటించుచున్నను దివ్యవిభూతులను స్మరింపజేయుచుండును. పరమేశ్వర విభూతులైన శాంత శివ సుందరభావములు చిత్రములందు సహజరీతిని ప్రత్యక్షమగుచుండును. గత సంవత్సరమునందు భారతియందు ప్రచురించిన గౌరీశంకరుల చిత్రమునుజూచినను, ఇతర మానవ దేవతాచిత్రములను జూచినను నీభావము పరిస్ఫుటమగుచున్నది. ఫాల్గుణమాస సంచికయందు ప్రచురించిన అజంతా చిత్రపటము రామారావుగారి లక్ష్యమును విశదము చేయుచున్నది. రామారావుగారు లావణ్యసౌష్ఠవములకును మానవదివ్య విభూతులకును భావరూపములకును సహజమైన సంయోగమును గలుగజేయుటకు యథాశక్తిని చిత్రకళాదేవి నుపాసించి కృతకృత్యులైరి. కళోపాసకులైన రామారావుగారి యకాలమరణము చిత్రకళాభ్యుదయమున కుత్తేజమును గలిగించి రామారావుగారికి సాయుజ్యప్రాప్తి గలుగుటకు భగవంతు డనుగ్రహించుగాత!

[భారతి, సాభిప్రాయ విశేషములు—మార్చి. 1925]

# గాంధిమహాత్ముడు

లోకము నాకర్షించిన రెండవ విషయము గాంధిగారి నిరపరాధ నిరోధక సైన్యము. 1864–వ సం. మొదలు బ్రిటిషు సామ్రాజ్యమునందలి యధినివేశ స్థలములకు హైందవులు కూలి పనులకై నిర్బంధకపద్ధతులకు లోబడి పోవుట యాచారమైనది. నిర్బంధకపద్ధతులకుఁ గట్టుపడి ప్రతియేటను వేలకొలఁది కూలి వాండ్రు పోవుటయును వారచట అష్టకష్టముల ననుభవించుటయును సంభవించుచున్నది. ఇట్టి కష్టములు దక్షిణాఫ్రికాలోని భారతీయుల కధికములైనవి. వానిని నివారించుటకై గాంధిగారు నిరపరాధక నిరోధకసైన్యమును నిర్మించిరి. ఆ సైన్యపరాక్రమము నిర్భేద్యము. స్త్రీలును పురుషులును చిన్నలును పెద్దలును పరమోత్సాహ సంపన్నులై త్యాగవ్రతమును స్వీకరించిరి. మానరక్షణమునకై ధనమును సుఖమును ప్రాణమును సమర్పింప సంసిద్ధులైరి. నిరాయుధులును నిరాహారులును దౌర్జన్యము నెదిరించి విజయము నొందిరి. ఆ విజయము లోకమున కాదర్శప్రాయ మగుచున్నది. విజయమునకు త్యాగము మూలము. పరిత్యాగశీలుర కసాధ్య మసంభవము. శూరులు ధీరులు ధర్మాత్ములు త్యాగాత్ములు. గాంధిగారు త్యాగసంపన్నులు. భారతీయుల మానరక్షణమునకై గాంధిగారు పడిన కష్టములు దుర్భరములు. వారు ధనసౌఖ్యములను గోల్పోయిరి, దారాపుత్రాదుల వియోగమును సహించిరి, కారాగృహవాసమును స్వర్గవాసమువలె స్వీకరించిరి. నాయకుల పరమోత్సాహము సైనికులను సైనికుల పరమోత్సాహము జనులను నావరించుట సహజము. ఒక గాంధిగారి త్యాగ మెంతటి యుత్సాహమును గలిగించినదియు తెలిసియున్నది. ఆ యుత్సాహము నిరపరాధనిరోధక సైన్యమునకేకాక భరతఖండమున కంతకును వ్యాపించినది. జనులు శక్తికొలఁది సోదరభారతీయుల సహాయమునకై తోడ్పడిరి. హైందవ జాతీయ నిర్మాణమునకు దక్షిణాఫ్రికాలోని యాందోళనము దోహదంబు నొసంగి దానిని బలపఱచినది. సుప్రసిద్ధార్య నాయకుల వలె గాంధిగారు పూజ్యులై భారతీయుల హృదయపీఠముల నలంకరింపఁగలరు.

రాజప్రతినిధి శ్రీ హార్డింజి ప్రభువుగారు చూపిన సానుభూతియును సంస్తవనీయము. శ్రీ వారు నిరపరాధనిరోధమును శ్లాఘించి హైందవుల కుత్సాహమును బోథాగారికి సంతాపమును గలిగించిరి. హిందూదేశపరిపాలకుల పట్టుదలయును బ్రిటిషు పరిపాలకుల సానుభూతియును దక్షిణాఫ్రికా సమస్యను నిర్ణయించుటకుఁ దోడ్పడుట సంతృప్తికరము. కాన్పూరునగరములో జరిగిన యల్లరులందుఁ బట్టువడినవారలను మన్నించి హార్డింజి ప్రభువుగారు మహమ్మదీయుల మన్ననలకుఁ బాత్రులయిరి. దేశమంతయును శాంతి గలిగి యొప్పుచున్నది. కాని వంగదేశమునం దపుడపుడు రాజకీయహత్యలు దలచూపుచుండుట సంతాపకరము. ఇట్టిహత్యలు వర్తమానకాలాందోళనమునకు సహజాంగములుగఁ బరిణమించుట కాంత మహిమగ నెంచఁదగియున్నది. వంగయువకుల దౌర్జన్యము నింద్యమే కాని, వారి సేవానిరతియు శ్లాఘ్యము. వఱదలు గలిగినపుడు యువకులు చూపిన సాహసధైర్యములును సేవాపరాయణతయును సర్వజన శ్లాఘనము నొందినవి. పరశుభ్ర దౌర్జన్యఫలమైన స్నేహలతా ప్రాణత్యాగము మూలమూలలను ప్రమోగుచు సంఘమునకు మహోపాదమువలె భయమును గలిగించినది. సంఘాభిమానులీ మహోపద్రవమునుండి సంఘమును గాపాడుటకు యత్నింపవలయును.

[ఉగాది సంచిక ప్రస్తావన. 1914]

## గాంధిమహాత్ముని సంచారము

జాతక కథలు సిద్ధార్థుని విజయయాత్రల నతిరమణీయముగను వివరించుచున్నవి. గౌతమబుద్ధు డేయూరికి బోయినను వేలకు వేలు ప్రజలు శ్రీమంతులు సామాన్యులు, పండితులు పామరులు, బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు మూగుచు బుద్ధదేవుని సందర్శించుచు కృతార్థులైనవిధమును గాంధిమహాత్ముని విజయయాత్రలు సంస్మరింపజేయుచున్నవి. లోకోపకారార్థ మవతరించిన మహానుభావులు, బంధువులు, స్వాములు, గురువులు, దేవులు. దుఃఖభూయిష్ఠమైన సంసారప్రవృత్తియందు దుఃఖోపశమనమునకును సుఖప్రాప్తికిని సాధనంబులను బోధించెడి మహానుభావుడు, ప్రత్యక్షమైన పరదేవత. గౌతమబుద్ధు డనిత్యములైన రాజ్యమును, భార్యాపుత్రాదులను, భాగ్యభోగములను బరిత్యజించి లోకకల్యాణమున కాత్మసమర్పణమును జేసి శాశ్వతానందమును బడసినవిధమునను గాంధిమహాత్ముడు సర్వసంగ పరిత్యాగమునుజేసి లోకహితార్థ మాత్మసమర్పణమునుజేసి లోకారాధ్యతను బడయగలిగెను. గాంధిమహాత్ముడు దేశమును ప్రజలను నావరించిన దుఃఖమును తనదుఃఖమునుగను సంభావించుచు పాపపరిహార్థ మాత్మసమర్పణమును జేయుచు లోకప్రియత్వమును బడయుచున్న విధమును మహాత్ముని దక్షిణదేశ సంచారము విశదము చేసినది. శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమునందు దెలిపినటులు మహాత్ముడు సర్వ్యత్రసమత్వమున్న వహించుచు నిందాస్తోత్రములను

పరిగణింపకను ధర్మారాధనమును జేయుచు లోకోద్ధరణమును జేయుచున్నాడు.

> 'సమోఽహం సర్వ భూతేషు
> న మే ద్వేష్యోస్తి న ప్రియః
> యే భజన్తి తు మాం భక్త్యా
> మయి తే తేషు చాప్యహమ్.'

మహాత్ముడు వారిని సందర్శించిన ప్రజలకు జాతిమత కుల గౌరవ భేదభావములను పాటింపకను స్వధర్మారాధన మార్గమును బోధించి సమత్వసిద్ధిని విశదముచేసెను. మనీషాపంచకమునందు శ్రీ శంకరస్వాములు బోధించిన వేదాంతార్థమును గాంధిమహాత్ము డనుష్ఠించుచు తత్త్వార్థమును నిత్యజీవనమునందు ప్రజలకు సువ్యక్తముచేసి స్వీయమాహాత్మ్యమును విశదముచేసెను. గోపిపాత రాయని ధర్మరాజ్య ప్రాభవము నాకాంక్షించినవారు సయితము సందర్శన సంకీర్తనముచేయుట యవసరంబైనది. శ్రీమంతులు నిరుపేదలు, బ్రాహ్మణులు పంచములు, వృద్ధులు బాలురు, స్త్రీలు పురుషులు, వారి మనోభీష్టములను గాంధి మహాత్మునియందు సందర్శించి యానందపరవశత్వమును బడయగలిగిరి. మమకారాహంకారపరాయణులకు గాంధిమహాత్ముని యుపదేశాచరణములు సంతృప్తిని గలుగజేయకపోయినను ధర్మాత్ములకు పరమానందమును గలుగజేసినవి. గాంధిమహాత్ముని సందర్శించి వారి పవిత్రోపదేశముల విను గంభాగ్యమె భాగ్యము. గతమాసాంతమునం దీభాగ్యమును బడసిన దక్షిణదేశవాసులు ధన్యులు.

## ప్రజాస్వాగతము

వేనవేలు ప్రజలు మహాత్మునకు స్వాగతంబు నొసంగి వారికిగల యవ్యాజభక్తి విశ్వాసములను సహస్రముఖములను విశదముచేసిరి. మహాత్మునకు చెన్నపురినుండి కన్యాకుమారి వరకును ప్రజలు మహోత్సవములను జేసి మంగళహారతులను సమర్పించిరి. ప్రజలు గంటలకొలదికాలము వారిని జూచి యానందించుటకు వేచియుండిరి. తిరువాన్కూరు మహారాణియును ప్రజలును నొసంగిన సత్కారాతిథ్యములు మహాత్ముని ప్రతిభ వృద్ధిని బొందుచున్న విధమును విశదము చేసినవి. చెన్నపురియందలి ప్రజలు చూపిన యుత్సాహమును మహాత్ముని ప్రతిభను విశదము చేసినది. శ్రీ మహారాణి విషయమై మహాత్ముడు 'యంగు ఇండియా' పత్రికయందు వ్రాసిన సంకీర్తనమును శ్రీమంతులు మననము చేయుదురుగాక! చెన్నపురి కార్పొరేషను సమర్పించిన స్వాగతపత్రము మహాత్ముని ప్రతిభాశయమును విశదము చేసినది. పంచములు పంచమోద్ధారకుడనియును, రాజ్యాంగాందోళకులు స్వరాజ్యోద్ధారకుడనియును, స్త్రీలు స్వాతంత్ర్య ధర్మోద్ధారకుడనియును, విద్యార్థులు గురువరేణ్యుడనియును, ప్రజ లవతారపురుషు డనియును, భావించి యారాధించిరి. బుద్ధిజాడ్యముగల యభిమానాంధులు దివ్యప్రభావమును జూడజాలకుండుట వారి ప్రారబ్ధకర్మఫలముగాని ప్రజల యుత్సాహలోపము గాదు. గాంధిమహాత్ము డనవరతము చేసెడి సత్యాహింసాధర్మములు ప్రజాపాలకుల దృష్టి నుచితరీతి నాకర్షించి గాంధిమహాత్ముని సంచారమున కనురూపమైన ఫలమును భగవంతుడు ప్రసాదించుగాక!

## మహాత్ముని యుపదేశములు

విజయమునకు మూలమైన ధర్మసంకల్పము మహాత్ముని యుపదేశములకు మూలబీజము. సకల మతసారమును సనాతనమును నైన 'సత్యాన్నాస్తి పరో ధర్మః' 'సత్యమేవ జయతే నానృతం' ధర్మములను మహాత్ముడు సంపూర్ణమైన జీవనవిధానమునకు సమన్వయము చేయుటకు జేయుచున్న ప్రయత్నములను ప్రపంచదృష్టి నాకర్షించినవి. సత్యవ్రతానుష్ఠానమున కాధారమైన యహింసాధర్మము హింసాపూరితమైన వర్తమాన యుగము నుద్ధరించుట కవసరమైనది. ఆయవసరమున కనురూపముగను భారతసంస్కారమునకు పరిపాటియైన యహింసాధర్మమును పునరుద్ధారణ చేయుటకు గాంధిమహాత్ముడు ఖద్దరు యోగసాధనము నుపదేశించుచున్నాడు. అహింసాయోగాభ్యాసమునకును, మానవధర్మారాధనమునకును, దుఃఖనివృత్తికిని, స్వరాజ్య సంపాదనమునకును ఖద్దరు యోగసాధమును మహాత్ము డుపదేశించుచున్నను, ప్రజలదృష్టి జయజయధ్వానములందు లగ్నమైన విధమునను ఖద్దరునందు లగ్నముగాకుండుట ప్రారబ్ధకర్మఫలముగ నున్నది. గాంధిమహాత్ముడు తన సంచారమునందన్ని సందర్భములందును ఖద్దరు యోగము నుపదేశించెను. మహాత్ముడు తిరిగి రెండుమూడుమాసములకు దక్షిణదేశ సంచారమునుజేయుట కేతెంచుచున్నాడు. అప్పటికైనను మహాత్ముడు ప్రార్థించునటులు ప్రజలు ఖద్దరుధారణమును జేయుచు సత్యాగ్రహదీక్షార్హతను బడయుదురని విశ్వసించుట కవకాశములు గన్పట్టుకున్నవి. సభావేదికలయందు గంభీరోపన్యాసములను జేసెడి నాయకులకే చిత్తశుద్ధి గలుగనపుడు జనసామాన్యమును నిందించుట యనుచితము. ప్రజలు గాంధిమహాత్ముని సందర్శించుటకు జూపిన యుత్సాహమునందొకపాలైనను కార్యాచరణమునందు జూపిన మహాత్ముని సంచారము సార్థకమై భారతమాత ధన్యతను బడయగలదు. ప్రజోత్సాహ మపారముగను వ్యక్తమగుచున్నను నిరంకుశ ప్రభుత్వమునకు ప్రబోధోదయము గలుగకను నధికార దౌర్జన్యము యథేచ్ఛగను నేలుచున్నది. ప్రజలకు గాంధిమహాత్ముడు కోరునటులు ప్రతిఘటన సామర్థ్యము గలుగనంతవరకును భారతమాతకు తరుణోపాయము దుర్లభముగ నున్నది.

[భారతి, సాభిప్రాయ విశేషములు—ఏప్రిల్, 1929]

## మహాత్ముని స్వీయచరిత్రము

మమకారాహంకారభరితమైన ప్రపంచమునందు సత్యాన్వేషణము సత్యవ్రతము దురారాధ్యములు. ఆబాలగోపాలము స్వీయాభిప్రాయములను సమర్థించుటకు విచిత్ర తర్కమును వ్యక్తము చేయుచు తమతప్పులను దాచుచుందురు. మహాత్ములు నిర్భయముగ సత్యము ననువదించుచు కష్టనిష్ఠురములకు లోనయ్యెడివిధమును సత్యవ్రతుల చరితములు విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ముడు ప్రచురించుచున్న స్వీయచరిత్రము జిజ్ఞాసువులకు సత్యాన్వేషణ విధానమునకు సాధనముగ నున్నది. మహాత్ముడాడంబరములు లేక బహిరంగము చేయుచున్న స్వీయచరిత్రాంశములు వారి వినయవిధేయతలను సత్యశీలమును విశదము చేయుచున్నవి. మమకారావరణమును విడిచి ధర్మావరణమును జేరుటకుగల ప్రతిబంధకములను గాంధిగారి స్వీయచరిత్రము తెల్లముచేయుచున్నది. కర్మయోగమును జ్ఞానయోగమును ధర్మక్షేత్రమునందు సమన్వయము సేయగల విధమును మహాత్ముల చరిత్రములు చాటుచున్నవి. సత్యవ్రతారాధనమున కభిమానవిరహితమైన మహాత్యాగము పరమసాధనమని గాంధిగారి చరిత్రము విశదము చేయుచున్నది. త్యాగారాధనము స్వార్థవిరహితమైన సేవావిధానమునందు నిరంతరము గోచరంబగుచుండును. లాభాలాభములను పాటింపక నిష్కామసేవను జేయునపుడు పురుషార్థమును బడయుటకు సకలావస్థలయందును మానవుల కవకాశములు గలవని మహాత్ముని స్వీయచరిత్రాంశములు తెలుపుచున్నవి. నిష్కామసేవనుజేయుటకు పండితులకు—పామరులకు, శ్రీమంతులకు—దరిద్రులకు, యోగులకు—భోగులకు, సాధువులకు—శూరులకు వారి స్థితిగతులకు దగిన యవకాశములు గలవు. ఉన్నయవకాశమును వినియోగించుట వివేకముగాని లేనియవకాశములకు శోచించుట వివేకము గాదు.

గాంధిమహాత్ముడు గత సంవత్సరమునందు దేశసంచారమును విడిచి సబర్మతి సత్యాగ్రహాశ్రమమునందు తంతుకారసంఘాభివృద్ధికి కాలమును వినియోగించెను. దేశమోక్షమునకు రాజ్యాంగాందోళనమే సాధనమని నమ్మెడివారికి మహాత్ముని విశ్రాంతి యసంతృప్తిని గలుగజేసినను స్వయంసహాయ సిద్ధాంతమును నమ్మినవారల కసంతృప్తిని గలుగజేయజాలదు. తాము తరింపక యితరులను తరింపజేయుటకు బూనుకొనుట యనుచితము. గతించిన సంవత్సరమున విశ్రాంతి సమయమునందు గాంధిమహాత్ముడు తంతుకార సంఘాభ్యుదయమునకు తన యావచ్ఛక్తిని వినియోగించెను. గౌహతి కాంగ్రెసు ముగిసినవెంటనే మహాత్ముడు దేశసంచారమున కుపక్రమించి, నిర్మాణకార్యవిధానమును, ముఖ్యముగ ఖద్దరు నిర్మాణమును వ్యాపింపజేయుటకు పాటుపడుచున్న విధమును వారిసంచారము విశదము చేయుచున్నది. వంగ బీహారురాష్ట్రములందును, బీరారు మహారాష్ట్ర దేశములందును వేలకొలది ప్రజలు మహాత్ముని సందర్శించి ఖద్దరు నిధికి కానుకల నర్పించిరి. ప్రజలకు గాంధిమహాత్మునిపైనిగలభక్తి విశ్వాసములు నిలిచియున్న విధమును సుస్వాగతములు, జనసమూహములు విశదముచేయుచున్నవి. గాంధిమహాత్ముని సంస్మరణము, సందర్శనము, స్వరాజ్యలక్ష్యమును ఖద్దరును ప్రజలకు హృద్గతము చేయుచున్నవి. స్వరాజ్యసంపాదనమునకు ప్రజలకృషి సాధనముగాని ప్రభుత్వ కటాక్షము సాధనము గాదు. ప్రజల యుత్సాహము తాత్కాలికముగాక స్థిరతరముగ నుండుటకు జనారాధ్యమైన సులభసాధనము గావలసియున్నది. ఆ సులభసాధనము ఖద్దరు రాటములందు గోచరంబగుచున్నది. ఖద్దరు ధారణము, రాటము స్వరాజ్యచిహ్నములుగ గ్రహింపబడుచున్నవి. ప్రజాసామాన్యమునకు స్వరాజ్య ప్రయోజనము చేతలవలన గ్రాహ్యమైనటులు సిద్ధాంతముల మూలమున గ్రాహ్యము గాజాలదు. తంతుకార సంఘము ఖద్దరు మూలమున ప్రజలయందు స్వరాజ్యలక్ష్యమును వ్యాపింపజేయుచున్న విధమును ఖద్దరు వ్యాపనము తెలుపుచున్నది.

[ఉగాది సంచిక ప్రస్తావన - 1929]

## మహాత్ముని జీవిత సందేశము

సత్యంవద। ధర్మంచర। స్వాధ్యాయాన్మా ప్రమదః। ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః। సత్యాన్న ప్రమదితవ్యం। ధర్మాన్న ప్రమదితవ్యం। కుశలాన్న ప్రమదితవ్యం। భూత్యై న ప్రమదితవ్యం। స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం। దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యం। మాతృదేవో భవ। పితృదేవో భవ। ఆచార్యదేవో భవ। అతిథిదేవో భవ। యాన్యనవద్యాని కర్మాణి। తాని సేవితవ్యాని। నో ఇతరాణి। యాన్యస్మాకగ్ం సుచరితాని, తాని త్వయోపాస్యాని। నో ఇతరాణి॥

యే కే చాస్మచ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః। తేషాం త్వయా౽౽సనేన ప్రశ్వసితవ్యం। శ్రద్ధయా దేయం। అశ్రద్ధయా౽దేయం। శ్రియా దేయం। హ్రియా దేయం। భియా దేయం। సంవిదా దేయం। అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్॥

యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః। యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మకామాస్స్యుః। యథా తే తత్ర వర్తేరన్। తథా తత్ర వర్తేథాః। అథాభ్యాఖ్యాతేషు। యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః। యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మకామాస్స్యుః। యథా తే తేషు వర్తేరన్॥

తథా తేషు వర్తేథాః। ఏష ఆదేశః। ఏష ఉపదేశః। ఏషా వేదోపనిషత్। ఏతదనుశాసనం। ఏవముపాసితవ్యం। ఏవము చైతదుపాస్యం। స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం। తాని త్వయోపాస్యాని విచికిత్సావస్థా తేషు వర్తేరన్॥

ప్రపంచ కల్యాణమునకై మహాత్ములకారణముగను సర్వసంగ పరిత్యాగమును జేయుచు ప్రజారాధనమునకు పాత్రులగుచున్నారు. సామాన్యులకు స్వప్రయోజన పరాయణత్వము సహజమైనటులు మహాత్ములకు పరహిత పరాయణత్వము సహజశీలము. సామాన్యులకు పశుబలము పరిపాటియైనటులు మహాత్ముల కాత్మబలము సహజమగుచున్నది. సామాన్యులకు భోగ సామర్థ్యమైనటులు మహాత్ములకు త్యాగ సామర్థ్య మగుచున్నది. సామాన్యుల కాగ్రహము సహజముగ గలుగునటులు మహాత్ములకు నిగ్రహము సహజముగ గలుగుచున్నది. సామాన్యులకు బాహ్యవిషయములు ప్రమాణమైనటులు మహాత్ముల కాత్మవిషయములు ప్రమాణములగుచున్నవి. ఒకనికి తనలాభము, తనవారి లాభము; రెండవవానికి మానవ లాభము, విశ్వలాభము. సామాన్యుల యాచరణము సంరంభమునకును, మహాత్ముల యాచరణము శాంతికిని సాధనము లగుచున్నవి.

మహాత్ముల యాచరణములు సామాన్యుల కాదర్శములై పురుషార్థసిద్ధికి సాధనము లగుచున్నవి. మహాత్ముల యాచరణములు భిన్నసంస్కారములుగల జనులకు వారు తలచినటులు గోచరంబగుచుండును. దైవసంపన్నులు వారి భక్తులకు వారి కోరికల కనురూపముగను ప్రత్యక్షమగుచు ధర్మాభ్యుదయమును జేయుచున్నారు. శ్రీకృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు మొదలగు దైవసంపన్నులు ధర్మాభ్యుదయమును జేసిన విధమును ప్రపంచ చరిత్ర సహస్రముఖములను చాటుచున్నది. గాంధిమహాత్ముని దివ్య చరిత్రమును ఆ మహనీయుల దివ్యచరిత్రమును సంస్మరింపజేయుచున్నది. తైత్తిరీయోపనిషత్తునందు శిక్షావల్లి తెలుపుచున్న సత్యధర్మాదేశోపదేశానుశాసనములు గాంధిమహాత్ముని గురుత్వమున కనురూపముగ నున్నవి.

గాంధిమహాత్మునకు 60 ఏండ్లు నిండినవి. దేశమునందంతటను అక్టోబరు మాసాదిని జయంత్యుత్సవములు జరుపబడినవి. ఆ యుత్సవములం దన్నిపక్షములవారును, మతములవారును, జాతులవారును గాంధిమహాత్ముని గుణ సంకీర్తనమును జేసిరి. అన్నవస్త్ర దానములను జేసిరి. సభలను, సంకీర్తనలను జేసిరి. గీతములను పాడిరి. బోధనలను జేసిరి. సంచికలను ప్రచురించిరి. ఖద్దరును విక్రయించిరి. ఈ మహోత్సవము లన్నియును ధర్మసంస్మరణమును గలుగజేయుచున్నవి.

గాంధిమహాత్ముడు శ్రీనివాసశాస్త్రి గారికి నైతికచక్రవర్తి; డాక్టరు సుబ్బరాయనుగారికి సంస్కరణప్రియుడు; సత్యమూర్తి గారికి రాజ్యాంగ ధురీణుడు; హోమ్సుగారికి మానవసేవా పరాయణుడు; రోమెయిను రోలెండుగారికి ధర్మమూర్తి; సరోజినిదేవిగారికి త్యాగసంపన్నుడు; లోకమునకు శాంతిదాత; భారతీయుల కవతారమూర్తి. సర్వాత్మస్వరూపుడైన భగవంతు నెవ్వ రేవిధముగ వారాధించెదరో వారల కావిధమున ననుగ్రహించు చున్నాడు.

శ్లో. యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ ! సర్వశః.

గీత. అ. 4., శ్లో. 11.

వర్తమానకాలమునందు లోకమునందంతటను ధర్మఘోష ప్రతిధ్వనిల్లుచున్నది. ఆస్తికులు నాస్తికులు, నిరంకుశాధికారులు స్వరాజ్యకాములు, సంగ్రామకాములు శాంతిప్రియులు, పూర్వాచారప్రియులు సంస్కరణప్రియులు, పండితులు పామరులు ధర్మప్రతిజ్ఞలను జేయుచున్నారు. స్వార్థమునకును పరార్థమునకును, భోగమునకును త్యాగమునకును, దైవసంపదలకును అసుర సంపదలకును ధర్మప్రవచనములను ధర్మరాజులు చేయుచున్నారు. అధికారానధికారులు చేయుచున్న ధర్మప్రవచనములు ప్రజలకు మహాసంభ్రమమును గలుగజేయుచున్నవి. కర్తవ్యము మాత్రము దుర్గ్రాహ్యముగ నున్నది.

రాజ్యాంగ విశారదులు స్వరాజ్యము పరమధర్మమని చాటుచున్నారు. ఆర్థిక విద్వాంసులు భౌతికభాగ్యములు ధర్మార్థము లని నమ్ముచున్నారు. సాంఘికసిద్ధాంతులు సంఘ సంస్కరణము పరమ ప్రయోజనమని ఉద్బోధించుచున్నారు. మత ప్రియులు మత సంరక్షణము పరమార్థమని ఘోషించుచున్నారు. ఆచారప్రియులు పూర్వాచారసంరక్షణమే ప్రధానధర్మమని వాదులాడుచున్నారు. అసుర బలప్రియుల సంగ్రామ సన్నాహములు కల్యాణసాధనములని సమర్థించుచున్నారు. వృత్తమునందలి వలయమునం దన్నిస్థలములును భిన్నమై కేంద్రమునకు సమానదూరమునం దున్నను, కేంద్రమున్మాత్రము స్థిరముగ నున్నది. కేంద్రధర్మాధారములేని ప్రత్యేక ధర్మములు నైమిత్తిక ధర్మములైనను, నిత్యధర్మములు గాజాలవు. వర్తమాన విషాదదశయందు ధర్మసంరంభమునందు సంశయములను దీర్చి నిత్యమైన ధర్మోపదేశములను చేయగల ధర్మాత్ములు ధన్యులు. అట్టి ధర్మాత్ములందు గాంధిమహాత్ముడు లోకాదరణమును బడయుచున్నాడు. వారి లోకాదరణమునకు వారి ఆత్మధర్మారాధనమె మూలముగనున్నది.

ధర్మరాజునకు భీష్ముడుత్తమధర్మ మాత్మధర్మ మను విషయమును విశదము చేసెను.

తే. "విను మనేకవిధంబుగా విస్తరిల్లు
ధర్మములయం దొకండును దలప నిష్ఫ
లంబు లే దాత్మవెూక్షపలంబి యైన
ధర్మ ముత్తమ మండ్రు తత్త్వజ్ఞు లధిప."

గాంధిమహాత్ము డాత్మకథయందు ఆధ్యాత్మిక లక్ష్యముతో జేసిన ధర్మనిర్ణయము భీష్ముడు ధర్మరాజునకు జేసిన ధర్మనిర్ణయమున కనురూపముగ నున్నది.

"నా ప్రయోగములం దాధ్యాత్మికము లనగా నైతికధర్మములు: ధర్మమున కర్థము నీతి: ఆత్మదృష్టితో ఏనీతి పాలింపదగినదో అది ధర్మము.........నేను తటస్థుడనై, అభిమాన రహితుడనై ఈ కథను వ్రాయగలిగితినేని ప్రయోగ మార్గానుగాము లగు నితరుల కిందు దారి బత్తెము దొరకగలదు.

నేను కేవలము సిద్ధాంతములను అనగా తత్త్వములను గూర్చి వ్రాయదలచితినేని ఆత్మకథను వ్రాయను. కాని యీ సిద్ధాంతములనుండి బయలుదేరిన కార్యముల యితిహాసమును వ్రాయగోరుచున్నాను. కావుననే యీ ప్రయత్నమునకు సత్య ప్రయోగమని మారుపే రుంచితిని. ఇందు సత్యముకన్న భిన్నము లనబడు అహింసా బ్రహ్మచర్యాదినియమములును, వీని ప్రయోగములును రాగలవు. కాని సత్యమే నా కన్నిటికన్న దొడ్డది. మఱియు దీనియందు పెక్కువస్తువుల సమావేశము కలదు. అసత్యము స్థూలముగా వాక్సత్యమే కాదు: భావసత్యముకూడ. అసత్యము కేవలము నా కల్పనాగతసత్యమే కాదు: అది స్వతంత్రము, చిరస్థాయి: అనగా సాక్షాత్పరబ్రహ్మము.

వందలు వేలు ప్రమందుదురుగాక! సత్యమునకే సదా జయమగుగాక! అల్పాత్ముల ప్రమాణముచే సత్యముయొక్క ప్రమాణము వీసర వోవకుండుగాక!

నేను నిండు నమ్మికతో ఎవనిని నాయనార్పు నిట్టూర్పుల కేలికగా తలంచుచుంటినో, మఱియు ఎవని యుప్పుగల్లు నేను తినుచుంటి ననుకొనుచుంటినో, అలవానికి నే వింతవలకును దవులనే యుంటినను నీ చింత ప్రతిక్షణము నన్ను తొలుచుచున్నది. దీనికి కారణము వావికారములే యని నాకు దెలియును. కాని వీని వింతవలకు నిర్మూలము చేయజాలకున్నాను."

ఆధ్యాత్మికధర్మము నిత్యమై సకలధర్మముల కాధారభూతముగ నున్నది. సత్యాన్వేషణమునకును, ధర్మాన్వేషణమునకును ఆత్మార్పణము చేయుచున్న గాంధిమహాత్ముని జీవయాత్ర మానవులకు సంకీర్తనయోగ్యముగ నున్నది. జీవయాత్రను సత్యాన్వేషణమునకై ఆహుతిచేయుచున్న మహాత్ముని పావనచరిత్ర మల్పాత్ములకు ధర్మాన్వేషణమునకు సాధనభూతముగ నున్నది.

శ్రీకృష్ణుడు విజయున కాత్మసాక్షాత్కారమునకు కర్మయోగము నుపదేశించెను. బుద్ధభగవానుడు దుఃఖనివృత్తికి విశుద్ధజీవనమును, జీవకారుణ్యమును లోకమున కనుగ్రహించెను. ఏసుక్రీస్తు మానవతరణమునకు ప్రేమతత్త్వమును, త్యాగసాధనమును ప్రసాదించెను. ఆ మహాత్ములు లోకోద్ధరణమును, నాత్మోద్ధరణమును నాత్మధర్మసాధనముననే చేసినవిధముననే గాంధిమహాత్ముడును నాత్మధర్మసాధనమున లోకోద్ధరణమును, నాత్మోద్ధరణమును జేయుచున్నాడు. ప్రపంచము ధర్మముమీద నాధారపడియున్నది.

ధర్మము, భౌతికము, నైతికము, ఆధ్యాత్మికములను రూపములను విశ్వమును ధరించుచున్నది. విశ్వము ధర్మముమీద నాధారపడియున్నది. పాశ్చాత్యదేశములందు భౌతిక ధర్మప్రవృత్తి ప్రవర్ధమానమై ఆధ్యాత్మిక ధర్మప్రవృత్తిని స్తంభింపజేసినది. భారతదేశమున నాధ్యాత్మిక ధర్మప్రవృత్తి నిద్రావస్థపాలై భౌతిక నైతిక ధర్మప్రయోజనములకు నిరుపయోగమైనది. భారతీయుల కాత్మసంస్మరణము దుస్తరమై జాతికధర్మమును దురారాధ్యమైనది. శ్రీకృష్ణు డుపదేశించిన కర్మయోగము, బుద్ధదేవు డుపదేశించిన అహింసాధర్మము భరతవర్షమునకు దూరస్థములైనవి. ధర్మనిరీక్షణము నిత్యమైన ఆధ్యాత్మిక ప్రయోజనములనుండి అనిత్యములైన భౌతికప్రయోజనములకు మరలినది. అనిత్యమైన భౌతికప్రయోజనములను సమకూర్చుటకైనను సంకల్పము, సంస్కారము, సాధనసంపత్తి స్తంభించినవి. స్వల్పప్రయోజనములు మహాఫలములైనవి. సకలవ్యవస్థలందును ఆత్మావలంబన మంతర్ధానమై, పరావలంబనము పరమప్రమాణమైనది.

ఇట్టి విషమదశయందు భారత దేశోద్ధరణమునకు గాంధిమహాత్ముడు కార్యరంగమునందు చేరుట భారతదేశ సౌభాగ్యమునకు శుభచిహ్నముగ నేర్పడినది. విద్యావంతులు, విద్యార్థులు, పండితులు, పామరులు, శ్రీమంతులు సామాన్యులు, స్త్రీలు పురుషులు, బాలురు బాలికలు గాంధిమహాత్ముని యుపదేశముల ననుసరించి ఆత్మపరిశోధనమును జేసికొనుట కుపక్రమించిరి. గాంధిపేరు మూలమూలలను వ్యాపించినది. శ్రీ రామనామ సంస్మరణమువలెనే గాంధినామ సంస్మరణమును ప్రజలు చేయుచున్నారు. గాంధి సంచారములందు లక్షలకొలది ప్రజలు పాదాక్రాంతులై ఖద్దరు నిధికి కానుకలను సమర్పించుచున్నారు. ఆంధ్రదేశ సంచారమునందు ప్రజలు చూపిన భక్త్యుత్సాహములు గాంధిమహాత్ముని మాహాత్మ్యమును సహస్రముఖముల చాటుచున్నవి.

గాంధిమహాత్ముడు వర్తమానయుగమునందు భారత సంస్కారమునకును, విజ్ఞానమునకును అవతారమూర్తియై వెలయుచున్నాడు. గాంధిమహాత్ముడు కర్మయోగి, విరాగి: మహాదాత, యాచకుడు: జ్ఞాని, ఉద్యోగి: నాయకుడు, అనుచరుడు: సత్యవాది, ప్రియవాది: స్వాతంత్ర్యప్రియుడు, నియత కర్మారాధకుడు: ఆంగ్లభాషాపండితుడు, హిందీ ప్రచారకుడు: మానవ సేవకుడు, స్వదేశ వ్రతపరాయణుడు,

కర్మ జ్ఞానసంపన్నుడైన గాంధిమహాత్ముడు కేవలము భారతనాయకుడే గాక లోకనాయకుడు, లోకోత్తరపురుషుడు. హిందువులు, మహమ్మదీయులు క్రైస్తవులు, బౌద్ధులు, పాశ్చాత్యులు, ప్రాచ్యులు మహాత్ముని గుణశీలముల నారాధించుచున్నారు. గాంధిమహాత్ముడు విస్మృహాయస్థితియందు నిద్రించుచున్న భారతీయులను మేల్కొలిపి ఆత్మసహాయమును నేర్పిన మహాయోగి.

ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః.

గీత: అ. 6, శ్లో. 5.

ఆత్మవిశ్వాసమును, ఆత్మసహాయమునే సహాయ నిరాకరణయోగము, సత్యాగ్రహయోగము. సత్యాగ్రహయోగము మహత్తరమైన ఆత్మయోగము. ఇమ్మహాయోగాభ్యాసమును సకలజనులు చేసి కామితార్థములను బడయుటకు రాటము, ఖద్దరు పరమ సాధనములుగ నున్నవి. రాటము దరిద్రనారాయణులకు కామధేనువు. శ్రీమంతులకు యోగచక్రము. రాటమును, ఖద్దరు ధారణమును భారతీయుల కాత్మశక్తిని ప్రసాదించుటకు పరమసాధనములుగ నున్నవి. సర్వజనసౌలభ్యమైన స్వారాజ్యసాధనము నారాధించి గాంధిమహాత్ముని సంకల్పమును సఫలముచేయుట భారతీయులకు పరమధర్మముగ నున్నది. గాంధిమహాత్ముని షష్టిపూర్త్యుత్సవ సమయమునందైనను ఖద్దరు దీక్షను బూనుట గాంధినామసంస్మరణమునకు ప్రయోజనము. కర్మయోగములేని జ్ఞానయోగము జీవయాత్రను జేయుటకైనను ప్రయోజనకరముగాదు. దేహయాత్ర చేయజాలనివా రాత్మయాత్రను చేయజాలరు. ఆత్మయాత్రను జేయుటకై గాంధిమహాత్ముడు పూనిన మహాదీక్షలో శతాంశమైనను భారతీయులు పూనినయెడల ముప్పదికోట్ల భారతీయులకు దుర్లభమైన కార్యము గనబడదు.

భౌతిక బలాభిమానధర్మముల కభ్యస్తమైన లోకమున కాత్మబలమునందు విశ్వాసము గలుగుట దుర్ఘటము. ప్రపంచప్రవృత్తియం దాగ్రహము సులభము, నిగ్రహము దుర్లభము. ప్రవృత్తియందు కర్మ కనురూపమైన ఫలము గలుగుచున్నది. హింసకు ఫలము హింస. ప్రేమకు ఫలము ప్రేమ. ప్రపంచవిలయమునకు మూలమైన హింసాధర్మమును లోక మారాధించి హింసాఫలము ననుభవించుచున్నది. గాంధిమహాత్ముడు త్రికరణశుద్ధిగను అహింసాధర్మము నారాధించుచున్న విధమును వారి జీవయాత్ర విశదము చేయుచున్నది. బుద్ధభగవానుడు 2,500 ఏండ్లకు పూర్వము ప్రసాదించిన యుత్తమధర్మమును గాంధిమహాత్ముడు లోకకల్యాణమునకై పూరించుచున్నాడు. ఆ పవిత్రధర్మవ్యాపనమును జేసి ప్రపంచమునందు శాంతిని స్థాపించుట మహాభాగ్యము. ఇట్టి మహోదయ సమయమునందు జనన మొందుటయును, లోకోత్తరపురుషుడైన గాంధిమహాత్ముని సాంగత్య సంభాషణ సంసేవన లాభములను బడయుటయును, లోకకల్యాణమునకై ఉడుతభక్తిచందాన గాంధిమహాత్ముని దీక్షను సఫలము చేయుటయును మహాభాగ్యముగ నున్నవి. ఈ మహోదయానందము ననుభవించుట కధికారమును బడయుటకు, భారతీయులు ఖద్దరును, సత్యమును అహింసాధర్మమును సేవించుటకు, భగవదనుగ్రహము గలుగుగాత!

ఆ. దంతియడుగులోన దక్కిన జంతుచ
యంబు నడుగు పెల్ల నడగి యుండు
నట్లు ధర్మకోటు లన్నియు లో నగు
నిద్ధ గుణ యహింస కింత నిజము.

సకలధర్మములును అహింసాధర్మమునం దిమిడి యున్నవి. ఒరులు తన కెన్ని చెడుగులను జేసినను నితరులకు చెడుగు జేయకుండుట సగము ధర్మమును. ఇట్టి పరమధర్మమె అహింసాధర్మము. ఈ పరమధర్మ స్వరూపము మహాత్ములకు ప్రత్యక్షమై సామాన్యులకు సులభగ్రాహ్యముగుచున్నది. ఉత్పన్నమైన ఆత్మధర్మమును సుప్రతిష్ఠించి భారతవర్షమును, లోకమును నుద్ధరించుటకు గాంధిమహాత్ముడు చూపుతున్న మహాత్యాగము వారికమరత్వమును గల్పించుచున్నది. ఆత్మమాహాత్మ్యమును ప్రత్యక్షముగ సందర్శించుచున్నవారైనను, ఆత్మప్రపత్తిని బడయుటకు గాంధిమహాత్ము డవలంబించిన దీక్షావిధానము నవలంబించి పురుషార్థమును సార్థకము చేయుదురు గాత! భగవంతు డాత్మబల సంపన్నుడైన గాంధిమహాత్మునకు లోకకల్యాణమునకై ఆయురారోగ్యముల నొసంగి కాపాడుగాత!

[భారతి సాహిత్యాయ విశేషములు—అక్టోబరు, 1929.]

## సత్యాగ్రహ ప్రస్థానము

ప్రపంచచరిత్రయందును, హిందూదేశచరిత్రయందును శుక్లసంవత్సర ఫాల్గున శుద్ధద్వాదశి బుధవారము పర్వదినముగ పరిగణింపబడగలదు. గాంధిమహాత్ము డానాడు ప్రాతఃకాలమునందు సత్యాగ్రహాశ్రమమును వదలి సత్యాగ్రహదళముతో సత్యాగ్రహప్రస్థానము నుపక్రమించెను. గాంధిమహాత్ముడు పూనిన సత్యాగ్రహప్రస్థానము బుద్ధదేవుని సంసార పరిత్యాగమును, శ్రీరాముని వనవాస స్వీకారమును, ధర్మరాజాదుల యరణ్యాజ్ఞాతవాసమును సంస్మరింపజేయుచున్నది. సత్యాగ్రహప్రస్థానారంభమునందు మహాత్ముడు చేసిన హితోపదేశములు లోకమునందలి శాంతికాములకును, స్వాతంత్ర్యప్రియులకును సత్యాన్వేషులకును ధర్మనిర్వాహణ మార్గమును బోధించుచున్నవి. ప్రపంచమునందు ధర్మాధర్మ సంరంభమునందు 'యతో ధర్మ స్తతో జయః' అని గాంధారి దుర్యోధనునకు జేసిన హితోప

దేశము సఫలమగుచున్నది. సుపరిపాలనముకన్నను స్వపరిపాలనము శ్రేష్ఠమని రాజ్యాంగ విశారదు లందఱును అంగీకరించుచున్నారు. పారతంత్ర్యము సకలానర్థములకును మూలమగుచున్నది. భారతీయ సంస్కారమున కపరిచితులైన పాశ్చాత్యాధికారులు భారతీయులకు రాజ్యాంగశిక్షణమునకు గురువులు కాజాలరు. సామ్రాజ్యాభిమానమునకును జాతీయాహంకారమునకును, ప్రభువులైన బ్రిటిషు రాజ్యాధికారులు స్వరాజ్యశిక్షణమునకు గురుత్వము వహించుట కలలోని వార్త. అనుదినమును క్షీణించుచున్న భరతవర్షమునకు స్వరాజ్యావసరమును రాజ్యాంగవేత్త లందఱును అంగీకరించుచున్నారు. దేశమునకు స్వతస్సిద్ధములైన కులభేదములు మతభేదములు జాతిభేదములు స్వరాజ్యసంపాదనమునకును, సత్యాగ్రహప్రస్థానమునకును ప్రతిబంధకములు గాజాలవు. స్వార్థపరులైన నిరంకుశాధికారులవలె, స్వార్థపరాయణులైన భారతీయ నాయకులును పూర్ణ స్వరాజ్యాశయమును సత్యాగ్రహప్రస్థానమును నిందించుటయును నిరసించుటయును సహజము. శౌకతాలీగారి మతాభిమానము, సంఘాభిమానము, వారిని సత్యాగ్రహప్రస్థానమునందు విముఖులను జేయుట సహజము. సత్యాగ్రహప్రస్థానమునకు మూలాధారము ధర్మనిరీక్షణముగాని వ్యక్తుల భేదాభిప్రాయములు గావు. గాంధిమహాత్ముని సత్యాగ్రహప్రస్థానము ప్రపంచదృష్టిని ధర్మనిరీక్షణమునందు లగ్నము చేయుచున్నది. స్వాతంత్ర్యసంపాదనమునకు పశుబలము మూలమను సిద్ధాంతమును నిర్మూలముజేయుటకు మహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానము ధర్మబలమును ప్రతిపాదించుచున్నది. ఖద్దరుబట్టలు, కదుళ్ళు, ఏకులు, స్వరాజ్యసంపాదనము జేయుట హాస్యాస్పదముగ గనుపట్టినను ధర్మబలవిజయము కాలక్రమమున వ్యక్తము కాగలదు. దేశమునందంతటను గాంధిమహాత్మునిపట్ల ప్రజలు చూపుచున్న యాదరగౌరవములు సత్యాగ్రహ విజయమునకు శుభసూచనలుగ నున్నవి.

గాంధిమహాత్ముడు సత్యాగ్రహదళముతో సత్యాగ్రహాశ్రమమును వదలి శాసనోల్లంఘన ప్రస్థానము ప్రారంభించిన శుభదినము లోకమునందంతటను పర్వదినముగ పరిగణింపబడగలదు. అహమదాబాదు పట్టణమునందు వేలమంది ప్రజలు శ్రీరామచంద్రమూర్తి అరణ్యవాసమునకు వెడలి నప్పుడువలెను విచారాక్రాంతులై నాలుగు మైళ్ల దూరమువఱకును గాంధిమహాత్ము ననుసరించిరి. స్థావరమైన సత్యాగ్రహాశ్రమము జంగమాశ్రమముగ మాఱినది. సత్యాగ్రహయాత్ర సత్యాగ్రహ సత్రయాగ రూపమును దాల్చినది. గాంధిమహాత్ముడు సత్యాగ్రహదళముతో విశ్రమించెడి స్థలములు పుణ్యక్షేత్రములై వెలయుచున్నవి. వేలకొలది ప్రజలు మార్గమునందును శిబిరములందును మహాత్ముని సందర్శించి కృతార్థులగుచున్నారు. ప్రజలు కానుకలను మంగళహారతులను సమర్పించుచున్నారు. గ్రామోద్యోగు లుద్యోగములను విసర్జించుచున్నారు. శ్రీరామసంకీర్తనలు, ప్రార్థనలు, గీతాపఠనము ధర్మోపదేశములు నియమములు శాంతి సమరప్రభావమును విశదము చేయుచున్నవి. వందలమంది ప్రజలు సత్యాగ్రహప్రస్థానమునందు జేరుట కుత్సాహము జూపుచున్నారు. దుర్బలుడైన గాంధిమహాత్ముడు 61 వ ఏటను పరమోత్సాహముతో పూర్ణస్వరాజ్య సంపాదనమునకై చేయుచున్న సత్యాగ్రహప్రస్థానము నిరంకుశదుర్గమునందు సయితము సంచలనమును గలుగజేసినది. ప్రపంచదృష్టియంతయును శాంతిసంరంభమున కాదర్శముగనున్న సత్యాగ్రహప్రస్థానమునందు నాయకుడైన గాంధిమహాత్మునియందును లగ్నమగుచున్నది. దేశవ్యవహారము లతివేగముగ నడుచుచున్నవి. డిసెంబరు 31 వ తేదిని లాహోరు కాంగ్రెసు, కాంగ్రెసు లక్ష్యము వెంటనే పూర్ణస్వరాజ్యస్థాపనమని నిర్ణయించినది. జనవరి 26 వ తేదిని దేశమునందంతటను వేనవేలు సభలను జరిపి లక్షలమంది భారతీయులు పూర్ణస్వరాజ్యప్రకటనను జేసిరి. ఫిబ్రవరి మాసాంతమునందు కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘము సత్యాగ్రహప్రస్థానమును నిర్ణయించినది. మాసాంతమునందు గాంధిమహాత్ముడు రాజప్రతినిధి కంత్యసందేశమును బంపి మార్చి 12 వ తేదిని సత్యాగ్రహప్రస్థానము నుపక్రమించెను. ధర్మబలమునకును ఆత్మవిశ్వాసమునకునుగల ప్రతిభను గాంధిమహాత్ముడు భారతీయ సోదరులకును నిరంకుశవర్గమునకును ప్రత్యక్షము చేయగలిగెను. భారతీయులు సందేహవ్యామోహములను విడిచి ఆత్మవిశ్వాసమును గలిగి స్వధర్మారాధనమునుజేసి కృతకృత్యులగుదురు గాక!

[ఉగాది సంచిక ప్రస్తావన—1930.]

## గాంధియుగము

ప్రపంచ వ్యాప్తములైన గాంధిమహాత్ముని 63—వ వర్ధంత్యుత్సవములు గాంధి యుగోదయమును పరిస్ఫుటము చేసినవి. ఆత్మ విస్మరణము చేసిన ప్రపంచమున కాత్మసంస్మరణమును జేసిన మహాత్ముడు నవయుగావతరణమును జేయుచున్న విధము ప్రపంచమునకు విస్మయమును సంభ్రమమును గలుగజేయుచున్నది. ప్రపంచేతిహాసములు దైవబలమును ఘోషించుచున్నను అసురబలము మహాసంభ్రమమును గలుగజేయుచున్నది. ప్రపంచేతిహాసము లనవరతము హిరణ్యాక్ష హిరణ్యకశిపు నృసింహావతారముల నారాధించుచున్నవి. ఆత్మవిజయమును ప్రతిపాదించిన ప్రహ్లాద ధ్రువ బుద్ధదేవ క్రైస్తవాదుల యితిహాసములు విస్మృతములై భౌతికాభిమానము ప్రబలినది. మతసంస్థలు, సాంఘికవ్యవస్థలు, రాజ్యాంగములు, సాహిత్యములు, శాస్త్రములు, కళలు, ధర్మములు భౌతిక సంప్రదాయయుక్తములైనవి. మానవలక్ష్యము నిత్యమైన ధర్మమునందును సత్యమునందును సంకుచితములై అనిత్యములైన భౌతిక సంపదలందు విశ్వవ్యాపకమును గాంచినది. సర్వసంహారమును జేసిన

ఐరోపామహాసంగ్రామానంతరమునందు ప్రపంచమునకు ధర్మసంస్మరణమును, ఆత్మవిశ్వాసమును గలుగలేదు. దైవదత్తములైన మహాశక్తులు సుందోపసుందోపాఖ్యానమువలె నాత్మవినాశనమునకు వినియోగపడుచున్నవి. ప్రపంచవ్యాప్తమైన ప్రళయావస్థయం దాత్మవిశ్వాసము జాతులకును, సంఘములకును, వ్యక్తులకును, దుర్లభముగ నున్నది. పాశ్చాత్యసంస్కారము భారతీయ సంస్కారమును సకలావరణములందును స్తంభనము చేసినది. చైతన్యమయమైన భారతీయ సంస్కారము జడప్రాయమైనది. పారతంత్ర్యము, సర్వదారిద్ర్యము బాహ్యాభ్యంతరయోగములను దుర్లభము చేసినది. భారతీయులకు భుక్తియును, ముక్తియును దుర్లభములైనవి. ఆత్మవిశ్వాస మంతరించి విధిబలము సకలవ్యవస్థలందును వేదవాక్యమైనవి. ఆత్మయందు విశ్వమును, విశ్వమునందు విశ్వేశ్వరుని, విశ్వేశ్వరునందు లీలాప్రపంచమును సందర్శించిన మహర్షుల సంతాన మిపుడు మాయాప్రలోభహతమై, ఆత్మోద్ధరణమునకును, ప్రపంచోద్ధరణమునకును నిరుపయోగముగా నున్నది. సమ్మోహావస్థయందు మునిగియున్న భారత సంతానమునకును ప్రపంచమునకును నాత్మసంస్మరణము చేసిన గాంధిమహాత్ముని వర్ధంత్యుత్సవములు దుఃఖమయమైన లోకమునకు బ్రహ్మానందదాయకములైనవి.

యుగాంతము నావరించిన మహాప్రళయావస్థ యుపశమించుట కాత్మసంస్మరణ మత్యంతావసరమైనది. పాశ్చాత్యశాస్త్రపరిశోధనలు సుఖరూపములైనను దుఃఖదాయకంబులుగను నున్నవి. రాజ్యాదాయము మారణసాధనములకును, ప్రజాదాయము మద్యపానమునకును నిరంతరభోగారాధనమునకును వినియోగపడునపుడు రాజ్యములును, సంఘములును, వ్యక్తులును నిత్యమైన ధర్మాధారరహితములై వినాశమును బొందుట ప్రకృతి ధర్మము. ప్రపంచేతిహాసములును, ప్రవృత్తియును నిట్టి మహాదృశ్యములలో నిండియున్నను పాశ్చాత్యపండితులకును, రాజ్యతంత్రజ్ఞులకును జ్ఞానోదయము గలుగకుండుట దురదృష్టము. పాశ్చాత్యరాజ్యములు స్వయముగ నాత్మహత్యను జేసికొనుట పాశ్చాత్యసంస్కారమునకు సహజఫలమైనను నిర్బంధముగను ప్రాచ్యరాజ్యముల కాత్మహత్యను చేయుట యధర్మము. ప్రకృతిసిద్ధములైన సుఖదాయకములైన భౌతికసంపదలతో లోకము నిండియున్నను కృత్రిమసంపదలను గల్పించుకొని ఆత్మనాశనమునకు బూనుకొనుట ప్రపంచము నావరించిన దురదృష్టము. విశ్వధారణమునకును పురుషార్థమునకువలెను మూలాధారము శాంతియును ధర్మమును గాని సంక్షోభమును నర్థకామములును గావు. విశ్వమంతయు ననంతముఖములను బోధించుచున్న యీ పరమార్థము కృత్రిమరూపములను దాల్చి పరమానర్థములకు మూలముగనున్నది.

వివిధమతములవారును వారి మతధర్మములను మతాచార్యులు ప్రతిపాదించిన నిత్యమైన ఆత్మధర్మార్థము వినియోగించకను నశ్వరములైన భౌతిక ప్రయోజనములకై వినియోగించుచు సంక్షోభాంకురములను నభివృద్ధి జేయుచున్న విధము భయంకరముగ నున్నది. జాతీయాహంకారము, మతాహంకారము, ధనాంధకారము, కులాభిమానము, విద్యాభిమానము, దేశాభిమానము మానవలక్ష్యము ననిత్యములైన బాహ్యప్రయోజనములకు వినియోగపడు నటులు నిత్యమైన ఆభ్యంతర ప్రయోజనములకు వినియోగపడకున్నవి. అభిమానారాధన మాత్మవిస్మరణమునకును పరపీడనమునకును వినియోగపడుచు మహాసంక్షోభమునకు సాధనం బగుచున్నది. ఈ మహాసంక్షోభమయమైన ప్రళయావస్థ ననుభవించుచున్న ప్రపంచమునందు శాంతిస్థాపనమునకై ఆత్మశక్తిని, ఆత్మధర్మమును ప్రపంచమునకు వ్యక్తముచేయుట కవతరించిన గాంధిమహాత్ముని వర్ధంత్యుత్సవములు జాతిమతకుల దశాభేదములు లేకను సకలజనులకును నాచరణయోగ్యములుగ నున్నవి. గాంధిమహాత్ముడాత్మసంయమయోగమును కర్మయోగమును అహింసాధర్మమునం దేకస్థాయియందు విశ్వశ్రుతియందు సమ్మేళనమును జేసి ఆత్మోన్నలబ్ధిని బొందగలవిధమును వారి పవిత్ర జీవయాత్రయందు లోకమునకు పరిస్ఫుటము చేయుచు లోకమునకు మార్గదర్శకులై ధన్యవాదములకు పాత్రులుగ నున్నారు.

## గాంధియుగధర్మము

శ్రీ కృష్ణపరమాత్ముడు కురుక్షేత్రమునందు విజయున కాత్మవిజయమునకు జేసిన ధర్మోపదేశమువలె గాంధిమహాత్ముడు భారతీయుల కాత్మవిజయమునకు జేయుచున్నాడు. గోపాలనందనుడు గీతామృతము నను గ్రహించుటకు విజయుడు నిమిత్తమాత్రుడైనటులు గాంధిమహాత్ముడు లోకమునకు సత్యాగ్రహము ననుగ్రహించుటకు భారతీయ పూర్ణ స్వరాజ్యమును నిమిత్తకారణముగ నున్నది. పురుషసూక్తప్రతిపాదితమైన ఆత్మసంస్కారమునకు సంతానమైన భారతీయులు సత్యాగ్రహ సంస్కారమును నారాధించుటకును నుపదేశించుటకును నధికారులుగ నున్నారు. గత సంవత్సరమునందు సత్యాగ్రహ సమరమునందు బాలబాలికలు, యువతీయువకులు, వృద్ధులు, పామరపండితులు, సామాన్యసంపన్నులు బలిదానము చేసిన విధ మాత్మవిజయమును పరిస్ఫుటము చేసినది. వేలకొలది శాంతిసైనికులు ఖద్దరు దీక్షావస్త్రధారులై నిర్బంధమందిరములందు కల్యాణమందిరములందువలె నాత్మానందము ననుభవించిరి. భారతీయాత్మవిజయమునకై ప్రాణమానధనములను సమర్పించిన యపూర్వేతిహాసము పాశ్చాత్యసంస్కారులకు భయసంభ్రమములను గలుగజేసి జిజ్ఞాసకు గారణంబైనది. ఈ జిజ్ఞాస గాంధి—ఇర్విను

కంథికిని, గాంధి విజయధ్యానములకును, గాంధిజయంత్యుత్సవములకును మూలముగ నున్నది. గాంధివారము భరతవర్షమునే కాకను ప్రపంచము నంతను గాంధిధర్మమయము చేసినది. ఆసేతుహిమాచలమును పర్యస్తములైన మహోత్సవములు, నగరసంకీర్తనములు, భజనలు, అన్నదానములు, అర్చనాభిషేకములు, సభలు, సంబోధనలు, ప్రతిజ్ఞలు, మహాపంచలనములు భారతీయుల కాత్మసంస్మరణము గలిగిన విధమునకు నిదర్శనములు. భారతీయులకు గలిగిన యాత్మసంస్మరణము ప్రపంచమున కంతకును నాత్మసంస్మరణమును గలుగజేయుటకు సాధనముగ నున్నది. గాంధిమహాత్ముని ఆత్మశక్తి క్రైస్తవమత గురువులకును, రాజ్యాంగపండితులకును నాత్మపరీక్షకు సాధనం బగుచున్నది. అసురసంపదారాధనయందు లగ్నమై తరణోపాయమును గానలేకను పరితపించుచున్న ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచముల కాళాకాంతులు గోచరంబగుచున్నవి. ఆంగ్లరాజ్యతంత్రజ్ఞులు గాంధిమహాత్ముడు బ్రిటీషురాజ్యమున కవతరించిన పరమశత్రువని నిందించినను మతగురువులు శాంతిస్థాపనమున కవతరించిన ఏసుక్రీస్తని శ్లాఘించుచున్నారు. భరతవర్షమునందువలెనే గ్రేటుబ్రిటనునందును లక్షలకొలది ప్రజలు గాంధి సందర్శనమును జేయుచు కృతార్థులగుచున్నారు. గాంధి వర్ధంత్యుత్సవములు పురుషసూక్త ప్రతిపాదితమైన ఆత్మస్వరూపమును, ఆత్మశక్తిని భారతీయులకు సంస్మరింపజేసినవి. భారతీయులు చిరకాలము విస్మరించిన యాత్మశక్తి నుద్ధరించి పూర్ణస్వరాజ్యమును, లోకశాంతిని బడయుటకు భగవంతు డనుగ్రహించుగాక!

## ఆత్మశక్తి

ప్రపంచ వృత్తియందు సకలశుభములను బడయుటకును స్వీయశరణము మూలాధారముగ నున్నది. "స్వయం తీర్ణః పరాం తారయతి" యను ధర్మము సర్వత్ర చెల్లుచున్నది. దుర్బలమైన పారతంత్ర్యబాధయందు మునిగియున్న భరతవర్షమునకు జీవయాత్ర నియతము దుర్లభముగనున్న విధమును రాజ్యాంగములు, వ్యాపార వాణిజ్యములు, ఆర్థికనిర్ణయములు, సామాన్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. లండనునందు రౌండుటేబిలు సమావేశము నందును, సిమ్లాయందు సామ్రాజ్యశాసనసభయందును, ఇతరరాజ్యాంగములందును మాటలయందును వాదనలయందును గల పటుత్వము కార్యములందు లేదని నిత్యానుభవము సువ్యక్తము చేయుచున్నది. గర్భదరిద్రమునందు మునిగి పన్నులభారముక్రిందను క్రుంగి నాశనమగుచున్న దేశమునందు క్రొత్తపన్నులను వేయుటయును, భాగ్యస్థితికి లక్ష్యమైన బంగారు వెండి ప్రచారమునకు ప్రతిబంధకములను గల్పించుటయును, వాగ్బంధనము చేయుటయును బ్రిటీషుపరిపాలనము గలుగజేయుచున్న జడత్వమునకు నిదర్శనములుగ నున్నవి. గ్రేటుబ్రిటనునందు జరుగుచున్న రాజ్యాంగార్థిక సంక్షోభము పాశ్చాత్య సంస్కారము గలుగజేసిన మహాసంక్షోభమును, ప్రపంచశాంతికిని స్వరాజ్యప్రాప్తికిని నారాధనయోగ్యమైన నవధర్మ స్థాపనారాధనావశ్యకమును విశదము చేయుచున్నవి.

లోకకల్యాణమునకును భారతీయ స్వరాజ్యప్రాప్తికిని సత్యాగ్రహధర్మమును ప్రతిపాదించి ఆ ధర్మమును నిత్యజీవనమునందు సార్థకము చేయుచున్న గాంధిమహాత్ముని పవిత్రమైన జీవిత విధానము భారతీయులకువలెను సకలజనులకును నారాధనయోగ్యముగ నున్నది. సత్యాగ్రహమున కాత్మశక్తిపరములైన సత్యము, నిగ్రహము, అహింసాదిధర్మములు విజయమును బొందగల విధమును గాంధిమహాత్ముని దిగ్విజయము లోకమునకు పురుషసూక్తమువలెను పరిస్ఫుటము చేయుచున్నది. ఆత్మవిజయమును భారతసంస్కరణము వేలయేండ్ల క్రితమునవె గీతార్థమునందును పరిస్ఫుటము చేసినది. ఆత్మవిజయమును, ప్రపంచకల్యాణమును అనాసక్తయోగరూపమునను నిత్యజీవయాత్రరూపమునను ప్రత్యక్షముచేయుచు భారతీయులకును ప్రపంచమునకును నాత్మశక్తిప్రభావమును సవగాహనము చేయబూనిన గాంధిమహాత్ముని సంకల్పమును సార్థకము చేయుటకు విజయుని సంతతియులైన భారతీయులు కర్మయోగపరాయణులై ఆత్మవిజయమును స్థాపించెదరు గాక!

శ్లో. నష్టో మోహః స్మృతి ర్లబ్ధా
త్వ త్ప్రసాదా న్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గత సందేహః
కరిష్యే వచనం తవ.

[భారతి సాభిప్రాయ విశేషములు—అక్టోబరు, 1931]

## సత్యాగ్రహాశ్రమ విచ్ఛేదము

ఓ ధర్మమా! నీ మహిమ విచిత్రము. నీ సందర్శనమునకు సబర్మతి సత్యాగ్రహాశ్రమనివాసము సాధనమో, సబర్మతి జెయిలు నివాసము సాధనమో సామాన్యులకు తెలియకున్నది. ప్రవృత్తియందు భోగత్యాగములకుగల సంరంభము ధర్మసంస్థాపనమున వినియోగపడుటయును, విచిత్రముగ నున్నది. సుఖప్రాప్తియును, దుఃఖనివృత్తియును జీవయాత్రకు సహజములైనను పరమార్థములు గావు. ధర్మనిర్వహణమునందు దుఃఖానుభవమును సుఖనివృత్తియును పరమార్థములుగ గనుపడుచున్నవి. సుఖదుఃఖములు జీవయాత్రయందు ధర్మనిర్వహణమునను సమానార్థకములు. గాంధిమహాత్ముడు ధర్మనిర్వహణమునకై సబర్మతి సత్యాగ్రహాశ్రమమును పరిత్యాగము చేసిన మహాత్యాగోదంతము ప్రపంచేతిహాసమునం దపూర్వముగ నున్నది. సత్యాగ్రహ పరిత్యాగము గాంధిమహాత్మునకు గలుగజేసిన హృదయసంతాపమును గాంధిమహాత్ముని దివ్యవాక్యములు వ్యక్తము చేయుచున్నవి:—

"1915 సం. హిందూదేశమునకు వచ్చిన క్రొత్తలో సత్యాగ్రహ ఆశ్రమము నిర్మించితిని. సత్యాన్వేషణమే ఆశ్రమ— ఆదర్శము. ఆశ్రమవాసులందరు సత్యము, అహింస, బ్రహ్మచర్యము, జిహ్వాచాపల్యమును స్వాధీనపఱచుకొనుట, దరిద్రనారాయణసేవ, ధైర్యసాహసములు, అస్పృశ్యతా నిర్మూలన ప్రచారము, స్వదేశి (ముఖ్యముగా ఖద్దరు) మున్నగు ఆదర్శముల నన్నింటిని మతాచారముగ పాటించి, ఉదర పోషణము చేసుకొందురు. ఆశ్రమ స్థలమును 1916 సం. లో కొంటిని. పనుల నన్నిటిని ఆశ్రమవాసులే చేసుకొనుచున్నారు. ఖద్దరు, పశుపోషణ పరిజ్ఞానము, శాస్త్రరీత్యా పారిశుధ్యము చేయుట, విద్యాభ్యాసము మున్నగునవి ఆశ్రమవాసులు నేర్చుకొనునవి. ఆశ్రమములో 107 మంది ప్రస్తుతము గలరు. (పురుషులు 27, స్త్రీలు 31, బాలురు 12, బాలికలు 22.) ప్రస్తుతము చెరసాలలోనున్నవారిసంఖ్య యిందు చేర్పలేదు. ఆశ్రమము వెలుపల పనిచేయుచున్నవారి సంఖ్యగూడ యిందు చేర్పలేదు. ఇప్పటివరకు ఖద్దరు, సత్యాశ్రమలో 1000 మంది తయారైరి. వీరందరు నాకు తెలిసినంతవరకు ప్రజానిర్మాణ కార్యక్రమ నిమగ్నులై యుండిరి. ఆశ్రమము రిజిస్టరైనది. ట్రస్టునందు సక్రమముగానే యున్నది. మిత్రులనుండి విరాళములను స్వీకరించుచున్నాము. ఇది కేవలము విద్యావ్యాపకమునకే వినియోగపడుచున్నది. జీతము లేకపోవుటయేగాక, విద్యార్థులకు భోజనము పెట్టి, కట్టుగుడ్డలనుగూడ యిచ్చుచున్నారు. ఆశ్రమ స్థిరాస్తి రు. 3,50,000. చరాస్తి రు 3,00,000 ఆశ్రమము రాజకీయమునందు పాల్గొనుట లేదు.

సత్యాగ్రహోద్యమమునకు జనకుడనగు నేను అత్యధిక త్యాగము చేయవలసిన ఆవశ్యకత యిపుడు కల్గినది. ఏది నాకు ప్రియాతిప్రియమో, ప్రాణసమమో, దేని నేర్పఱచుటకు 18 సం. నుండి నేనును, ఆశ్రమవాసులును, నిరుపమానశక్తుల వినియోగించి పనిచేసితిమో అట్టి ఆశ్రమమునే నే నిపుడు త్యాగము చేయుచున్నాను. ఈ ఆశ్రమమునకు సంబంధించిన ప్రతి పక్షి, పశువులలో ప్రత్యేక పవిత్ర చరిత్ర గలదు. ఈ ఆశ్రమమునకు సంబంధించిన వస్తువులన్నియు ఒక గొప్ప కుటుంబమునకు చెందినవే. వెనుక పనికిమాలిన బీడుగానున్న ప్రదేశము, మనుష్యుల కృషివలన ఒక పెద్ద ఆరామ క్షేత్రమైనది. ఇట్టి ఆశ్రమము చిల్చివేసి యిచట జరుగుచున్న పలువిధములగు కార్యములను విరమింపవలసి వచ్చినప్పుడు మేము అశ్రుజలపూరిత నేత్రులము కాకుండ మండజాలము. దీనినిగూర్చి ఆశ్రమవాసులగు స్త్రీపురుషులతో చాలాసార్లు సంభాషించితిని. ప్రస్తుతము దీనిని విరమించుటకు వారందరు సమ్మతించిరి.

సత్యాగ్రహమింతలో ముగియునటుల లేదు. అందువలన కాని ఫలితముల నన్నిటిని అనుభవింపవలసి యుండునని ఊహింపక తప్పదు. ఈ కారణమున ఆశ్రమమును విరమింప నిశ్చయించితిమి. కాని ఆశ్రమము సొత్తంతయు ప్రజాహితమునకే వినియోగింపవలెనని మాకోరిక. నగదును, చరాస్తుల నన్నిటినిగాని కొన్నిటినిగాని వశపఱచుకొన గోరినయెడల వాటిని నేను ప్రజాలాభమునకు నా సూచనల ప్రకారము వినియోగింపబూనిన మిత్రులకు వశపఱుపగోరెదము."

సత్యాగ్రహాశ్రమమును విచ్ఛేదము చేయుటయందు మహాత్మునకు గలిగిన హృదయ సంతాపమును, పూర్వోదాహృతములైన సత్యవాక్యములు సకలజనులకును పరమ విచారమును గలుగజేయుచున్నవి. పదునెనిమిదేండ్లు శ్రమపడి పోషించి పెంచిన యాశ్రమమును నిర్మూలము చేయుట సామాన్యులకు సాధ్యముగాని విషయము. ప్రాణసమానమయినదైనను నిస్సంగత్వమును నిస్పృహయును దేహధారులకు దుర్లభము. సన్న్యాసాశ్రమమును స్వీకరించియును మహాశ్రమములను నిర్మించి మమకారము బూనుట ప్రపంచమునందు పరిపాటియైన విషయము. సత్యాగ్రహమునకై వినియోగపడని సత్యాగ్రహాశ్రమనిర్వహణము సత్యాగ్రహనాయకుడైన గాంధిమహాత్మునకు నిరర్థకమేకాకను దురారాధ్యమును.

సత్యవ్రతపరాయణుడైన మహాత్మునకు సత్యధర్మ నిర్వహణమునకు సంసారము, ఉద్యమములు, ఆశ్రమములు సాధనములు కాని పరమార్థములు గావు. సామాన్యులకు సాధనములు గ్రాహ్యమైనటులు సాధ్యములు గ్రాహ్యములు గావు. సాధ్యములకు నిరర్థకములైన సాధనములను విసర్జించుట మహాత్ములకు సులభము. మహోపాఖ్యానములను సత్యవ్రతారాధించుటకు ప్రతిబంధకములను నిగ్రహించుట మహాత్ములకు పరమార్థము. సత్యాగ్రహ నిర్వహణమునకు ప్రతిబంధకమైన సత్యాగ్రహాశ్రమమును విచ్ఛేదము చేయుటయందు గాంధిమహాత్ము డవలంబించిన త్యాగ వ్రతానుష్ఠానము ప్రపంచమునందంతటను భయసంభ్రమములను గలుగజేసినది.

* * *

గాంధి మహాత్ముని సత్యాగ్రహాశ్రమత్యాగము బుద్ధదేవుని రాజ్య సంసారత్యాగమును విస్మరింప జేయుచున్నది. గౌతమబుద్ధుడు దుఃఖనివృత్తికిని, ఆత్మోపలబ్ధికిని సంసారమును, రాజ్యమును విసర్జించెను. గాంధిమహాత్ముడు సత్యవ్రతపరాయణమైన ధర్మ నిర్వహణార్థము శ్రమపడి పోషించి పెంచిన సత్యాగ్రహాశ్రమమును తృణప్రాయముగను విధ్వంసము చేయుట త్యాగోదంతములందు దివ్యోదంతము. వర్తమాన సమయమునందు సత్యాగ్రహోద్యమమునందు సత్యాగ్రహాశ్రమ పరిత్యాగము విషాదాధ్యాయముగను గోచరం బగుచున్నను కాలాంతరమునను దివ్యాధ్యాయముగను వెలయుగలదు. సత్య నిర్వహణమునకై సోక్రెటీసు విషపానముచేసిన ఇతిహాసమునవలెను,

మానవ పాపక్షయమునకై ఏసుక్రీస్తు శిలువను ధరించిన యటి పోలిన రీతిని గాంధిమహాత్ముని త్యాగమును కాలాంతరమునందు ధర్మేతిహాసమునందు పరంజ్యోతివలెను ప్రకాశింపగలదు.

* * *

ఏసుక్రీస్తు అశ్వశాలయందు పుట్టినరీతిని ధర్మము నిర్బంధాశ్రమములందు, బీభత్సపరిస్థితులందు తేజోవంతమగుచున్నది. పంచమహాపాతకులకును వాసస్థలములైన చెరసాలలు మహాత్ములకు నిర్బంధవాసస్థలములగుట ప్రపంచావృతమైన దురదృష్టము. అనిత్యమైన బాహుబలమునకుగల ప్రతిష్ఠ రాజ్యాంగములం దాది కాలమునుండియును నిత్యమైన ధర్మబలమునకు గలుగకున్నది. రోమక సామ్రాజ్యము క్రీస్తుమత విధ్వంసనమున కుపయోగించిన పశుబల ప్రయోగమునే వర్తమానకాలమునందు 1933 సంవత్సరముల యనంతరము రాజ్యాంగములు వినియోగించుచున్నవి. శిక్షాస్మృతియందు సత్యసంకల్పములును, ధర్మనిర్ణయములును దండనార్హము లగుచున్నవి. సత్యసంహారమునకును, ధర్మోద్ధారణమునకును నధికారముచేసెడి ప్రయత్నము లసహ్యములైనను సద్వినియోగము లగుచున్నవి. అధికార భయావృతమైన ప్రపంచపరిస్థితులందు ధర్మాభయములను స్థాపించుటకు ప్రపంచ మనుభవించిన దుఃఖవేదనను ఘోరసంగ్రామములు, మతకలహములు, సాంఘిక సంరంభములు, వ్యాపారార్థిక సమరములు వేనోళ్లను బోధించుచున్నను జ్ఞానోదయము దుస్తరముగ నున్నది. సంరంభమయమైన ప్రపంచోదంతములందు గాంధిమహాత్ము డుపక్రమించిన మహోద్యోగోదంతము ఆసురబలనిరసనమునకును, దైవబల సంవర్ధనమునకును, ధర్మపరమైన శాంతిస్థాపనమునకును పరంజ్యోతివలె వినియోగపడుటకు భగవదనుగ్రహము గలుగు గాత!

[భారతి సాభిప్రాయ విశేషములు—ఆగస్టు, 1933]




## మహాత్ముని కర్మధర్మయాత్రలు

గతించిన సోమవాసరమునను దేశమునం దంతటను జాతి మత కుల దశాభేదములు లేకను మహాత్ముని 65—వ వర్ధంత్యుత్సవములు మహావైభవముతో జరుపబడినవి. ఆటలు, సభలు, సంకీర్తనములు, సంభాషణములు, వినోదములు, వ్యాఖ్యానములు, వివాసములు మొదలగునవి గాంధిమహాత్ముని మహత్త్వమును విశదముచేసినవి. మహాత్ముని జీవితమునం దెవరు సంభావించినటులు వారికి ఆత్మస్వరూప విశ్వాసములు గోచరించినవి. స్త్రీలు, బాలబాలికలు వారి గాఢభక్తిని వ్యక్తము చేసిరి. పండితులు ధర్మోపదేశములను చేసిరి. పామరులు మంగళహారతులను సమర్పించిరి. ధనికులు ద్రవ్యమును సమర్పించిరి. జనులందరును జాతి మత కులభేదములను విడిచి ధర్మమూర్తికి మంగళగీతములను పాడిరి. ఈ మహోత్సవములు మహోదయసాధనములను ప్రపంచమునకు కరతలామలకము చేయుచున్నవి. గాంధిమహాత్ముని జీవయాత్రయందు కర్మజిజ్ఞాస, ధర్మజిజ్ఞాస, బ్రహ్మజిజ్ఞాస ఆత్మార్థమైన స్థాయిభావమునందు లగ్నములై పూర్ణయోగ ప్రభావమును లోకమునకు సువ్యక్తము చేసినవి. మహాత్ముని కర్మధర్మయాత్రలు ప్రజాలక్ష్యమును అర్థకామారాధనములందు లగ్నముచేసినటులు ధర్మానుష్ఠానమునందు లగ్నము చేయుచున్నవి. గాంధిమహాత్ముడు స్వరాజ్యకాములకు రాజ్యాంగనాయకుడు; సంఘసంస్కర్తలకు సంస్కరణపరాయణుడు; మతప్రవర్తలకు బ్రహ్మజ్ఞుడు; కర్మయోగులకు కర్మప్రియుడు; ధర్మజ్ఞులకు ధర్మాత్ముడు; శాంతికాములకు అహింసాదీక్షాపరాయణుడు; సత్యకాములకు సత్యాత్ముడు. గాంధిమహాత్ముని పట్ల ప్రజలకు బాహ్యలక్ష్యము గలిగినటు లాత్మలక్ష్యము గలుగనున్నది. ఆత్మసాధనరహితములైన బాహ్యసాధనములు పురుషార్థిక సిద్ధికి నిరర్థకములని మహాత్ముని ధర్మోపదేశము లనవరతము వ్యక్తముచేయుచున్నవి. అపరమార్గమును లోకమునకు వ్యక్తము చేయుటకై గాంధిమహాత్ముడు పూనిన కర్మానుష్ఠానము లోకమునకు కర్మానుష్ఠానమునకును, ధర్మానుష్ఠానమునకును పరమలక్ష్యముగ నున్నది.

గాంధిమహాత్ము డొక సంవత్సరము సత్యాగ్రహ ప్రస్థానమును విరమించిరి; సబర్మతిని సత్యాగ్రహాశ్రమమును హరిజనాశ్రమమును జేసిరి; నవజీవన ముద్రణాలయమును నిర్మూలనము చేసిరి. అర్థకామారాధనమునకై ప్రపంచ మవలంబించిన మార్గమును ధర్మా

సాధనమునకై మహాత్ముడవలంబించుచున్న విధము వర్తమాన విషాద పరిస్థితులందు ప్రపంచమునకు ధర్మోపదేశమును జేయుటకు దగియున్నది. ధర్మమునకు ఆత్మగతమైన త్యాగము సాధనమైనటులు బాహ్యములైన అర్థకామములు సాధనములు గావు. బాహ్యసాధనములందైనను నిష్కామకర్మ యోగమువలెను కామకర్మయోగము సాధనము గాదు. గాంధిమహాత్ముడు పూనిన కర్మయోగానుష్ఠానము సామాన్యులకు సాధ్యము గాకపోయినను బాహ్యకర్మానుష్ఠానమునందైనను వ్యవసాయ పరాయణత్వము దుర్లభమైనది. గాంధిమహాత్ముని మహాత్యాగప్రస్థానము భారతీయులకుపలెను సకల ప్రపంచమునకు కర్మయోగపరాయణమైన ధర్మయోగాభ్యాసమునకు మార్గదర్శకము గావలయును. ప్రపంచ పరిణామమునకు గాంధిమహాత్ముని ధర్మయోగానుష్ఠానము వినియోగపడగల విధమును ప్రజానాయకులు గ్రహించుటకు మహాత్ముని 65—వ వర్ధంత్యుత్సవములు సకలవిధములను వినియోగపడుచున్నవి. కీర్తిశేషులైన శ్రీమతి వసంతమ్మగారి జీవితము నీపరమార్థమునే భిన్నమార్గమునను సువ్యక్తము చేయుచున్నది.

[భారతి సాభిప్రాయ విశేషములు—అక్టోబరు, 1933]

## గాంధిమహాత్ముడు—సనాతన ధర్మము

వైదికమతపరిణామము హిందూమత ప్రవాహమున కపూర్వమైన శోభనువలెను కళంకమును గలుగజేసినది. పూర్వమీమాంస పోయి ఉత్తరమీమాంస మతప్రవృత్తియందు వ్యాపకమునం దున్నను మృతప్రాయములైన పూర్వ మీమాంసాపరములైన యాచారవ్యవహారములు జీవప్రవాహమును స్తంభింపజేసినవి. కర్మస్థానమును జ్ఞానము, జ్ఞానస్థానమును భక్తియును నాక్రమించి, భాగవతభక్తి దేశమునందంతటను వ్యాపకమునం దున్నను నిర్జీవమైన కర్మకాండను హిందూమతమున కాధారముగను నిర్ణయింపగోరుట నిరుపయోగము. కర్మకాండను జైనబౌద్ధమతములును, ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతములును, మహమ్మదీయ క్రైస్తవమతములును, పరప్రభుత్వములును కాలక్రమమునను నిరుపయోగము చేసినవి. బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీతలు జ్ఞానమును కర్మస్థానమునను ప్రతిష్ఠించినవి. భాగవతభక్తి భక్తిని జ్ఞానస్థానమునను ప్రతిష్ఠించినది. హిందూమత వాహినియందు కర్మ జ్ఞాన భక్తి వైరాగ్యయోగవాహినులు సంగమించి హిందూమతము కూలంకషముగ ప్రవహించుచున్నను పంకకలంకితమై జీవరక్షణ ప్రయోజనములకు నిరుపయోగమే కాకను హానికరముగ నున్నది.

దురదృష్టవంతు లెల్లపుడును దురదృష్టవంతులుగను, పాపు లాజన్మాంతము పాపులుగను, దరిద్రులు దరిద్రులుగను, అజ్ఞానులజ్ఞానులుగను నుండవలయునని శాసించెడి సనాతనవర్ణాశ్రమ ధర్మములు మానవజీవిత ప్రయోజనములకు నిరర్థకములు. అస్పృశ్యతానివారణము నిత్యమైన ధర్మమునకు విరుద్ధము కాదనియును, ఒకవేళ ధర్మవిరుద్ధమైనను నివారించుటకు మతాచార్యులు ప్రయత్నించివా రనియును, వెనుక ప్రయత్నింపకపోయినను నిపుడు ప్రయత్నించుట ధర్మవిరుద్ధము గాదనియును ప్రాజ్ఞులంగీకరింపగలరు. జీవమైన ప్రజాజీవనమును స్తంభింపజేసి నిర్జీవమైన యాచారాభిమానముల నారాధించుట మరణసాధనముగాని జీవనసాధనము గాదు.

వర్తమాన స్వాతంత్ర్య యుగమునందు వ్యక్తి స్వాతంత్ర్యమును నిరోధించుట మానవధర్మ సంస్థాపనమునకు ప్రతికూలము. స్వాతంత్ర్యము నభిలషించెడి సవర్ణు లవర్ణులకు స్వాతంత్ర్యమును నిరోధించుట యధర్మము. సకల ప్రజాసంస్థలయందును అవర్ణులకు ప్రవేశమును గల్పించుట సవర్ణుల కలంఘనీయమైన ధర్మము. దేవాలయాది ప్రవేశమునకును శాసననిర్మాణమును చేయుట ధర్మవిహితముగాని ధర్మవిరుద్ధము గాదు. ధర్మశాస్త్రములందు దేవాలయ ప్రవేశము ప్రతిషేధింపబడలేదని పండితాభిప్రాయమును ప్రబలుచున్నది. అఖండమైన హిందూసంస్కారము దేశకాలపాత్రల కనురూపముగను మారినవిధము హిందూధర్మశాస్త్రములు, పురాణేతిహాసములు విశదము చేయుచున్నవి.

పూర్వము మహర్షు లవలంబించిన ధర్మమార్గమును వర్తమాన కాలమునందును సవర్ణు లవలంబించుట ధర్మము, వివేకము. జీవములేని సంఘమునందు జీవప్రతిష్ఠాపనమును జేయుటకు నిర్జీవములైన యాచారవ్యవహారముల నతిక్రమించి సజీవమైన యాచారవ్యవహారముల నవలంబించుట ప్రయోజనకరము. ప్రాజ్ఞులు ధర్మాధర్మవిచారణ చేసి ధర్మారాధనమును జేయుటకు బూనుకొనుట వివేకము. కాని నిందలకును దూషణలకును బూనుకొనుట వివేకము గాదు. స్వభావసిద్ధమైన ధర్మమునకు స్వార్థారోపణమును జేయుట, భ్రష్టత్వము నాపాదించుట యసంగతము.

అస్పృశ్యతా నివారణమునకును రాజకీయ సంస్కరణములకును సంబంధము లేదు. ఇది నూతనము గాదు. స్వామి దయానందుడు, వివేకానందుడు, రామకృష్ణుడు మొదలగు హిందూమత సంస్కర్తలీ ధర్మారాధనమున కిదివరకే పూనుకొని యుండిరి. ఒకవేళను రాజకీయమునకు సంబంధమున్నను నింద్యముగాదు. వర్తమానయుగము రాజకీయ యుగము. రాజకీయ సంబంధములేని ప్రజాజీవనము వర్తమానకాలమునందు దుర్లభము. ఆర్థిక నైతిక సాంఘిక వైజ్ఞానికాది విషయములందు రాజకీయసంబంధ మలంఘనీయముగ నున్నది. మతమునకును, రాజకీయమునకును సంబంధము కొన్నిదేశములం దప్రతిహతముగ నున్నది. చేష్టారహితమైన పారతంత్ర్యభాగ్యము ననుభవించుచున్న హిందూస్థానమునందు మతఘోషసందర్భాసందర్భములు లేకను బయలుదేరుట యాచారమైనది. దైవభక్తిపరాయణుడును త్యాగమూర్తియునైన గాంధిమహాత్ముడు హిందూమత విప్లవమునకు పూనుకొనినటు లారోపణచేయుట యన్యాయ్యము. ఆచారాభిమానావృతమైన హృదయమునందు స్వాతంత్ర్యపరమైన జ్ఞానకాంతులు ప్రసరింపజాలవు. హిందూమతాభిమాను లందరును మతాచార్యులు పూర్వమే ప్రసరింపజేసిన జ్ఞానకాంతులను ప్రసరింపజేసి హిందూ సంఘమును, హిందూమతమును, మానవధర్మమును, గాంధిమహాత్ముని సంకల్పమును, దేశసౌభాగ్యమును గాపాడుట పరమ ధర్మము.

[భారతి సాభిప్రాయ విశేషములు—జనవరి, 1933.]

# సవర్ణులు - అవర్ణులు

మానవులందు ప్రపంచవ్యవహారములయందు ప్రకృతిసిద్ధములయిన భేదములు గుణకర్మవిభాగాదులవలనను గలుగుచున్నవి. గుణకర్మవిభాగములు దేశకాలపాత్రాధారములు. దేశకాలపాత్రాధారములును, గుణకర్మసంజాతములును నైన జాతిమతాదిభేదములును, వర్ణాశ్రమ భేదములును అనిత్యములును, సాపేక్షములునుగాని శాశ్వతములును, నిరపేక్షములును గావు. ప్రవృత్తివలనను గలిగిన భేదముల నతిక్రమించి యాత్మోన్నతిని బడయుటకు సకల మానవులును సమానాధికారులు. సమానాధికారులైన తోడిమానవులను ధర్మబాహ్యులను జేయుట కేవలము దైవధర్మబహిష్కారణము. జన్మవలనను గలిగిన పరిస్థితులను నతిక్రమించి పురుషార్థములు బడయుటకు సకలజనులును నధికారులను పరమార్థమును హిందూమతేతిహాసములు వేనోళ్లను బోధించుచున్నవి.

వేదములు, వేదాంగములు, ధర్మశాస్త్రములు, పురాణేతిహాసాదులు సత్యాన్వేషకులకు పరమార్థమును పరిస్ఫుటము చేయుచున్నవి. హిందూమత పరిణామమునందు కర్మమార్గము, జ్ఞానమార్గము, భక్తిమార్గము సర్వసమత్వసర్వాత్మత్వపరమైన పూర్ణయోగమునందు పరిపక్వమును బొందినవి. అద్వితీయమును, నఖండమును నైన పూర్ణయోగార్థమును ప్రస్థానత్రయాది మతగ్రంథములు బోధించుచున్నవి. ప్రవృత్తియందు జీవ మనవరత మభివృద్ధి నొందుచున్నవిధమును సనాతనమైన జీవితచరిత్రము సువ్యక్తము చేయుచున్నది. జీవుడు జననము సంక్రమింపజేసిన ధర్మసంస్కారమునకు కర్తయైనటుల హర్తయును. అవ్యయమైన ఆత్మ, సాపేక్షములైన వర్ణాశ్రమాది సంస్కారముల నతిక్రమించి, నిరపేక్షమైన మోక్షమును బడయుచున్నది. అట్టి యాత్మోన్నతికి సకలజనులును, జాతిమతకులాదిభేదములు లేక, సమానాధికారులు. హిందూమత పరమార్థమైన 'తత్త్వమసి' 'సర్వం ఖల్విదం బ్రహ్మే' త్యాది మహావాక్యార్థములను విస్మరించి జడప్రాయమైన ఆచారధర్మారాధనపరాయణమైన మతమునందు హిందూమత పరమార్థమును గ్రహించుట సకలజనులకును పరమధర్మము. ప్రవృత్తియందు సంచలనము జీవధర్మము: నిశ్చేష్టత విలయమరణచిహ్నము.

శ్లో. చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్
గుణకర్మ విభాగశః,
తస్య కర్తార మపి మాం
విద్ధ్యకర్తార మవ్యయమ్.

(భగవద్గీత)

మనుజులు, గుణకర్మవిభాగాదులు కల్పించెడి స్థితిగతుం కరణమునకువలె సకరణమునకును, ధర్మాధికారులు. మనుజులకు కరణాకరణ సామర్థ్యము లేనపుడు పురుషార్థసిద్ధియే దుష్ప్రాప్య మగుచున్నది. నిరుద్ధభారతము మానవధర్మపరమైన హిందూమత పరమార్థమును తేటతెనుగున పద్యరూపమునను హృద్యముగను బోధించుచున్నది.

గాంధిమహాత్ముని యుపదేశాదేశములు ప్రజాలక్ష్యమును హరిజన సమస్యయందు లగ్నము చేసినవి. మహాత్ముని ధర్మదీక్ష అవర్ణులందును సవర్ణులందువలెను మహాసంచలనమును గలుగజేసినది. హిందూస్థానమునందంతటను హరిజనోద్ధరణమునకు ప్రచండమైన ప్రయత్నములు జరుగుచున్నవి. ఇతర రాష్ట్రములందువలెను ఆంధ్రరాష్ట్రమునందును హరిజనోద్ధరణమునకై ప్రబలప్రయత్నములు జరుగుచున్నవి. ఆంధ్రక్షేత్రమునందు హరిజనోద్యమాంకురము లిదివరకే తలయెత్తి వర్ధిల్లుచున్నవి.

సంస్కరణప్రియులైన శ్రీమంతులు, పండితులు, గ్రంథకర్తలు, కవులు, భక్తులు, మతాభిమానులు హరిజనోద్ధరణమునకు వారి విద్యావివేకసంపదలను వినియోగించినవిధమును ఆంధ్రదేశేతిహాసములు విశదము చేయుచున్నవి. సంస్కరణోద్యమునకు శ్రీయుత వీరేశలింగము పంతులుగారు పితామహులు: రఘుపతి వేంకటరత్నము నాయుడుగారు గురువులు: శ్రీ పిఠాపురము మహారాజాగారు రాజపోషకులు: చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు, మంగిపూడి వేంకటశర్మగారు మొదలగు కావ్యకర్తలు మంగళాశీర్వాదకులు: గూడూరు రామచంద్రుడు, వేమూరి రాంజీరావు, నల్లపాటి హనుమంతరావు, దిగుమర్తి హనుమంతరావు, తల్లాప్రగడ ప్రకాశరావు, నరసింహశర్మ, వెల్లంకి కృష్ణమూర్తి గారులు మొదలగువారు హరిజనసేవకులు. శ్రీయుత రాయుడు గంగయ్య, కమతము షణ్ముఖము, నరాలశెట్టి దేవేంద్రుడు, సుంద్రు వెంకయ్య, భాగ్యవర్మరెడ్డి, పాకేటి గురువులుగారు మొదలగు హరిజన నాయకులును స్వసంఘాభ్యుదయమునకు పాటుపడుచున్నారు.

ఆంధ్రావనియందు హరిజనోద్యమ వ్యాపనమునందు శ్రీయుత మంగిపూడి వేంకటశర్మగారి కృతి "నిరుద్ధభారతము" హరిజన సమస్యయందు పండితపామర హృదయమును లగ్నము చేసినవిధమునకు గ్రంథమునకు గలిగిన గౌరవవ్యాపకములు ప్రమాణములు.

విశుద్ధభారతము! — భారతీయులందు హరిజను లత్యంతము విరుద్ధులు. భారతధర్మరక్షణమునకు విరుద్ధులవిరుద్ధులు గావలసిన యవసరమును దేశకాలపరిస్థితులు సువ్యక్తము చేయుచున్నవి. అగ్రజధర్మపరాయణమైన భారతధర్మము దేశమునకును ధర్మమునకును దేవునకును ననర్థదాయకమును, నన్యాయమును, నవమానకరమును. వేంకటశర్మగారు విశుద్ధభారతమునందు హరిజనుల పరివేదనమును, సవర్ణుల యపరాధములను, నుభయుల ధర్మనిర్వహణమార్గమును రసవంతముగ వర్ణించిన పద్యావళి రసానందమును గలుగజేయుచున్నది. శర్మగారి శీలమువలెను కావ్యశైలియును, మృదువుగను, సరళముగను, సరసముగను నున్నది. ప్రతి పద్యమును భావగర్భితమైన దైన్యదృశ్యము, భక్తిదృశ్యము, కరుణాదృశ్యము, మహాత్త్వదృశ్యము సాంగోపాంగముగ చిత్రించి పటులు కల్పింపబడి భావప్రపంచమునందు సంభ్రమమును గలుగ జేయుచున్నది.

సవర్ణులకు ప్రార్థనము సౌమ్యముగను, భావగర్భితముగను నున్నది:

ఉ. మాలల గోల భాగవత
మా, మరి భారతమా, వినంగ మా
కాలము పోవుటే ఫలము
కా కిఁక పుణ్యమ! పూరుషార్థమా!
"మాల లటంచుఁ జేర్కొనిన
మాత్రనె పాపము వచ్చు"నంచు బ్రా
హ్మలక, విహార లీ బయిసీ
మారిన దీనుల నాలకింపుఁడీ!

ఉ. వేదవిభాగమున్ జరిపె
విశ్వము పర్వముఁ బ్రస్తుతింప: వి
ష్టాదశసత్పురాణములు
శక్తిమతిన్ విరచించె; సర్వులో
కాదరణీయమైన యతి
పావన భారతమున్ రచించె; వ
ట్టోద్దరు వంశసంభవము
పొందెను వ్యాసుఁడు నిమ్న జాతుఁడే.

మ. పరజన్మం బిది యుత్తమం బనుచు నా
నాదేశవిద్వాంసులున్
వరుసన్ రూఢి యొనర్చినట్టి పలుకున్
వ్యర్థంబుఁ గావించి యి
ట్లరరే! మద్ద్విప్రగాలు మానవులు వి
య్యం బందుచున్నారు; భూ
సురులారా! దయఁజూచి పుల్కసులకున్
శుద్ధత్వమున్ నేర్పరే!

చ. మనువున కప్రతిమ్మ, ఋషి
మండలికెల్లను నల్లముక్క, చె
క్కని మన వేదశాస్త్రముల
ఖ్యాతికిఁ జెప్పిన మత్స్య, ధర్మపున్
జనులయి వచ్చెఁ గన్న మత
కర్తలకీర్తి కళాకళంక మీ
యనుచితవృత్తిఁ బోవిడిచి
యార్యు లఖండయశంబు నొందరే.

సీ. మనపలేదు సుమండి! కడజాతివారింట
భోజనంబులు సేయఁ బోలు ననుచు
పలుకలేదు సుమండి! పంచమజాతితో
స్నేహంబు శ్రేప్రొద్దు సేయుఁ డనుచు
చెప్పలేదు సుమండి! చేరి మాలలతోడఁ
బొందుగా వియ్యంబు లందుఁ డనుచు
ఆడలేదు సుమండి! యంత్యవర్ణాలను
విందువేడ్కలకు రావింపుఁ డనుచు
తే. ఆర్యవరులార! సహభోజనాదికములు
సహజసద్భావసంపద సమము గావు!
ఐకమత్యంబు సమకూర్చి యలరఁజేయు
సానుభూతియె యున్నంటెనరి సుమండి!

సీ. పెరొయకున్నదె మిమ్ము పెరాయునట్టులు మమ్ము
భూమతమకు దీవి భూమిదేవి
మీకు వెన్నెలఁ గాచి మాకుఁ గాయుటలేదె
చలువలపరసీమ చందమామ
మీమీఁదనే కావి మామీఁద వీవదే
సరససౌరభశాలి చల్లగాలి
వెలుఁగు వేడియు మీకుఁ గలిగించి మా కిడ
భవ్యసౌఖ్యకరుండు భాస్కరుండు
తే. కురిసి మీపైని మాపైనిఁ గురియుచున్న
సకలసస్యావనసుకీర్తి జలదమూర్తి
దైవసృష్టికిఁ బక్షపాతంబు లేదు;
సృష్టి వీక్షించి తెలియరే! శిష్టులార!

అవర్ణులకుఁ జేసిన హెచ్చరికయుఁను సంబోధనమును వారి వికాసమునకు సాధనముగ నున్నది.

ఉ. పంచములార! యంతరిత
భవ్యగుణోత్కరులార! సక్తితో
దంచిత శక్తులార! యున
మర్త్యుల! మీరలు! గొప్పివందలో

పంచితమ్మై చరించు నల
వ్యాఘ్ర కిశోరము రీతిఁ బూర్తిగా
పంచితు లైతి రాత్మ బల
వైఖరి నెంచుఁడు! మేల్కొనుం డిఁకన్.

సీ. శుచి లేదనుచు మమ్ముఁ జూడరా దందురా
పరిశుభ్రతను మాకుఁ గఱపరాదె!
పరమమూర్ఖులు మీరు పనికిరా రందురా
తెలివితేటలు మాకుఁ దెలుపరాదె
సద్గుణంబుల మీరు సాటిరా రందురా
మహితబుద్ధులు మాకు మప్పరాదె
కరము నీచులు మీరు కలియరా దందురా
నెఱతనంబును మాకు నేర్పరాదె!

తే. అతిదరిద్రు లగుట రోతు మందు రేని
సిరి గలుగు మార్గములు మాకుఁ జెప్పరాదె!
భూతదయ యుంచి, పటు సానుభూతి మించి
శ్రేయములు గూర్పరయ్య! దేశీయులార!

సీ. త్రాగుబోతు లటంచు దప్పించఁబోదురా
మద్యపాయు లిఁకెంతమంది లేరు!
గొడ్డుమాంసము దినే మడ్డివా రందురా
మాంసభక్షకు లెంతమంది లేరు!
నీమంబు తెఱుఁగని నీచుల మందురా
మావంటివా రెంతమంది లేరు!
నిత్యసేవకు లంచు నిరసింతు మందురా
మందభాగ్యు లిఁకెంతమంది లేరు!

తే. ఉచితరీతిని భాషించు నొప్పిదంబు
లేనివా రని మన్నింపలేని, యితర
మనుజులం దట్టివా రెంతమంది లేరు!
మమ్ము జక్కనఁజేయు మూలమ్ము గలదె!

సీ. మము మీరు వెలివేసి మన్నింప కుంటచే
ఊరిబైటను మేము చేరవలసె
పరిశుద్ధతను మాకుఁ గఱపకుండుటచేత
మాలిన్యమున మున్గి తేలవలసె
చదువు చెప్పక మమ్ము వదలివేయుటవల్ల
నజ్ఞానకూపమం దణఁగవలసె
నీతు లేమియు మాకు నేర్పకుండుటచేత
దుర్నీతిలోఁ బడి దొర్లవలసె

తే. మన మతంబునఁ గల ధర్మ మర్మములను
జెప్పనికతాన నన్యులఁ జేరవలసె
కలసి చేదోడు వాదోడుగా మెలంగు
మ మ్మిటు లుపేక్షసేయ నేమమ్ము గలదె!

సీ. మాకు మీరు మతంబు మప్పకుండినను మీ
మతమె మా మత మంచు మదిని దలఁచి
వెలివేసి మీ రెంత వెలువరించుచు నున్న
నశ్రాంతమును మిమ్మె యనుసరించి
అదయులై మ మ్మెంత యణఁగఁ ద్రొక్కుచు నున్న
నుద్ధరించెద రంచు బుద్ధి నమ్మి
చదువీక దుస్సహాజ్ఞానాంధుపందు ద్రో
సినను మా గురు లంచు సేవచేసి

తే. మేము మిము వీడకున్నాము మేకలట్లు
కటికితనమున మిమ్మిట్లు గాసిబెట్ట
తగవుగా, దింక మాకు విద్యల నొసంగి
దయ యొసంగఁగఁ బ్రోవరే దాతలార!

సీ. కాపురంబులు చేయఁగాఁ జుట్టుగుడిసెలే
కాని లోగిళ్లు లెక్కకును లేవు
చెలఁగి కట్టంగ మాసిన చింపిగుడ్డలే
కాని వల్వలు కొంచమైన లేవు
త్రావంగ మాకల జావయు, గంజియే
కాని యన్నమును శాకములు లేవు
సొగసుగాఁ దాల్ప గాజులుఁ, బూసపేరులే
కాని బంగరునగల్ లేశ లేవు

తే. పంట పండింపఁగా నూరివారిపేరె
కాని సొంతంబు లెందును గానరావు
అకట! మా ఘోర దారిద్ర్య మొకరికైన
జాలి పుట్టింపదాయెనా? శీలులార!

దిగంత విశ్రాంతమైన ధర్మఘోష వ్యాసయుగమునందు వలెను గాంధి నవయుగమునందును బధిరశంఖారావముగ నున్నది. సనాతనులును సంస్కరణ ప్రియులును హిందూమహాధర్మబోధను నీకృతియందు దెలిపినటులు ప్రశాంతచిత్తులై యవధరించి కర్మయోగారూఢు లగుదురుగాత!

శా. బందా లెల్ల వదల్చివేసుకొని స
ద్భావంబు నౌదార్య మిం
పొందన్ సర్వసమత్వ మాచరణచే
బోధించి సర్వప్రజా
బృందాలన్ వడిలో నిముడ్చుకొనుచున్
బ్రేమించుచున్ గందులున్

తే. మోదఖేదాలు, సుఖదుఃఖములును, మరియుఁ
బుణ్యపాపాలుఁ, గలిమిలేములును సరులె!
ఉభయులకు హెచ్చులొచ్చు లే మున్న వింక?
మనసు పౌర్వ్యంబు నెనసి క్రమ్మఁబడుఁగాక!

మ. మనదేశంబున జన్మమెత్తి మనక్షే
మంబున్ సదా కోరి తా
మనయుంబున్ మన సంఘవృద్ధికయి దా
స్యం బోవఁగాఁ జేయుచున్
మన దైవంబులఁ గొల్చుచున్ మన మతా
మ్నాయప్రకారంబుగా
మనుచున్నన్ మనదేశసోదరులె యు
న్మాటన్ విచారింపమే!

విరుద్ధ భారతమునకు రెండుకూర్పులు ముగిసినవి. అందలి రసవంతములైన పద్యము లాంధ్రావనియం దంతటను వ్యాపకముఁ గాంచినవి. పట్టణములందును, పల్లెలందును, సభలయందును, సమాజములందును, నిందలిపద్యములను ప్రాచీనపద్యములనువలెను చదువుట పరిపాటియైనది. ఈ విఖ్యాత గ్రంథమునకు మూడవ కూర్పునకు. ఆంధ్రలోకమునకు చిరపరిచితమైన గ్రంథమునకు, చిరపరిచితుడైన గ్రంథకర్తకును పరిచయవాక్యములను వ్రాయుట యసమంజసము. శ్రీయుత వేంకటశర్మగారిమీదను, విరుద్ధ భారతము మీదను, విషయముమీదను గల గౌరవాదరణములు నన్నీ చర్విత చర్వణమునకు పురికొలిపినవి.

ఆంధ్రలోకము, సుపరిచితమైన విరుద్ధభారతమున కాదర స్వాగతంబుల నొసంగుగాత! భగవదనుగ్రహమునను నాంధ్రాభ్యుదయమును, మానవధర్మాభ్యుదయమును కూడుగాత!

[విరుద్ధ భారతము పరిచయ వాక్యము—1933]

# పూర్ణపురుషుడు

## శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

★

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

# 1

## మహాపురుషులు – పూర్ణపురుషులు

"ఓం పూర్ణ మదః పూర్ణ మిదం
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణ మే వావశిష్యతే."

మహాపురుషు లనదగినవారు చాలా అరుదుగా ఉంటారు. విశేషమహత్త్వము ఏ ఒక్క అంశలో చూపినా, అట్టివారిని మహాపురుషు లనవచ్చును. ఆ అంశలో వారు లోకానికి మార్గదర్శకులుగా ఉంటారు. మహాకవులు, మహాస్థపతులు, శిల్పులు, చిత్రకారులు, ఉత్తమ వాగ్గేయకారులు ఈ కోవలోని వారే. ఏ శాస్త్రములోనైనా విశిష్టమైన మార్గము చూపినవారందరూ మహాపురుష శబ్దవాచ్యులే. క్షణక్షణమూ నూతన వికాసము పొందుతున్న ఆధునిక విజ్ఞానశాస్త్రములో కొత్త కొత్త మెట్లువేసిన గెలీలియో, న్యూటను, మెండలీను, డార్విను, మార్కోని, ఐన్‌స్టీన్, పాశ్చర్, ఇత్యాదు లెందరో మహాపురుషు లనదగినవారున్నారు. చార్వాక దర్శనమంటూ ఒకటి గ్రంథరూపంగా ఇప్పుడు మనకు లభ్యము కాకపోయినా, చార్వాకుడు కేవల పురాణపురుషుడు కాడు. అతడు "శరీరము పృథివ్యాపస్తేజోవాయువు లనే నాలుగు భూతములనుండి, సురాబీజములనుండి మదశక్తి పుట్టినట్లు, ఉద్భవించిన చైతన్యమే; దేహముకంటె వేరుగా ఆత్మ అనేది లేదు; వేదములు, అగ్నిహోత్రాది కర్మలు పౌరుషమూ బుద్ధీ లేనివారి కొరకు పుట్టిన బ్రదుకు తెరువులు; బ్రదికినన్నాళ్లు అప్పుచేసి ఐనా సుఖంగా బ్రదుకవలె, ఈ శరీరము బూడిద ఐన తర్వాత మళ్లీ ఎట్లా వస్తుంది?" అని నిర్భయముగా చాటిన నాస్తిక దర్శన కర్త. అటువంటి చార్వాకుడు నిస్సందేహముగా మహాపురుషుడే! ఎంతో జననాశనానికి కారకులైనారని నేడు లోకము నిందించుట పరిపాటియైన హిట్లరు, ముసోలినీవంటి నియంతలు కూడా మహాపురుషులు కాదనడము మన అల్పత్వాన్ని, అజ్ఞానాన్నే ప్రదర్శిస్తుంది. మిక్కిలి ఊర్జస్వంతమైన సత్త్వము ఎవరిలో ఉన్నా వారిని మహాపురుషు లనడమే ధర్మము. రావణకుంభకర్ణులు హిరణ్యాక్ష హిరణ్య కశిపులవంటి పురాణ పురుషులుకూడా మహాపురుషశబ్దవాచ్యులే!

మహాపురుషులలో వెలిగిన మహత్త్వము మంటగా మండి లోకాన్ని దహించినప్పుడు వారిని గర్హిస్తాము; అట్లుగాక అది దివ్యజ్యోతియై లోకాన్ని చల్లబరచి కల్యాణకరమైన మార్గములో నడిపించినప్పుడు, అట్టివారిని పూజిస్తాము. అంతేకాని రెండురకాల వా పురుషులను ప్రస్తావించక ఊరుకోలేము. వారంత గొప్పవారు కనుకనే, కావ్యములు కాంతా సమ్మితముగా ఉపదేశించేవి అని కావ్యమర్మజ్ఞు లంటూ, అవి 'రామాదివత్ వర్తితవ్యం, న తు రావణాదివత్' అని శ్రీరాముని నామము స్మరించిన వెంటనే రావణుని పేరు స్మరించక తప్పలేదు.

మహాపురుషులకు వారికి అభిమానపాత్రమైన విషయములో ఎంత అతిశయమున్నా, తక్కిన విషయాలలో వారు అతిసామాన్యులుగా ఉండవచ్చు. ఆధునిక విజ్ఞానానికి మూలపురుషుడని పాశ్చాత్యులు ఉద్ఘోషించే ఆర్కిమిడిసు "బాతు"లో స్నానంచేస్తూ ఉండగా, నీటిలోవేసిన వస్తువుల భారాన్నిగూర్చిన సిద్ధాంతము స్ఫురించగానే, ఆనందపరవశుడై ఉన్నవాడున్నట్లుగా దిగంబరుడై వీధి వెంట పరుగెత్తి వెళ్లినాడంటారు. నెపోలియనువంటి మహావీరునికి రాత్రులు పిల్లి అంటే భయమట. ఒకరాత్రి తన గదిలో అల్లరిచేసిన పిల్లికి భయపడి దానిని పిస్తోలుతో కాల్చగా గురి తప్పినదట. ఇంగ్లండును రక్షించిన నెల్సనుపేర లండనులో ట్రఫాల్గరుస్క్వేరు నిర్మించి గౌరవించారు; కాని ఆయన వ్యక్తిగతమైన అవినీతిజీవితము కూడా జగద్విదితమే. అలెగ్జాండరు మద్యపానమత్తుడై ఉన్న సమయములో, అతని విజయాలకు నిజముగా కారకులైనవారు అతని సేనాధ్యక్షులే అని ఉద్ఘాటించినందుకు, క్లీటసు అనే తన పెంపుడు సోదరుణ్ణి, పైగా తనకు పలుమారులు ప్రాణరక్షణచేసిన ప్రాణదాతను శూలముతో పొడిచి చంపివేసినది చరిత్ర ప్రసిద్ధము.

మహాపురుషులు, మహాత్ములు తమ మార్గములో ఎంత మహత్త్వము కలవారైనా, ఇతర విషయాలలో పసివారివలె ఉండడముకూడా కద్దు. సినీమారంగములో చార్లీచాప్లిను యుగపురుషుడు. గాంధిమహాత్ముడు ఇంగ్లండు వెళ్లినప్పుడు వారిని దర్శించడానికి చార్లీచాప్లిను అనుమతి కోరగా, మహాత్ముడు "ఎవ రాయన?" అని అడిగినట్లు పత్రికలలో చదివినాము. పైగా అవి చార్లీచాప్లిను ప్రతిష్ఠ శిఖరాగ్రము అధిష్ఠించిన రోజులు! షా వలె పెంకెతనముగా మాట్లాడేవాడు కాడుగదా మహాత్ముడు! అది చదివినప్పుడు మాబోట్లకు "ఈ అజ్ఞానమునకు" మహాత్మునియందు గౌరవము శతగుణముగా అతిశయించినది. అట్టిది మహాత్ములలో రాణిస్తుంది.

మహాత్ముడు విద్యార్థిగా ఉండగా తాను పాఠ్యగ్రంథాలే కాని ఇతర ఇంగ్లీషు పుస్తకాలు చదవలేదని ఆత్మకథలో వ్రాసుకొనినారు. ఐనా ఆయన ఇంగ్లీషు శైలిలో పటుత్వము తేటదనమూ అనితరసాధ్యమైనవికదా! రాజకీయ నాయకుడైన తర్వాతనైనా ఆయన చేసిన ఆర్థిక రాజకీయ గ్రంథపఠనముకూడా చాలా తక్కువే. ఐనా కార్యరంగములోకి దిగినప్పుడు, ఆయన బుద్ధి కర్తవ్యమును సులువుగా గ్రహించి, లక్ష్యములకు సూటిగా దాని

బాణమువలెనే ప్రసరించి భేదించేది. ఆయన ఉప్పుసత్యాగ్రహము ప్రారంభించినప్పుడు ప్రపంచములోని ప్రసిద్ధ రాజకీయార్థికవేత్తలు అది ఒక వెర్రిఊహగా వర్ణించి నవ్వినారు. కాని దాని మహత్తర పరిణామము చూచినతర్వాత, ఆ గ్రాంథిక పండితులు తామే వెర్రివాళ్ళమని గ్రహించి, తమ సిద్ధాంతసూత్రాలు మార్చుకొన్నారు. మహాపురుషుల చర్యలే ఆ విధంగా ఉంటవి. అట్లా కొత్తదారులు తొక్కినవారు కనుకనే వారు మహాపురుషులు !

కాని పూర్ణపురుషులు అటువంటివారు కారు. వారికి ఏదో ప్రత్యేకాంశములో అపరిమితమైన శక్తి మహాపురుషులకువలెనే ఉండడము అసంభవముకాదు కాని అసాధారణము. అందువల్ల పూర్ణపురుషులు ఉత్తమ విషయాలన్నిటిలో మహాపురుషులు పెట్టిన ఒరవడిలో వారి అడుగుజాడలలో నడుస్తారు. దేదీప్యమానమై మిరుమిట్లు కొలుపుతూ ఏకముఖంగా ప్రసరించే వెలుగువలె వారు వెలుగకపోవచ్చును. వారి ఆత్మలోని వెలుగు సర్వతోముఖమై ఎల్లప్పుడూ ప్రజ్వలిస్తుంది. ఆ వెలుగు ఎప్పుడూ చల్లదనమే కలిగిస్తుంది, తపింపచేయదు; కల్మషాన్ని హరిస్తుంది కాని దాన్నికూడా బాధపెట్టకుండా తొలిగిస్తుంది. వారి ప్రతిభ సమస్తవిషయాలను స్పృశిస్తుంది, స్పృశించిన దానినల్లా ఉజ్జ్వలింపజేస్తుంది, లోకకల్యాణకరమైన మార్గములో ప్రవేశపెడుతుంది. అట్టివారే పూర్ణపురుషు లనదగినవారు !

పూర్ణపురుషుల ప్రజ్ఞ విశ్వవిస్తారముగా వ్యాపించడానికి సర్వసామాన్యముగా సాహిత్యము పునాదిగా ఉంటుంది. సాహిత్య స్వభావమే ఎన్నిటినో కూర్చుకుని ఏర్పడడము. సాహిత్య శబ్దములోనే కూడిఉండడము, హితముగా మనిఉండడము ద్యోతితమవుతుంది. కవికి సాహిత్యవేత్తకు చతుష్షష్టికళలలో జ్ఞానముండవలెనని మమ్మటభట్టాది సాహిత్యతత్వజ్ఞులు నిర్ధారణ చేసినారు. సాహిత్యమునుండి వారల దృష్టి సంగీతమువిూదికి, నాట్యము, చిత్రకళ, శిల్పము, స్థాపత్యము మొదలగు లలితకళలు అన్నిటివిూదికి మళ్ళుతుంది.

ఈ విధంగా లలితకళ లన్నిటివిూదను నిష్ణమైనవారి బుద్ధి, లలితకళల ఆవిర్భావానికి మూలమూ, వాని ప్రవర్తకత్వానికి ధ్యేయమూ ఐన మానవసంఘమువిూదికి తిరుగుతుంది. వారు కష్టమూ బాధా ఎక్కడ కనబడినా చూచి భరించలేరు. చూచి జాలిపడి కన్నులు ఆవలికి త్రిప్పుకుని ఊరుకోలేరు. సర్వవిధాలా ఆర్తులఆర్తి తొలగించడానికి పూనుకుంటారు. అన్యాయము ఎక్కడఉన్నా, సరిచేయడానికి యత్నిస్తారు. అజ్ఞానము బహురూపాలుగా లోకాన్ని ఆవరించి వారికి కనిపిస్తుంది. అజ్ఞానాంధకారంలోకి తమ ఆత్మలోనుంచి కాంతిరేఖలు ప్రసరింపజేసి వెలిగిస్తారు. ఉన్నతాదర్శాలు కలవాళ్ళు వారికి తటస్థపడితే, వారిని దేవాలయంలో దేవుణ్ణి పూజించినట్లు పత్రం పుష్పం ఫలం తోయం సమర్పించి కృతకృత్యులమైయినా మనుకోరు. అట్టివారి ఆదర్శసిద్ధికి యథాశక్తిగా తోడ్పడి, వారికి అనుయాయులైనట్లే అనుసరిస్తూ, తమతోపాటు ఇతరులను అనుసరింపజేస్తారు.

సాంఘికసేవ వారిని తరుచుగా రాజకీయాలలోకి లాగుతుంది. కాని వారి రాజకీయాలు అధికార పదవులకు ప్రాకులాడేవి, తమవారికి మాత్రమే మేలుకూర్చేవి, కావు. అవి విశ్వమానవ కల్యాణానికి దోహదముచేసే రాజకీయాలు !

మహాపురుషుల బుద్ధి పరిమితవ్యాప్తి కలది కావచ్చును; వారు కఠినులూ నీతిబాహ్యులూకూడా కావచ్చును. పూర్ణపురుషుల బుద్ధి కాని ప్రవృత్తికాని అట్టిదోషముల కెన్నడును పాల్పడదు. దానికి ముఖ్యమైన కారణము అనేక జన్మలలో చేసిన పుణ్యఫలమంతా వారి కీజన్మలో ప్రారబ్ధకర్మగా మూర్తీభవించడమే. నీచములు అవినీతి కరములు లోకవిద్విష్టములు ఐన కార్యములవంకకు వారి ప్రవృత్తి ప్రసరింపదు. అట్టివాటి వ్యామోహమునుండి ప్రయత్న పూర్వకముగా తమ బుద్ధిని మళ్లించుకొనవలసిన అవస్థ వారి కీ జన్మలో అవసరములేదు. ఆ భ్రాంతులూ, వాటిని నిగ్రహించడమూ, పూర్వజన్మలలోనే సాధనచేసి ఈ జన్మ ఎత్తినవారు ! ఆత్మలోని అవినీతిని నిగ్రహించుకొనడానికి ఈ జన్మలో వారు శక్తివ్యయముచేయ నవసరములేని పుణ్యపుంజము మూర్తీభవించిన వారు పూర్ణపురుషులు ! గీతలో ఆత్మసంయమ యోగమనే ఆరవ యధ్యాయములో, అర్జునుడు "యోగసాధన చేసియు మనశ్చాంచల్యముచే సిద్ధిపొందలేనివాని గతియేమి ?" అని ప్రశ్నింపగా, శ్రీకృష్ణభగవానుడు, "కల్యాణకృత్తు ఎన్నడును దుర్గతిని పొందడు నాయనా ! పుణ్యలోకములలో కొంతకాలము గడిపి సదాచారులైన సంపన్నుల యింట పుట్టును. లేక ధీమంతులైన యోగుల కులమునందే జన్మించును. అట్టి జన్మ దుర్లభతరము. అపైన నతడు పూర్వజన్మ జ్ఞానమును పెంపొందించుకొనుచు, తిరిగి యోగసిద్ధికొరకే యత్నించును.

> "పూర్వాభ్యాసేన తేనైవ
> హ్రియతే హ్యవశోఽపి సః,
> జిజ్ఞాసు రపి యోగస్య
> శబ్దబ్రహ్మా తివర్తతే.
>
> ప్రయత్నా ద్యతమానస్తు
> యోగీ సంశుద్ధ కిల్బిషః
> అనేక జన్మ సంసిద్ధ
> స్తతో యాతి పరాం గతిమ్ !"

అని అభయ మిచ్చినాడు, ఇందులో 'శబ్దబ్రహ్మాతివర్తతే' అనే పదబంధానికి పూర్వాచార్యుల వివరణ లిచ్చి నాగేశ్వరరాయలు క్లుప్తముగా "కర్మయోగి ఆత్మయోగి" అని వివరించినారని గమనింపదగినది.

పూర్ణపురుషులైనవారి బుద్ధి సాహిత్యమూలముగా ఆరంభమై, కర్మయోగములో ప్రవృత్తమై, ఆత్మయోగముగా

